## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# ధర్మఖండము

ఈఁదులపల్లి భవానీశంకర కవీంద్ర

ప్రణీతపద్యకావ్యము



శ్రీపీఠికాపురసంస్థానాధీశ్వరుల యాజ్ఞ ననుసరించి

విమర్శాదర్శక

నడకుదుటి వీరరాజకవిగారిచేఁ

బరిష్కరింపఁబడి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరాలయమందు

ముద్రింపఁబడినది.

1931.

శ్రీ దేవాయ నమః

# ఉపోద్ఘాతము



కవితాకన్యక విహరించుసుందరోద్యానమునందు పరిఢవిల్లురమ్యతరశ్రేణులు మూఁడు. ఒకటి ధర్మప్రసంగ రంగస్థలాభిశోభితము ; వేఱొకటి చారిత్రవిశేషసురద్రుమోపరంజితము ; నానావిధప్రకృతివిషయమృదులతావిరాజిత మింకొకటి. ఈమూఁడుశ్రేణులును నానందప్రదములును, విజ్ఞానసంధాయకములును, నిసర్గమనోహరములు నై పరస్పరసంబంధము గలిగి విలసిల్లుచుండును. ఈ శ్రేణీత్రయములో మొదటిదానియందాకన్యక సంచారముసేయునప్పుడు, భక్తి నీతి వైరాగ్యాదులెల్ల దివ్యమూర్తులం దాల్చి, ప్రీతిమెయి నామెకు స్వాగతమిచ్చి, యనేకప్రస్తావములతో నాయారంగస్థలంబుల నామెతో నర్తించుచుఁ గాలక్షేప మొనర్చుచునుండును; రెండవదానియందామె విహరించునప్పుడు, చరిత్రవిశేషంబు లన్నియు స్థిరతరవృక్షాకృతులను ధరియించి,తదీయామృతసేచనదోహదక్రియలచే శాఖోపశాఖాసంశోభితంబు లై, పుష్పఫలసంపత్సమృద్ధంబు లై వినమ్రభావముతో విరాజిల్లుచుండును ; ఇఁక నాసుందరి మూఁడవవీథిని వాహ్యాళి యొనర్చునప్పుడు, నానారసభావలతాసమలంకృత యగుప్రకృతిదేవి, మందహాసాంచితసుందరవదనార

విందముతో, విస్ఫురద్విశాలనేత్రేందీవరంబులతో, పాటలాభి శోభితగండఫలకంబులతో, రోమహర్షణాభిరామగాత్రయష్టితో నామెకుఁ బ్రీత్యుత్థాన మొసగి, మృణాళసుకుమారము లైన బాహువల్లికల నామెను గౌఁగిటం జేర్చి, యామెతో యథేష్ట విహారంబులు సలుపుచుండును. మఱియు నీమూఁడువీథుల యందును నొకదానినుండి వేఱొకదానిలోనికిఁ బోవుటకు నడుమ నడుమ విశాలమార్గము లనేకము లేర్పడియుండును. అక్కన్యా కామణి విలాసవిభూషితయై యొకవీథినుండి వేఱొకవీథికిఁ బోయి విహరించుచుండును. ఒక్కొక్కప్పు డానందాతిరేకంబున నామె యమ్మూఁడువీథులయందును స్వేచ్ఛమైఁ జెలఁగాడు చుండును. అట్టివేళలయందే నానావిధధర్మప్రతిపాదకంబు లగు పురాణేతిహాసాదు లావిర్భవించుచుండును.

మనపురాణేతిహాసములప్రప్రథమజన్మస్థాన మార్యావర్త దేశము. అక్కాలమున నద్దేశమును గీర్వాణభాషాయోష పరిపాలించుచుండెను. కాలక్రమమున నామె భారతవర్ష మంతయుఁ దనయేలుబడికిఁ దెచ్చుకొని తుదకుఁ జక్రవర్తిని యయ్యెను! దేశభాషాసీమంతిను లెల్లరు నామెకు సామంతపు రాణు లైరి. దేశమునం దంతట నామెయధికారమే చెల్లు చుండుటచేఁ బురాణాదిగ్రంథము లెల్లయెడలఁ బ్రచారము నేయుచుండెను. ఒక్కయధికారమే యెల్లకాల మొక్కదేశముననే సాగుచుండుట ప్రకృతిలక్షణము గాదు. దానంజేసి కాలము

క్రమించినకొలఁది గీర్వాణవాణిపలుకుబడి తగ్గిపోయెను. సామంత రాజశ్రీమణులు మేలుకొని తల లెత్తిరి. ఇప్పుడు వారికిఁ బురాణ విజ్ఞాన మావశ్యక మయ్యెను. ఐననేమి ? అది జనసామాన్యమునకు దురవగాహ మైన సంస్కృతభాషయందు సంఘటితమై యుండెను. దానంజేసి, యాయాయేలికల ప్రోత్సాహాతిరేకంబున దేశభాషాకవులు తమతమభాషలలోనికి నాయాపురాణాది గ్రంథములను బరివర్తించుకొనిరి. అట్లే మనయాంధ్రమహాకవులును దత్తత్పురాణవిజ్ఞానము నాంధ్రలోకమునకు విశదము సేయుపొంటె వానిని దెలుఁగుబాసలోనికిఁ దెచ్చి తాము గృతార్థు లగుటయేకాక తమవారి నందఱను జరితార్థులను గావించిరి. ఈరీతిని భారత, భాగవత, రామాయణములేకాక, మత్స్యకూర్మాదులును, శైవ వైష్ణవాదులును నగుపురాణములును దెలుఁగులోనికి వచ్చి, యాంధ్రులకుఁ గరతలామలకములై సుజ్ఞానప్రదము లైనవి.

వ్యాసమహర్షిప్రణీతము లని చెప్పంబడుపురాణములన్నిటిలో స్కాందపురాణము మిగుల గొప్పది. దానియం దేఁబదిఖండములు గల వందురు. వానిలో భీమఖండము, కాశీఖండము, శివరహస్యఖండము, నాగరఖండము మొదలగు కొన్నిఖండములు శ్రీనాథాదిమహాకవులచేఁ దెలుఁగింపఁబడి యాంధ్రదేశమున వ్యాప్తిని గాంచినవి. అట్టిఖండములలో మఱియొక్కటి యగునీ

## ధ ర్మ ఖ ం డ ము

అనుమానవధర్మప్రబోధకం బగు మేలిభాగమును దరువాతి ప్రాధకవులలో నొక్కఁ డగు

## ఈఁదులపల్లి భవానీశకవి

అనునాఱువేలనియోగిచంద్రుఁడు తెలుఁగులోనికిఁ దెచ్చెను. ఈతఁడు భారద్వాజగోత్రపవిత్రుఁడు; నరసామాత్యపౌత్రుఁడు; శంకరమంత్రిపుత్రుఁడు. ఈతనితల్లి అచ్చమాంబ. ఇమ్మహాకవీంద్రునియిష్టదైవము, ' అమృతలింగ ' మని పేర్కొనఁబడు శ్రీశైలమల్లికార్జునదేవుఁడు. ఒకానొకశనిత్రయోదశినాఁ డీతఁ డుపవసించి, పార్థివలింగపూజాదికము నెఱవేర్చుకొని విశ్రమించి యుండఁగా, ఆనాఁటినిశీథవేళ నీతనిస్వప్నమున నమ్మహాదేవుఁడు సాక్షాత్కరించి, సమస్తధర్మప్రతిపాదకం బగు ధర్మఖండము నాంధ్రీకరించి తనపేరఁ గృతియిమ్మని యానతీయఁగా, నాతఁ డవ్విషయమును దనవిద్యాగురు వగు దిట్టకవి వేంకటరాయకవిసింహునకు విన్నవించి, యాతనియాదేశమున నీగ్రంథరాజమును శ్రీశైలనాథునకుఁ గృతిగ నొసగి, తాను గృతార్థుఁ డై యాంధ్రలోకమును ధన్యమును గావించెను.

ఈభవానీశకవి యెచ్చటివాఁడో, యీతనిచరిత్ర మేమో యెంతగాఁ బ్రయత్నించినను దెలియంగరాలేదు. వీరేశలింగము

పంతులవారికవిచరిత్రమం దైన నీతనింగూర్చిన విశేషవిషయము లెవ్వియు వ్రాయఁబడియుండలేదు. సాధారణముగా నింటిపేరులు గ్రామనామములనుబట్టి యుండును గావున నీ 'ఈఁదులపల్లి' యెచ్చటిదో యని విచారింపఁగా, నీపేరు గలగ్రామ మిప్పు డెచ్చటను గానరాలేదు. కాని 'ఈఁదుల' యను నక్షరత్రయము మొదటఁ గలగ్రామములు పెక్కులు గానవచ్చెను :—

(1) ఈఁదులపాలెము (గుంటూరు)
(2) ఈఁదులకుంట (ఏలూరు)
(3) ఈఁదులగూడెము (నూజివీడు)
(4) ఈఁదులఖండిక (నెల్లూరు)
(5) ఈఁదులకోట } (ఎల్లవరము)
(6) ఈఁదులవలస } (ఎల్లవరము)
(7) ఈఁదులమద్దాలి (గుడివాడ)
(8) ఈఁదులవలస (శ్రీకాకుళము)

ఈపైని జెప్పఁబడినవి గాక,

(9) ఈఁదుపల్లె (రేపల్లెతాలూకా)
(10) ఈఁదురాపల్లె (తెక్కలి)
(11) ఓదులపల్లె (కదిరి)
(12) ఈఁదరపల్లె(అమలాపురము)

అనుగ్రామములును గనఁబడుచున్నవి. వీనిలో 9 వ సంఖ్య గల 'ఈఁదుపల్లె' యే పూర్వము 'ఈఁదులపల్లె' యై యుండును. గోదావరీమండలములోనియార్వేలవారు సామాన్యముగ గుంటూరు, నెల్లూరు మొదలగుమండలములనుండి వలస వచ్చినవారే కావున నీ 'ఈఁదులపల్లి' వారును నట్లు వచ్చిన వారేయై యుందురు. కాకినాడసమీపమున నడకుదురుంబోలె*

* నడుకుదురు గుంటూరుమండలములోనిది. అక్కడనుండివచ్చిన నడుకుదుటివారే పిమ్మట నడకుదుటివారైనారు. కాకినాడసమీపమున నున్న 'నడకుదురు' గ్రామమున కానామము వారివలననే వచ్చినది.

అమలాపురముసమీపమున 'ఈఁదులపల్లె' యు, కాలక్రమమున నిక్కవిపూర్వులపేర నిర్మింపఁబడియుండును. అదియే యిక్కాలమున 'ఈఁదరపల్లి' గా మాఱినది గావలయును. భవానీశకవి యీ యీఁదరపల్లినివాసుఁడే యై యుండె ననుటకుఁ గొన్ని హేతువులును గానవచ్చుచున్నవి. ఎవ్వియన,

(1) 'ఈఁదరపల్లె' కరణములయింటిపేరు 'ఈఁదరపల్లె' వారు. వారిగోత్రమును, మనకవిగోత్రమును నొక్కటియె.

(2) కవిమంత్రగురువు ఇవుటూరి సాంబయ్యగారు. ఇవటూరివా రమలాపురముతాలూకాలోఁ బెక్కురు గలరు.

(3) ఇక్కవివిద్యాగురువు దిట్టకవి వేంకటరాయకవి. ఈవేంకటరాయకవితండ్రి యైనవెణుతురుఁబల్లి విశ్వనాథకవి పెద్దాపురసంస్థానాధీశ్వరుఁ డైనవత్సవాయ పెద(ముసలి) తిమ్మరాజుగారికిఁ దన శేషధర్మకావ్యము నంకితమొనర్చెను. మఱియు నాతనిసోదరి పేరమాంబ యప్పటిపెద్దాపురసంస్థానమంత్రి యైన యేనుఁగు గుర్వరాజు (ఏనుఁగులక్ష్మణకవికిఁ బ్రపితామహుఁడు) భార్య. ఈ హేతువులంబట్టి దిట్టకవివారు గోదావరిమండలములోనివారే. మఱియుఁ బై తిమ్మరాజప్రభువు దాక్షారామ భీమేశ్వరస్వామిని సందర్శింపవచ్చినప్పు డాతనిమంత్రి యగు గురువప్రధాని, (తనబావమఱఁదియైన) విశ్వనాథకవిప్రజ్ఞావిశేషాదులనుగూర్చి తనప్రభువునకు విన్నవింపఁగా, రా జాతనిని బిలిపించినట్లు శేషధర్మకావ్యమునఁ గలదు. కావున విశ్వనాథ

కవి దాక్షారామ, తత్ప్రాంతగ్రామనివాసి యై యుండును. ఆతనినందనుఁడు వేంకటాద్రికవియు(కవిగురువు) నచ్చటివాఁడే. (వెణుతురుఁబల్లివారే బిరుదనామముచే దిట్టకవివారైనారు!) దిట్టకవివారు అమలాపురముతాలూకాలో 'దిట్టము'గా నున్నారు.

(4) శ్రీపీఠికాపురసంస్థానాధీశు లైన శ్రీ రావు మాధవరాయనింగారికిఁ దనవాసవదత్తాపరిణయమును గృతిగా నొసగిన వక్కలంక వీరభద్రకవియు, మనభవానీశకవియు సహాధ్యాయులు. వీరభద్రకవి, అమలాపురముతాలూకాలోని 'పుల్లేటికుఱ్ఱు' గ్రామనివాసి యైన *ధేందులూరి (అయ్యగారి) లింగనారాధ్యునికిఁ గొంతకాలము శిష్యుఁడై యున్న హేతువునఁ దత్సహాధ్యాయి యైన భవానీశకవియుఁ దత్ప్రాంతమువాఁడగుట నిశ్చయము.

పైవిషయములు, ఏనుఁగు లక్ష్మణకవి జాహ్నవీమాహాత్మ్యములోని యీక్రింది సీసపాదములనుబట్టి తెలియవచ్చును.

"సీ. మత్పితామహుమేనమామ వెణ్తురుఁబల్లి
విశ్వనాథకవీంద్రు విపులయశుని

* ఈలింగనారాధ్యుఁడు మన్మాతామహునికిఁ బ్రపితామహుఁడు. కూ. తిమ్మకవికి మాహేశ్వరమంత్రగురువు. ఈయనకుఁ బలువురు శిష్యులుండెడివారఁట. వా రాయనను 'అయ్యగారు, అయ్యగారు' అని వ్యవహరించుచువచ్చుటచే నాయన తరువాతివారు అయ్యగారివా రైనారు.

నతనితపఃఫలం బనఁగ జన్మించిన
విద్యావిశారదు వేంకటాద్రి
నతనిమేనల్లునిఁ గృతికర్త వక్కలం
కాన్వయ వీరభద్రార్యవర్యుఁ
దత్సహాధ్యాయి నుత్తమశీలు నీందుల
పలి భవానీపతిప్రౌఢకవిని,"

పై హేతువుల నన్నిటినిబట్టి భవానీశకవి, తూర్పు గోదావరీమండలములోని 'అమలాపురము' సమీపముననుండి 'ఈఁదరపల్లి' యని యిప్పుడు చెప్పఁబడుచున్న 'ఈఁదులపల్లి' నివాసియే యని నిర్ధారణ మగుచున్నది.

మఱియు, భవానీశకవీందుని విద్యాగురు వగు

దిట్టకవి వేంకటరాయకవి

నిగూర్చి యించుక ప్రశంసించుట యప్రస్తుతము గాదు. ఈ వేంకటరాయకవి యత్యంతసమర్థుఁడైన విద్వత్కవి యైనట్లు భవానీశకవి, వక్కలంక వీరభద్రకవి, ఏనుఁగు లక్ష్మణకవి మొదలగువారు మిక్కిలిగఁ బొగడియున్నారు. కాని యీతఁడు రచించినగ్రంథము లెవ్వియో తెలియరావు. కావుననే వీరేశ లింగమువంతులుగారి కవిచరిత్రమున నాంధ్రకవులపట్టికయం దీతనినామము చేర్పఁబడలేదు. అయిన నీతఁ డేదో లక్షణ గ్రంథమును రచియించినట్లుమాత్రము కూచిమంచి తిమ్మకవి

సార్వభౌముఁడు తనసర్వలక్షణసారసంగ్రహము శకటరేఫప్రకరణమున నిట్లు వ్రాసియున్నాఁడు :—

"ఆ. పదముమొదల నడుదఁ దుదిఁ దద్భవంబుల
రేఫగాని శకటరేఫ గాదు
నిక్క మనుచు సుగుణనిధి దిట్టకవి వేంక
టార్యవరుఁడు వలికె... ..."

ఇఁక నివ్విషయముల నటుండనిచ్చి

కవికాలము

నుగూర్చి కొంత విచారించెదను. ఆంధ్రకవులచరిత్రము మూఁడవభాగమున 'ఈఁదులపల్లిభవానీశకవి' నిగుఱించి యిట్లు వ్రాయఁబడియున్నది :—

"ఇతఁడు క్రీ. శ. పదునెనిమిదవశతాబ్దారంభమునుండి 1750 వ సంవత్సరప్రాంతమువఱకు జీవించియుండును."

ఈయభిప్రాయముతో నేకాఁబోలు, వీరేశలింగముపంతులుగారు, కూచిమంచి తిమ్మకవికి ముందే చేర్పఁబడవలసిన యిక్కవిని, ఆతనితరువాతఁ బదునలువురుకవులను జెప్పిన పిమ్మటఁ జేర్చియున్నారు. వీరికాలనిర్ణయమున నొకింతపొరపాటు గానవచ్చుచున్నది. ఎట్లన,

భవానీశకవి విద్యాగురువైన దిట్టకవి వేంకటాద్రితండ్రియగు విశ్వనాథకవి తన శేషధర్మకావ్యమును క్రీ.శ. 1550 సం.

మొదలుగ 1607 సంవత్సరమువఱకు రాజ్యముచేసిన వత్సవాయ పెద తిమ్మరాజుగారికిఁ గృతిగా నిచ్చియున్నాఁడు. ఈరాజు పరిపాలనకాలము స్థానికచరిత్రమునందును, దానినిబట్టి కవుల చరిత్రమునందును పైరితినే యుదాహరింపఁబడియున్నది. దీనిం బట్టి విశ్వనాథకవి, క్రీ.శ. 1600-1605 సంవత్సరములనడుమ శేషధర్మకావ్యము నారాజునకుఁ గృతిగా నిచ్చియుండును. ఆనాఁటికిఁ బూర్వమే, "శ్రీరామవిజయయక్షగానము, గౌరీ వివాహద్విపదకృతి, నిరోష్ఠ్యహరిశ్చంద్రచరిత్ర, సంస్కృత పారిజాతాపహరణకావ్యము" మొదలగు ప్రౌఢగ్రంథములను రచియించియుండిన యవ్విశ్వనాథకవికి శేషధర్మరచనమునాఁటికి ముప్పదియైదేండ్ల ప్రాయమైన నుండియుండవలయును. కావున విశ్వనాథకవిజననము క్రీ. శ. 1570 సం. ప్రాంతమున నై యుండు నని యూహింపవచ్చును. మనకవిగురువైన వేంకటాద్రి, విశ్వనాథకవికి నేఁబదియేండ్లప్రాయమునఁ బుట్టియుండు నను కొన్నను నాతఁడు క్రీ.శ. 1620 ప్రాంతమునఁ బుట్టియుండవలయు ను. మఱియు, సుప్రసిద్ధుఁడైన వక్కలంక వీరభద్రకవి, యీ వేంకటాద్రికి మేనయల్లుఁడు. వీరభద్రకవితల్లి జగ్గమాంబ, వేంకటాద్రికవికిఁ గడగొట్టుచెల్లెలై యుండు నని భావించుచో నామె 1630సం.ప్రాంతమున, ననఁగా, విశ్వనాథకవికి నఱువది యేండ్లవయస్సున నైనఁ బుట్టియుండును. అట్లయినచో వీరభద్ర కవి యామెకు ముప్పదవయేఁట ననఁగా, క్రీ.శ. 1660 వ సం.

ప్రాంతమునఁ బుట్టియుండు ననియు, నాతనిసహపాఠియు, 'నెచ్చెలి'యు నగు మనభవానీశకవియు దాదాపుగా నాకాలముననే జన్మించి యుండు ననియుఁ జెప్పుట సత్యదూరము గానేరదు.

ఇదియునుంగాక, క్రీ.శ. 1679 సం. మొదలుకొని 1704 సం.వఱకును శ్రీపీఠికాపురసంస్థానమును బరిపాలించిన శ్రీరావు రామచంద్రిమాధరాయప్రభువర్యునకు వక్కలంక వీరభద్రకవి తన వాసవదత్తాపరిణయమును గృతిగ నిచ్చియున్నాఁడు. ఆంధ్ర గీర్వాణభాషలయందు సునిశితపాండిత్యమును సంపాదించి వాసవదత్తవంటి ప్రౌఢశ్లేషకావ్యమును దెలుఁగించినవీరభద్రకవి కానాఁటికి నలువదియేండ్లయిన నుండియుండును. అట్టిచో నాతనిజననము క్రీ.శ. 1660 సం. ప్రాంతమే యగును.

పైహేతువులనుబట్టి భవానీశవీరభద్రకవు లిద్దఱును, కూచిమంచి తిమ్మకవికంటె 25-30 సంవత్సరములు పెద్దవారైనట్లు నిశ్చయ మగుచున్నది. మఱియు, నేనుఁగులక్ష్మణకవి, తనజాహ్నవీమాహాత్మ్యమునందు, గవిస్తుతిసందర్భమున *దిట్టకవి విశ్వనాథుని, వేంకటాద్రిని, వక్కలంక వీరభద్రకవిని, ఈఁదులపల్లి భవానీశకవిని గీర్తించిన పిమ్మట నాపద్యముననే,

---

* ఇంతకుము న్నీపీఠికయందే యుదాహరింపఁబడియున్న "మాప్పితామహు" అను సీసపద్యపాదములను జూడుఁడు.

"వర్తమానకవీశ్వరవరునిఁ గూచి
మంచి తిమ్మకవీంద్రుని మదిఁ దలంచి."

అని తిమ్మకవిని వర్తమానకవీశ్వరుఁడు గాఁ బొగడియుండుట యుఁ బైకాలనిర్ణయ హేతువులకుఁ దోఁడుపడుచు చున్నది. కాన భవానీశకవి క్రీ.శ. 1660 సం. ప్రాంతమునఁ బుట్టి పదు నెనిమిదవశతాబ్దిప్రారంభమునాఁటికే ప్రౌఢకవియై ధర్మఖండ మును రచియించి యుండు నని చెప్పవచ్చును.

# ధర్మఖండము

ఈగ్రంథములోని ప్రధానమైన యితివృత్తము వాల్మీకి మహర్షి చరిత్రము. శౌనకాదిమహర్షు లొకప్పుడు సూతమహ ర్షిని గనుంగొని 'రామదేవుని' నామమునుగూర్చి తెలుపఁ గోరిరి. సూతుండును వారిసంప్రశ్నము నెంతయు నభినందించుచు, నానందపరవశుం డై, రామనామమాహాత్మ్యమును బెక్కుభం గుల నభివర్ణించి, తొల్లి క్రూరుఁడైనకిరాతుఁ డొకడు రామ మంత్రమును వ్యత్యస్తముగ జపియించియు వాల్మీకి నాఁ బ్రసిద్ధివహియించి మోక్షసామ్రాజ్యమును జూఱకొనె నని తెలుపఁగా, నమ్మునీంద్రు లవ్వాల్మీకిమహాత్మునియద్భుత చరిత్రము నెఱుంగింప నక్కథకునిఁ గోరిరి. అవ్వాల్మీకికథయే ప్రధానముగా నీగ్రంథమున నీతి, భక్తి, ధర్మ ప్రతిపాదకంబు

లగు నుపకథ లనేకములు ప్రస్తావింపఁబడినవి. ఆయుపకథలలోఁ గొన్నిటియందు శివకేశవాభేదనిరూపణము మిక్కిలి గాఢముగను, యుక్తియుక్తముగను గావింపఁబడినది. మఱియు శివునిఁగాని, విష్ణునిఁగాని నిందించుట మహాపాపహేతు వని చెప్పఁబడినది. నిజమే. ఏనామముతో నున్నను లక్ష్యభూతుఁడాజగత్కర్తయే కాదా ? కావుననే,

" పరివాదాస్పద వాదమోద మదిరాపానంబుచే మత్తులై
హరిమేలంచు హరుండు మేలనుచు నాహా! కొందఱీపొందెఱుంగరు..."

అని సర్వజ్ఞకవియు, నుత్తరహరివంశమునఁ దనవిచారమును దెల్పియున్నాఁడు.

పైవిషయమేకాక యీగ్రంథమునఁ బ్రస్తావవశమున స్వర్గనరకలోకములు, వానిలోనిసుఖదుఃఖములు యథోచితముగ నభివర్ణింపఁబడినవి. అందు పాపానుభవముతోఁగూడిన నరకవర్ణనము మిగుల భయంకరమై, మానవహృదయమును బాపకార్యములపొంతకుఁ బోనీయనంతటిసామర్థ్యముగలదై యొప్పుచున్నది. అట్లే స్వర్గలోకవర్ణనమును, ఆయాసౌఖ్యముల ననుభవించుటకై మానవులమానసము లుఱ్ఱూట లూరునట్లొనరించుచు, వారిని బుణ్యకార్యాభిముఖులను జేయుటకుఁ జాలినదియై, తనరారుచున్నది.

ఇట్లే సందర్భము ననుసరించి పతివ్రతామాహాత్మ్యము, మార్కండేయహృదయనైర్మల్యపరిశోధనవైచిత్ర్యము, దాక్షా

రామ పీఠికాపురక్షేత్ర మహిమాద్యభివర్ణనము, దూర్వాసో మహామునీంద్రవిచిత్రచర్యాకథనము, ప్రహ్లాదగర్వనిర్వాపణకథ, భగవద్గీతాపఠనప్రభావాభివర్ణనము, ఇంకను భారత, భాగవత, రామాయణాదులలోని కథ లనేకములును నాయాచోటులఁ జెప్పఁబడినవి. ఈరీతినే పురాణము లన్నిట నీతి, భక్తి, ధర్మ, చారిత్రకవిజ్ఞానప్రబోధకంబు లగు కథలు జనసామాన్యమునకు మరల మరల జ్ఞప్తికిఁ దెచ్చుపొంటె నొకదానిలోనివి వేఱొక దానియందు దఱచుగ వ్రాయఁబడుచుండును.

ఈగ్రంథములోని యొక్కొక్కకథయందును నీతివిశేషమో, భక్తివిశేషమో, లేక వానిసమ్మేళనవిశేషమో చెప్పఁబడుచు నుండుటయ కాక యనేకధర్మములు సందర్భానుసారముగాఁ జొప్పింపఁబడి గ్రంథనామమును సార్థక మొనర్చుచున్నవి. ఇంతియకాక, యీకావ్యము ధర్మఖండము గావునను, ధర్మప్రబోధమే దీనియందు ముఖ్యలక్ష్యముగా నుద్దేశింపఁబడి యుండుటచేతను నాయాయితిహాసములయం దొక్కొక్కచోట నాయాపాత్రములచే ధర్మప్రసంగముచేయించుటకు గ్రంథకర్త యవకాశమును గల్పించుకొన్నాఁడు. మఱియు నీపుస్తకమునఁ జెప్పఁబడిన వైదికధర్మములు విధులును, పౌరాణికధర్మములు యుక్తములును, సాంఘికధర్మములు తాత్కాలికములును నైనట్లు గన్పట్టుచున్నవి. వీనిం దెలుపునితిహాసములును దదనుగుణముగానే యున్నవి. మొత్తముమీఁద నిక్కోశ మంతయు

భక్తి, నీతి, వైరాగ్యాదివిశేషములచే నుత్సాహజనకముగానే యున్నది. ఇందు చెప్పఁబడిన యుపకథ లన్నిటికిని మూలమైనది

## వాల్మీకి చరిత్రము.

మహాపురుషులజీవితములు మానవలోకమునకు మణిమయాదర్శములు. వారిచరిత్రములు నిరంతరపఠనీయములు. వారిప్రవర్తనము లవశ్యానుసరణీయములు. అట్టిమహాత్ములు జగదుపకారార్థ మప్పుడప్పు డవతరించుచుందురు. వారిలోఁ గొందఱు మహానుభావత్వము బాల్యమునుండియు సువ్యక్తమగుచుఁ దుదకు మహోన్నతస్థితికి వచ్చి ప్రకాశవంతమై లోకమును రంజింపఁజేయును. ప్రహ్లాదాదు లీతరగతిలోనివారు. కొందఱు చిన్నతనంబున నుత్తమపురుషలక్షణములను స్ఫురింపఁజేసియు, యౌవనదశయందు భ్రష్టులై, తుదకుఁ బూర్వవాసనచే నుత్తమోత్తమత్వమును గానుపింతురు. విప్రనారాయణాదు లీజాతిలోనివారు. మఱికొందఱు పిన్నటనాఁటనుండియు దుష్టత్వ మేర్పడ నానావిధపాపకర్మముల నొనర్చుచువచ్చి, తుదకుఁ బుణ్యవశంబున మహాపురుషత్వమును గాంచి యాచంద్రార్కం బగు యశంబును గాంతురు. వాల్మీకిమహర్ష్యాదు లీతెగకుఁ జేరినవారు.

వాల్మీకునియుత్పత్తిం గూర్చి రెండుమతములు గలవు.

అందొకటి—ఆతఁ డుత్తమబ్రాహ్మణవంశమునకుఁ జెందినవాఁ డనియు,యౌవనదశయందు కిరాతవనితాలోలుఁడై, క్రూరుఁడై పిమ్మట సాధుపురుషసందర్శనాదులచే మహాపురుషుఁ డయ్యె ననియుఁ జెప్పుచున్నది. వాసిష్ఠరామాయణము, భక్తవిజయము మొదలగునవి యీమతమును దెల్పునవి. రెండవది—ఈతఁడు క్రూరకిరాతకులసంజాతుఁ డనియుఁ, దరువాత సప్తమహర్షి సందర్శన సంభాషణ సదుపదేశాదులచే మహానుభావత్వముఁ గాంచె ననియుఁ దెలుపుచున్నది. ధర్మఖండము, రఘునాథభూపాలునివాల్మీకిచరిత్రము మొదలగునవి యీమతములోనివి. కొన్ని హేతువులనుబట్టి యీమొదటిపక్షమును, కొన్ని యుపపత్తులనుబట్టి యీరెండవపక్షమును బోషింపఁబడునవియే. వీనిపూర్వపక్షసిద్ధాంతములను బ్రస్తుతము నిలిపియుంచి, పుళిందాన్వయసంభూతుఁడుగాఁ జెప్పఁబడిన యీగ్రంథములోని వాల్మీకిచారిత్ర మెట్లు నిర్వహింపఁబడినదో యిచ్చట సంగ్రహించుచున్నాను.

తొల్లి యొకప్పుడు సప్తమహర్షులు హిమగిరికి నరుగుచుండఁ, దత్సమీపవక్షణాధిపతియు, నంతకప్రతిముఁడును, ధనుర్బాణాదిభయంకరసాధనహస్తుండును నగుకిరాతుఁ డొకఁడు, పొదలమఱుంగున నిలిచి' పొంచిపొంచి చూచుచు వారిని గొల్లపెట్టుతలంపున నొక్కదాఁటునఁ బిడుగువలె వారియెదుటఁ బడియెను. ఆకస్మికముగ సంభవించిన యట్టివిపత్సమయమున

నమ్మహర్షులు తమపూజోపకరణాదులను జేరువ నున్నపొదల మాటునఁ బాఱవైచుటయు, మేనులఁ జెమ్మటలు గ్రమ్మ భీతి ల్లుటయు మానవసామాన్య మైన వారికళవళపాటును బ్రదర్శిం చుచున్నను, నొక్కఁడయడు గెనఁ గదల్పక, నకుశములై నిర్మల ములైన తమహస్తాబ్జములను బైకెత్తి, మృదుమధురసంభాష ణము సల్పి, సదుపదేశముచే వానిని దుష్కృత్యములనుండి మరలింపఁ బ్రయత్నించుట వారి తపోధనసంపన్నతను, మనో నైర్మల్యమును, ప్రతిభాతిశయమును, ఆత్మవిశ్వాసమును సూచించుచున్నది. సామాన్యముగా నెట్టిదుర్మార్గునిహృదయ మునం దైనను పుణ్యాపాపనిరూపణజ్ఞాన మిమ్ముడుకొనియే యుం డును. కాని స్వార్థపరత్వము వానిని ధర్మమార్గమునుండి తాత్కాలికసుఖమార్గమునకు మరలించుచుండును. దానంజేసి సుఖలోలుఁ డగు మానవుం డేదియో యొకసమాధానమును గల్పించుకొని దుష్కార్యముల నొనరించుచుండును. ఈవు ళిందుఁ డట్టివాఁడుగానే కన్పట్టును. కావుననే యాతఁడు, వారి యుపదేశవాక్యములు తనమానసమును గలఁగించినను లక్ష్య ముసేయక, స్వధర్మనిర్వహణము గావించుచుంటి నను విశ్వాస ముతోడను, తన్నుఁ దప్పించుకొనిపోవుటకై వా రిట్లు పల్కు చున్నా రను నభిప్రాయముతోడను దారపుత్త్రాదిసంరక్షణమే తన విధాయకకృత్య మని చెప్పి వారిధర్మోపదేశముల నెల్ల నొక్క వెడనవ్వుతోఁ ద్రోసివైచెను. ఇంతవఱకు మనమునిం

దు్రిలసంగీతమునకుఁ జింతకాయలు రాలినవి గావు. కాని, ప్రత్యుత్పన్నమతు లగు వారి కిప్పు డొక్క పల్లవిదొరకినది! ఆపల్లవి మనపుళిందునివజ్రకర్కశహృదయమునుసయితము ద్రవీభూతమును గావించెను. ఆకారణమున దుర్బలమైన వానిహృత్పిండ మతివేలముగఁ గొట్టుకొనఁదొడంగెను. ఆసంచలనమువలనఁ గలిగెడి యొక్కొక్కశబ్దమునందును “పాపము! నరకము! బాధ!” అనుపలుకులు ప్రతిధ్వనించుచుండెను. దృఢాతిదృఢమైన యక్కిరాతునిమానసమునకు హఠాత్తుగాఁ బరివర్తనమును గల్పించిన యాపల్లవి యేది? „ఘోరతరమైన నీపాపమును నీదారపుత్రాదులు పంచుకొనియెదరేమో చెప్పుము!” అనుప్రశ్నమే!

ఈసంప్రశ్నముచే శాబరరాజుస్వాంతము కడుంగడుఁ గలఁతవాఱెను. తోడనే కుటుంబముకొఱకు వాఁ డొనర్చిన దుష్కృత్యములు జ్ఞప్తికి వచ్చి, పాపభయమును, నరకయాతనాభీతియుఁ బొడసూపెను. దానంజేసి వానిచిత్తము నావరించియున్న క్రూరత్వము దూరమై, యత్తపోధనులయెడ వినమ్రత్వమును, సదుపదేశపూర్వకమైన వారిప్రశ్నమునకు సదుత్తరము వడయవలయు నను కుతూహలమును గలిగెను. ఆసాధుపురుషుల సందర్శన సంభాషణాదులవలన నచ్చోరప్రభునిదౌష్ట్య మొకింత యోసరిల్లినను, పూర్వవాసనాబలంబున ధార్ష్ట్యము

మాత్రము పూర్తిగ వానిని విడువలేదు. “మీకుఁ బ్రాణములపై నాస యున్నచో, నేను మరలి వచ్చునందాఁక నిచ్చటనే యుండవలసిన దని శాసించి, యట్లుండుటకు శపథములు చేయు నెడల మిమ్ముల నూరక యిచట విడిచిపోవుదును.” అని చెప్పినాఁడు. అప్పుడు మనస్తత్త్వవేదులును, నుచితజ్ఞులును నగు నమ్మహర్షివర్యులు, కొన్నిపాపముల నుగ్గడించి, శపథములఁ గావించిరి. అప్పుళిందుఁ డింతవఱకు నొనర్చినపాతకములముందర మనమహర్షులు వక్కాణించిన యాకలుషములు సాధారణములే యైనను నిష్కళంకచరిత్రులును, సాత్త్వికస్వభావులును, నియమనిరతులును నగు నాబ్రహ్మర్షులకు నవియే మహాపాపములుగఁ గానంబడినవి! ఇఁక, ‘ పాపము ’ అనుశబ్దమునకే భీతిల్లు నవస్థకు దిగిన యీయెఱుకుజేని కప్పటి కాశపథములే సరిపోయినవి! అప్పు డాతఁడు విశ్వాసముతో వారిని వీడ్కొని నిజపట్టణాభిముఖుఁడై చని, తిన్నగా నంతఃపురమును జేరి ముందుగాఁ దన భార్యనురావించి, యామెకు సత్యమునుగూర్చియు, పాతివ్రత్యమునుగూర్చియుఁ గొంతవఱకు నుపన్యసించి, “కుటుంబపోషణముకొఱకు నేను గావించినదుష్కృత్యములఫలమును నీవు పంచుకొనెదవా? లేదా? నిజముగఁ జెప్పుము!” అనియడిగెను. ఆతనిప్రశ్నమున కాసాధ్వి “నన్నుఁ బోషింపఁదగినవాఁడవు నీవు; నిన్ను సేవింపఁదగినదానను నేను. నీవు ప్రేమించి యొసగినవాని ననుభవించుటకేకాని నీపాపములను బంచుకొనుటకు

నాకు విధి యేమి యున్నది?" అని వినయ మేర్పడఁ బలికెను. ఆమాటల కాకిరాతవిభుఁడు విస్మితుఁడై యామె నేమియు ననఁజాలక, వినయవంతుఁ డైన తనకుమారునిఁ బిలిచి, తా నంతకుము న్నొనర్చినదురితముల నెల్ల నాతనికిఁ దెలిపి, తొంటి యట్లే ప్రశ్నించెను. భిల్లనాయకుఁడు వివరించినఘోరపాపకృత్యముల కాతనిపుత్త్రుఁడు గడగడవడఁకి, "తండ్రీ! నీవు రక్షించుటయు నేను సుఖించుటయు మనధర్మములై యున్నవి. ఇట్టిచో నీపాపముల నే నెట్లుపంచుకొనఁగలను? ఏయుగమునందును నొకరు చేసినదురితములను వే ఱొకరు పంచుకొనినట్లు వినఁబడదు. అదియునుగాక పుత్త్రమిత్త్రకళత్రాదిపోషణమునకు దుష్కృత్యములనే చేయవలసిన విధి యెచ్చట నున్నది? కావున నీవు గావించినపాపములఫలమును నీవే యనుభవింపవలయును." అని ప్రత్యుత్తరము నిచ్చెను! ఈఘట్ట మీగ్రంథమున ధర్మనిబద్ధమై, సముచితమై, యుక్తియుక్తమై, స్వభావానురూపమై, హృదయంగమమై యొప్పారుచున్నది.

ఇప్పట్టునఁ బుళిందవిభుఁడు దారపుత్త్రులను ప్రశ్నించుటకు మున్ను గావించిన ధర్మప్రసంగములు—, "క్రూర-చోర వ్యాపారమునందే నిరంతరకాలక్షేపమొనర్చునట్టివానికి నింతటి ధర్మవిజ్ఞాన మెట్లు గలిగినది?"—అను సందేహమును గలిగించెడిని. కాని, దానిసమాధానము వానియుపన్యాసమునఁదే పొడకట్టుచున్నది. ఎట్లన; వాఁడు తన పూర్వవ్యాపారముల

నన్నిటిని దనప్రియసికడ ని ట్లుగ్గడించినాఁడు :—

"శా. ద్వారద్వారమునందు [1]యాచనయు, [2]సేవాకర్మముం జల్పుచున్,
[3]చేరంబాడి, [4]కృషీవలుండ నగుచుం బెంబొంది, తృష్ణాంబుధిం
బారం బేమిటఁ బొందలేక యట సంపల్లాభముం గోరి నేఁ
[5]జోరత్వం బొనరించితిన్ ఖలుఁడనై శోభావతీ! నీకునై." (35 పుట.)

ఆబోయవానితొలివృత్తులు నాలుగును జనసామాన్య మవలంబించువృత్తులే. వానివలన నాతనికి లోకముతోడిపరిచయము విశేషముగ నుండియుండకతప్పదు. ఆపరిచయము వలన వాని కాకాలమున ధర్మాధర్మవివేకము గలిగియుండు ననుటయు విరుద్ధవిషయము గాదు. అయిన నేమి? ఒకవర్తనము నుండి వేఱొకవర్తనమునకు వానిని గ్రమముగా నెక్కించుచు నుత్తరోత్తరాభివృద్ధిని గాంచిన తృష్ణాదేవికిమాత్ర మావృత్తుల వలన సంతృప్తి గలుగలేదు. దానంజేసి యామె వాని కైదవ వృత్తి నిజూపెను. ఆదుర్వృత్తియందు ప్రవేశించినపిమ్మట వానికి స్వార్థపరత్వమును దానితోపాటు క్రూరత్వమును హెచ్చిపోయెను. దుష్కార్యనిమగ్నుఁడై యున్న వానికప్పుడంతకుమున్ను గలిగియున్న విజ్ఞానమునకు నభివృద్ధిమార్గ మమ్మహారణ్యమునఁ గానరాదయ్యెను. అదియ హేతువుగాఁ దదీయస్వార్థపరత్వమేఘమండలిచేఁ దద్విజ్ఞానచంద్రిక కప్పఁబడియుండెను.

ఇప్పుడు సాధుపురుషసందర్శన సంభాషణములు తీవ్రవాయుప్రసారములై వానిహృదయమును దాఁకెను. వెంటనే

వాని మానసాకాశము నావరించి యున్న యామేఘమండలి యోసరిల్లెను. విజ్ఞానచంద్రిక తన దివ్యకాంతులతోఁ దేజరిల్లెను. ఆయొఱుకుతేని యాధర్మోపన్యాసపుఁ దళతళలు తద్దివ్యకాంతి సంభూతములే! ఇఁకఁ గథాభాగమునకు మరలుదము.

ప్రాణముకంటె నధికముగాఁ దన్నుఁ బ్రేమించు చున్న సహధర్మచారిణియు, దైవముకంటె నెక్కుడుగాఁ దన్నుఁ బూజించుచున్న పుత్త్రుఁడునుగూడఁ దనయభిమతమునకు విరుద్ధముగాఁ బ్రతిభాషించుటచే నక్కిరాతుఁడు హతాశుఁడయ్యెను. అప్పు డాతనికిఁ బాప మనునది యెంతదుర్భర మైనదో స్పష్టముగాఁ దెలియవచ్చెను. మఱియు వానిపాపసముదాయ మంతయు నొకభీషణాకృతిని దాల్చి వానియెదుటఁ బ్రత్యక్ష మయ్యెను. అంతట లోకమంతయు రౌరవాదిమహానరకములచే నాక్రమింపఁబడినట్లు వానికిఁ దోఁచెను. పశ్చాత్తాపానలజ్వాలలచే నొడలంతయు నుడికిపోవుచుండెను. అప్పు డాతనికి భార్య, పుత్త్రులు, రాజ్యము, పరివారము మొదలగు వానియందు గల యభిమానమంతయు విలుప్త మైపోయెను. అగాధపరితాపముచేఁ గ్రాఁగి కాఁగి తృష్ణాదేవి స్వార్థపరత్వమును వెంట నిడికొని పాఱిపోయెను; అజ్ఞానముతోడ నహంకారమును పటాపంచ లయ్యెను. విచారావృత మై యున్న విజ్ఞానకళ వానిహృదయాంతరాళమున కొక్కసారి మెఱపుమెఱసినట్లు తళుక్కుమనియెను! అత్తళుకులో వానికి మహర్షి చరణంబులు నవవికసితపద్మముల

వలె మనోహరంబులై కానవచ్చెను! తచ్ఛరణంబులుదక్క- వేఱొక శరణం బేదియు వానికి నగపడుటలేదు! ఆయాశతోనే యాతఁడు శరవేగమున మునీంద్రసందర్శనమునకై యేతెంచెను.

అప్పటి వాని నిర్వేద మెట్టిదో కాని, దానివలన వానికిఁ గలిగిన వికారాకారము, తత్పూర్వభీషణాకారము నినుమడించి, యాబ్రహ్మర్షులకు నీశ్వరసాహాయ్యము నపేక్షింపవలసినంతటి భీతిని గల్పించెను. ఆనిర్వేదము స్నేహమై వాని విజ్ఞాన దీపికను బ్రజ్వరిల్లఁ జేసెను. ఆ నిర్వేదముతోనే యాతఁ డమ్మహా మునీంద్రులకు సాష్టాంగనమస్కారము లాచరించి తన్నుద్ధరింప వలసిన దని ప్రార్థించెను.

ఈఘట్టమునందు పశ్చాత్తప్తుఁడును, పాపభీతుఁడును, తరణోపాయాభిలాషియు, వినయవినమ్రసుభాషియు నగు నప్పాళిందునిచే, గురుసాన్నిధ్యమున హృదయవేదనానివేదనముం బోలె, నాసంయమీంద్రులసమ్ముఖమ్మునఁ బాపపుణ్యపరిశంస చేయించుట యెంతయు యుక్తముగా నున్నది. జ్ఞానాతురుఁడైన యాతని సంప్రశ్నములకు సహానమ్మై సమాధాన మిచ్చు వారుంబోలె, సంయమీంద్రులు సదుపదేశరూపకముగా బోధించినవియుఁ, దత్ప్రసంగసందర్భమున సూతుఁడు శౌన కాదులకుఁ దెల్పినవియు నగు వివిధేతిహాసములలోని వివిధధర్మ ములతో నిండియుండుటచేతనే యీగ్రంథమునకు ధర్మఖండ మనునామము సార్థక మైనది.

క్రమక్రమముగా మునీంద్రులతోడి సంభాషణ మధిక మైనకొలఁది నాశబరవర్యునకు, ధనతృష్ణాస్థానమున జ్ఞానతృష్ణ ప్రవేశించి యధికము గాఁజొచ్చెను. అప్పు డాతఁడు నిజపాప పరిహారణార్థి యై, తన్ను శిష్యునిఁ గాఁ బరిగ్రహించి, తన కెద్ది యేని మంత్రము నుపదేశించి కృతార్థునిఁ గావింపవలసిన దని యత్తాపసవర్యులఁ బ్రార్థించెను. కాని, యనధికారికి మనూప దేశ మొనర్చుట యనర్థం బనుధర్మము వారిని బాధించుటచే వా రట్లు సేయుట కియ్యకొనలేదు. అంతట వాఁడు హతాశుఁ డై యాఋషీశ్వరులను సంహరింప సంసిద్ధుఁ డయ్యెను!

సర్వసంగపరిత్యాగి యై, సద్గతిలాభాకాంక్షి యై పశ్చా త్తప్తహృదయముతో నాత్మసమర్పణముఁగావించి, తా నొనర్చిన ప్రార్థన మంతయు నిష్ఫల మైనప్పుడు, అనన్యగతికుఁ డగు నక్కిరాతకునివంటివాని కంతకంటె నన్యోపాయ మేమి తోఁచు ను? అర్థ సంపాదనకాంక్షయందు పూర్వ మాతని హృదయ మెంతటికాఠిన్యమును వహించి యుండెడిదో, పరమార్థ సంపాద నాభిలాషమునను నిప్పు డంతక్రౌర్యమును వహించినట్లు ప్రద ర్శించి, కవి, యీసందర్భమునం దాతనిసహజగుణమును జక్కఁ గాఁ బోషించినాఁడు. మఱియు, సనాతనధర్మపరాయణులును, నిష్కలంక చిత్తులును నగు సమ్మహర్షి శ్రేష్ఠుల హృదయమునం దట్టి సంశయము గలిగినట్లు చెప్పుటయు స్వభావానుగుణముగనే యున్నది.

ఇప్పట్టునఁ గిరాతునిహృదయ మెంతతీక్ష్ణ మైపోయినదో, ఆతీక్ష్ణత్వమును గాంచిన మహామునీంద్రులహృదయమును నంతె ముగ్ధమైపోయినది. అప్పుడు వానిబారినుండి తాము విడివడుట కైనను, పాపములబారినుండి వాని నుద్ధరించుట కైనను వారు ప్రియత్నింపవలసియున్నది. కాని యేయుపాయమును నాసమయమున వారికిఁ దోఁపలేదు. దానంజేసి వారికి దైవసాహాయ్యము గావలసివచ్చెను. తుదకు వారు దేవునిం బ్రార్థించి తదుపదిష్టమార్గముననే యాతనికి మంత్రోపదేశమును గావించిరి. [మానసిక శక్తివలన నిష్కలంకచిత్తు లగు మహాత్ము లీశ్వర సందర్శనమును సంకల్పించుకొనఁ గలుగుట యొకయాశ్చర్య విషయము గా దనుటకుఁ బూర్వాధునికదృష్టాంతము లనేకములు గలవు.]

పశ్చాత్తాపవేదనచేఁ బరివక్వమై యేకాగ్రితం బొరసియున్న భిల్లుని చిత్తక్షేత్రమునందు, శుక్తియం దమృతబిందువుం బోలె నమ్మహామంత్రిబీజరాజ మావాపిత మై సత్ఫలసంసిద్ధికిఁ గారణ మయ్యెను. ఇఁకఁ జెప్పవలసిన దేమి? నిరతిశయపుణ్యావశంబున ముమ్కురుఁ డైనపుళిందునకు మునిత్వము ప్రాప్తించెను! అంతట నాతఁడు దత్సంయమీంద్రులను వీడ్కొలిపి, గురుని యాదేశము ననుసరించి తాపసవేషధారియై తపముసేయ నారంభించెను. ఆతని గురువిశ్వాసమును, తన్మంత్రిరాజప్రిభావమును నెట్టివో కాని, వానిదారపుత్రాదులు, బంధు పరివారాదులు

నచ్చోటికి వచ్చి యెన్నివిధములఁ బ్రార్థించినను నాతనికి వినఁబడనియంతటిగాఢసమాధియం దాతనిని బ్రవేశపెట్టిన వయ్యెను. క్రమక్రమముగా నాతఁడు తన్మంత్రమయుఁడై బహిఃప్రపంచమునే మఱచిపోయెను! మఱియు, నాతనియుగ్రతపంబునకు భీతిల్లి, విఘ్నం బాపాదింప దేవేంద్రుఁ డనిపిన యప్సరోవనితల గర్వోక్తులకుఁగూడ నాతనియసాధారణసమాధిచే భంగపాటు వాటిల్లెను!

"చోరులకున్ జారులకుం
క్రూరులకు శరారులకును గురుతరమహిమన్
వైరాగ్య మబ్బె నేనియు
వారలకున్ మరల విషయవాంఛ యొదవునే?" (329 పు. 80 ప.)

అని యాతఁడు తొలుత గురుసన్నిధిని గావించినప్రతిజ్ఞ సత్యమై సార్థకమైనది! మఱియుఁ బ్రపథమమునఁ జోరసందర్శనము కాఁగానే "తపోధనముదక్క మునయొద్ద నేమున్నది?" అని యామునీంద్రు లనుకొనినట్లు ప్రారంభమునఁ గథాబీజమును సంధానించిన మనకవి, యామునీశ్వరులచేతనే వానికిఁ దపోధనమును జేకూర్పించి కావ్యగుణమును బోషించినాఁడు!

వసిష్ఠశిష్యుం డగు నమ్మునిచంద్రుని తపోమహిమంబువలన నాతఁ డున్నఘోరవన మంతయు నందనోద్యానమును దృణీకరించునంతటి పరిశాంతసుందరాకృతిని వహించెను! తొల్లి

యూతనికి మంత్రోపదేశ మొనర్చి, చిరకాలమునకు పూర్వప
శంబున నచ్చోటికే వచ్చిన సప్తర్షిసత్తములుసహిత మవ్వనము
నానవాలుపట్టలేకపోయిరి ! అత్తపోవనమునం దున్న స్థావర
జంగమపదార్థము లన్నిటినుండియు, పంచభూతములయందును
రామనామము ప్రతిధ్వనించుచుండెను. అన్నిటను దన్మంత్రా
ధిదేవత యగు శ్రీరామచంద్రునిమూర్తి దివ్యకళా కలితమై
కన్నులకుఁ గట్టినట్లు దోఁచుచుండెను. గురూపదేశంబు వడసి,
సర్వంబును మఱచి, యాత్మారాముఁడై తపస్సమాధియం
దున్న యమ్ముని శ్రేష్ఠునిభౌతికదేహము, చిరకాలము గతించిన
కతన వల్మీకసంయుతంబై గుల్మలతాపాదపపరివేష్టితంబై
దృగ్గోచరంబు గామింజేసి యమ్మహర్షిసప్తకము శిష్యసహితం
బుగా నత్యంతాశ్చర్యానందనిమగ్నమానసమై యమ్మనోహర
ధ్వనిరూపంబులకు మూలము నారయ నలుదెసల విలోకించు
చుండెను. అంతట వారికి నారదమహామునిసందర్శనము కాఁగా,
వా రాతనిం బూజించి, యాధ్వనిరూపంబులకుఁ గారణము
దెలుపవేఁడిరి. అప్పు డాదేవముని వసిష్ఠు నుద్దేశించి " నీశిష్యుం
డగు నలనాఁటికిరాతుఁడే యిందు వల్మీకాచ్ఛన్నుండై తపంబు
సేయుచున్నవాఁడు. " అని యెఱుంగించి వారియాశ్చర్యానంద
ముల నినుమడింపఁజేసెను. పిమ్మట వారు తత్సందర్శనకౌతూ
హలంబును బట్టఁజాలక, వెంటనే యవ్వల్మీకంబు గ్రొచ్చి యంతు,

"సీ. పుటపాకశోభితభూరిప్రభాసాంద్రు
నజినవల్కలనిచయావృతాంగుఁ
జాటలస్ఫుటజటాపటలాభిశోభితు
రామనామాసక్తరమ్యరసను
సద్గురువరపాదజలజార్పితేక్షణు
దీప్యమానానలదివ్యతేజు
నవిదితబాహ్యలోకానీకవర్తను
శ్రీరామచరణాబ్జచింతనాత్ము
గీ. బద్ధపద్మాసనస్థుఁ దపఃప్రదీప్తు..." (నవమా. 266 ప.)

మునివరు లొక్కనిఁ గాంచి యాతని ననేకవిధములఁ బ్రబోధించిరి. కాని, గురుమంత్రమునే జపియించుచు, గురూపదేశమునే మననముసేయుచు గురుస్వరూపమే బ్రహ్మస్వరూపముగా ధ్యానించుచు, సర్వమును దన్మయముగా ననుభావించుచు నున్న యాతనికిఁ గడపటిగురువాక్య మొక్కటియే తుదకుఁ బ్రబోధకారణమయ్యెను!

తనపాపవిముక్తికిని, దుఃఖవిముక్తికిని, బంధవిముక్తికిని నెవ్వనియనుగ్రహము ప్రధానాధార మని యాతఁడు విశ్వసించియుండెనో యట్టివసిష్ఠుఁడు, తనప్రార్థనమును దిరస్కరించి నప్పుడు, ఒక్కసారిగాఁ గ్రోధోద్రిక్తుఁడై యమ్మహాత్మునిఁ జంపుటకు సాహసించుటయం దాతనియహంకార మెంతపరమావధి నందినదో, యిప్పు డీతనిసర్వాత్మకత్వ మంతపరమావధి నందినది. తొలుత భౌతికార్థసంపాదనమునం దాతని కెంతపట్టుదల

యుండెనో, పిమ్మటఁ బరమార్థ సాధనవిషయమునందును నం తటి యభినివేశ మున్నట్లు ప్రదర్శించి కవి యాతనిభౌతికాధ్యాత్మికజీవితముల చరమాత్కృష్ట్యమును జక్కఁగాఁ జూపినాఁడు.

ఇఁకఁ జెప్పవలసినదేమి? కిరాతుఁడు వాల్మీకి యై, పరమబ్రహ్మర్షి యై, శ్రీమద్రామాయణకర్త యై, యాదికవి బిరుదముతో నప్పటికి నిప్పటికి నెప్పటికినిగూడ నక్షరస్వరూపుఁడై విరాజిల్లుచున్నాఁడు. ఈయితివృత్తము నాధారము చేసికొనియే కవి యీధర్మఖండ మంతయుఁ బ్రపంచించినాఁడు.

మఱియు, కేవలస్వార్థపరత్వముచే దయాధర్మాదులను, సామాన్యమానవత్వమునుగూడఁ బరిత్యజించి, తుచ్ఛధనలోలుఁడై, క్రూరదానవునింబోలి, స్త్రీలనక, బాలురనక, వృద్ధులనక దారుణహత్యలను గావించుటయే యాత్మధర్మముగ నిత్యహింసకుఁడై చరించుచున్న దుష్టబుద్ధి యగు నొకకిరాతాధముని—ఎవఁడో యొకనిషాదుఁడు క్రౌంచపక్షిని జంపినంతమాత్రముననే—కరఁగిపోవుచున్న హృదయముతోఁ, గొట్టుకొని పోవుచున్న ప్రాణవాయువులతో,

"మా! నిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్."

అనుప్రబోధవచనములతో ననుతపింపఁగలిగిన పరమదయాళునిఁగను, బ్రహ్మర్షిఁగను మార్పఁజాలిన యుత్కృష్టధర్మములు గల యీధర్మఖండము, రాగద్వేషాద్యరిషడ్వర్గసమా

కులం బయిన మానవలోకము నుద్ధరించుటకుఁ బరమసాధనమై యొప్పుచున్నది.

క వి క వి త్వ ము.

ఈగ్రంథములోని కవిత్వ మంతయు నిరర్గళధారావిలసితమై, లలితపదబంధురమై, ప్రౌఢమై, సలక్షణమై, హృదయరంజకమై యొప్పారుచున్నది. ఇక్కవికి నాంధ్రగీర్వాణభాషలయందు నిరతిశయపాండిత్యము గల దనుటకు గ్రంథమం దంతట ననేకదృష్టాంతములు గలవు. ఆంధ్రకవిత్వమున నీతని కెట్టి సునిశితధార గలదో సంస్కృతకవితయందును నట్టిధారయే యున్నట్టు లీకావ్యమునం దచ్చటచ్చట సందర్భవశమున ఋషిపాత్రములచే నాంధ్రచ్ఛందోనిబద్ధముగాఁ బలికించిన సంస్కృతపద్యములు దెలుపుచున్నవి. ఆంధ్రకవిత్వమువలెనే యిందుగానవచ్చు సంస్కృతకవిత్వమునయితను క్లిష్టతారహితమై, గంభీరమై, మృదుమధురమనోహరరచనముతో వెలయుచున్నది. చోరుఁడును, క్రూరుఁడును, ఖడ్గాదిభయంకరసాధనహస్తుఁడును నగుకిరాతుఁడు సప్తమహర్షుల నెదురుకొనినప్పుడు వారు పరస్పరము సంభాషించుకొనిన ఘట్టములందు గలయాయాపద్యములు పాత్రోచితభాషతో నెంతయు హృదయాహ్లాదకరములై విరాజిల్లుచున్నవి. మఱియు నాపద్యములలోఁ గొన్ని సంస్కృతచ్ఛందస్సుతో సంబంధములేని సీసగీతాదులును గలవు. 23, 24, 49, 50 పుటలను జూడఁదగును.

అట్టిధారాళసంభాషణసహిత మగు మనోహరసంస్కృత పద్యరచన మాంధ్రగ్రంథములయం దపురూపమే యని చెప్ప వచ్చును. మఱియు నీగ్రంథము చతుర్థాశ్వాసము 52 వ పద్యము హయగతిరగడ, 104 పద్యమందున్న (దండకములోని) సంస్కృతభాగము, షష్ఠాశ్వాసము (370) చూర్ణిక—వీని యందు కవి చూపినగీర్వాణకవిత్వరచనాసామర్థ్య మసాధారణ ధోరణిం జూపట్టుచున్నది. ఆంధ్రపద్యములందు గన్పట్టు సం స్కృతదీర్ఘసమాసములు సైతము సరళమధురశబ్దగుంభితము లై యున్నవి. మొత్తముమీఁదఁ గవిత్వ మంతయు మనోజ్ఞ రచనా విలసితమై ప్రౌఢమై యొప్పుచున్నది.

ఇక్కవికాలమునాఁటి కాంధ్రదేశమునఁ బ్రబంధరచ నము పెచ్చుపెరిగియుండుటచే నీతఁడును నాయాఘట్టముల యం దవసరము లని తోఁచినచోటులఁ బ్రబంధలక్షణముల నగపఱిచినాఁడు. కాని, యవి విసువుపుట్టించునవి గాక సము చితముగానే యున్నవి. భవానీశకవి కేవలసాహిత్యపరుఁడే కాక స్వాధ్యాయపరుఁడు నై యుండినట్లు 373 వ పుటయం దున్న వేదపరిభాష గలపద్యము చాటుచున్నది.

ప్రౌఢప్రబంధములయందుంబోలె నీధర్మఖండమునం దును బంధగర్భచిత్రకవిత్వములు గలిగినపద్యములు కొన్ని గలవు. మఱియు సంగీతభరతాభినయాదిశాస్త్రములయందును

సీతనికిఁ గలవిశేషపరిచయమును పంచమాశ్వాసమునఁ (136 పద్యము మొదలుగఁ) గనవచ్చును.

## ఆంధ్రీకరణము.

మూలగ్రంథమునుబట్టి యీతనిభాషాంతరీకరణ మెట్లుండెనో కనుఁగొనుటకు సంస్కృతధర్మఖండము నాకు లభియింపలేదు. అయినను గ్రంథమంతయుఁ బఠించువారికి, భారతాది గ్రంథములను మనయాంధ్రమహాకవు లెట్లు దెలుఁగించిరో, యట్లే యథామాతృకముగా నాంధ్రీకరింపక, మూలకథలను మాత్ర మనుసరించుచు యథేచ్ఛముగా వర్ణనాదులను జేర్చుచు నాంధ్రకావ్యోచితశైలిని గ్రంథమును మనోహరముగాఁ బరిపూర్తి నొందించె ననియే తోఁపఁగలదు. పెద్దవలనఁ బ్రసంగవశమున నప్పుడప్పుడు వినఁబడువానిలో నొండురెండుశ్లోకముల యాంధ్రీకరణమునుబట్టి యీతని భాషాంతరీకరణసామర్థ్యము దెలుపడఁగలదు :—

"శ్లో. చత్వారో ధనదాయాదాః, ధర్మాగ్ని నృపతస్కరాః
జ్యేష్ఠభ్రాత్రవమానేన, త్రయః కుప్యన్తి సోదరాః."

"గీ. ధర్మ, రాజ, వహ్ని, తస్కరుల్ నలువురు
భ్రాత లర్థమునకుఁ బాలివార
లందు నగ్రజాతు నవమాన మొనరింపఁ
గినుక నొందు మువ్వు రనుజులకును."

"శ్లో. రాజా రాష్ట్రకృతం పాపమ్, రాజపాపం పురోహితః
భర్తా భార్యాకృతం పాపమ్, శిష్యపాపం గురు ర్వ్రజేత్."

"క. క్షితిజనకృతదురితము భూ
పతిఁ జెందున్ నృపతిచేయుపాతకము పురో
హితుఁ జెందున్ సతిదురితము
పతిఁ జెందుం జెందు శిష్యపాపము గురునిన్."

## ఛందోవ్యాకరణవిశేషములు.

ఆంధ్రకవిత్వము పుట్టినదిమొదలు నేఁటివఱకు నాంధ్రి చ్ఛందోవ్యాకరణలక్షణము లేకనియమబద్ధము లై యుండలేదు. కవిప్రయోగస్వాతంత్ర్యముచే నైన నేమి, లేఖకప్రమాదములు పూర్వకవిప్రయుక్తము లని నమ్మి తరువాతికవులు ప్రయోగించుటచే నైన నేమి, ఇట్టికారణములు మఱికొన్నింటిచే నైన నేమి యాయానిబంధనములు నానాఁటికి ననేకవిధముల మాఱిపోయినవి. వానింబట్టి కవులలోను, లక్షణగ్రంథకర్తలలోను మతభేదము లేర్పడినవి. వాని నెల్లఁ జర్చించుట కిది యదను గాదు గాని, ధర్మఖండములోని ప్రయోగములు కొన్ని కొంద ఱిమతమున దుష్టములుగాఁ గన్పట్టినను గొందఱిమతమున సాధువులే యని చూపుటకుమాత్రము కొంత యవకాశముఁ దీసికొనవలసియున్నది.

ఛందోవిషయములు :—

(1) ఉ—వు ల యతి :—

"కా, వునఁ జండాలుఁడ వాదు సందియము లే దూహింప" 227 వు.

ఇది యొకచిత్రమైనయతి. సంస్కృతభాషయందు, ఇ, ఉ, ఋ, ౠ లకు భిన్నాచ్చు పరమైనప్పుడు వరుసగా య, వ, ర, ల అనునవి తూదేశము లగును. దీనికి యణాదేశ మని పేరు. ఆంధ్రచ్ఛందస్సులయందు "ఇ—యి, ఋ—రి, ౠ—లి" అనునవి పరస్పరము యతిమైత్రిఁ జెందుచుండుట యీ యణాదేశశక్తిచేతనే యనియు, నట్లే 'ఉ—వు' లుగూడ యతిమైత్రి నొందవచ్చు ననియుఁ గొందఱు కవీంద్రులమత మైనట్లు తోఁచుచున్నది. కాని లక్షణగ్రంథకర్త లీయతిని గ్రహించినట్లు గానరాదు. అయినను, పూర్వకవులు కొంద ఱీయతిని వాడినారు. ఒండు రెండుప్రయోగములనుమాత్ర మిచ్చుటఁ జూపెదను:—

"దే, వునను వనుంగువాఁడ వని యుత్సుకతన్..."

పాల్కురికి సోమన, వృషాధిపశతకము, 98 ప.

"కా, వునఁ దగ నర్జునుండుఁ బవనోద్భవుఁడున్..."

ఆంధ్రభాగవతము, దశమస్కం. ఉ. భా. 714 ప.

ఇట్టి వింకను గలవు. కావున మనకవిప్రయోగ మసాధువనఁ జెల్లదు.

(2) రేఫద్వయమైత్రి :—

ఈమైత్రినిగూర్చిన మతభేదము గజకచ్ఛపములపోరుం

బోలెఁ జిరకాలమునుండి పరంపరగా వచ్చుచున్నది. ఇది సామాన్యముగా నాంధ్రకవులయందఱగ్రంథములయందును గలదు. నన్నియభట్టారకునికి మున్నే శకటరేఫోచ్చారణము మాఱిపోయినది. ఉచ్చారణభేద మున్నంతకాలము మనవారు దానికలయిక గూడని దనునిబంధనము నేర్పఱిచిరి. ఆయుచ్చారణము సాంకర్యముఁ జెందిపోయినను, తొంటినిబంధనముమాత్రము కొందఱను బాధించుచునేయున్నది! దీనిచర్చ కిది యదను గామి విరమించితిని. ఉదాహరణములు గ్రంథమునందు చూడనగును.

(3) ప్రాసభేదము :—

"క. ఆద్వారంబున నరిగి..., 'తద్ద్వారస్థితుఁడు...'" సప్తమా. 272ప.

"ప్రాసస్సర్వేషు చైక ఏవ స్యాత్" అనుసూత్రము ప్రకారము కడవెడలఁ బ్రాస మేకరీతి నుండవలయు ననుట న్యాయ్యమే కాని కవులప్రయోగవిశేషములంబట్టి ప్రాసవిశేషములును బెరిగిపోయినవి. పైప్రాసమువంటిది భారతాదిగ్రంథములఁ బెక్కుటఁ గానవచ్చుచున్నది. ఒక్కయుదాహరణము :—

క. ఆద్యపురుషోపలాలిత, 'ముద్యోతితరోచిరుద్గమోగ్రంబు"
తిక్కనవిరాటప. చతు. 121 ప.

(గీర్వాణసూత్రాధారమునఁ గొంద ఱిట్టిచోటులఁ బ్రాసాక్షరములన్నిటికిని ద్విత్వము నిచ్చెదరు.)

(4) పృథ్వీవృత్తము :—

నాకు లభించిన లక్షణగ్రంథము లన్నిటఁ బృథ్వీవృత్తము నకుఁ బదిరెండవచోట విశ్రమము చెప్పఁబడినది. కాని, లింగమగుంట తిమ్మనమాత్రము సులక్షణసారమునందు దీనికిఁ బదునాలవస్థానమున యతిని విధించినాఁడు. నన్నియాదికవులు పండ్రెండవచోటనే యతిఁ గూర్చినారు. అల్లసాని పెద్దనామాత్యుఁడు మాత్రము సంస్కృతలక్షణము ననుసరించి తొమ్మిదవ యింట దానికి విశ్రమమును గలిగించినాఁడు. మనభవానీశకవి యీరెండుమతములను బాటించి రెండుపద్యములను జెప్పించి నాఁడు ! ఎట్లన,

" ప్రతోదముల గ్రుచ్చియుం ♦ బ్రదర♦రాజిచే నొంచియున్ ... "
106 పుట. 24 ప.

" చెలంగి ద్విజులం దిర♦స్కృతులఁ♦జేయుటన్ " 119 పుట. 72 ప.

తక్కినవానియందు పెద్దనమతమునే స్వీకరించినాఁడు:—

" శివస్తవ చయంబులున్ ♦ శివసహస్రనామంబులున్ ... "
అష్టమా. 257 ప.

## II. వ్యాకరణవిశేషములు :—

(1) నః కౌ—కువర్ణకంబు పరం బగునపుడు, ఉకార ఋకారంబులకు నగాగమం బగు. (వ్యా. సూత్రము.)

ఈసూత్రమును ప్రౌఢవ్యాకరణకర్త మొదలగువారు కొంద ఱంగీకరింపలేదు. దీనినిగూర్చినచర్చ చాలఁ గలదు.

దానిని విడిచి ప్రామాణిక కవిప్రయోగములనుమాత్రము రెంటి నుదాహరించెదను :—

« అడిగిడుచోటఁ గాల్దెమలినంత నె 'కౌనుకు' బింద మయ్యెడున్. »
నన్నిచో. కుమా. అష్ట. 16 ప.

« నీకనినపదంబు ద్రిప్పఁగ జగత్పతి 'పద్మజుకైనఁ' బాడియే ? »
ఎఱ్ఱన నృసింహపు. ద్వి. 28 ప.

వీనింబట్టి మనభవానీశుని

«'ఛాయాదయితోదయం బవధి'యాత్మనరాయువు
కంచు' నెంచుచున్» 158 పుట 216 ప.

అనుప్రయోగము రక్షిత మగుచున్నది.

(2) "ఆగమచకారమునకు ముత్తు పరం బగునప్పుడు పత్వము వచ్చును." అని వ్యా. సూ.

« జనయిత్రిన్ భుజియింపఁ బెట్టక 'భుజించం'గాదు. »
256 పుట. 177 ప.

ఇట్టిప్రయోగములు పూర్వాధునికములు లెక్కకు మిక్కిలినవి గలవు. మచ్చునకు మహాకవిప్రయోగ మొకటి:—

క. మించుగ నాసురపులు శి
క్షించిన యాయొక్కరింత పెంగమునకు సం
'హించ' నొక నాల్గు గడియలు ... ..." క. పు.

(3) వానిల్లు—వాని+ఇల్లు. (ఇకారసంధి)

« విహరించుచుండెడి వీరాయెను వేంపు 'వానింటి' » 377 పు.

ఈసంధి సామాన్యముగా నాంధ్రగ్రంథములయందన్నిటఁ గన్పట్టునదే. ఇతరోదాహరణముల మాని 'వాని'శబ్దమునకును, దానివంటిదే యగు 'దీని'శబ్దమునకును సంధిసేయఁబడిన ప్రౌఢ కవిప్రయోగములనుమాత్ర మిచ్చుట నిచ్చెదను:—

“ 'వా,నరదముఁ' దునిమెన్ సకేతుహయసూతముగాన్ ”

జైమినిభా. సప్త. 19 ప.

“ ననయమ్మువానిఁ గన్న నయమ్ము గలయింతి
ననయమ్ముఁ దాల్చు 'వానన్నఁ' జెనకి ”

నరసభూ. చతు. 68 ప.

“ శుద్ధపార్ష్ణులు గాన చూడ 'దీనంఘ్రులు'... ” నైష. తృతీ. 202ప.

ఇట్లే మోచుక, లేకన్ మొదలగుప్రయోగములు చూపట్టుచున్నవి. కొందఱువ్యాకర్తలు వీనిని దోషయుక్తములుగాఁ బరిగణించిరి. కాని కొందఱమతమున నివి సాధువులే యైనట్లు పూర్వమహాకవిప్రయోగములు శతసహస్రములుగాఁ జూపట్టుచున్నవి. ఒండు, రెండు ప్రయోగములుమాత్ర మిందు చూపెదను.

“ గరళం 'బెత్తుక' క్రోలఁగాఁ దలఁచితే ? కష్టాత్మ !”

భాస్కరరా. అరణ్య. ద్వి. 102 ప.

“ బ్రహ్మాస్త్రమవలీలఁ 'బట్టుక' మ్రింగ ” రంగనాథరామా. బాల.

పినవీరభద్రాదు లనేకు లిట్టివానిని బ్రయోగించినారు. ఇఁక వ్యతిరేకక్త్వార్థకమును (లేకన్) గూర్చిన ప్రయోగములలోఁ బ్రధానమైనది,

“క. అనఘ ! యిది యేఁటితప మే
మనుపమదుఃఖితుల మగుట నాధారముల్తే
కను సంతానోచ్ఛేదం,బున...” నన్నియభా. ఆదిప. ద్వి. 143ప.

అను ప్రామాణికాగ్రగణ్యప్రయోగమే కలదు ! దీనిని బలువురు పలుతోవలఁ బెట్టినారు !

## గ్రంథ పరిష్కరణము

### (వ్రాఁతప్రతులు)

ఏతద్గ్రంథ పరిష్కరణమున కాధారములైన వ్రాఁత ప్రతు లైదు. వానిలో రెండు తాళపత్త్రపుఁబ్రతులు. ఈ రెండు నసమగ్రములే. ఒకటి సప్తమాశ్వాసము సగమువఱకును, రెండవది అష్టమాశ్వాసముసగమువఱకును గలిగియున్నవి. తక్కినమూఁడును గాగితపుఁబ్రతులు. అందొకటి పైవాని వలెనే యసమగ్రము; ఒకటి సమగ్రమైనదే కాని, దీనిమాతృక దొరకలేదు.* తక్కినమూఁడవకాగితపుఁబ్రతి, పైప్రతులు నాల్గిటినిబట్టి ముద్రణమున కనువగునట్లు విశదమైనలేఖనము తో నున్నది. పైప్రతులు నాలుగును నేకమాతృకాపుత్త్రికలు గావు గాని, తత్పుత్త్రికలపుత్త్రికలో, వానిదౌహిత్రికలో యై

* ఇక్కాగితపుఁబ్రతి యథామాతృకముగా వ్రాయఁబడిన దగుటచే మాతృక లేనిలోపము గానరాలేదు!

యుండు నని కొన్ని కారణములనుబట్టి తోఁచుచున్నది. వివరణ మనావశ్యకము.

మఱియు, నసమగ్రపుఁబ్రతులు మూఁటియందును ననేకము లైనలేఖనదోషములు, ఛందోవ్యాకరణాదిదోషములు, పద, వాక్య, పాద, పద్య, కథాభాగ లోపములు, ఈలోపములను బూరించుకొనుటకై కొన్నిచోట్ల విడిచిపెట్టఁబడినస్థలములు మొదలగునవి గలవు. నాలవప్రతి గ్రంథమంతయుఁ జాలవఱకు లుప్తభాగములు లేకుండ నున్న దన్నమాటయే కాని తక్కిన విషయములయం దెల్లఁ బైవానికిఁ దీసిపోలేదు. పరిశుభ్రముగా వ్రాయఁబడిన యైదవప్రతియందు సామాన్యము లగు లేఖన దోషములు విశేషముగను, తక్కినదోషము లచ్చటచ్చటఁ గొలఁదిమాత్రమును నవరింపఁబడినవి గాని దానియందును లెక్కకు మిక్కిలినదోషము లట్లే వ్రాయఁబడినవి. మొత్తము మీఁద సందిగ్ధస్థలములయందు పెక్కుటఁ బ్రతు లన్నియు నేకవిధసాహాయ్యమునే చేసినవి ! * అయినను యథామతిని బరిష్కరించితిని. నాయజ్ఞానమున నిలిచిపోయిన తప్పులను మన్నింపఁ బాఠకులను వేఁడుచున్నాను.

సుప్రసిద్ధవిమర్శకులును, భాషాభిమానులు నగు శ్రీయుత బండారు తమ్మయ్యగారు ప్రసంగవశమున నేతత్పుస్తకము

* అష్టమాశ్వాసము సగము మొదలు గ్రంథముకడవఱకుఁ బ్రత్యంతరము లేమింజేసి వానిపరిష్కరణము మఱింతకష్టమును గలిగించెను.

ముద్రింపఁబడినసంగతి విని సందిగ్ధపాఠములను సరిచూచుకొను టకై తాటియాకులప్రతి నొకదానిని దయతో నా కిచ్చిరి. అది యు సంపూర్ణగ్రంథముగాకపోయినను నేను గావించినసవరణము లనేకములు కవ్యభిప్రాయానుసారములే యని తెలిపి నా కత్యం తామోదము నొడఁగూర్చినది. మఱియు, దానింబట్టి కాఁ వచ్చిన భిన్నపాఠములు, "ముఖ్యపాఠభేదములు" అనుశీర్షికగల పత్త్రమునఁ జూపఁబడినవి.

ఆయా కథలయు, పాత్రములయుఁ బూర్వోత్తరసందర్భ విషయమున నీపురాణఖండము తక్కినపురాణములను బోలియే యున్నది. కాని, యొకచోటఁ గథాన్వయవిభేదముమాత్ర మాంధ్రకావ్యములయం దదృష్టశ్రుతపూర్వముగా నున్నది. ఏది యన,

ఈగ్రంథమునయష్టమాశ్వాసము 271 వ పద్యము మొదలుకొని నవమాశ్వాసము 260 వ పద్యమువఱకు రామా యణకథా సంగ్రహము గలదు. దీనిని శివుఁడు దేవతలకు తన భవిష్యదవతారకథగాఁ జెప్పినాఁడు. కథాప్రారంభమున మన కవి, యఱువదిపద్యములవఱకు శంకరునిచే భవిష్యదర్థక్రియల తోనే దానిని చెప్పించినాఁడు. కాని, పిమ్మట నసఁగా, అష్ట మాశ్వాసము 331 వ పద్యము మొదలుకొని నవమాశ్వాసము 253 వ పద్యమువఱకు భూతకాలక్రియల నుపయోగించినాఁడు.

దీనింబట్టి కవి ప్రమాదపడినాఁ డేమో యని సంశయింపవలసి వచ్చును. కాని యట్లు తలంప వలనుపడకుండఁ దరువాతిపద్యములయందు మరల భవిష్యదర్థకక్రియలనే వాడి కథను ముగింపఁజేసినాఁడు ! ఈ హేతువుచేఁ గవి బుద్ధిపూర్వకముగానే యిట్లు వ్రాసియుండు నని నిశ్చిత మగుచున్నది. కావున దీని నిట్లు సమర్థించుకొనవచ్చును.

(1) సంస్కృతపురాణములయం దీదృశ మగుసంప్రదాయము బహుళముగఁ గన్పట్టును. అన్నిటికంటెఁ బ్రధానమైన యుదాహరణము, ఆదికావ్య మని ప్రసిద్ధిఁ గాంచిన రామాయణమే. ముందు జరుగఁబోవు నని నారదుఁ డుపదేశించిన రామాయణకథను వాల్మీకి భూతక్రియలతోనే రచియించినాఁడు! ఈధర్మఖండము మూలమునఁగూడ నాంధ్రమున నున్నట్లే యుండియుండును.

(2) శ్రీరామకథ జగత్ప్రసిద్ధ మైనది. దానిని కడకు వెడల భావిక్రియలతోనే వ్రాయునెడలఁ బాఠకులకును, శ్రోతలకును విసుపుగా నుండు నని భావించి భావిక్రియలతోఁ గథ నారంభించి, భూతక్రియలతో రావణసంహారము చేయించి మరల భవిష్యదర్థకములతో శ్రీరామపట్టాభిషేకము చేయించి, కవి, పూర్వోత్తరసందర్భమును బోషించుకొన్నాఁ డని యైన సమర్థింపవచ్చును.

☞ పైక్రియలమార్పు, ఆశ్వాసమధ్యమునఁ జేయుట కంటె నయ్యాశ్వాసముచివరవఱకు నాక్రియలనే నిల్పుట కొంత వఱకు యుక్తియుక్తముగా నుండు నని యెంచి అష్టమాశ్వాసము 331 వ పద్యము మొదలుకొని యయ్యాశ్వాసము తుదిదాఁక భూతక్రియలను భావిక్రియలుగా మార్చితిని. అట్లు గావించుట వలనఁ గవి కవితాధార కేమియు భంగము వాటిల్లలేదు.

## గ్రంథముద్రణము

శ్రీమదభినవకృష్ణదేవరాయ బిరుదాంకితులును, భాషాపోషకులును, ఔదార్యశీలురును, శ్రీపీఠికాపుర సంస్థానాధీశ్వరులును నగు శ్రీమన్మహారాజా, శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహదరువారు, విశేషధనవ్యయముతో మిక్కిలియరుదైన * యీధర్మఖండమువ్రాఁతప్రతులను సంపాదించు నేర్పాటులను గావించి, లేఖకులను నియమించి, కాగితపుఁబ్రతుల వ్రాయించి, సమగ్రగ్రంథముగా ముద్రింపించి, యస్తమింపనున్న కవికీర్తిని గాపాడి, భాషకును, ఆంధ్రలోకమునకును

* ధర్మఖండమువ్రాఁతప్రతులు మిక్కిలి దుర్లభము లనుటకు — చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున ప్రథమాశ్వాసముమాత్రమే కలదని తెలుపు తత్కోశసముదాయపట్టికయు, సమగ్రమైన గ్రంథము లభింప లేదని వ్రాసిన ఆంధ్రకవులచరిత్రమును, ఏతత్పుస్తకప్రకటనమునకు లభియించినయసమగ్రపుఁబ్రతులును దార్కాణములు.

మహోపకారమును గావించియున్నారు. ఏతద్విద్యాపోషకుని పితృ పితామహాదు లగు ప్రభువులును, కవీంద్రుల గౌరవించి, పోషించి, వారిచే ననేకగ్రంథముల వ్రాయించి, కృతుల నంది, యపారయశంబును గాంచియున్నారు. కీర్తిమంత మైన యిట్టి సద్వంశమున జనియించి, తమపూర్వులయశంబునకు వన్నె దెచ్చు చున్న యౌదార్యశాలు లగు నీప్రభువర్యులను, వీరికుటుంబమును సర్వేశ్వరుం డగు పరమేశ్వరుండు, ఆయురారోగ్యైశ్వర్యాదుల నొసగి, యింకను ననేకోద్గ్రంథములఁ బ్రకటింపించి, భాషాసంరక్షణ మితోధికముగ నొనరించున ట్లనుగ్రహించుఁగాక యని నిరంతరము వేఁడుచున్నాను.

| | |
|---|---|
| పీఠికాపురము<br>ప్రజాపతివత్సరవిజయదశమీ<br>జయవాసరము. | ఇట్లు విబుధవిధేయుఁడు<br><br>న డ కు దు టి వీ ర రా జు. |

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## ప్రథమాశ్వాసము



శ్రీనగకన్య ముత్యముల
చేఁ దలఁబ్రా లిడువేళ శీర్షగం
గానది చిందుబిందువుల
గ్రందున సర్వసుపర్వకోటి ను
ర్వీనుతవైభవంబునఁ బ
విత్రితగాత్రులఁ జేయుశంభుఁ డా
శ్రీనగరాజమందిరుఁ డ
శేషశుభంబులు మాకు నీవుతన్. 1

మ. గరిమం గౌస్తుభరత్నబింబితనిజాం
గస్ఫూర్తి వేఱొక్క సుం
దరి యంచున్ సిరి యెంచు నత్తఱి నితాం
తప్రీతి సంధిల్ల న
య్యురుభూషామణి తత్కుచాగ్రమున నా
యోజించి కేళీకళా
స్ఫురణన్ రంజిలఁజేయుశౌరి దయఁ బ్రో
చు న్నమ్ము నెల్లప్పుడున్. 2

చ. సురరమణీమణీచికుర
చుంబితపాదసరోజ మారఘు
స్మరనిరవద్యవామతను
సౌధనివాసిని యోగిలోకహృ
త్సరసిరుహాభ్రమద్భ్రమరి
సర్వజగజ్జనయిత్రి శీతభూ
ధరవరపుత్రి నిత్యశుభ
దాత్రి ననుం గృతకృత్యుఁ జేయుతన్. 3

సీ. ఏదేవి గాదిలిసైదోడు దైవత
కోటి బుభుక్షు వోమీటుదాత
యేదేవిపాదంబు లింద్రాదిసురమౌళి
రాజిమాణిక్యనీరాజితంబు

లేదేవి శంఖపద్మాది శేవధు లీనుఁ
జంచలనిజకటాక్షాంచలముల
నేదేవికిని గౌస్తుభాదీప్తిదీప్తంబు
హరియురఃపీఠిసింహాసనంబు

గీ. కాంతలతికాంతకుంతసంక్రాంతవిజయుఁ
గంతు రతికాంతు నేదేవి గన్నతల్లి
యట్టిజలనిధికన్య లోకైకమాన్య
కలిమిపైదలి మాయింట నిలుచుఁగాత. 4

ఉ. శ్రీకరశోణరత్నరుచిఁ
జెన్నగుప్రసన్ననిమేనితోడ బం
ధూకసుమారుణాంబరము
తో నునులేనెలనొప్పు కొప్పుతోఁ
బ్రాకటలోచనత్రయవి
రాజితమైనమొగంబుతోడ న
స్తోకకృపావిభూతి నిలు
చున్ భువనేశ్వరి నామనంబునన్. 5

క. శారద వీణాగానవి
శారద తనుకాంతివిజితశారదశరభృ
న్నారద మామకకృతికిన్
పారదయన్ సంఘటించుఁ జాతుర్యకళల్. 6

క. నిజముఖమదలోభాళి
వ్రజముఖరితదిఙ్ముఖున్ సువాహనితాఖున్
గజముఖుఁ బంచముఖాత్మజుఁ
నజముఖబర్హిర్ముఖనుతు నాత్మ భజింతున్. 7

సీ. శ్రీరామనామసుధారసమదవదిం
దిందిరం బెవ్వాని ధీసమృద్ధి
భారతామ్నాయాదిబహుతరగ్రంథముల్
రచియించె నెవ్వాఁడు ప్రచురఫణితి
నార్య యెవ్వనిజిహ్వ నాత్మీయనఖశిఖ
రములచే బీజాక్షరములు వ్రాసె
శూరుఁ డేశూరుని చారుతరాంగంబు
నిజకిరణావాప్తి నెగడఁ జేసె

గీ. నట్టికవితారమాకలశాంబునిధుల
వామలూరుసముద్భవవ్యాసకాళి
దాసుకవిమయూరులఁ దలఁచి కొలిచి
యంజలి ఘటించి ప్రార్థింతు నన్వహంబు. 8

మ. ఎలమి న్నన్నయభట్టుఁ దిక్కమఖి భీ
మేశాఖ్యుని న్సోము న
త్యలఘుప్రాభవుఁ బెద్దనార్యు ఘనుఁ బో
తామాత్యు శ్రీనాథుఁ బిం

గళిసూరన్నను భాస్కరుఁ విమలవా
క్చాతుర్యసంసిద్ధికిం
జెలువొప్ప న్వినుతింతు నాంధ్రకవితా
సృష్టిక్రియాస్రష్టలన్. 9

చ. నెఱి గిరిజేశుమాళిపయి
నేనును దాను వసింతు మెట్లు నా
తుఱవు సుధామరీచి యని
యుమ్మెతపు వ్వనురీతి ముష్కరుం
డఱచినఁ బ్రాజ్ఞుతోడ సముఁ
డౌనె వృథా కవినంచు నెల్లెడం
దఱచుగఁ బేలుఁగాక కవి
తారసవాసన తా నెఱుంగునే. 10

క. కోకిల పలికిన నోర్వని
కాకవులతెఱంగునన్ సుకవిసూక్తులకుం
గాకవు లఱచిన నేమి వి
వేకనిధులు బుధులు చెలఁగి విందురు కరుణన్. 11

క. కొఱమాలి పలికి మూఢత
నెఱపక సత్సభల మాననియతి నిలుఁడు మీ
రెఱుఁగనియది తప్పనకుఁడు
ఛిఱికితనములేని కుకవి బృందములారా. 12

గీ. అనుచు నిష్టదేవతాదిమసత్కృతి
వందనంబుఁ గుకవినిందనంబుఁ
జేసి తెనుఁగుబాస భాసుర మగుగతిఁ
గబ్బ మెలమిఁ జేయఁ గాఁ దలంచి 13

గీ. స్కాందమునఁ దగు నేఁబదిఖండములను
ధరణిధరములఁ గనకభూధరముకరణి
మేటియై ధర్మఖండంబు మిగుల నలరు
నదియు నాసేర్చురీతిఁ జెప్పెద ముదమున. 14

స్రగ్ధర. చంచన్నిర్మాణలక్ష్మీసమధికఫలద
స్కాందకల్యాణవాణీ
పంచాశత్ఖండహారప్రవిమలతరళో
ద్భాసియై ధర్మగర్భ
ప్రాంచల్లీలాస్పదంబై హరమురహరమా
హాత్మ్యశోభాంచితంబై
యెంచన్ శ్రీధర్మఖండం బిది దురితతమో
హేళియై హాళి నొప్పున్. 15

క. అని యూహించుచు నే నొక
శనిత్రయోదశిఁ బ్రదోషసమయంబున శం
భునిఁ బార్థివేశుఁ బూజిం
చి నియతి నున్నంత నానిశీథినియందున్. 16

సీ. మణిగణాంచితహేమమయకర్ణకుండల
చ్ఛవి గండమండలిఁ జొకళింప
సలలితరుద్రాక్షపేరులతోడ నురమున
తారహారములు క్రొందళుకు లీన
హస్తారుణద్యుతి నామ్రేడితప్రభ
నబ్జరాగాంగుళీయకము లమర
తపనీయమేఖలతళతళల్ కటితటిం
దరుణార్కరుచులఁ ద్రస్తరు లొనర్ప
గీ. స్వర్ణవర్ణాంగకమున జ్యోత్స్నవిశుద్ధ
భూతి చెలువొంద నొకమహాపురుషవరుఁడు
తళుకుమొగమునఁ జిఱునవ్వు బెళుకుఁగనులఁ
గరుణయుఁ దలిర్పఁ గలలోనఁ గానుపించె. 17

గీ. అచ్చెరువు నొంది యతఁ డెవ్వ రనియు నెఱుఁగ
కే నమస్కృతిఁ గావించి యెదుట నిల్చి
యున్నతఱి నన్నుఁ జూచి ప్రసన్నఫణితి
నాదరించుచు నతఁ డిట్టు లానతిచ్చె. 18

గీ. సర్వధర్మకర్మసారసంగ్రహాశోభి
యైనధర్మఖండ మాంధ్రభాష
నీవు రచనసేయు మీకథ మాపేర
నంకితంబుసేయు మనఘచరిత. 19

వ. అనియె నంత నొక్కమహాత్ముండు మదాప్తుని తెలుంగున
నేతెంచి యల్లన మధురస్వరంబున ని ట్లనియె. 20

క. ఇతఁ డమృతలింగ మితనికిఁ
గృతి యొసఁగుము నీదుకోర్కు లెల్ల ఫలించున్
గృతికిఁ గృతి యొసఁగుసుకృతికి
నతులితశుభవిభవలాభ మగు టద్భుతమే. 21

వ. అనియె నాలోనన మేలుకాంచి యుదంచితకౌతూహలాయత్త
చిత్తుండనై. 22

ఉ. శ్రీమయవాగ్విలాసుఁడు న
శేషలిపిప్రవణుండు భూరిశో
భామహనీయమూర్తియుఁ బ్ర
బంధనిబంధనబంధురక్రియా
భామహతుల్యసూత్రుఁడు నృ
పాలకపూజ్యుఁడు నంచుఁ దన్ జను
లేమరునెంచ దిట్టకవి
వేంకటరాయకవీంద్రుఁ డొప్పగున్. 23

చ. అతనికృపాకటాక్షవిభ
వాతిశయం బనిశంబు గల్గ నే
నతులకవిత్వతత్త్వమహి
మాఢ్యతఁ బ్రౌఢిమఁ గంటిఁ గావునం

గృతమతిచేఁ బ్రబంధ మొన
రించుతలంపును స్వప్నముగ సమం
చితగతి నమ్మహాత్మునకుఁ
జేతులు మోడ్చుచు విన్నవించితిన్. 24

వ. మద్గురుండైన యక్కవివరుండు నత్యంతకృపాతరంగితాంత
రంగుండై. 25

సీ. ధాత్రి భారద్వాజగోత్రపవిత్రుఁడై
సురుచిరాపస్తంబ సూత్రుఁ డగుచు
నిరతాన్నదానాభినిరతుఁడై నీఁదుల
పలినరసామాత్యపౌత్త్రివరుని
సంతతపూజితశంకరుం డగుశంక
రామాత్యమౌళికి నాత్మభవునిఁ
బ్రాజ్ఞుని నచ్చమాంబాగర్భశుక్తిము
క్తామణి నీశ్వరధ్యాననిరతు

గీ. భవ్యశృంగారమంజరీకావ్యరత్న
మాంధ్రభాష నొనర్చిన యనఘచరితు
శంభునిభుఁ డగు నిపుటూరిశంభుశిష్యు
నను భవానీశనాముఁ గన్గొనుచుఁ బలికె. 26

క. శ్రీకర మత్కారుణ్యార
సాకలనఁ బ్రబంధకర్త వై యలరితి వీ

వీకృతికన్య న్మాన్యన్
శ్రీకంఠున కర్పణంబుసేయుము వేడ్కన్. 27

గీ. అఖిలలోకైకనాయకుం డయిన శ్రీగి
రీశ్వరుఁడు మల్లికార్జునుఁ డిందుమౌళి
యిష్టదైవంబుగద నీకు నీప్రబంధ
మంకితముసేయు మీ మహిమ్మాహాత్మ్యనకును. 28

క. చెఱకున ఫలముం, బసఁడిం
దఱచుగఁ దావియుఁ, బటీరతరువున విరియున్
వఱలినగతి నీకృతికిన్
గఱకంఠుఁ డధీశుఁ డగుట గౌరవము మహిన్. 29

వ. అని యానతిచ్చిన. 30

చ. లలితనవీనతాండవవి
లాసవిశేషకపర్దభృజ్జటా
వలయసరిద్ఘళంఘళర
వప్రతతిప్రతిభాసమానవా
గ్విలసనశాలిమైన యల
వేంకటరాయకవీంద్రచంద్రు నే
నలరి నుతించి మ్రొక్కుచుఁ ద
దాజ్ఞఁ బ్రబంధముసేయఁబూనితిన్. 31

మ. హరిశౌర్యుండగు రావుమాధవనృపా
లాగ్రేసరుం గావ్యచా

తురి మెప్పించి తదీయసత్కృప సిరుల్
దోరంబుగా నంది బం
ధురతేజుం డయి వక్కలంకకులపా
థోరాశిరాకాసుధా
కిరణుండై తగు వీరభద్రసుకవిం
గీర్తింతు నానెచ్చెలిన్. 32

క. అనుచున్ మఱియు నిదానీం
తనవిద్వత్కవుల< బొగడి తత్కారుణ్యం
బున నీకబ్బము నానే
ర్చినచందంబున< దెనుంగుసేయుదు వేడ్కన్. 33

గీ. అంగనాసంగవామాంగు< డర్జునాంగు<
డఖిలకారణకర్త లోకైకభర్త
భక్తవితతికి ముంగొంగుపసిడి మేటి
వేల్పు శ్రీగిరిపతివంటివేల్పు గల<డె. 34

వ. అని తలంచి మ్రొక్కి యమ్మహాదేవునకు. 35

—♦ షష్ఠ్యంతములు. ♦—

క. భవునకు సహస్రదళసం
భవముఖ్యనిలింపవినుతపదవిభవునకున్
భవవారిరాశికుంభో
ద్భవునకు ఫాలాక్షువిజితభావభవునకున్. 36

క. ధరణీశతాంగునకును శశి
తరణిరథాంగునకు దైవతభుజంగునకున్
సరిదధిపనిషంగునకుం
గరధృతసారంగునకును గౌరాంగునకున్. 37

క. అజరాళిమౌళిరత్న
వ్రజజనితమయూఖపిహితవరచరణునకున్
రజతాచలశరణునకున్
భుజగేంద్రాభరణునకుం ద్రిపురహరణునకున్. 38

క. భూరిశిరశ్చంద్రసుధా
ధారోజ్జీవితశిరోధితలహారితపం
కేరుహభవమస్తకకృత
సారస్తుతిముదితునకును సద్విదితునకున్. 39

క. వ్యాళాధిపవృతమంథర
శైలోన్మథితాంబురాశిసంజాతమహా
క్ష్వేళాహాలాహాల
లీలాసంహారునకు దళితమారునకున్. 40

క. సోమార్ధకలాపునకున్
హైమవతీసమ్మదాంచితాలాపునకున్
హేమాద్రిచాపున కుదగ
స్తామితబలసామజాసురాటోపునకున్. 41

క. సతతదిదృక్షాగతహిత
తతత్రైరికమానవార్పితస్వర్ణమణీ
చతురనటీకరితురగా
ద్యతిసంభారునకుఁ ద్రిజగదాధారునకున్. 42

క. శ్రీగిరిశిఖరాభ్యున్నత
ధాగధగద్భర్మనిర్మితప్రాసాదా
భోగనివాసున కగజా
యోగార్పితసతతమానసోల్లాసునకున్. 43

క. సాదరకృపామతికిఁ దరు
ణాదిత్యసహస్రశోభనాచ్ఛద్యుతికిన్
వేదావళికృతనతికిన్
శ్రీదపేర్మాభిరతికి శ్రీగిరిపతికిన్. 44

వ. సభక్తిసమర్పితంబుగా నాయొనర్పంబూనిన ధర్మఖండం బను
ప్రబంధరాజంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 45

శా. శ్రీనిత్యం బయి నైమిశం బలరు ధా
త్రి న్మౌనిసింహప్రయు
క్తానూనాధ్వరహోమధూమజలవా
హవ్యూహనిధ్యానసం
ధానాఖండశిఖండితాండవనిదా
నప్రౌఢ షడ్జ స్థిర

స్వానాయోజితవల్లకీక్వణనది
వ్యస్త్రీమనఃకాంతమై. 46

గీ. శౌనకాదు లయినమానులా నైమిశా
రణ్యమున నగణ్యపుణ్యకథలు
వినఁగ నాసఁజేసి వినయసమేతుఁ బ్ర
ఖ్యాతు సూతుఁ బ్రీతిఁ గాంచి యనిరి. 47

గీ. రామదేవునినామంబు ప్రేమతోడ
వినఁగ వేడుక య్యో నో యనఘ మాకుఁ
దెలుపవయ్య మహాభాగ ధీసమేత
ఖ్యాతవినుతపురాణార్థజాత సూత. 48

మ. అనినన్ సూతుఁడు శౌనకాదులకు నా
హ్లాదంబుగా నిట్లను
న్వినుతింపం దగు పృచ్ఛచేసితిరి యెం
తే మేలుమేల్ రామదే
వునినామంబు త్రిలోకపావనతచేఁ
బొల్పారు నానేర్చిన
ట్లొనరం దెల్పెదఁ జిత్తగింపుఁడు తదీ
యోదారమాహాత్మ్యమున్. 49

సీ. కమలాక్షు వనమాలికావిరాజితవక్షు
సుస్మితముఖపద్ము సుగుణసద్ము

వరచక్రివరకరు దానవభీకరు
బాణబాణాసకృపాణిఁ బాణి *
సనకాదిసేవ్యు నిర్జరభావ్యు ఘనఘనా
ఘనదేహు నాజానుకలితబాహు
సుందరు ధృతిజితమందరు లక్ష్మణ
శత్రుఘ్నభరతాదిసహితు మహితు
గీ. మారనిభు విభుఁ బ్రభు నత్యుదారు వీరుఁ
గనకభద్రాసనాసీనుఁ గనకవసను
నవనిజాకాము రాము లోకాభిరాముఁ
దలఁచి నుతియించునరుఁడు సద్ధన్యతరుఁడు. 50
గీ. రాజశేఖరు ఖరదైత్యరాజదమను
నచ్యుతు ధరాత్మజామనోహరు నహీన
రత్నభూషణభూషితు రాము శివు భ
జించుసుకృతి కృతార్థుఁడై కాంచు ముక్తి. 51
గీ. అనఘమై యాద్యమై పరమాత్మమై ని
రంతరానందమయమై యనంత మగుచు
యోగివరు లాత్మ రమియింప నుల్లసిల్లు
నట్టిబ్రహ్మంబు రామాహ్వయమునఁ దగియె. 52
క. రా యనినంతనె మొగమునఁ
బాయును వృజినవ్రజంబు వడి నది మరలన్

* కృపాణపాణి—వ్రా.ప్ర.

డాయక యుండ మకార ము
పాయమునఁ గవాట మిడినపగిదిఁ బొసంగున్. 53

గీ. రామ యనినయక్షరద్వయం బెవ్వని
రసన నధివసించుఁ బొసఁగ నతఁడు
జ్ఞాని మాని పుణ్యశాలి కులీనుండు
సకలవేదవేది సుకృతి జగతి. 54

ఉ. జారుఁడు వేదశాస్త్రగురు
సద్ద్విజనిందకుఁ డార్యగర్హితా
చారుఁడు హేతునిష్ఠకుఁడు
సంతతభోగపరుండు లోభియుం
జోరుఁడు పాపి నాస్తికుఁడు
జూదరియుం బిశునుండు లోనుగా
వీరలు రామనామజప
వృత్తిఁ గృతార్థతముల్ వసుంధరన్. 55

క. దేవారాధనరహితులు
దేవబ్రహ్మస్వహరులు స్త్రీలోలు రస
ద్భావులు పుళిందపుల్కస
సేవకులుగ్ రామనామసేవఁ బవిత్రుల్. 56

గీ. స్నానసంధ్యాజపాద్యనుష్ఠాన వైశ్వ
దేవవిరహితుఁ డయినభూదేవకులుఁడు

మహితవిప్రోచితాచారసహితుఁ డయిన
శూద్రుఁడును రామజపమున శుద్ధుఁ డరయ. 57

గీ. అధికవర్ణాంగనాగామి యధమవర్ణ
కామినీసంగతుం డుదక్యారతుండు
నిజకులాచారరహితుండు నీతిబాహ్యుఁ
డనయమును రామజపమున ననఘు లవని. 58

గీ. విహితసత్కర్మములు మాని వెస విరుద్ధ
కర్మకరు లగు యాతనాగామివిప్ర
రాజవిట్ఛూద్రవరులు శ్రీరామనామ
జపమునఁ బవిత్రు లగుట నిస్సంశయంబు. 59

గీ. ఎట్టికూ్రరు లయిన నెలమి విరక్తులై
నిర్మలాత్ము లగుచు నియతి రామ
నామజపము సల్పి రామసారూప్యంబుఁ
జెంది సుఖముఁ బొంది యుందు రెపుడు. 60

గీ. అవని సంసారసంస్థితుం డయ్యు రామ
నామజప మొనరించిన నరుఁడు దురిత
సమితి నంటక నిర్మలత్వమున మెఱయుఁ
బంకకీటంబుగతి నతిప్రౌఢరీతి. 61

సీ. మందాక్షదేహాభిమానమాయాస్మయ
పరిముఖముల్ విడనాడి భక్తిఁ బూని

సకలకర్మవిరక్తిఁ బ్రకటించి సంగవి
నిర్ముక్తుఁడై యతినిష్ఠతోడ
నారదాదిమునీంద్రవారపూజిత మగు
శ్రీరామనామప్రసిద్ధజపము
వ్యత్యస్తముగ నైన వరుసతో నైనను
స్మరియించి దుష్కృతచరితుఁడైన

గీ. రుచిరగతిఁ బొందు రామసారూప్యముక్తి
మును కిరాతుఁడు రామసన్మనుజపమున
ననఘులు నుతింప వాల్మీకి యగుచుఁ బ్రబలి
కలుషముల నుజ్జగించినకరణి ధరణి. 62

గీ. అనినఁ గథకునితో శౌనకాదు లనఘ
యాకిరాతుని తెఱఁ గెట్టి దరయ నతఁడు
వాములూరూద్భవుం డెట్టివలన నయ్యెఁ
దెలుపు మచ్చెరు విది యనఁ బలికె నతఁడు. 63

ఆ. వెలయ నక్కిరాతువృత్తము మీకు నే
విన్నవింతు వినుఁడు వీను లలర
సరసఁ బదియు రెండుసంవత్సరము లనా
వృష్టి యయ్యెఁ దొల్లి విశ్వమునకు. 64

చ. అవని కవగ్రహంబుగ గ్ర
హంబులు వక్రగతిం జరింపఁగా

నివిరెఁ గొలంకులు న్నదులు
నెండలచేఁ జెడె సస్యసంఘముల్
జవ మఱె వర్ణధర్మములు
సంకర మయ్యె నశించె సర్వజం
తువులును ధారణాల్ దొఱఁగి
తోఁచెను గ్రామము పాపధామమై. 65

వ. అక్కాలంబున. 66

క. పన్నిరువురు భాస్కరులుం
బన్నినఁ దనదైన*చలువ వాయని దని లో
నెన్ని హిమగిరికి సరిగిరి
సన్నుతగతి ధర్మపరులు సప్తర్షివరుల్. 67

ఆ. అరిగి కాంచి రొక్కయటవి ననేకప
వదనదానసేకవర్ధితాతి
తుంగశిఖరకుసుమసంగతతారకా
విసరభూరుహములఁ బొసఁగుదాని. 68

సీ. నకులకీచకభీమ శకునిశిఖండిసం
కలితమై భారతకథ యనంగ
శరభకేసరిగజర్షభగవయాదిస
నాథమై రామాయణం బనంగఁ
బ్రద్యుమ్నశంబర రామబృందావన
దక్షత భాగవతం బనంగ

* చెలువ, చెలువు—వ్రా. ప్ర.

హారిణీభుజంగప్రయాతాభిరామమై
సలలితవృత్తశాస్త్రం బసంగ

ఆ. సచ్ఛభల్లఖడ్గ వారిపుండరీకాళి
సహిత మగుచు యుద్ధమహి యనంగఁ
దనరుదాని దేవదానవాభేద్యమై
యమితచోరహృద్య మయినదాని.

ఆ. ఇందుమూర్తిరీతి నిల ఋక్షసేవ్యమై
గౌరి యనఁగ స్థాణుకలిత మగుచు
నగరుతిలకశోభియై కామినియుఁబోలె
నొనరి సిరులు గవయు చున్నదాని. 70

క. ఝిల్లీగణనాదితమై
యొల్లం బగునయ్యరణ్యముం జొచ్చి మిథ
స్సల్లాపంబుల నమ్ముని
తల్లజులు చనంజనంగఁ దన్మధ్యమునన్. 71

ఉ. అంతికపక్కణాధిపతి
యైనపుళిందుఁ డొకండు సర్వజీ
వాంతకుఁ డంతకప్రతిముఁ
డాయతబాహుఁడు నీలదేహుఁ డ
త్యంతనిశాతఖడ్గవిశి
ఖాస్త్రకఠోరచుతారతూణస

త్కుంతధరుండు నిర్దయుఁడు
క్రూరుఁడు చోరుఁ డుదారుఁ డెంతయున్.

గీ. మాంసఖాదనమధుపానమాంసలుండు
పింగళాక్షుండు పరిణాహపీనవక్షుఁ
డధ్వగామిజనౌఘవిత్తాపహరణ
మరణకరణాతిదృఢకరచరణుఁ డతఁడు. 73

సీ. ధర్మగుణాసక్తిఁ దలఁపనేరక పూని
ధర్మగుణాసక్తిఁ దగ మెలంగి
విప్రవరావనవిధిఁ బరాఙ్ముఖుఁ డయి
విప్రవరావనవిధి భజించి
కనకాంబరధ్యాన గంధ మెఱుంగక
కనకాంబరధ్యాన గతిఁ జెలంగి
యనిమిషభక్తసమాసక్తిఁ జెందక
యనిమిషభక్తశోభనతఁ జొక్కి

తే. ధీవరాదృతమహిమచేఁ దేజరిల్లక
ధీవరాదృతమహిమచేఁ దేజరిల్లి
పుణ్యజనఘనవిఖ్యాతిఁ బొందలేక
పుణ్యజనుఁ డనువిఖ్యాతిఁ బొసఁగువాఁడు. 74

తే. కనియెఁ గాషాయవల్కలాజినవసనుల
లలితరుద్రాక్షమాలికాకలితభూతి

ధరుల దండకమండలుకరుల నుదిత
తరణిపావకనిభదీప్తితనుల మునుల. 75

తే. కామసంహారణాతిపవిగల్భు లగుట
హారుప్రతిచ్ఛాయ లనఁ దమోహాననశక్తి
నర్కమూర్త్యంతరము లన నలరునట్టి
ఘనరజఃఖండనస్వచ్ఛతనుల ఘనుల. 76

చ. పొదలమఱుంగున న్నిలిచి
పొంచి కనుంగొని చోరపుంగవుం
డదయత నస్మదీయవివి
ఖావళి నేఁ డిదె వీరి నొంచెదం
గదిసి సమస్తవస్తుతతిఁ
గైకొని పుత్త్రికళత్త్రరక్షచేఁ
జొదలెద నంచు నెంచి మదిఁ
బొంగి మునీంద్రులప్రోల నిల్చినన్. 77

సీ. బహుళసాలగ్రామ భరితలోహితతామ్ర
సంపుటావళి నికుంజములఁ బెట్టి
వివిధబృసీపరివేష్టితపుస్తక
సంభార మందంద జాఱవిడిచి
వల్కలముద్రిత వరదేవపూజోప
కరణసామగ్రి లాఁగలను విఱాఁటి

పుణ్యాపగాజలపూరితస్ఫాటిక
స్వచ్ఛకుండికలు పార్శ్వముల నైచి
తే. హాటకచ్ఛాయ నెఱిమించు సంగళములఁ
జెమట లుప్పతిలంగ దిగ్భ్రమము గదిరి
మానదశపూని గమిగూడి మానసములు
వాయుధుత మగు నావకై నడిఁ జలింప. 78

సీ. యమ ఇవ పాటచ్చరాధమోఽయం సము
పాగతః కర్తవ్య మత్ర కిన్ను
నితరాం నజానాతి నిర్ఘృణోఽస్మాక౯ ఖలు
దాతు మస్మై తపోధన మృతే హి
నాస్తి వరాటక మపి బతాస్మత్సదే
శే హరిష్యతి కిన్ను జీవితాని
గంతవ్య మిహ కుత్ర కా వా గతి స్తతో
గంతుం సమర్థా న కాతరాశ్చ
తే. రక్షకః కో ను రామాంతర స్త మేవ
శరణ ముపయామహే వయం సమ్మదేన
రామ ! పాహి ! హరే ! కృష్ణ ! రక్ష ! రక్ష !
యనుచు మానులు కళవళ మంది రపుడు. 79

క. ఆలీల మునులవచనము
లాలించి శరంబు వింట సవరించి వోరుం

డాలీఢపాదుఁడై తా
నాలో నిలునిలువుఁ డనుచు నరికట్టుటయుః. 80

క. సన్మార్గరోధి యయ్యె న
సన్మార్గవిహారి యుల్లసద్వింధ్యమహీ
భృన్మార్గమున హిమావని
భృన్మార్గంబున నటంచు భీతిల్లి మునుల్. 81

తే. జడధియోఽప్యాపదం ప్రాప్య సంతరంతి
తరణ మస్మాక మద్య చిత్రం కి మత్ర
త్యజ్యతాం సాధ్వసం భవితవ్య మేవ
భవతి తన్నాన్యథా యని పలికి మఱియు. 82

సీ. యేన కేనాప్యుపాయేన మనీషిణః
ప్రతరంతి భువి బుద్ధిపాటవేన
జడతయా కిం భవిష్యతి తస్కరాధమో
బాణబాణాసనపాణి రేతి
అస్మాభి రిహ ధైర్య మాలంబనీయం కి
లాభాషణీయ స్తథాఽయ మస్తు
సంబోధయామహే సమ్యగేనం తతో
రక్షకో వర్తతే రామ ఏవ
తే. యనుచు నన్యోన్య మీరీతి నాడి మాను
లాపుళిందున కాభిముఖ్యము భజించి

సకుశనిర్మలశయుకు శేశయము లెత్తి
పలికి రిట్లని యుచితంపుభాషణముల. 83

చ. జలరుహపత్రనీరకణ
జాలముచందము జీవితంబు చం
చలజలబుద్బుదం బనఁగఁ
జాలు కళేబర మెంచి చూడఁ జం
చలలతెఱంగునం బొదలు
సంపద లింపగుభోగముల్ శర
జ్జలదముచాయలం బరగు
సర్వము నస్థిర మెన్నిభంగులన్. 84

క. మూత్రపురీషంబులకుం
బాత్రము శోకంబుఁ బెనుచుఁ బలుదెఱఁగులఁ దా
పత్రయదూషిత మగుచుం
గాత్రము నెఱి మించు మించుగతిఁ జంచలమై. 85

చ. ఎముకలు కంబముల్; నరము
లెన్నఁగఁ బెండెలకట్లు; మాంసర
క్తము లనులేపనంబు; పయి
కప్పు త్వచంబు స్రవించు పెక్కఛి
ద్రములను బూతిగంధకలి
తంబు; రుగాశ్రయ మై చెలంగి దే

హాము దగ నిల్లువోలెఁ గడు
నస్థిరమై పరగుఁ గా వసుంధర గా. 86

తే. అస్థిరం బైనయట్టి దేహంబుకొఱకుఁ
గదిసి యన్యాయములు సేయఁ గలుష మొదవుఁ
దాన నిరయాధివాసంబు దప్ప దుర్వి
నంతకన్నను గీ డెద్ది యరసిచూడ. 87

సీ. ధరణీవిబుధవిత్తహరణహింసలకన్న
నధికతరం బైన యఘము గలదె
బ్రహ్మస్వహరణపాపమునకు నెనయైన
దెంచ మహాపాపపంచకంబు
ధారుణీనిర్జరద్రవ్యాపహరణాగ్ని
కులతూలికాశైలముల హరించు
ధర నేకవింశతినరకసంగతిఁ దూన్ప
బ్రహ్మస్వహరణంబె భారమయ్యె

తే. నవనిసురవిత్తము హరించు నఘము లనుభ
వించునారకయాతన లెంచఁదరమె
రహిఁ జతుఃపంచషట్సహస్రముఖు లయిన
విధిశివస్కందపన్నగ విభుల కయిన. 88

క. అని మధురవచనరచనల
మునిముఖ్యులు ధర్మమార్గమున నీగతిఁ బ

ల్కినయూపల్కులు వెడవెడ
విని వికవిక నగి పుళిందవిభుఁ డిట్లనియెన్. 89

ఆ. అటమటించి పోవనిటు చెప్పితిరి మిమ్ము
జరగనీయ నిప్పుడె సవరఁబెట్టి
యొడిసికొందు నొడమి యొగి నాలి బిడ్డల
బందుగులను మనిచి బ్రదుకు గందు. 90

చ. అన విని వానిఁ జూచి మును,
లారయఁ బుత్త్రకళత్రరక్షకై
యనయముఁ గ్రూరవృత్తి మెయి
నర్థము నీవు గడించెదేని నీ
ఘనతరమైనకిల్బిషని
కాయముభాగము వారు గొందురో
కొనరో యెఱుంగఁ దెల్పు మవి
శంకితలీల నటించుఁ బల్కి నన్. 91

క. సూరివరు లయినవారల
సారసుధాసారనిభవచస్సంగతిచేఁ
గ్రూరుం డగుచోరుఁడు న
క్రూరుండయ్యెక్క సమస్తగుణమునశిఖనిగను. 92

ఆ. పూర్వజననసుకృతమున సాధుసంగతి
గలుగ దానఁ దొలఁగుఁ గలుషసమితి

యందుఁ జిత్తశుద్ధియగు నందుఁ బుణ్యంబు
లొదవు దానఁ గలుగుఁ ద్రిదివవసతి. 93

క. తులసీసేవయు గంగా
జలములఁ గ్రుంకుటయు విష్ణుసంభజనము సా
ధులసహావాసంబును ని
చ్చలు సారము లగు నసారసంసారమునన్. 94

తే. సంగతి దొలంగవలయు నేసరణి నైనఁ
బూని తొలఁగకయున్న సత్పురుషవరుల
సంగతిఁ బొసంగవలయు నిస్సంశయముగ
నదిగదా సంగతి హరించు నౌషధంబు. 95

వ. కావున నవ్వీరుం డగుచోరుండు నిజప్రాగ్జనికృతం బగుసుకృ
తంబున నొదవినయమ్మహామహులసందర్శనసంభాషణధర్మో
పదేశంబులఁ దనతులువతనంబుఁ దొలంగంబెట్టి యతిలలిత
మృదులచిత్తుండై యత్తపోధనసత్తములకు నమస్కరించి
యిట్లనియె. 96

ఆ. ఏ నొనర్చునట్టిపృజినంబు నాపరి
జనము సగము పంచుకొనునొ లేదొ
యడిగి వత్తు మరల నరుదెంచునంతకు
నెలమి నిచట నిలువవలయు మీరు. 97

క. జీవితము మీఁది ప్రేమం
బీవలనం గలిగెనేని యిచ్చట నిలువుం

డావల నన్నెఱుఁగుదురే
భీవిరహితు నహితవీరభీషణమూర్తిన్. 98

ఆ. అరిగి తిరిగి మరలు నంతకు నిట మీర
లొండువలన నురగ కుండుటకును
బ్రత్యయార్థమయిన బాస యొసంగిన
మిమ్ము నునిచి పోదు మిన్న కేను. 99

వ. అనినవార లందఱు నొక్కమాఱుగా నిట్లనిరి. 100

ఆ. ఈవు తిరిగిమరల నేతేరకయ మున్న
చనినవారమేని శబరవర్య!
కలుగు బ్రాహ్మణాధికార మొనర్పని
యతని కైన దురితగతులు మాకు. 101

వ. అనినం బుళిందుం డిట్లనియె. 102

క. ఎందు సముదాయకృత మది
పొం దగునే యొకని దసఁగ భువిఁ గావున మీ
రందఱు నొక్కటఁ బలుకఁగ
నందమె వేర్వేఱ నొడువుఁ డాశపథంబుల్. 103

వ. అనవుడు. 104

సీ. సప్తఘస్రము లుపస్నానంబు సేయని
చెనఁటిదుర్గతిఁ బో నసిష్ఠుహాని
సతతశూద్రగ్రామసంవాసి యగునట్టి
కలుషాత్ముగతిఁ బొందఁ గాంక్షకందు

వైశ్వదేవము మానివలనొప్ప భుజియించు
పాతకిగతిఁ బోవ గౌతముండు
శ్రోత్రియుం డైనభూసురు నుపేక్షించు ని
ర్దయుగతిఁ బో జమదగ్నిమునియుఁ

తే. గశ్యపుఁడు గురుఁ దిట్టినకర్మిగతులఁ
గమలహితు *సంజఁ గనువానిగతుల నత్రి
మహి నసాక్షికభోజియౌ మనుజుగతుల
వడి భరద్వాజుఁడును బొందువార మనిరి. 105

వ. అని పునరాగమనంబునంతకు నిలువక యరిగితిమేని యిట్టిదు ర్గతులం జెందంగలవార మని ప్రత్యయంబుగాఁ బ్రత్యేకం బును సత్యంబులు వలికిన నతండు వారలపలుకులు నమ్మి యత్యంతరయంబున. 106

క. కోలహరిహరిణశరభ
వ్యాళశ్వాపదతరక్షువారణగోలాం
గూలాచ్ఛభల్లఝిల్లీ
కోలాహలభరితమయిన కోనం జనియెన్. 107

వ. ఇట్లు చనిచని హరిదంతదంతిశుండాదండాయతప్రశస్తహస్తం బుల శరశరాసనంబు లలవరించి మెఱుంగుల రంగు లీను కఱకుంగోఱలు బయల్పడ నిస్తులాస్తోకస్తనితఘోషణభీషణ

---

* 'నకుచి' అని వ్రాఁతప్రతులు.

భీషణంబు లడర నీలాంబుదకదంబంబులడంబు విడంబించు కాయంబుల నిరులు వెల్లివిరియించు ఘోరవీరపుళిందబృందంబుల నందంబయి కీకసభక్షణలోలంబులై యన్యోన్యజన్యంబు లొనరించుకౌలేయకజాలంబులకోలాహలంబులును కాదంబరీఘటానేకపిశితరాశిపరిపూర్ణపణంబులచెంత నేపు మీఱి మిన్నునం బన్ని యెన్నికకు మిగిలి వలయాకారంబున నెఱచిరుచిం బఱచి యెఱకలకరువలి నవక్రవిక్రము లగు విక్రయికజనంబులఁ జీకాకునం జీకులఁ గావించి చంచుచరణంబుల నవ్యక్రవ్యకబళంబు లాకస్మికంబుగా గ్రహించి ప్రడీనోడ్డీనగతుల నతులజవంబునం బఱచు కాకకంకగృధ్రాద్యక్షుద్రపక్షులకలకలంబును గలసి యంభోనిధానానూనధ్వానంబు ననుకరింప ననేకపతాకానీకధ్వజతోరణపూరణశరణరాజివిరాజితం బయి సురాహితాలయంబు గావున లంకాపురం బన భోగినీభుజంగశతసమావృతంబు గావునఁ బాతాళభువనం బన సుకృతిజనదుష్ప్రవేశంబు గావున సంయమనీనగరం బన నింపుపెంపుమీఱు పక్కణంబు బ్రవేశించి నిజసదనంబున కరిగి బంధుజనకృతవందనాలింగనములం బూజితుండై వారల బహూకరించి నూత్నరత్నభిత్తిస్థాపితహీరవారముకురనికరరంజితంబును స్వర్ణవేదికాంచితంబును జిత్రవితానశోభితంబును కనకరచితంబునునగు కేళీగృహంబుఁ జొచ్చి హంసతూలికాతల్పంబున నాసీనుండై తనమనంబునం

బెనఁగొనిన నంత యంతయుం గులకాంతనుఁ దెలుపం
దలంచి యంతఃపురంబునకు రావించిన. 108

సీ. తెలిగోము గలసోముచెలు వోమునగుమోము
 * కంజాతసుషమఁ జీకాకుపఱుప
బలువాలుగల నేలు లలివాలుఁజూపులు
 వలరాజుతూపుల వంక లొత్త
నరుదారునెరి మేరుగిరిఁ గేరు గుబ్బలు
 జక్కవకవల నుచుక్కుమనఁగఁ
బెనుమించులను మించు ననుపించునెమ్మేను
 జాళువానెఱడాలు డీలుపఱుపఁ
ఆ. దేఁటిదాఁటుఁ బదరి తిరమొప్పు నొప్పుల
కుప్ప యైన కప్పుఁగొప్పు దనర
నెంచ నంచలకు నుదంచితగతిఁ జూపు
గమన మొప్ప మందగమన వచ్చె. 109

ఉత్సా. వచ్చి యొచ్చె మింత లేక
 వారిజాక్షి పీఁడియం
బిచ్చి యిచ్చకమునఁ దాల
 వృంత మంత నంది తా
నచ్చి మెచ్చి కంకణక్వ
 ణంబు మ్రోవ వీవఁగా

---

* సుషమంబు కాకుపఱుప—వ్రా. ప్ర.

నిచ్చ మెచ్చి చోరవీరుఁ
డిట్టు లనియె నెనయఁగన్. 110

చ. అడిగెద నొక్కమాట మగు
వా! యది తథ్యము పల్కు మిథ్యగా
నొడువకు మిథ్యఁ బల్కిన ని
ను న్మదిలో నెఱనమ్మ మిథ్యకుం
బొడవగునట్టిపాపమును
బొందుగఁ దథ్యవచోనిరూఢికిం
గడచినయట్టిధర్మము జ
గంబున లేదు తలంచి చూడఁగన్. 111

ఉ. సత్యము సాధుసమ్మతము
సత్యముచే నగుఁ బుణ్యలోకముల్
సత్యునిఁ జూచి దేవపితృ
సంఘము మోదముఁ బొందుఁ బొందుగా
సత్యముచే జయింప నగు
శాత్రవవీరుల సత్యహీనుఁడై
నిత్యముఁ జేయుధర్మ మది
నిష్ఫలమై చను నెల్లభంగులన్. 112

ఆ. సకలజంతుతతికి సత్యంబె ధర్మసం
హతికి మూలకంద మట్లుగాన

సుమహితముగ సత్యసమమైన ధర్మంబు
గలుగనేర దీజగత్త్రయమున. 113

క. అతివకుఁ బతిదైవం బిల
నతనికి మాయావి యైన నది చేసినను
వ్రతములు నిష్ఫలమై చనుఁ
దతి నశ్రోత్రియున కొసఁగు దానమురీతిన్. 114

సీ. ధవునిసమ్మతి లేక దానధర్మ మొనర్చు
జలజాక్షి గణికయై సంభవించు
దయితు మొఱంగి యితరునియై మెలంగిన
యలివేణి సూకరియై జనించు
పతియాజ్ఞ సేయక ప్రతివాక్యములు పల్కు
నబ్జాక్షి శునకియై యవతరించు
భర్తతోఁ గ్రోధించి పలుదెఱంగులఁ దిట్టు
సంగన వ్యాఘ్రియై యడవిఁ దిరుగు

తే. ఘనవయోభరమదమానకలిత యగుచు
మగని నవమాన మొనరించు మచ్చెకంటి
కాన నజగరి యై పుట్టుఁ గాన పూని
వరునియెడ భక్తి సలుపంగ వలయు సతికి. 115

వ. అని కొన్ని పతివ్రతాలక్షణంబు లుపన్యసించి యిట్లనియె. 116

క. నినుఁ బ్రోచుటకై చేసితి
ఘనతరవిశ్వాసఘాతఖగమృగహింసా

జననింద్యానృతవచనా
ద్యనుపమవృజినవ్రజంబు లంబుజనయనా. 117

శా. ద్వారద్వారమునందు యాచనయు సే
వాకర్మముం జల్పుచున్,
బేరంబాడి కృషీవలుండ నగుచున్
బెంపొంది తృష్ణాంబుధిం
బారం బేమిటఁ బొందలేక యట సం
పల్లాభముం గోరి నేఁ
జోరత్వం బొనరించితిన్ ఖలుఁడనై
శోభావతీ! నీకునై. 118

శా. శాతాస్త్రంబులు *వింటఁ బూనుకొని య
శ్రాంతంబు గాంతారసం
యాతాయాతజనౌఘవిత్తహరణ
వ్యాపారతం బొంగి ని
ర్భీతిం జేసితిఁ బెక్కుహింసలు సుహృ
ద్బృందంబు రంజిల్ల సం
ప్రీతిం జోరుల కెల్ల నాయకుఁడనై
పెంపొందితిన్ మానినీ! 119

క. అనయంబును బ్రముచ్చిమిచే
ననయంబున సిరుల నలరి హారులం గిరులన్

---

* వెంటఁ—పాఠాంతరము.

వనితల నేలితి నిఖిలా
వనితలమున సాటికలమువారు దనరఁగన్. 120

క. కొడుకులకు నీకుఁ దోడవులు
గడనకు నెక్కుడుగ నిడితి గడియించితి ప
ర్వ్వడులం దత్తడులం గడు
నొడమియు నీయొడయతనము నుడురాజముఖీ! 121

ఆ. నీనిమిత్త మిట్లు పూని యఘంబులు
వాసిదొఱఁగి చేయవలసెఁ గానఁ
బ్రాకటముగ నిందు భాగంబు గొనియెదో
కొనవో తెలుపు మిపుడు కుందరదన! 122

క. మగఁ డిమ్మెయిఁ *దన్నడిగిన
జిగిగుబ్బలమీఁదినరులసిరు లంబెరయన్
పగడంపుఁగెంపువాతెఱ
నగవొప్పఁగ నతనిఁజూచి నాతుక పల్కెన్. 123

చ. తనయులు నన్ను బంధుల ము
దంబునఁ బ్రోవఁగఁ గర్త వీవు నీ
వనిశము సేయుపాప మిది
యంతయు నీయదిగాని మాకు రా
దొనరఁగఁ గల్మషంబుఫల
మొక్కఁ డొనర్చిన నన్యుఁ డందునే

* దగ్గ నొడివిన—వ్రాఁతప్రతులు.

చన దిది ధీరగర్హితము
శాస్త్రనిషిద్ధము ప్రాణవల్లభా! 124

సీ. సభఁ బాపవారణశక్తుఁడై యుండియు
నూరకయుండిన నొక్కపాలు
స్నేహమోహంబులచే ధర్మనిర్ణయ
మొప్పంగఁ జెప్పిన నొక్కపాలు
పత్నీసుతచ్ఛాత్రపాపంబులకు శిక్ష
లోపి సేయకయున్న నొక్కపాలు
సంతతపాపకృజ్జనఘనసంసర్గ
మొనరఁ జల్పినయేని నొక్కపాలు

ఆ. వచనమాత్రమేని వారింప కూరక
యున్న శక్తిరహితుఁ డొక్కపాలు
పంచుకొందు రిట్లు పాపభాగంబులు
ప్రాజ్ఞసమ్మతముగఁ బ్రాణనాథ! 125

ఆ. చెలఁగి సేయువాఁడు సేయించువాఁడు ప్రే
రించువాఁడు సమ్మతించువాఁడు
పాపపుణ్యములకు భాగార్హు లగుదురు
నలువురును ధరిత్రిఁ జెలువ మిగుల. 126

తే. అతివ సహధర్మచారిణి యగుటఁ జేసి
పతికృతంబగు సుకృతంబు పాలు గాంచుఁ

గాంతచేసిన సుకృతభాగంబుఁ గొనఁగ
భర్త యధికారి గాఁ డిది పాజ్ఞమతము. 127

క. రవణంబులు పుట్టంబులు
ధవుఁ డొసఁగినఁ దాల్చుకొనుట దక్కఁగ నితర
వ్యవహారంబు స్వతంత్రం
బువిధలకుం గలుగ దెట్టియుగముల నైనన్. 128

వ. అది గావున. 129

క. వాసిగ నన్నేలుకొనన్
గ్రాస మొసఁగి శిక్షసేయఁ గర్తవు నేనీ
దోసము వీసముఁ గొన నిదె
నీసేవ యొనర్తు నింతనిజము హృదీశా ! 130

క. అని వనిత వలుకుఫలుకులు
విని విస్మితుఁ డగుచుఁ జోరవీరుఁడు ససయున్
జనవర్ణనీయవినయుం
దనయుం గని యనియె ముద మెదం గదురంగన్. 131

క. వినయాఢ్యశీలగుణములఁ
దనరెడ శ్రీమంతు లయిన తనయులు గల రె
వ్వని కతఁడు జగము లన్నియు
ననుపమసుకృతమున గెలుచు నందురు సుకృతుల్. 132

ఆ. జలజసఖునివలన జగములు రంజిల్లు
దీప మిడఁగ నిల్లు తేజరిల్లు

నిల సుపుత్త్రుచేతఁ గులమెల్ల విలసిల్లుఁ
గీర్తి నన్నిదిశల వార్త చెల్లు. 133

క. తలిదండ్రు లున్నతఱి వా
రలకు విధేయుఁ డయి యంత పరిత్యక్తము ని
మ్ములఁ బైతృక మిడి గయకుం
బోలుపుగ నరిగనయతండె పుత్త్రుఁడు ధరణిన్. 134

ఆ. త్యాగభోగములకు ధనమును సత్ప్రజ్ఞ
లై విధేయు లయిన యాత్మజులును
సద్గుణాఢ్యయైన సహధర్మిణియు నస
దైనతపముఫలమె యవనియందు. 135

క. లేవడి యగు జీవనముం
ధీవిరహితు లయినసుతులు ధృతిఁ బ్రతికూలం
బౌవర్తించుకళత్రము
పావనతాహీనతయును పాపఫలంబుల్. 136

ఆ. భువిఁ గుబుద్ధు లయిన పుత్త్రకళత్రాదు
లరయుమందిరంబు నిరయవసతి
ధర్మవంతులయిన తనయులు వనితయు
నొదవిరేని యదియె త్రిదివవసతి. 137

వ. అని యల్లన ప్రసంగంబు దిగిచి తనవర్తనం బిట్లని చెప్పె. 138

మ. ఖలచిత్తంబునఁ బౌరదారకల నా
కర్షించి భూదేవము

ఖ్యుల హింసించి ధనంబుఁ గైకొని యతి
క్రూరుండనై బాంధవా
వళితోడం గలహించి మిత్రచయముౕ
వంచించి దుశ్శీలతం
గలుషంబుల్ దగ నాచరించితి ననం
ఖ్యాతంబుగాఁ బుత్త్రకా ! 139

క. ఉపపాపమహాపాపము
లపారముగఁ జేసితిౕ సుమాంబువ్యజనా
తపవారణచందనములు
తపర్తువుల నొసఁగనైతి దయ విప్రులకుౕ. 140

చ. అరయఁగ మధ్యదేశమున
నావరణంబుల నిష్ఠ మొప్పఁగా
హరిహరవారణాననశి
వార్కుల నిల్పి సపర్యసేయ ను
ర్వర ననుబోఁటి కుత్సితకి
రాతుల కర్హత లేకయున్నఁ ద
ద్గురుపరిపూజకద్విజుల
కుౕ ధనమియ్యఁగనైతిఁ బ్రీతితోౕ. 141

సీ. అచ్యుతధ్యానంబు నరయక వారాంగ
నావయోమనసచింతనల మెఱసి

హరికథాకర్ణనాదర మెఱుంగక గణి
కామణీమణితసంగతిఁ జెలంగి
విష్ణుపదార్చనావిధి మాని మానినీ
పాదసంవాహనప్రౌఢిఁ బొదలి
పరమేశనైవేద్యభక్ష్యంబు మెసవక
వేశ్యాసవాస్వాదవిధి మెలంగి

తే. నందనందనమందిరాళిందమహితి
నరుగ కనవరతాహితస్మరశరార్తి
వారముఖ్యాగృహోదారతోరణాప్తిఁ
బూని దినములు ద్రోచితి ధీనిధాన. 142

ఆ. జారచోరసహవిహారసంచారంబు
మరగి సుజనసంగమహము గనక
యాజవంజవసుఖహర్షాప్తిఁ బరలోక
చింత నిముసమైనఁ జేయనైతి. 143

సీ. అధ్వనీనశ్రాంతిహరణార్థమై తరు
వాటికావళి పథావళి ఘటింప
ధర నపాత్రవ్యయదక్షతచే, నగ్ర
జన్మల కొసఁగ వీసమ్ము సొమ్ము
భవనసమాగతప్రాహుణికుల నల
రక్కముల రేఁచుటదక్క గ్రాస మొసఁగ

మరుభూమి గ్రీష్మాగమమున నిర్మలతర
నీరపూరప్రపఁ నిలుప నెందు

తే. హరిహరులఁ దులసీబిల్వతరుదళముల
నర్చచేసి తదగ్రమునందు లాస్య
మెలమి నొనరింపఁ గరతాళలలితగతుల
సరిగె యౌవన మిట్లు నిరర్థకముగ. 144

తే. మాఘకార్తికవైశాఖమాసములఁ బ్రి
యాగ గోదావరీప్రముఖార్త్వ దివ్య
తీర్థములఁ గ్రుంకి హరిపాదతీర్థజలము
ద్రావలేనైతిఁ దులసి కర్ణములఁ దుఱిమి. 145

క. తతదురితచరితసంగతి
సతతము పితృమాతృదుహితృజామాతృమనో
గతహితరతిఁ బొదలక దు
ర్మతినై చరియింప వత్సరంబులు గడచెన్. 146

చ. వ్రతహితతీర్థయాత్ర లుప
వాసముఁ జేయఁగమాని పూని నేఁ
బ్రతి హరివాసరౌఘశివ
రాత్రులయందు భుజించి మించి సం
తతగణికామణీనిధువ
నప్రమదాంబుధి నోలలాడుచున్

ధృతిమెయి భారతాదికథ
లెన్నఁడు వీనుల నింప నింపునన్. 147

ఆ. ఉద్ధరింపనైతి సద్ధర్మగతిఁ జూపు
శాదమగ్నమైన సౌరభేయి
నస్మదీయమందిరాజిరధర భూసు
రాంఘ్రిజలము చిక్కఁదయ్యె నకట. 148

చ. హరి భజియింపనైతి లల
నాపయవామితవర్ణనాస్థ న
స్థిరమతి నర్థలోభరతిఁ
జేయఁగ నైతిఁ బరోపకార మి
ద్ధర శరతాదయాకలిన
తాగుణముల్ సహజంబు లయ్యె నె
ట్లరయుదు నీయపారకలు
షాబ్ధికిఁ దారణయానపాత్రమున్. 149

వ. అది గావున. 150

చ. ఇలఁ గల భూరిరేణుగణ
వృష్టికణంబుల కెక్కుడైన నా
కలుషచయార్ధభాగము త
గం గొనుమా తదనంతరంబ ని

శ్చలగతి శేషితాఘఘన
   శాదము *నిర్మల గాంగవారిలోఁ
దోలఁచి సుఖించెదర్ విగత
   దోషమనీష ధరిత్రిఁ బుత్త్రకా! 151

క. అని నైజాంహోభాగము
గొను మని ప్రార్థించునట్టి గురువచనంబుల్
దనమనమునఁ గుత్సించుచుఁ
దనయుం డిట్లనియె మృదుసుధామధురోక్తిన్. 152

చ. అఱిముఱి నీయపారదురి
   తావళి వీనులఁ జేర్చినంతనే
వెఱపును రోమహర్షణము
   వేపథువుం జనియించె నింక నీ
యుఱవగునట్టిపాపభర
   మోపి వహింపఁగ నెట్లు నేర్తు నె
త్తఱిఁ దరమానె లేఁగకు ను
   దగ్రభరం బగు బండి మోయఁగన్. 153

తే. కార్యకారణరూపసంగతిఁ జెలంగి
పుత్త్రజనకాహ్వయంబులు పూనినట్టి
మనకు నిరువుర కార్యసమ్మతుల నతుల
పోష్యపోషకవృత్తులు పొసఁగె జగతి. 154

* 'నిష్కృతి' అని భ్రాంతప్రతులు.

చ. జనకుఁడ వీవు రక్షణము
సల్పఁగ శిష్య యొనర్పఁ గర్త వి
శ్లైనసిన నీదు ప్రాపుఁ గని
యేసుఖవంతుఁడ నౌట దక్క నీ
యనుపమపాపలేశ మది
యందఁజుమీ మును పేయుగంబులన్
విను ఘోరపాపకర్మములు
వేఱొకఁ డాఁగెనె మాట లేటికిన్. 155

చ. మఱియును నొండు సెప్పెదఁ గ్ర
మంబున సంతతముం దురంతమై
పఱపగు నీయుదగ్రతర
పాతకజాతము పోష్యవృత్తిచే
వఱలు కళత్రపుత్త్రహిత
వార ముదారత లేశమైన ని
న్నెఱేఁ గొనువారు గారు తగ
నీకనుభావ్యము తత్ఫలం బిలన్. 156

తే. అనిశశమదమసంపన్ను లయినఘనులు
ధర్మకర్మంబె సలుపుచు నిర్మలముగఁ
బుత్త్రమిత్త్రకళత్త్రాదిపోషణంబు
సేయుదురు గాని దురితముల్ సేయ రెందు. 157

క. పరిజనములు భవదాహృత
వరధనములు గొనఁగఁ బాలివారలు నీదు
స్తరతరదురితము నిరతము
వరుస న్నీ వనుభవింపవలయుం దండ్రీ. 158

వ. అని. 159

శా. సూనుం డీగతిఁ బల్కుపల్కు విని ద
స్యుం డెంతయు న్విస్మితుం
డై నిశ్వాస మొనర్చి బందుగుల భా
ర్యాపుత్రమిత్రాదులన్
దా నిందించుచు నాత్మపాపముల కా
త్మ న్నిష్కృతిం గోరె యా
వహ్నిశ్రేష్ఠులచెంతకుం జనియె సు
మ్లానాతిదీనాస్యుఁడై. 160

క. ధనురాశుగకరుఁ డయ్యు వి
పినచరణిన్ వేషమాత్రభీషణుఁ డగుచున్
జనియె న్నిరహంకృతిచే
ఘనశాంతి న్వైర ముడిగి గతమత్సరుఁడై. 161

వ. ఇట్లు గేహంబుపై మోహంబు వదలి యమ్మహారణ్యా
మార్గంబున నిరర్గళగతి నరుగుచుం దనసంకల్పంబు వికల్పం బగుటకుం జింతించి మనంబున నిట్లని వితర్కించె. 162

ఉ. ఏ మును పాజవంజవసు
ఖేచ్ఛ సతీసుతరక్షణార్థమై
పామరవృత్తిఁ బాపము ల
పారము చేసితి ధర్మకర్మ మిం
దేమియుఁ జేయనైతి జని
యెల్ల నిరర్థక మయ్యె నక్కటా!
యేమి యొనర్తు నేది తెరు
వేమిటఁ బుణ్యుఁడ నౌదు నిద్ధరన్. 163

క. మఱి కార్యాకార్యము లే
నెఱుఁగక బంధులకు ధనము లిచ్చితిఁ బిదపన్
గుఱియైతి దురితముల కే
మఱియుం ధర్మంబు సేయ మతిరహితుఁడనై. 164

క. పరలోకసహాయంబై
పరగినయది ధర్మనిరతి బాంధవపుత్రో
త్కరమిత్రకళత్రంబులు
పరిపంథిసమూహ మనుచుఁ బలుకుదు రార్యుల్. 165

ఉత్సా. ధీరబుద్ధి నింద్రియములఁ ద్రిప్పలేక భోగులై
మేరమీఱువారు పుత్రమిత్రదారరక్షకున్
క్రూరవృత్తి దినము ధనముఁ గూర్చి పేర్చువారు దు
ర్వారనారకంబుఁ జేరువారు సిద్ధ మిద్ధరన్. 166

ఆ. అర్థవంతు లయ్యు సత్యంతలుబ్ధులై
పాత్రములకు లేశమాత్రమైన
నిడక యనుభవించు హీనాత్ము లవని న
పారనారకములఁ జేరువారు. 167

క. అడిమినపరిజనరక్షకుఁ
దలఁచుగ నొసరించు దుష్కృతము లెన్నఁటికిన్
దలఁగవు తదనుభవమునకు
గుడియైతిం దగ ననేకకోట్యబ్దంబుల్. 168

ఉ. పావనులైనభూసురుల
భావము వేగమె మార్దవం బగున్
సేవ యొనర్చినం గరుణ
సేయుదు రాశ్రితకోటి కెప్పుడున్
గావున నిమ్మునీంద్రుల న
కారణబంధుల నాశ్రయింతు వీ
రేవిధినైనఁ బాతకని
వృత్తి యొనర్ప సమర్థు లెంతయున్. 169

చ. శ్రుతిహితసూక్తిచే నలరు
చు న్నిఖిలాగమసారవేదులై
సతతము పక్షపాతగతిఁ
జాల ననంతపదానురక్తులై

ధృతిఁ జెలువొందు నీద్విజత
తిం బ్రతిభం గనుటాది గాఁగ నా
మతి బ్రమదంబునం బొదలి
మత్సర మంతయు డిందెఁ బొందుగన్. 170

క. అని తలఁచుచుఁ జోరుం డ
మ్మునిముఖ్యులనికటదేశమున్ వెసఁ జేరం
జన వాని ఘోరరూపముఁ
గని వారలు మానసములు గడుఁ జలియింపన్. 171

పంచ. అయం సమాగతో మలిమ్లు చాధమః పునః ఖలః
స్వయం తరక్షువద్గిరీంద్రచారుకందరా దహో
క్వ యామహే భియా వయంతు కాననే భయావహే
దయాఽస్య నాస్తి ఘాతుక స్సదా యటంచుఁ బల్కుచున్.

ఆ. ఇతరచింతయాఽల మిహ రక్షకో రామ
ఏవ తం భజామహే జగంతి
తేన సర్వదాఽవితాని తస్మై నమో
యనుచు రాముఁ దలఁచి యపుడు మఱియు. 173

మత్త. శ్యామలావయవం చరాచర సద్గురుం వనమాలికా
ధామశోభితవక్షసం వరదైర్ఘ్యబాహుయుగాంచితం
భ్రామయంత మరం శరం మృదుపాణినా విమలేన వం
దామహే రఘురామ మేవ ముదా యటంచుఁ దలంచుచున్.

ఉత్సా. చింతయామహే ఉనుజేన సీతయా సమన్వితం
కంతుకోటిసుందరం జగత్పతిం రఘూత్తమం
సంతతాభయప్రదం ప్రసన్నవదన మీడ్య మ
త్యంతనీలఘనఘనాంగ మనఘ మాయతేక్షణమ్. 175

క. శరణం భజామహే స
త్కరుణావరుణాలయం జగద్భరణం సం
సరణార్ణవతరణం వర
తరుణారుణకంజమంజుతరకరచరణమ్. 176

తే. ఇట్లు నుతిసేయుమునులపైఁ గృప దలిర్ప
జానకియు లక్ష్మణుండు పార్శ్వములఁ గొలువ
బాణతూణీరకోదండపాణి యగుచు
సరసగతి రాఘవుండు ప్రసన్నుఁ డయ్యె. 177

క. మరకతదూర్వాదళనిభ
వరతేజుఁ రాముఁ గాంచి వారలు జగమున్
వరుసఁ దదాత్మకముగఁ గని
యురుగతి బాహ్యంబు మఱచి యుండిరి భక్తిన్. 178

తే. తలఁచువారి కభీష్టముల్ దయ నొసంగు
నట్టిరఘురాము సర్వలోకాభిరాముఁ
గాంచి హర్షించి మునులు తన్కరునివలని
భయ మెఱుంగక నిల్చిరి పరిసరమున. 179

చ. ఘనమునిచాతకౌఘము న
కల్మషజీవనవృత్తిఁ బ్రోచి స
ద్వినుతపిశంగచేలవర
విద్యుదుదారతఁ దేజరిల్లి సాం
పున శరచాపముల్ మెఱయఁ
బూని నిరంతరమేచకచ్ఛవిం
దనరెడు రాఘవాంబుదము
తాపము వాపుట చోద్యమే ధరన్. 180

వ. ఇట్లు రామసందర్శనామందానందసుధార్ణవంబునం దేలి
నిశ్శంకం గొంకక యున్న యమ్మునికంఠీరవంబుల యుప
కంఠం బకుంఠితోత్కంఠం జేరం జని వారలకు సాష్టాంగం
బొఱగి లేచి ప్రాంజలియై చోరవీరుం డిట్లనియె. 181

క. స్వాములయానతిఁ బనివిని
జామాతృభ్రాతృదుహితృజాయాదాయా
దామితహితసుతవితతి
న్నామకదురితాంశములు గొనంగ నడిగితిన్. 182

వ. అడిగిన వార లిట్లనిరి. 183

ఆ. నీయుపార్జితార్థనిచయభాగంబుల
నేము గొనఁగఁ దగుదు మింత నిజము
నీయొనర్చుదురితనికరంబు నీయది
కాని యందు నొక్క కాని గొనము. 184

క. అనుపల్కులు విని విస్మయ
మును జింతయు నంతరంగమునఁ బేనఁగొన ని
మ్మున వెడలితి వితథోద్యమ
మున మునుపటిదురితచరితమునకు మునుకుచున్. 185

మ. జనతాఖండనచండతాండవరిరం
సాచిత్రకాయాదిస
త్త్వనికాయాంచితకాననాంతరతరు
వ్రాతచ్ఛదాచ్ఛాదితా
యనసమ్యగ్గమనాగమశ్రమము స
ద్యస్సంభవం బైన యీ
యనుతాపంబున డిందఁ వచ్చితి నితాం
తాపారవేగంబునన్. 186

చ. ఋతగతియందు నేమఱక
తృష్ణ దొఱంగి యధర్మకర్మవ
ర్జితమతి నప్రమత్తతఁ జ
రించి యలోలుపతాగుణాఢ్యులై
సతతము ధర్మకర్మములు
సల్పుచుఁ బుత్త్రకళత్రమిత్రసం
తతిఁ దగఁ బ్రోచునట్టి యతి
ధన్యులు మాన్యులుగా వసుంధరన్. 187

తే. కలిమికోలందిఁ బ్రబాతులై యలరి పాప
భీతులై పుణ్యకర్మసంప్రీతు లగుచు
బంధురక్షణ మొనరించు ప్రాజ్ఞమతుల
కే నమస్కృతి యొనరింతు నిది నిజంబు. 188

క. చోరులు శరారులును మఱి
జారులుఁ గ్రూరులును సూరిజననిందకులున్
దారాత్మజవశగతులు
న్నారకమున కరుగువారు ననుఁబోలి ధరన్. 189

తే. సజ్జనద్వేషి యగుపంచజనున కిహముఁ
బరము దూరంబులుగఁ గల్గు నిరయవసతి
మంగళం బగు సత్సంగమంబువలన
నదియు బహుపుణ్యలభ్యమై యమరు నంద్రు. 190

తే. అవని సత్సంగకారణం బగు మదీయ
పూర్వజనికృతసుకృతసంభూతికతనఁ
బరమపావనమూర్తులై పరఁగు మిమ్ము
నింపు మీఱంగ నేఁడు దర్శింపఁ గంటి. 191

సీ. నీహారకరకరనికరపరిసంగతిఁ
గరినోపలంబులు గరఁగుకరణి
సూనవితానసంధానవిధానతఁ
బేటిక వాసనల్ బేర్చురీతి

వేధిరసాసారవిసరప్రసరయుక్తి
నశ్మసారము హేమ మగుతెఱఁగునఁ
దతవిభ్రమభ్రమద్భ్రమరసంగతిఁ గీట
కము తదాకారమై యమరుమాడ్కి

తే. సత్పురుషరాజితోడ దుర్జనులు గదిసి
మృదుతఁ గాంచి తద్వాసన నెనసి రుచిర
వృత్తిఁ జెన్నొంది యటఁ దదాకృతి వహించి
పరిబలుదురుగాదె జగములఁ బ్రౌఢి మెఱసి. 192

క. గతమత్సరు లగుమీసం
గతి గలిగినయదియ మొదలుగా నామతి స
ద్రతిఁ బొదలుచుఁ గల్మషవ
ర్జితగతిఁ జెలువొందె మౌనిశేఖరులారా! 193

తే. ప్రాగ్జననకృతసుకృతసౌభాగ్యగరిమ
సారముగ నిప్డు విప్రతీసార మొదవెఁ
గాని మత్కృతదురితనికాయ మెన్నఁ
గమలభవునకు నైన శక్యంబు గాదు. 194

క. పాపాకూపారము మీ
ప్రాపను తెప్పం దరించి బ్రతుకుదు సనుచుక్
శాపానుగ్రహసామ
ర్థ్యోపేతుల మిమ్ము శరణ మొందితిఁ బ్రీతిన్. 195

క. ప్రతిగిరిపరపురపక్కణ
వితతారణ్యములఁ బుడమివేల్పులు లేరే
కృతులై మీతెఱఁగున స
న్మతి యొసఁగఁగ లేరు గాక మాదృశుల కిలన్. 196

కవిరాజవిరాజితము.
ప్రమ సరిమిత్రులపౌత్రిఁమ లొక్కతె
అంగునఁ గాంచి యనారతమున్
సుమహితవృత్తి ఋజుత్వము దప్పక
శోభిలి సత్పథసంచరతన్
దమము వెలార్చి ముదంబున సద్ద్విజ
తాపముఁ బాపి శుచిత్వముచే
నమరి కళానిధు లై ద్విజరాజత
నందినవారలు మీర లిలన్. 197

వ. అని పల్కి చోరుండు మఱియు ని ట్లనియె. 198

క. జననంబున శూద్రుండై
జనయిత్రీజనకరచితసంస్కారమునన్
గొనకొని కర్మము సలుపుచు
వెనుక ద్విజుం డనఁగఁ బరగు విప్రుఁడు పుడమిన్. 199

తే. వెలయ స్మృతికారణంబున విప్రుఁ డనఁగఁ
బరగు విప్రార్భకుఁడు శుద్ధతరుఁ డతండు

సర్వధర్మాధికారియై యుర్విఁ బర్వఁ
బ్రకటచిత్రార్థరచితభిత్తిక యనంగ. 200

క. నిర్మలమతి విప్రుఁడు స
త్కర్మమున సచిత్రభిత్తిగతి నుతిఁ గనుఁ ద
ద్ధర్మం బెడలిన యాఁడు
ష్కర్ముఁడు పతిరహితయైనసతిగతి నొనరున్. 201

క. ఆరూఢిగ నిజకర్మ
ప్రారంభం బెడల విడిచి పామరతం దు
ర్వారాఘకారియై తగు
పాఱుఁడు వ్రాత్యుండు నాఁగఁ బరగు ధరిత్రిన్. 202

సీ. గర్భసంస్కారంబుఁ గనక వేదాక్షరా
భ్యాసవర్జితుఁ డైన భూసురుండు
స్నానసంధ్యాదివిహీనతచే వేష
భాషారతుం డైన బాడబుండు
వేదశాస్త్రపురాణవిముఖుఁడై దుర్మతి
నలరి సర్వాక్షేపియగు ద్విజుండు
కరవాలశరచాపకరుఁడై సమీకాభి
రతిచేఁ బ్రవర్తించు బ్రాహ్మణుండు

తే. నవరవర్ణసేవాపరుఁ డై తదీయ
నిరతసంగతిఁ దగు ధరణీసురుండు

గణకలేఖకవృత్తి వికర్ముఁ డైన
విప్రుఁడును వాత్యసంజ్ఞచే వెలయువారు. 203

తే. నిత్యమును వాత్యసంసేవనిరతి సలుపు
నగ్రజుండు మహాత్రాత్యుఁ డనఁగఁ బరగు
నాతఁ డాత్మాఘచయతారణాసమర్థుఁ
డొరుల నేరీతిఁ దరియింప నోపు నవని. 204

ఉ. పూనిక వ్యర్థకర్మములు
పూని జఘన్యజనత్రభోజియై
స్నానము బ్రహ్మయజ్ఞమును
సంధ్యయు హోమము వైశ్వదేవముఁ
మానితతర్పణక్రియయు
మంత్రజపంబును దేవపూజయుఁ
మానుగ సప్తఘస్రములు
మానినఁ బాతకి యా ద్విజుం డిలన్. 205

తే. హేయభోజన మగు స్నానహీనభుక్తి
యసమ యజపి సేయునాహార మర్వి
క్రిములఁ దిను టగు వేల్వక నమలు టరయఁ
బరుల కొసఁగక మెసవినఁ బలలసమము. 206

సీ. అలసుఁడై శూద్రజనానీతకుశసమి
జ్జలఫలములఁ గర్మసమితి సల్పి

స్నానహీనతఁ జెంది క్షుణదాధృతాంశుక
సహితుఁడై ప్రొద్దున సంధ్య వార్చి
నదిలో మునుంగక సదన భాండస్థ మం
దోష్ణోదకస్నాన మొనరఁ జేసి
రథ్యల నడచుచోఁ బ్రజ్ఞావిరహితుఁడై
ఫలమూలతాంబూలములు భుజించి

తే. శ్వపచతతి నంటి యశుచియై జలము గ్రోలి
ధీరబుద్ధి సాలగ్రామతీర్థజలము
సప్తరాత్రముల్ గ్రోలక దీప్తి దఱిగి
పాతకుం డగు విప్రుండు భూతలమున. 207

సీ. కులపతియన్నంబు కులటాన్నము పరాన్న
లోలుపాన్నంబు దేవాలయాధి
కారియన్నంబు ననారతదుష్ప్రతి
గ్రహశీలునన్నంబు గణికయన్న
మఱియాచకాన్నంబు యత్యధీనాన్నంబు
ధరణీసురద్రవ్యహారణదక్షు
నన్నంబును గణాన్న మాచారహీనద్వి
జాధమపిశునజనాన్నములును

తే. వ్రాత్యభృత్యాన్నములు హోమవైశ్వదేవ
రహితదుష్టాన్నమును బరద్రవ్యహరణ

హరిహరద్వేషపాషండకాన్నములు భు
జించి చాంద్రాయణములు చరించవలయు. 208

ఆ. బంధకియును వారభామయుఁ జండాలి
కయు రజస్వలైన కన్యకయును
నెఱి సగోత్రకామినియు వృషలీసంజ్ఞ
వెలయువారు వీరు విశ్వమునను. 209

క. అతిదుర్మతి వృషలీసం
గతి సంతతి వడయునట్టిఖలచిత్తుఁడు వి
ప్రతఁ దొఱఁగి నిరయగతిఁ గను
నతనికదన్నము భుజింప నఘ మగు మిగులన్. 210

తే. సాధుసంతాపకృత్కులజారచోర
సమయభేదకపాషండషండపిశున
హీననటవిటగాయకహేయకర్మ
కర్మఠులు దానపాత్రముల్ గారు ధరణి. 211

తే. క్రోధనోగ్రప్రతిగ్రహక్రూరవేష
భాషణాభక్ష్యభక్షణభారవాహ
హైతుకపరాన్నలోలుపఘాతుకద్వి
జన్ములకు దాన మొసఁగఁ బోసంగ దంద్రము. 212

క. పరకార్యనాశకులును
బరహింసారంభకులును బకవృత్తులు దు

ర్భతతరపరాపవాదులు
నిరతము దానవిధివర్జనీయులు పుడమిన్. 213

చ. ఎసఁగఁగ నంధుఁ డంధుఁ దరి
యింపఁగ నేరనియట్లనార్యుఁడై
పొసఁగిన యగ్రజన్ముఁ డొక
పుణ్యము నీయఁగలేఁడు దాతకున్
వసమరి యై యపాత్ర మగు
వానికి నిచ్చినదాన మెన్నఁగా
భసితమునందు హవ్య మిడు
భంగిఁ దలంప నిరర్థకం బగున్. 214

తే. వేదశాస్త్రపురాణసద్వృత్తి దొఱఁగి
స్నానసంధ్యాజపాద్యనుష్ఠానహీనుఁ
డయిన విప్రుని ధార్మికుఁ డైనరాజు
నీచకర్మాధికారిగా నిలుపవలయు. 215

క. పరలోకవిచారజ్ఞులు
పరోపకారులు పరాన్నపరివర్జకులున్
హరమురహరనామస్మృతి
నిరతులు నిరతమును బూజనీయులు ధరణిన్. 216

తే. పురుషసూక్తము శతరుద్రీయమును జపించు
వారుఁ ద్యక్తపరిగ్రహుల్ ధీరవృత్తి

నఖిలవస్తువిరక్తిచే నలరునట్టి
యనఘమతులు జీవన్ముక్తు లగుట నిజము. 217

సీ. సత్యవంతులు జనశ్లాఘులు శాంతులు
దాంతులు జపహోమతత్పరులును
శివపూజనాసక్తచిత్తులు శాస్త్రార్థ
చింతనప్రాజ్ఞులు శేషభుజులు
సతిధర్మనిష్ఠులు కృతపంచయజ్ఞులు
స్నానసంధ్యాహరిధ్యానపరులు
నతులితపుణ్యతీర్థాప్లవపరిపూత
దేహులు సంతుష్టధీరమతులు

తే. సతతమితహితభాషణుల్ సాధువృత్తి
నిరతులుఁ బ్రయత్నమునఁ బూజనీయు లిట్టి
వారి నవమాన మొనరింపవలవ దెపుడు
నెలమి నాయుర్యశశ్శ్రీలు వలయునేని. 218

తే. కొసరి యాయుర్యశశ్శ్రీలు గోరు భూమి
వల్లభుండు స్వరాష్ట్రనివాసు లయిన
వృత్తికర్శితమహితసద్విప్రవరుల
మది నుపేక్ష యొనర్పక మనుపవలయు. 219

వ. అని సత్సంగతి నుదయించిన యనూనజ్ఞానంబుకతంబునఁ
జోరవీరుం డీరీతిం బలికి క్రమ్మఱ నమ్మునిపుంగవులం
గనుంగొని యిట్లనియె. 220

క. చోరుఁడ శఠారుఁడ దురా
చారుఁడఁ గ్రూరుండ మఱియు జారుండను నే
మీర లుదారులు గిరివర
ధీరులు నాసంశయంబుఁ దీర్పఁగవలయున్. 221

వ. ఎట్లనిన. 222

తే. కొంద ఱానందహీనతఁ జెందువారు
మందమతు లయి కొందఱు గుందువారు
కొంద ఱామయబాధచేఁ గొందలంబు
నంది యందంద పుడమిలో వందువారు. 223

మత్త. కొంద ఱభ్యవహారదూరతఁ
గుంది యాచన సేయుచున్
మందభాగ్యము నొంది కుత్సిత
మార్గులై ప్రతిమందిరా
ళిందభూముల కేఁగ నందుల
లేదు లే దని త్రోయఁగాఁ
గంది దీనతఁ జెంది యుండఁగఁ
గాంతు మెందును ధారుణిన్. 224

ఆ. తొలుత వీర లెట్టిదురితం బొనర్చిరో
తెలుపవలయు మీర లలఘుకరుణ
నతులభవదనుగ్రహమునఁ గృతార్థతా
మహిమఁ జెందువాఁడ మానులార. 225

వ. అనిన వానికి నమ్మును లిట్లనిరి. 226

తరళ. భళిభళీ తగుఁ జోర నీదగుప్రశ్న మిమ్మిహి మానవుల్
చెలఁగి దుర్మతులై యఘంబులు చేసి నారకయాతనం
గొలఁది మీఱిన వత్సరంబులు గూడి తత్ఫలభోక్తలై
కలుషశేషముచే జనింతురు గ్రమ్మఱన్ సుఖహీనులై. 227

క. ధనయౌవనవిద్యామద
మున ఘనుల హసించు కలుషమున మఱుమెయి దు
ర్జనులై సౌఖ్యవిహీనత
జనియించెద రాత్మహేయజనికి వగచుచున్. 228

ఆ. ధర్మకృజ్జనములఁ ద్రస్తరిచేఁ దిర
స్కృతి యొనర్చు దురితగతులకతన
మందబుద్ధు లగుదు రెందును మఱుమేన
శూరతావిహార! చోరవీర! 229

తే. ఎంచ దురితార్జితసుఖాప్తిఁ గాంచిరేని
వారు మఱుమేన రుగ్బాధ వందువారు
దురిత మాచంద్రతారకస్థిరతఁ బరగు
సౌఖ్యములు నశ్వరంబులై చను ధ్రువంబు. 230

సీ. స్థలజలఫలమూలతాంబూలతండుల
చేలాన్నదధిఘృతక్షీరశాక
ములు నమస్కృతిపూర్వముగ యాచకులకు య
థాశక్తి నొసఁగక యాశఁ జెఱచి

సంళాపములు వల్కి శ్వానభృత్యులఁ గవ
యించి సాధ్వస మొదవించునట్టి
దురితాభినిరతులు దురితశేషంబున
నశనాంబరార్థమై యాఁకఁ నూని
ఆ. పాత్రిపాణు లగుచు ధాత్రి నదాతల
ఫలము లిట్టి వనుచుఁ దెలుపురీతి
దీనవృత్తిఁ జేఁ బ్రతిద్వారసీమల
కరుగువారు దుఃఖితాత్ము లగుచు. 231
క. ఎందుల నణుమాత్రం బై
నం దమ కొదవమికిఁ జింత నలఁగి నిజజనిన్
నిందించి బుభుక్షం బ్రతి
మందిరములఁ దిరిగితిరిగి మరలుదు రాశన్. 232
వ. అనిన విని చోరుండు మఱియు ని ట్లనియె. 233
చ. అడిగినయంతమాత్రమున
నద్భుతలీలఁ జెలంగ వాంఛకుం
గడవఁగ రత్నభూషణని
కాయముఖాఖిలవస్తుసంతతుల్
దొడరి జనంబు లాదరము
తో నొసఁగం గదు నప్రయాసతన్
బుడమిని గొంద ఱార్యజన
పూజ్యతఁ జెందుదు రేమి చోద్యమో. 234

క. వారలఁ గనుఁగొని నంతనె
ధీరత దేవతలఁ గనినతెఱఁగున మనుజుల్
స్మేరముఖాంబుజు లగుచు ను
దారధనము లొసఁగి పూజఁ దనుపుదు రర్థిన్. 235

వ. మఱియు. 236

ఉత్సా. అన్నవస్త్రదీనతం బ్రియాన మంది కుంది సం
పన్నమందిరముల కరిగి మానహీనవృత్తులై
యన్నుకొనినపాము నోమి యల్పవస్తులబ్ధిచేఁ
గన్నవొంద కుండువారిఁ గాంతు మెందుఁ గొందఱన్. 237

క. ప్రతినగరప్రత్యూటజ
ప్రతిగేహద్వారముల నిరంతరయాత్రన్
ధృతి దఱిఁగి తిరిగి యొగి న
ల్పతరదరిద్ర్యవరలాభపరు లగుదు రిలన్. 238

వ. వీర లెట్టి కారణంబున నిట్టితెఱంగు వార లై రెఱింగిం
పవలయు ననిన సమ్మహాత్ము లి ట్లనిరి. 239

సీ. అతిథు లేతెంచిన నాత్మజనిర్విశే
షముగఁ బ్రియంబున సత్కరించి
భద్రంబ డిగి యర్ఘ్యపాద్యాసనాంజలి
ప్రతతి దేవోపచారము లొసర్చి
రత్నభూషాంబరరజతచామీకర
ప్రముఖనానావస్తుసముదయంబు

ప్రకటభక్తిపూర్వకముగ నిరతంబు
గురుతరవిభవంబుకొలఁది నొసఁగు
ఆ. నట్టివారు సువ్వె యపరియానమున న
ఖర్వవస్తుసమితిఁ గాంచి మించి
యలఘుసౌఖ్యమున నిరామయు లై ధరఁ
బూజ్యతానిరూఢిఁ బొల్చువారు. 240
సీ. అర్థులఁ గాంచి ప్రత్యర్థులఁ గాంచిన
ట్లత్యంతరోషరక్తాక్షు లదుర
నభిశాప మొనరించి యదయతఁ గలహించి
తనుఁ బుత్త్రదారలు తగ దనంగఁ
దరలించి యర్ధచంద్రప్రాప్తిచే బహి
ర్గతులఁ గావించి యుద్ధతిఁ గవాట
మిడి వారు మొఱ యిడ *గడు విడి తడవునఁ
గొసరించి తన్మాత్ర యొసఁగి యనుపు
ఆ. నట్టివారు సువ్వె యాచకు లై ప్రతి
ద్వారదేశమున ననారతంబు
తిరిగి తిరిగి మఱి యతిప్రయాసంబున
నల్పవస్తులాభు లగుదు రవని. 241
క. అడిగెడుధనికులు కడు లే
వడి మా కని యతిథిఁ దిట్టి స్వల్ప మొసఁగి యా

* కడువడిఁ దడవున కొసరించి—పాఠాం.

కడఁ బశ్చాత్తాపితు లగు
జడమతులకు నల్పసుఖము సమకూరుఁ దుదన్. 242

తే. ఏల రా నిచ్చి తని ద్వారపాలుఁ గినిసి
యతిథిఁ గడ నిడి కడుపడి నారగింప
క్లిష్టమృష్టాన్నపానీయతృప్తిఁ జేయ
వలయు నైశ్వర్యకాము లైనట్టివారు. 243

క. సురవరవరుణధనేశ్వర
హరిహరదండధరముఖుల కయినన్ ధర సు
స్థిరమతి నొరులకు నొసఁగక
యరు దయినపదార్థజాత మనుభవ మగునే. 244

తే. ఇందుసూర్యోపరాగములందె తక్క-
నొనర ద్విజమాత్రునకు దాన మొసఁగ నట్టి
దతఁడు దాతల నిరయసంస్థితులఁ జేయు
వాని కిడుకంటె దానంబు మాను టురవు. 245

మణిగణనికరము.

గుణమణిఖను లగుగురుజనములకున్
మణిగణనికరము మహిమ నొసఁగి యూ
ర్జితసుకృతమునఁ బటుగతి రమణీ
మణులఁ గలసి సుఖమహు లగుదు రిలన్. 246

తే. హరిహరహిరణ్యగర్భాదిసురల కయినఁ
గృతశుభాశుభకర్మసంతతి దలంప

ధర సవశ్యానుభావ్య మై పరగు ననినఁ
బరిహరింపఁగ వలఁతులే పంచజనులు. 247

దోదకము.

దాన మొనర్చినధన్యతరాత్మల్
కానల నైనను గాంతురు సౌఖ్యం
బా నెఱి లేనిదురాత్మలు సద్రి
వ్యానుభవంబుల నందరు ధాత్రిన్. 248

క. పాయక దురితము వాయం
బ్రాయశ్చిత్త మొనరింప నను వగు దానం
గాయంబు పావనం బగు
నాయతసంస్కారపూత మగుభిత్తిగతిన్. 249

క. వ్యవధానంబున నేనియు
నవలం దుష్కర్మనాశ మగు నిష్కృతిచే
భువి సేతుబంధగత మై
జవమఱి యవికార మైనసలిలంబుక్రియన్. 250

తే. సారె కూలంకషాలహరీరయంబు
గదిసి నిలుపఁగ శక్యంబు గానియట్లు
నిష్కృతివిహీన మై తగుదుష్కృతాఘ
మతిశయం బగు ననివార్య మై ధరిత్రి. 251

క. ఇది వేదవాదిసమ్మత
మది గావునఁ గర్మమూలసాముల మనుజుల్

మదమున దురిత మొనర్పక
మృదుగతి వర్తింపవలయు మీఁ దెఱిఁగి తగన్. 252

ఆ. నిరతకృచ్ఛ్రముఖ్యనిష్కృతు లొనరింప
నేల మున్నె తెలిసి యిద్ధబుద్ధి
మోహలోభరోషములఁ బాపములు సేయ
కొదిఁగి మిన్న కుండు టురవుగాదె. 253

చ. అరుదుగ వేదశాస్త్రముల
యర్థ మెఱింగినపుణ్యపూరుషుల్
దురితము త్రోవఁ బోవ రిది
దుష్టజనంబులు గానలేరు గా
యరయఁగఁ దన్నివృత్తియె మ
హాఫలదాయక మై వసుంధరం
దిర మగుతత్ప్రవర్తనము
ధీరవిగర్హిత మెన్ని చూడఁగన్. 254

చ. నరుఁ డురుధర్మకర్మము లొ
నర్చియుఁ బాపము లోపి చేసియుం
జిరతరసౌఖ్యదుఃఖములఁ
జెందుఁ గ్రమంబున నట్లు గావునం
బరువడి ధీరభావమునఁ
బాపనివృత్తి యొనర్పు మే లగున్

ధర నదియే తపఃఫలము
దానము నధ్యయనంబుఁ బుణ్యముౕ. 255

వ. అనిన విని చోరుండు వెండియు ని ట్లనియె. 256

ఉ. కొందఱు కాంతిమంతులును
గోమలపాణిపదుల్ ప్రసన్నరా
కేందుముఖుల్ విశాలజల
జేక్షణులుౕ స్మితపూర్వభాషణుల్
కొందఱు గర్తనేత్రులును
గుత్సితగాత్రులు వామనాంగులుఁ
నిందితవక్త్రపాణిపద
నీరజులుం గల రుర్వి మానవుల్. 257

వ. ఈయిరుదెఱంగులవారలు నెట్టిసుకృతదుష్కృతంబులు
గారణంబులుగ నిట్టివారలై జనియించి రెఱింగింపవలయు
ననిన నమ్మహాముని లి ట్లనిరి. 258

సీ. పల్లవమృదుపదపాణులు ద్విజులకు
నభ్యంజన మొనర్చునట్టివారు
ఆయతేక్షణులు స్నేహాపూర్ణదీపికా
కలికానికాయంబు నిలుపువారు
సౌందర్యశేవధుల్ చందనభూషణాం
బరదానవిఖ్యాతిఁ బరగువారు

సౌరభ్యతనులు కాశ్మీరకస్తూరికా
ఘనసారధాతలై తనరువారు
తే. సురుచిరాస్యులు ధారుణీసురవరులకుఁ
జెలఁగి తాంబూలదానంబు సేయువారు
సంతతానందవంతులు సజ్జనాళి
వచనరచనల నలరించువార లవని. 259

ఉ. ఆమునఁ బ్రాణిహింసనము
నార్యవినిందయు మాలికాహరి
ద్రాముఖవస్తుచౌర్యముఁ బ
తత్రిపదచ్ఛద సూనశోభితా
రామ విఖండనంబులుఁ ది
రంబుగఁ జేయుటచేఁ గురూపులై
యీమహిఁ గేకరాక్షులును
హేయకరాంఘ్రులు నౌదు రిమ్మలన్. 260

వ. అనిన విని చోరుం డత్యంతసంతుష్టాంతరంగుండై ధర్మ
నిదానశ్రవణకుతూహలంబునఁ గ్రిమ్మఱ నమ్మునుల
కిట్లనియె. 261

తే. అవనిఁ గర్మోద్భవంబులై యతిశయిల్లి
నిరయలోకంబు నాకంబు నెఱయు; వీని
నెట్టిమనుజులు పొందుదు రెఱుఁగఁ దెలుప
వలయు మునివర్యులార! మీ రలఘుగతిని. 262

వ. అనిన వానికి మును లిట్లనిరి. 263

తే. నెలయ నిజధర్మరతులైన విప్రరాజ
వైశ్యశూద్రులు పతిభక్తి వఱలుచున్న
యట్టిపుణ్యాంగనలును నెయ్యంబు మీఱ
స్వర్గమున కేఁగువారు నిస్సంశయంబు. 264

ఆ. శీతభీతు లయిన క్షితిసురవర్యులు
సమరభీతు లయిన జనపతులును
వహ్నిభీత లయిన వనజాతముఖులును
స్వర్గమునకుఁ జనరు శబరవర్య ! 265

తే. కండనియుఁ బేషణియు నంతికయును సలిల
కుంభినియు మార్జనియు నన కొమరుమిగులు
నైదుతెఱఁగుల జీవసంహాతులహాతుల
చేత గృహి నాకలోకంబుఁ జేరఁ డంద్రు. 266

క. విశ్రుతవర్ణియు గృహియు వ
నాశ్రముఁడును భిక్షుకుండు ననవరతంబున్
స్వాశ్రమధర్మస్థితులై
యాశ్రమమున స్వర్గమునకు నరుగుదురు తగన్. 267

వ. తద్ధర్మం బెట్టి దనిన. 268

క. ఇరుపొద్దు పేర్మి భిక్షా
నిరతియుఁ దీర్థాభిగమననిష్ఠయు గురుస

త్పరిచర్యయు స్వాధ్యాయా
దరమును వర్ణికిని స్వర్గధర్మము లరయన్. 269

మ. అజరప్రీతిగ వైశ్వదేవముఖస
ద్వ్యాపార మేపారఁగా
యజనాదుల్ దగ నాచరించుచును స
మ్యక్సత్యసంపన్నుఁడై
వృజినం బెయ్యెడఁ జేరనీయక జగ
ద్విశ్రాంతి నశ్రాంతముఁ
నిజదారాభిరతి న్మెలంగవలయుఁ
నిష్టన్ గృహస్థుం డిలన్. 270

మ. జటియై యింద్రియముల్ గుదించి నియతిం
జాయాసమేతంబుగా
నటవీదేశమునందుఁ గ్రుమ్మరుచు వ
న్యాహారసంతృప్తుఁడై
యట దేవాతిథిపూజ లేమఱక సం
ధ్యాస్నానహోమాదు లూ
రట నేప్రొద్దును జల్పఁగాఁ దగు వన
ప్రస్థుండు ప్రస్థానతన్. 271

శా. శాంతుండై నిరహంకృతిం ద్రిషవణ
స్నానం బొగిం జేసి సు

స్వాంతుండై మఱి వీతరాగమున ని
స్సంగస్థితిక్ మించి ధీ
మంతుండై తగ సర్వజీవులకు సే
మం బాత్మఁ జింతించుచున్
దాంతుండై యతి బ్రహ్మభావమునఁ జెం
దం బాత్రుఁ డౌ నుర్వరన్. 272

ఆ. స్వర్గలోకమునకుఁ జననేరఁ డవకీర్ణి
యైన వర్ణి పతితుఁడైన గృహియు
గ్రామసంస్థుఁ డయిన ఘనవనప్రస్థుండు
నలఘురాగకలితుఁడయిన యతియు. 273

ఆ. ఆత్మధర్మవిముఖుఁ డై పరధర్మంబు
లాచరించు మనుజుఁ డశుభ మొందు
నాత్మభర్తృవిముఖ యై జారుఁ జెందిన
యబ్జవదన యసతి యైనకరణి. 274

తే. విహితసద్ధర్మరహితుఁడై విప్రుఁ డూర్ధ్వ
లోకమున కేఁగలేఁడు విలూనపక్ష
మయిన నీడోద్భవంబు విహాయసమున
కెగయనేరని తెఱఁగున నిద్ధమహిమ. 275

తే. అవనిసురుఁడు షట్కర్మము లాచరించి
యధికతరుఁ డగు నటుసేయ నలసుఁడైనఁ

ద్రివిధకర్మంబు లొగి నాచరింప మేలు
సకలలోకంబులు జయింపఁ జాలు నతఁడు. 276

సీ. స్నానసంధ్యాతపస్స్వాధ్యాయపితృతర్ప
ణాదులు సంప్రీతి నాచరించి
దేవార్చనము వైశ్వదేవము నక్లిష్ట
నియతియు నింద్రియనిగ్రహంబు
యజనయాజనములు నధ్యయనాధ్యాప
నంబులు మఱియు దానప్రతిగ్ర
హము లనుకర్మంబు లహరహంబును జేసి
సద్వృత్తమును నహింసయును దయయు

తే. నాత్మదారాభిరతియు విద్యాపరతయు
నడర నతిథిఁ బూజించుచు నార్యచర్య
నలరు నతఁడు ద్విజశ్రేష్ఠుఁ డనఁగఁ బరగు
నట్లు గాకుండెనే వ్రాత్యుఁ డగు నిజంబు. 277

సీ. ప్రజ నిజాత్మజులుగా భావించి పాలించి
రిపునృపతుల సంహరించి మించి
విప్రదేవక్షేత్రవృత్తులు వెలిచేసి
కరము షష్ఠాంశభాగంబుఁ గొనుచు
దండార్హు లగువారి దండించి సాధుక
దంబకరక్షణదక్షుఁ డగుచుఁ

దస్కరబాధఁ జెందఁగనీయ కనిశంబు
దృఢవిక్రమంబునఁ దేజరిల్లి

ఆ. స్వస్వధర్మవిధుల వర్ణాశ్రమంబులు
నిలుపఁజేసి దాంతనిష్ఠ వ్రాని
వేదశాస్త్రసరణి విడువక వసుమతీ
పాలనం బొనర్పవలయు నృపతి. 278

ఆ. గర్వమై యకార్యకార్యము లెఱుఁగక
కుపథవృత్తిఁ దిరుగుగురువు నైన
ధారుణీశ్వరుండు దండించుటకు నర్హుఁ
డనుచుఁ బల్కుదురు మహాత్ము లవని. 279

ఆ. ఆత్మధర్మవిముఖు లగు చతుర్వర్ణాశ్ర
మస్థు లయినవారి మనుజవిభుఁడు
స్నేహమోహయుక్తి శిక్షింపకున్నఁ ద
ద్దురిత మతనిఁ జెందు ధరణియందు. 280

క. కావున నుత్పథవర్తుల
భూవల్లభుఁ డుచితదండమున శిక్షింపం
గావలయు నాత్మపాలిత
భూవలయమునందు ధర్మము న్నిలుపుటకై. 281

ఆ. దండనార్హజనుల దండించి సజ్జనా
వళులఁ బ్రోచుభూమివరుఁడు జగతి

నారవిందుతారకారూఢ మగుకీర్తి
నలరు సాధుబృంద మహా ననంగ. 282

క. ధర్మము మర్మ మెఱింగిన
నిర్మలవిప్రానుమతి ననిందితమహిమన్
ధర్మంబు నధర్మంబు న
హర్మ్ముఖమునఁ జింతసేయ నగు జనపతికిన్. 283

క. సంతతమృదుగతిచే ధీ
మంతుండై తిగ్మదండమహాసియుండై
దాంతుండై యురుభుజబల
వంతుం డగు నట్టి భూమివరుఁడు సుఖించున్. 284

సీ. ఈలీల సద్వృత్తి నృపుఁ డిలఁ బాలింపఁ
గురియించు వర్షము గులిశపాణి
సస్యసంపత్తి యజస్రంబు నిరవొందు
ధర్మంబు నాల్గుపాదముల నడచు
సద్వృత్తమునఁ దపస్స్వాధ్యాయనిరతులై
సవనంబు లొనరింతు రవనిసురులు
ప్రతినగరగ్రామభవనముల్ వేదశా
స్త్రప్రపూరితములై రహిఁ జెలంగు

తే. వసుధ యన్వర్థనామమై వన్నె కెక్క
యాచనామతి యొక్కనికైన లేక

యఖిలజనములు దాతలై యలరఁగలరు
సత్యలోకంబుడంబున జగము దనరు. 285

క. అదనునఁ బర్జన్యోపమ
వదాన్యతయు మతియు సత్యవాగ్వైభవమున్
మది నీశ్వరభావనయున్
స్వదాసనిరతియును వలయు జనపతి కెపుడున్. 286

వ. వెండియు ధరామండలాఖండలుం డాఖండలవైభవంబున రిపుబలంబుపై నాయోధనంబునకు వెడలునప్పుడు బాణ బాణాసనకృపాణవారశిరస్త్రాణతూణాది పరికరనికరసన్నద్ధుండై సమదసామజఘీంకారసంకులంబును పవనజవన రంగత్తురంగహేషాభీలంబును స్యందనసందోహనేమిఘన స్వనకలితంబును వీరగర్జనగర్జితంబును ధనుర్జ్యాంజినీటం కారయోధవీరహుంకారభేరీభాంకారరవాన్వితంబును రుధిరపానలోలభూతబేతాళపిశాచరవభైరవంబునై చంద్రోదయసమయచండవాతోద్ధూత ఘూర్ణమానార్ణవంబు ౘగేణిసేయుచు శూరజనబృందానందకరంబును భీరు జనహృదయవిదారణకారణంబును నగు ప్రధనరంగంబు నిశ్శంకం గొంకక చొచ్చి వీరనృత్యంబు సల్పుచు మున్నీరుగలంచు కవ్వంపుఁగొండమవ్వంబునఁ జతురంగబలంబులం జక్కాడచి నిజనాయకనికాయలూనానూననానా శూరవీరవారమాంసహస్తమస్తకాద్యవయవశకలంబులు

శోణితనదీప్రవాహంబునం దేలియాడం జేయుచు సురనిక
రం బంబరంబున నచ్చరలుం దారును విమానారూఢులై
నిల్చి తనసత్యసంగరంబు విలోకించి మెచ్చి యచ్చెరువు
నొంద విజయలక్ష్మీకరగ్రహణమహోత్సవంబునం దేజ
రిల్లవలయు మఱి యట్లుగాక వైరుల కగ్గలంబై రణరం
గంబునం బంచత్వంబు నొందెనేని మార్తాండమండలంబు
భేదించికొని చని పరమపదమునం బ్రాపించు నెట్లును
శూరు లయినధారుణీనాథులకు సంగ్రామంబు సేయుటయె
పరమధర్మంబు దానికిఁ బరమం బగు ధర్మంబు లేదు
గావున. 287

తే. ఆత్మధర్మపరుం డగు నట్టివాని
కిహముఁ బరమును సిద్ధించు నిష్ట మొందు
నాత్మధర్మంబె సర్వసుఖాస్పదంబు
కామగవి కల్పకంబు చింతామణియును. 288

ఆ. వైశ్యవృత్తి యగుచు వర్తిలు వాణిజ్య
మతఁడు నైజధర్మరతి మెలంగి
యగ్రజన్మచేత నణుమాత్రలాభంబు
గొనక విక్రయించుకొనుట యురవు. 289

తే. విప్రసేవాదినిజధర్మవృత్తి వలన
నుభయలోకంబులు జయించునూరుభవుఁడు

నృపవణిక్పాదభవులకు నెల్ల విప్ర
పాదసేవయ ధర్మమై పరగుఁ బుడమి. 290

వ. కావున దేవభూదేవసేవాదినిజధర్మంబున వైశ్యుండు లో
కంబుల జయించుట ధ్రువంబు. 291

ఉ. భూసురసేవ శూద్రునకుఁ
బొందుగ నుత్తమధర్మమై తగున్
వాసిగ నంద చెందుఁ ద్రిది
వం బది సేయక దుష్టబుద్ధియై
భూసురుఁ గ్రూరదృష్టిఁ గని
పోలఁగ హుంకరణం బొనర్చి య
ద్దోసము గారణంబుగ న
ధోగతి నొందు నతండు నిచ్చలున్. 292

తే. కపిలపాల్గ్రోలి బ్రాహ్మణకాంతఁ గవిసి
జపము గావించి వేదంబుఁ జదివి విప్రు
పరిహాసం బొనరించియుఁ బాదభవుఁడు
శమనగృహమున కతిథి యై చను నిజంబు. 293

క. కావున స్వధర్మనిరతుం
డై వఱలిన శూద్రుఁ డనఘుఁ డై కను శుభముల్
తా వైదికకర్మస్థుం
డై విప్రుని ధిక్కరించి యమపురముఁ గనున్. 294

క. ధరఁ బంచయజ్ఞహీనులు
ధరణీసురవిత్తహారణదక్షు లుపస్నా
నరహితు లపాత్రదాతలు
వరుస న్నిరయమున కరుగువారు దలంపన్. 295

క. పరకామిన్యనురక్తులు
పరాన్ననిరతులు వికర్మపరులును ధరణీ
సురవరగురునిందకులున్
నిరయమునకు నరుగువారు నిజ మూహింపన్. 296

తే. ఎలమి మ్లేచ్ఛాంగనల రమియించువానిఁ
దత్సహాభాషణక్రీడఁ దగులువాని
నందు సంతానజనకుఁడై యలరువాని
జముఁడు గని సమ్మదమున లాస్యంబు సలుపు. 297

ఆ. యవనవేషభాష లలవరించుట వారి
చేఁ బ్రతిగ్రహంబు సేయుటయును
వలదు ప్రాణవాయువులు కంఠగతములై
నట్టివేళ నయిన నార్యతతికి. 298

తే. మ్లేచ్ఛనిలయనివాసంబు మ్లేచ్ఛసేవ
యలతి యగుకల్మషంబులఫలము గాదు
మ్లేచ్ఛభోజ్యాభినిరతియు మ్లేచ్ఛవేష
ధారణము మ్లేచ్ఛతాదాత్మ్యకారణములు. 299

క. శ్రుతియును స్మృతియుఁ బురాణము
నితిహాసము నప్రమాణ మెవ్వనికి నతం
డతినీచుఁడు తత్సేవా
తతయాజ్ఞాలాపములు పతనకారణముల్. 300

క. వేమరు బలవంతమ్ముగఁ
గామినులం గవయు నట్టిఖలుఁడు నగమ్యా
గామియు దారత్యాగియు
నీముప్పురు సంయమనికి హితమిత్రు లిలన్. 301

సీ. అడిగినవారల కిడక మృష్టాన్నంబు
నిష్టంబుగా భుజియించునతఁడు
విద్వజ్జనులసాధువృత్తుల నదయతఁ
జేరి నిర్బంధంబు సేయునతఁడు
శ్రోత్రియు లయినవిప్రుల కుపద్రవముగ
వృత్తి చ్ఛేదన మొనరించునతఁడు
పరధనక్షేత్రాపహరణాంధబుద్ధియై
పరదారల రమింపఁబరగు నతఁడు

తే. దీనజనములయాశ గుందించునతఁడు
మార్గరోధనకారియై మలయునతఁడు
తెలిసి పతితునియన్నంబు దినునతండు
నిరయమున కేఁగువారలు నిక్కువంబు. 302

క. దూపటిలియున్న మొదవుల
కాపద లొనరించి జలము లానకయుండం
గోపంబున నరికట్టిన
పాపాత్ముఁడు నారకమునఁ బడు నిక్కముగన్. 303

తే. అధికవర్ణాంగనాగామి యగునతండు
హీనజాత్యంగనాగామి యైనవాఁడు
నేకవింశతిసంఖ్యాకహేయనరక
రాశిఁ బడుఁ బునరావృత్తిరహితుఁ డగుచు. 304

క. ఇంతి విటావళిసంతతిఁ
గంతుసుఖక్రీడ సలుపఁ గడుఁ జెడుఁ బుణ్యం
బెంతయుఁ బతిత యగుం దా
నంతట నారకమునందు నధివసియించున్. 305

క. స్వైరిణి యగుటకు నెక్కుడు
నారికిఁ గలుషంబు గలదె నలిఁ గావునఁ దా
నారూఢి శీల మెప్పుడు
నేరుపుచే నలవరించి నెగడఁగవలయున్. 306

ఆ. శీలరక్షణంబు చేసినవనితగు
ణంబు లెట్టివైన డంబుమీఱు
శీలరక్షణంబు సేయనిసతి సద్గు
ణంబులైననిష్ఫలంబు లుర్వి. 307

సీ. పతిభక్తి సతులకుఁ బరమధర్మము దాని
కెక్కుడుధర్మ మెయ్యెడల లేదు
దురితాంబునిధిసముత్తరణంబు నిందిరా
భరణకారణము తత్ప్రాభవంబు
స్వర్లోకనిశ్శ్రేణి శర్మప్రదాయిని
ప్రాణనాథునిసేవ భామినులకు
పతికి సమ్మతమైనపని యెట్టిదైనను
వైఫల్యరహితమై వన్నెకెక్కు
తే. ప్రియునియనుమతిఁ జేయుగౌరీవ్రతాది
నియమములు సఫలంబులై నెగడుఁ బుడమిఁ
గావున స్వధర్మవతులైన కమలవదన
లఖిలలోకంబులు జయింతు రతులగతుల. 308

ఆ. పతిహితంబు వెలిగ సతి యన్యధర్మంబు
కారణముగ మేలు గోరెనేని
కంఠసీమ ఱాయిగట్టి తరంగిణిఁ
దరణ మాచరించుకరణి కాదె. 309

క. తరుణి పతియాజ్ఞ వెలిగా
నురుధర్మ మొనర్చెనేనియు న్విఫల మగుం
గరిభుక్తకపిత్థముగతి
ధర నశ్రోత్రియున కొసఁగుదానముభాతిన్. 310

సీ. మాయాకరండంబు మైథునాహారరత
త్వరము శౌచాచారవిరహితంబు
నస్వతంత్రంబు పరాధీన మపవిత్ర
మాయతచింతాశతాకులంబు
దురితాలయంబు సందుష్టంబు రుష్టంబు
నతిజుగుప్సితము నిందాన్వితంబు
సారహీనంబు తృష్ణాలతాగహనంబు
చంచలాసన్నిభ చంచలంబు
తే. నగు స్వభావంబు లలనల కలరు నైన
భర్తృపదభక్తి నవ్యయభవ్యసుఖముఁ
గాంతు రది యుజ్జగించి వికర్మకరణ
భరణ లై రేని సిద్ధించు నిరయవసతి. 311

క. జననీజనకులు బాల్యం
బున, నాథుఁడు జవ్వనమునఁ, బుత్త్రులు జర నే
పునఁ దనుఁ బ్రోవఁగ మనఁజనుఁ
దనయిచ్చ న్మెలఁగఁ జనదు తరుణీమణికిన్. 312

చ. యతియును బ్రహ్మచారి విధ
వాంగనయున్ ధృతిఁ గాయశోషణ
వ్రతమును బ్రహ్మచర్య ముప
వాసము నింద్రియనిగ్రహంబు ప

స్మతి నొనరింపఁగావలయు
మత్సరముం ద్యజియించి మించి సం
తతము నభక్ష్యభక్ష్యవిహి
తంబు లెఱింగి భుజింపఁగాఁ దగున్. 313

తే. కాయసంశోషణవ్రతగతులు సలుప
వలయు హోమాదివిధి విధవలకు వలదు
నాథునకుఁ దృప్తి యొదవ దానము లొసంగ
వలయుఁ గనకాంబరాన్నాదివస్తుసమితి. 314

సీ. యాచకుం డగుచుఁ దృష్ణాతురవృత్తిచే
విత్తసంగ్రహముఁ గావించెనేని
వైరాగ్యమున మున్ను వదలినగృహకర్మ
ములు పలుమఱు మదిఁ దలఁచెనేని
మంత్రోపదేశదంభమున లోభాత్ముఁడై
శిష్యసంగ్రహణంబు చేసెనేని
వనితలతోడ మంతనమునఁ గదిసి భా
షించి హసించి క్రీడించెనేని

తే. సంగలంపటలీలఁ బొసంగెనేని
భోగసంగ్రహ మొనరింపఁబూనెనేని
యగ్రశాఖాధిరోహణం బాచరించి
యతి యధోముఖుఁడై నిరయమునఁ గూలు. 315

క. యతి యతివలఁ దలఁచుట రా
గత నితవుగఁ గనుట నర్మగర్భోక్తు లసం
*గతగతిఁ బలుకుట నతిదు
ర్మతి రతిఁ గాంక్షించుటయును మానఁగవలయున్. 316

చ. అన విని చోరవీరుఁ డపు
డామునిముఖ్యులఁ జూచి పల్కె ని
ట్లనుపమధర్మవంతు లగు
నార్యజనుల్ గమనింప నర్హమై
యెనసిన స్వర్గమార్గ మది
యెట్టిది యందులసౌఖ్య మెద్ది నే
వినియెదఁ దెల్పఁగాఁ దగు స
విస్తరతన్ గృప యుల్లసిల్లఁగన్. 317

వ. అనిన విని వానికి మానిపుంగవు లిట్లనిరి. 318

క. స్వర్గమున కరుగుమార్గ మ
నర్గళ మగు సుకృతవంతు లగువారలకున్
దుర్గమ మగు సుజనేతర
వర్గమునకు నెపుడు నది యవారణమహిమన్. 319

తే. మృదులహైరణ్యవాలుకామేదురంబు
కాంచనోదరవేదికాభ్యంచితంబు

* గతిరతి—వ్రా. ప్ర.

కుముదమితో ప్రలాబద్ధకుట్టిమంబు
దృష్టిరమ్యంబు సౌమ్యంబు త్రిదివపథము. 320

తే. కమ్రతరఫలభరనమ్రకంటకఫల
దధిఫలశ్రీఫలాదికతరుచయంబు
కాయమానసమానమై కాయగముల
నలరుగుత్తులఁ దలిరుల నలరు నచట. 321

తే. నిఖిలతరుమూలములు భర్మనిర్మితంబు
లయిన మెఱుఁగుటరంగుల నతిశయిల్లు
నందుఁ బొందుగ నిల్చి కరాంబుజముల
నందికొనఁ దగి తత్ఫలబృంద మమరు. 322

తే. నూనృతవ్రతచరితులు సుమతు లోరుల
క్షుత్పిపాసార్తి హరియించు శుద్ధమతులు
విప్రనిర్బంధములు మాన్పు విశదయశులు
నరుగఁ గలవార లప్పుణ్యసరణియందు. 323

మ. సురలోకాధ్వగులైన ధర్మపరు ల
స్తోకానుభూతి న్మనో
హరపుష్పాపచయక్రియాదిలలిత
వ్యాపార మేపారఁగాఁ
దరుమూలాంచితహైమవేదికల మీఁ
దం బ్రీతి నాసీనులై

గరిమం దత్ఫలముల్ భుజింపుదురు మా
ర్గశ్రాంతి యల్లార్చుచున్. 324

క. స్థిరతరసౌరభలహరీ
భరితము లగువిరులు మధురఫలములు మును భూ
సురవరులకుఁ బస నొసఁగిన
సరసతచే వారి కిట్టిసౌఖ్యము గల్గున్. 325

క. మెండుగ నభినవనవమణి
మండితతోరణవిరాజమానములై యం
దుండుం జలిపందిరు లా
ఖండలకోదండదండఖండములగతిన్. 326

వ. ఆచలిపందిరులయందు. 327

క. ఏలాలామజ్జకత
క్కోలకచాంపేయముఖ్యకుసుమామోద
శ్రీలం దేలుం జల మను
కూలతచే శాతకుంభకుంభశతములన్. 328

తే. సారకాపిత్థఫలనవసౌరభంబు
లూర నాగరలవణజంబీరనీర
పూరితం బయి యించుక పులుసు గలిగి
శక్రదుర్లభ మయినట్టి తక్రి మమరు. 329

చ. ఎలసినజున్నుఁ గ్రొంబెరుఁగు
నేలకెయున్ మిరెయంబు డంబుగా

నలముఁగ శర్కరారచిత
మై విలసిల్లి రసాలసాలస
త్ఫలరసమేళనంబున సు
ధారసధారల గేరు పానకం
బలరుఁ గటాహమధ్యముల
నవ్యయభవ్యసుఖైకహేతువై. 330

తే. అంతఁ బానీయశాలలయంతికములఁ
జేరువారల రావించి గారవించి
శ్రమముఁ దీర్తురు తాళవృంతముల విసరి
కోరి తత్రత్యులైనట్టి ధీరమతులు. 331

చ. అలరుచు స్వాగతం బరసి
యర్చ యొనర్చిసుపక్వగోస్తనీ
ఫలరసమిశ్రితం బయిన
పానక మానఁగఁజేసి జాళువా
వలువలు గట్టనిచ్చి చెలు
వంబుగ మేనుల నక్షకర్దమం
బలఁది ప్రియం బొనర్తు రన
యంబును బాంధుల కమ్మహామహుల్.332

చ. పరుపడి నధ్వనీనుల పి
పాసలు దీఱ వనాధ్వసీమలన్

మరుధర వేసవిం బ్రిప ల
మర్చియు సువ్యజనాతపత్రసుం
దరసుమచందనాంశుకవి
తానమృదుత్వగుపానదోఘముల్
తిరముగ దాన మిచ్చియు సు
ధీతతి గాంచు నుదారసౌఖ్యముల్. 333

వ. ఇత్తెఱంగున సుకృతవంతు లయినపాంథులు పానీయశాలల
నందంద విశ్రమించుచుఁ జనంజన నమ్ముందర. 334

సీ. ఫలవన్నతాంశుమత్ఫలఫలపూరజం
భలఫలలాంగలీపాదపములు
మధురమధుద్రుమమహిలాద్రుమాభ్యాస
మధురసామాధవీమంటపములు
బాలానిలాలోలదేలాలతాజాల
నాగవల్లీవృతపూగకములు
మరువకకురువకమల్లీమతల్లికా
రామణీయకసుమారామకములు

తే. చంచరీకప్రివరపరచక్రచక్రి
సారసారసహంససంసద్విహార
హారికైరవనపసారసాకరములు
రంగు మీఱంగ నచటఁ బొసంగు మిగుల. 335

వ. మఱియును. 336

తే. రుచిరమణిబద్ధసోపానరుక్మవాలు
కైక్షవక్షీరనారికేళాంబుమధుర
నీరపూరప్రసారకాసారవార
వాపికాకూపసంతతి వఱలు నందు. 337

ఆ. రంగదనిలచలతరంగసువంగత
పంచవర్ణజలజభాసురములు
వెలయు ద్విరదరదనవిశదసరసబిస
షండమండితములు సరసు లచట. 338

సీ. సురుచిరకాంతిభాసురు లైన తెరువరు
లాసారసాకరహారివారి
యందుఁ గృతస్నాను లై తమతాపంబు
దీఱఁ దత్తీరకర్పూరపులిన
తలముల నిలుచుచుఁ దతమణిభూషణ
జాంబూనదాంబరసమితిఁ దాల్చి
ఘనసారచందనగంధధురంధర
ఫలసముత్కరము లిం పలర మెసవి

ఆ. మేర మీఱి మధుసుధారసాసారకా
సారనీరధార సారెసారెఁ
గ్రోలి మెలఁగుదురు నికుంజపుంజంబుల
మందమందగతుల నందముగను. 339

చ. ఫలితతరు ల్ద్విజాతులకు
భక్తినొసంగుటయుం గతోదక
స్థలములఁ బ్రాణిలోకము హి
తంబునకై సరసీతటాకముల్
నిలుపుటయు న్మహాత్ములకు
నెంజిలి దీర్చుటయుం దలంప నీ
యలఘుసుకర్మపంక్తులు త
దవ్యయమార్గసుఖైకహేతువుల్. 340

వ. అచ్చటఁ దరలిపోవం బోవ. 341

క. కొందఱు సుందరు లపుడా
ముందర మాకందపనసమోచాఫలముల్
పొందుగఁ గానుక లిడుదు ర
మందానందమునఁ జతురిమం బథికులకున్. 342

ఉ. ఆలలనామణుల్ మణిగ
ణాభరణాంబరభక్ష్యభోజ్యతాం
బూలసుగంధమాల్యములు
పొందుగ నిచ్చి యుదారవైఖరిన్
దాలలయాన్వితంబుగ ము
దంబుగఁ బాడుచు లాస్యగీతికా
శ్రీల సుఖింపఁజేయుదురు
చేకొని నిర్మలధర్మకర్ములన్. 343

క. వారలు మును పథికుల కుప
కారం బొనరించుసుకృతకారణమున న
న్నారులు గావించినయుప
చారములను బొందుదురు విచారరహితులై. 344

ఆ. అందు నివ్విధమున నాతిథ్య మొనరించి
మగువ లనుప ననుపమానసార
భాభిరామకుసుమితారామసీమల
సరణి నల్లనల్లఁ జనఁగఁజనఁగ. 345

సీ. వంజులవంజులకుంజమంజులములు
సురసాలసురసాలసురుచిరములు
పాటలాపాటలపటలమనోజ్ఞముల్
కేసరకేసరభాసురములు
తరుణకదంబకదంబసుందరములు
ఘనపూగపూగపూగప్రియములు
శ్రీఫలశ్రీఫలశ్రీఫలీహృద్యముల్
చాంపేయచాంపేయసలలితములు

తే. సారసారంగసారంగజాలబాల
శారికాకీరికాపికదారికాము
యూరికామధుమధురపత్కారనినద
పూరితంబులు నగువనంబులు నెలుంగు. 346

సీ. తగ మగరాల వింతగ నొనరించిన
వాట మైనట్టికవాటములును
క్రొత్తచాయలఁదళుకొత్తుముత్తియముల
తానకం బైనవితానములును
నెలఱాల నలరి వెన్నెలఁ గరంగుచు సుగ
తాయనం బయిన వాతాయనములు
రంగుబంగారుమెఱుంగులగోడలఁ
జిత్రమై మొనసిన చిత్రములును
తే. బరగి దర్పణమణిగణాభరణభరణ
పేటికావీటికాహేమశాటికాది
నిస్తులాస్తోకశస్తసమస్తవస్తు
కలితలలితనివేశముల్ గలుగు నందు. 347
ఆ. యవనికావితర్దికాదులరచనల
నలరుచున్న తద్గృహాంతరముల
భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యముల్
షడ్రసోపయుక్తసరణి నమరు. 348
వ. తత్పురోభాగంబున. 349
చ. ఖచరవిహారయోగ్యవిధు
కాంతలసచ్ఛయనీయహృద్యముల్
రుచిరచిరత్నరత్నమయ
రుక్మవిమానము లుండు మెండుగా

సచట మరుచ్చలద్ధ్వజప
టాంచలహస్తము లెత్తి కింకిణీ
నిచయరవంబులన్ సుకృత
నిష్ఠ యొనర్చినవారిఁ జీఱుచున్. 350

క. మతములు మణిగణసంశో
భితములు తరుణారుణార్కబింబవిభారా
జితములు ఘంటాశతనా
దితములు తదగ్రిమము లఖిలదిక్పతినుతముల్. 351

సీ. కర మొప్పు మృదుపదకరము లందమ్ముచేఁ
దమ్ములు మాకుఁ గెందమ్మ లనఁగఁ
బగ లంధకము లని పగటుకనుంగవల్
గలువలమీఁదఁ గాఁకలు నెలార్ప
నరు లెఱుంగక తెలిసరు లానుకుచములు
గిరుల రాకొట్టుచు గిరులుకొనఁగఁ
దులలేనిదేహకాంతులచిరప్రభలచేఁ
దటిదురుచ్ఛాయ లెంతటి వనంగ

తే. తెరలతేనియ లొదవువాతెరలరంగు
బింబఫలములు మాప్రతిబింబము లన
వఱలు నచ్చటఁ బచ్చయొవరులఁ దరుల
దరుల సిరుల మెలంగుసుందరులఁపిండు. 352

తే. సారకాశ్మీరఘనఘనసారగంధ
సారము లలంది నిలుతు రద్దారిఁ జేరి
హారకేయూరమంజీరతారహార
వారముఖ్యపరిష్కారవత్తులు సతులు. 353

ఉ. శంబరశాబనేత్ర లని
శంబు ముదంబున వీణ లెత్తి తో
రంబుగ మేళవించి సుక
రంబుగఁ దంత్రులు మీఁటి తద్విమా
నంబుల నిల్చి పాడఁగ ఘ
నంబులు చిన్కఁ గరంగి రత్నరా
జంబులు నీరగు న్మఱి క
జంబులు పూవులు పూచు నింపుగన్. 354

మ. ఫలభారానతచూతపోతలలిత
ప్రత్యగ్రశాఖాశిఖా
వలిపైఁ గోకిలకేకిలోకములు శే
వ న్నిల్చి మాధుర్యధు
ర్యలసత్పంచమషడ్జనిస్స్వనము లో
య్యం బ్రేమ నందియ్య వీ
ణలు వాయింతురు మీనలోచనలు గా
నప్రౌఢిఁ దచ్ఛాయలన్. 355

చ. కొలఁకులు దాఁటి కప్పురపుఁ
గుప్పలు మెట్టి యలంత నల్లసం
బొలసి వనావనిం గలుగు
పూవులతావులు సంగ్రహించి యా
చెలువలగుబ్బగుబ్బలులఁ
జేరి కవుంగిటఁ దార్చు నిచ్చలుక్
మలయసమీరవారములు
మక్కువఁ జేయు విటాళికై వడిన్. 356

క. గణనాతీతం బయి మణి
గణఖచితవిమానవితతి ఘనతరగతి రో
హణగిరి నగం దదారో
హణమున సురలోకమునకు నరుగుదు రనఘుల్. 357

ఆ. కలహశూరులును సుకర్మశూరులు దాన
శూరులును ధరిత్రి వీరు ముగురు
వాటమయిన తత్కవాటపాటనమునఁ
బాటవంబు గలుగుమేటిదొరలు. 358

వ. ఇట్లు సుకృతవంతు లనూనవిమానారోహణంబున నాక లోకంబున కరుగు తెఱంగు దెల్పిన నాకర్ణించి నితాంత సంతోషితస్వాంతంబునఁ జోరవీరుండు మునివర్యుల కి ట్లనియె. 359

ఆ. ధర్మకర్మనిర్మితము స్వర్గమార్గము
వినఁగ నతులసౌఖ్య మొనరె నింకఁ
దెలుపవలయు మీర లలఘుదయామతి
నరకలోకమునకు నరుగుతెఱఁగు. 360

తే. ధర్మరాజానుచరులు దుష్కర్మపరుల
నెవ్విధంబునఁ గొని చని యెట్టిబాధ
నలుపుదురొ దానిఁ దెలియ నిస్సంశయముగ
వినఁగ వేడుక య య్యె నోయనఘులార. 361

వ. అని యడిగె నని చెప్పిన విని నైమిశారణ్యపుణ్యమహా
ర్షులు తదనంతరకథావృత్తాంతంబు దెలుపు మని యడు
గుటయును. 362

శా. అద్రీంద్రాత్మతనూభవాకుచతటీ
వ్యాలిప్తకాశ్మీరస
న్మద్రాముద్రితకాయ కాయజధను
ర్ముక్తప్రసూనాంబకో
న్నిద్రప్రాభవభీతదారువనమా
నిస్తోమరామామనో
హృద్రమ్యాకృతియోగ యోగకలనా
హేవాక లోకప్రియా. 363

క. ఉరగేశ్వరశింజితసుర
గిరిచాపవిముక్త మంథగిరిధరశరవి
స్ఫురణాహతపురదానవ
వరవైభవ భవ నిలింపవందిత యభవా. 364

మాలిని. భూరికారుణ్యసంపూర్ణపూర్ణేక్షణా
పారికాంక్షీశహృత్పంకజేందిందిరా
దారితాఘౌఘపాతాళగంగానదీ
వారికేళీకళావైభవాభ్యున్నతా. 365

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీదులపల్లిశంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## ద్వితీయాశ్వాసము



శ్రీతోషితచంద్రమతీ
ఖ్యాతిసతీదత్తమల్లికాదామాఖ్యా
ఖ్యాతశుభనామ మునిజన
చేతోజలజాతభృంగ శ్రీగిరిలింగా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు వసిష్ఠాదిమునీశ్వరు లమ్మునిముచ్చున కిట్లనిరి. 2

క. యమకింకరవిరచితసం
యమనీమార్గస్థయాతనావళి ఖలబృం
దములకు ననుభవ మగుచం
దములు సవిస్తరతఁ జెప్పెదము విను మనఘా. 3

క. ఖదిరాంగారమయంబై
యొదవిన సప్తతిసహస్రయోజనదూరా
స్పదమై యమ్మార్గంబున
నది దనరుఁ వైతరణి యనన్ భయదంబై. 4

వ. ఆ వైతరణీతరణం బుదగ్దిశాగమనులకుం దక్క౯ం దక్కి౯న పుండెరువున నరుగువారల కెల్ల నావశ్యకంబు. 5

తే. బ్రహ్మనిష్ఠులు హరిహరారాధకులును
రాగవైరవిరహితులు యోగరతులు
జాపకులు యతులును వీతపాపు లగుచు
నుత్తరాయణమున మృతినొందువారు. 6

తే. ఉత్తరాయణమృతి యగు నుత్తములకు
నమరు ఖలులకు దక్షిణాయననిధనము
నిదియె గుఱు తగు సుకృతదుష్కృతచరితుల
*తతి నుదగ్దక్షిణాధ్వసంగతులఁ జేయ. 7

తే. అన్నవస్త్రనివాసార్థ మన్యమార్గ
నిరతు లగువారి కడ్డమై నిలుచుఁగాని
యమ్మహాంగారతటిని ప్రయాణవేళ
సాధుజనులకు దృష్టిగోచరము గాదు. 8

క. గొనకొని చని యాధునిఁ గనుఁ
గొనినంతనె బెదరు గదురు గుండె లదరు నే

* రతి నుదగ్దక్షిణాధ్వసంగతులఁ జేయు—వ్రా. ప్ర.

మనఁదగుఁ దత్తరణముతటి
మనముల నగు వెతలకతలు మనుజావళికిన్. 9

చ. అచట వినీలశైలవికృ
తాకృతులై భ్రుకుటీభయానక
ప్రచలితఫాలభాగు లయి
భాసురవహ్నికణారుణాక్షులై
రుచిరతటిద్రదస్ఞు లయి
రూఢనిశాతకృపాణహస్తులై
ప్రచురకృతాంతకింకరులు
ప్రోథి వసింతురు సాధ్వసావహుల్. 10

ఉ. ఆయెడ కేఁగుదెంచు దురి
తాత్ములఁ దాళసమానమానకృ
ష్ణాయసముద్గరప్రహతి
నంగము లెల్లను జర్ఝరంబులై
పాయఁగఁ జేసియుం గళలఁ
బల్మఱు మోఁదియు దాఁటఁజేయు స
వ్యాయుసఖస్రవంతి సమ
వర్తిభటావళి భీషణక్రియన్. 11

తే. ధర్మరాజానుజీవులు ధర్మపరులఁ
గాంచి హర్షించి సురుచిరాకారు లగుచు

నెలమి శుచివచనంబులు వలికి కరుణఁ
జూచి దాఁటింపుదురు దాని సుఖతరముగ. 12

సీ. ధేనుసాలగ్రామతిలశైలకన్యకా
కలధౌతదాతలై యలరువారు
నధ్వన్యజనతాసుఖావహాశ్వత్థాది
వృక్షషండముల నిర్మించువారు
వృత్తిక్షమక్షేత్రవివిధోపదావిధి
విప్రప్రతిష్ఠ గావించువారు
దేవభూదేవతాదీనగోకులసాధు
నిర్బంధహరణులై నెగడువారు

తే. స్థవిరయతికృతసేవచేఁ దనరువారు
నతిథిసంతర్పణ మొనర్చునట్టివారు
హరిహరధ్యానపూజలఁ బరగువారు
దాఁటుదురు సుఖలీల వైతరణి ధరణి. 13

ఆ. నిత్యకర్మరతులు నిర్మత్సరులు దయా
పరు లుదారసత్యభాషణులును
గురుబహుశ్రుతులును బరతాపహరు ల
త్తటిని నశ్రమమున దాఁటువారు. 14

వ. ఏతద్విరుద్ధు లయినదురితాత్ములు ఖాదిరానలసంతప్తగా
త్రులై నడువంజాలక దండధరకింకరసముద్దండగదాతాడ

నంబుల నొచ్చి శోకించుచు నొక్కతెఱంగున నయ్యంగా
రవాహిని నుత్తరింపఁ దత్తటంబున. 15

మత్త. ఆజనంబుల వెంటఁ గావలి యై గమింపుదు రంతఁ బం
కేజమిత్రసుతానుజీవు లకృత్రిమప్రతిమాన్వితుల్
యోజనద్వయదైర్ఘ్యకాయు లయోమయోగ్రగదాయుధుల్
రాజితాయతదంష్ట్రికాతికరాళితానను లుద్ధతుల్. 16

తే. ప్రకటితాతపతాపితసికతిలంబు
కీలికీలాకలాపసంకేలితంబు
శాతకంటకసంరుద్ధచత్వరంబు
నైన కాపథ మొక్కటి యమరు నెదుట. 17

వ. అందు. 18

క. కాయలుఁ బండ్లును రిక్తము
లై యలరులు లేక దారుణాహివృతములై
ఛాయావివర్జితము లై
యాయెడ నొకకొన్నితరువు లమరుఁ దిరంబై. 19

తే. పాతకిజనమ్ము లచట గవ్యూతిదైర్ఘ్య
యాతనాదేహములు దాల్చి యరుగు నపుడు
నావనీతకృతంబు లనంగఁ దనరి
యవియుఁ గోష్ఠాసహంబులై యమరు మఱియు. 20

క. కుసుమసుకుమారగతి జతు
రసకిసలయరాగభాసురతచేఁ దగి రా

జసుఖోచితంబులై సా
ధ్వసకలితము లగుచు వెలయుఁ దత్కాయంబుల్. 21

తే. అనలసంతప్తసూచ్యంకురావృతాధ్వ
సీమ నడువంగ లేక మూర్ఛిలఁగ వారి
నంత నంతకకింకరు లంతసంత
నదరి కనుఁగొని క్రోధతామ్రాక్షు లగుచు. 22

క. ఒకనికిఁ బదువురు వేవురు
ప్రకటితగతిఁ జుట్టుకొని పరశ్వథకౌక్షే
యకకుంతభిండివాలాం
బకములచే నొంపుదురు కృపావిరహితులై. 23

పృథ్వి. ప్రతోదముల గ్రుచ్చియుం బ్రదరరాజిచే *నొంచి యు
ద్ధతిన్ మెడల రజ్జువుల్ దవులఁ దార్చి క్రొన్నెత్తురుల్
క్షితిం దొరుఁగ నీడ్చ దుష్కృతు లొగిం గృతాంతాప్తులన్
స్తుతింపుదురు భీరులై సొలయుచు న్నితాంతవ్యథన్. 24

వ. అచ్చోటం దరలి పోవంబోవ నమ్ముందర. 25

ఉత్సా. ఋక్షకీశపుండరీకవృకలులాయఖడ్గహ
ర్యక్షముఖ్యఘోరసత్త్వరాజి శమనకింకరా
ధ్యక్షశాసనమునఁ జేరి యాస్యగుహలు దెఱచి యు
ద్వీక్షణముల నిప్పు లురుల నెగసి కఱచు వారలన్. 26

క. ముఖగహ్వరముల మారుత
సఖశిఖలు వినిర్గమింప సక్రోధగతిన్

---

* నొచ్చి—వ్రా. ప్ర.

నఖదంష్ట్రాయుధములచే
నఖిలావయవములఁ జీరు నార్తిఁ గొలలఁగన్. 27

లయగ్రాహి.
క్రూరవిహగంబు లతిఘోరగతితో శ్రవణ
దారణగతిన్ మొరయఁ గారుకొని రక్తాం
గారఫలభాసనతసీరసతరుల్ వెలయ
దారిఁ బలుమూలు శ్రమవారి గురియన్ వే
సారి యమకింకరులు గేరుచు నిశాతశర
ధారలఁ గుఠారములఁ జీరుదురు క్రోధన్
దారుణభుజంగము లపారముగఁ జుట్టుకొనఁ
బాలుదురు కంజములఁ దూలి తమ ...

ఆ. శ్యామశబలనామసారమేయంబులు
దారి నిరుగెలఁకులఁ దారితారి
దశనకాంతు లమర దశయోజనాయామ
కాయములు మలంచి కాయు నచట. 29

క. అక్కాలేయకయుగ్మము
చక్కలములు నమలునట్టి చందమునను జే
రుక్కున నక్కఱిసూత్మ్ములఁ
గ్రక్కున నమలుచును వెడలఁ గ్రాయున్ మరలన్. 30

క. సొమ్మసిలి రక్తపూరము
గ్రమ్మఁగ లేవంగ లేని గడుసరులం గ్రొ

ధ్రమ్ములు సింహమృగములు
నెమ్మక లదరంటఁ గఱచి యెఱచి భుజించు౯. 31

తే. వజ్రముఖము లయోముఖవదనములును
యోజనాయామకాయంబు లొనరఁ దాల్చి
యైంద్రవారుణవాయవ్యయామ్యకాక
నికరములు వారిఁ జేరి కనికర మెడలి. 32

క. కఱచి పలలంబు మెసవఁగ
వెఱగొఱలఁ దదీయతీవ్రవేదనచే బి
ట్టఱచి సమీరజవంబునఁ
బఱతురు వా రపుడు లేచి పడుచుం బడుచున్. 33

సీ. తతపూతిగంధవాసితదూరసరణులై
విణ్మూత్రకుండముల్ వెలయునెడల
గుంజాసముత్కరగురుకాంతిఁ బ్రబలిన
యంగారరాసులు పొంగునెడల
క్షారనీరతటాకసంపూరితములైన
*యూషరక్షేత్రంబు లొనరునెడల
జ్వలనసంతాపితోపలశకలంబులు
మిట్టఁబల్లంబులై మెఱయునెడల

తే. నడచి యమభటకృతబాధ నలఁగి యలఁగి
ఘనబుభుక్షాపిపాసార్తిఁ గలఁగి మెలఁగి

---

* యూషభూములఁ జేరి యొనరునెడల — వ్రా. ప్ర.

దోఁతవాతపరిపీడచేఁ దూలఁగి మలఁగి
యరుగుదురు దుఃఖభాజను లగుచు ఖలులు. 34

సీ. దగఁ దీర్చు మీకు శీతలజలం బిది యని
తప్తసీసరసంబు ద్రావ నొసఁగి
యాతపోష్ణిమ కిది యక్షకర్దమ మని
క్షారకర్దమ మంగకముల నలఁది
తషులంబు నములఁ డందముగ మీ రని నోర
ననలకణంబు లింపలరఁ జొనిపి
ఘనసారరజము వాసనఁ జూడుఁ డని పూతి
గంధవస్తువు నాసికలఁ గవించి

తే. బాధ యొనరింపుదురు మహోర్భటులు భటులు
నిరతపరధనపరదారహరణలోలు
రై మదోద్ధతి దురితాత్ము లయిన వారి
వారియాతన లెన్న నెవ్వారితరము. 35

ఉ. దుష్పథవర్తులిక్కరణి
దూతలబాధ నలంగి కన్నులం
బాష్పజలంబు చిప్పిల న
పారముగా క్షతజమ్ము గ్రమ్మటం
బుష్పితకింశుకస్ఫురణఁ
బోలినగాత్రము లొప్ప నార్తిచే

గోష్పదదేశ మామ డయి
కొంకుచుఁ బోవుదు రల్లనల్లనన్. 36

సీ. ధర్మశాస్త్రార్థ మంతర్వాణి దెల్ప న
హంకృతిచే విన నైతి ననియు
యౌవనద్రవ్యకులాభిమానంబుల
నలరి ధర్మవిరోధి నైతి ననియు
సతతంబు దుర్జనసంగతిఁ గదిరిన
యఘకర్మములు మాన నైతి ననియు
స్పర్ధచే నైన వంచన నైన మాయచే
నైనఁ బుణ్యము సేయ నైతి ననియు
తే. యమభటార్భటిఁ గుందఁ బా లయితి ననియుఁ
గర్మ మనుభవమునఁ గాని కడన దనియు
భావసీమల నెలయు ప్రాగ్భవకృతాఘ
మకృతసుకృతజనం బెంచు నరుగునపుడు. 37

వ. మఱియును. 38

క. మతిహీనత నన్యాయా
ర్జితధనమున ధర్మ మాచరించితి నది దు
ర్గతిఁ జేర్చెను దప్తాయ
స్థితనీరకణంబుకరణిఁ జెడి విఫలంబై. 39

తే. అన్యవిత్తంబుచే ధర్మ మాచరించు
వాఁడు బడలికఁ బడియెడువాఁడు గాని
మిాఱి తత్ఫలభోక్త గా నేరఁ డవని
నర్థ మెవ్వని దతనిద యగు ఫలంబు. 40

ఉత్సా. ఒనరఁ జౌర్యభావమునఁ బరోపతాపవృత్తిచే
ధనముఁ గూర్చి సేయుధర్మతతి నిరర్థకం బగుఁ
విసయశూన్యు లయిన ఖలుల విత్త మెలమిఁ దెచ్చి పా
వనుల కొసఁగవలయుఁ బుణ్యవాంఛ గలుగుమానవుల్. 41

క. భావింపఁగ మానవులకు
యౌవనముఁ ధనము ప్రభుత యవివేకితయుఁ
దావలములు నిరయమునకు
నావేళల సుగుణవంతు లై యుండఁ దగుఁ. 42

ఆ. కలుషసముదయంబు సలిపినారము మును
నెఱి జగత్త్రయము తృణీకరించి
తత్ఫలానుభవతఁ దగఁ బరిశుద్ధుల
మగుదు మని వివేకు లగుచు నరిగి. 43

మ. నడువంజాలక మూర్ఛఁ జెందుటయు నం
తం గింకరుల్ పగ్గముల్
మెడలం గట్టిగఁ గట్టి యీడిచియు నె
మ్మేనుల్ వడిఁ రక్తముల్

పడియుం గత్తుల నొత్తి యంపముల నొ
వ్వం జీరియుఁ మీఁటి సం
దడిగా నార్చియు క్షారనీరములు మీఁ
దం జల్లియు నొంపఁగన్. 44

శా. వారల్ జర్జరితాంగులై పొరలి దు
ర్వారవ్యథన్ ధన్యులా
రా ! రక్షింపుఁడు మీరె దిక్కని తముం
బ్రార్థించి మ్రొక్కంగ ని
ష్కారుణ్యాత్మకులై యరుంతుదకశా
ఘాతంబుల నొంచి య
న్నీరేజాప్తసుతాప్తు లాకృపణుల
న్నిందించుచుం గ్రూరతన్. 45

వ. ఇట్లని పలుకుదురు. 46

క. తరువులు విరులుం దలిరులు
దిర మొప్ప నదీనదములతియ్యనిజలముల్
కరచరణంబులు గలుగఁగ
హరి నారాధింపఁ దగదె యనిశము మీరల్. 47

ఆ. అన్యకర్మవిముఖతాత్మకులోచితా
చారములఁ బరోపకారములను
దానధర్మవిధులఁ దగఁ బూజితుం డగుఁ
గ్లేశనాశకుండు కేశవుండు. 48

తే. ఏయుపాయంబుచే నైన నెట్టిదేహి
కయిన సమ్మద మొదవించునట్టికతన
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గధరుఁడు
ప్రీతిఁ జెన్నొందు నది సేయ రైతి రెండు. 49

సీ. అంఘ్రియుగ్మము గల్గ నతిభక్తి నేప్రొద్దు
హరిహరాలయముల కరుగఁ జనదె
కర్ణముల్ గలుగ నాకర్ణింపఁ బొసఁగదే
ప్రౌఢిచే వివిధపురాణకథలు
హరినామకీర్తనం బాచరింపఁగ రాదె
సరస మై యొనరు రసజ్ఞ దనర
స్వాయత్త మై తగి కాయంబు చెలువొంద
గంగాదినదుల మునుంగఁ దగదె

తే. యతిబుధోత్తమగురుపతివ్రతలఁ గాంచ
రాదె దీప్తవిశాలనేత్రములు గలుగ
సతతదానాదికక్రియల్ సలుపఁ దగదె
హస్తయుగళము గల్గఁ బ్రశస్తసరణి. 50

క. హరినామస్మరణంబున
నరులకు నిర్బంధమును వినాశము శ్రమముఁ
ధర నర్థహానియును లే
దరయఁగ నది సల్పరైతి రనయము నకటా. 51

సీ. విద్వత్ప్రసంగంబు విలసిల్లునెడఁ బరా
ఙ్ముఖతచే వర్తించి ముఖరు లగుచు
గాయకవిటనటగణికావశంవద
వృత్తిచేఁ బ్రబలి దుర్వృత్తు లగుచు
బాలిశులై ప్రజఁ బాలింప నొల్లక
కారించి కల్మషకారు లగుచు
దీనులై పరగు శ్రోత్రియభూసురులకు జీ
వికలొసఁగూర్పక వికలు లగుచు

తే. నలరి హింసార్జితద్రవ్య మనుభవించి
సకలసంపద్వితాన మచ్చటనె డించి
కర్మవశమున నిప్పు డేకాకు లగుచుఁ
బడితి రీగతి క్షత్రియభాసులార! 52

ఆ. ధీనిధానదీనమానవు లడిగిన
రాజ్యగర్వమునఁ బరాకుఁజేసి
కేరి కామినులకుఁ గ్రీడామృగంబుల
రీతి నుందు రెపుడు నృపతులార! 53

సీ. దీనమానవుల కార్తి జనింపఁగాఁ జేసి
తొడరి మత్తిల్లె నీదోర్బలంబు
శిష్టజనంబు నాక్షేపించెఁ బలుమఱుఁ
గదియుచు నీయాస్యగహ్వరంబు

క్రౌర్యంబున నకార్యగమనోత్సుకం బయి
పరగు నెల్లపుడు నీపదయుగంబు
నొరులకుఁ బరితాప మొనరించి పొదలె న
ఖర్వగర్వమున నీగాత్రయష్టి

తే. రమ్యకరుణాసముద్రు శ్రీరామభద్రుఁ
దలఁప దొకయప్పుడైనఁ నీతలఁపుమెలఁపు
వలచి మునుసేయు పాతకావళిఫలంబు
లనుభవింపుము తప్పింపనగునె కుజన. 54

సీ. శరశరాసనధరు జనతాశివంకరు
ననిలజసేవ్యు బ్రహ్మాదిభావ్యు
వనజాక్షు సజ్జనావనదక్షు నీలాంబు
ధరనిభకాయు సీతాసహాయు
దిక్పాలగణనుతు ధీజనవందితు
సురమునినుతిపాత్రు శుభచరిత్రు
జాంబూనదాంబరు సద్గుణాడంబరు
మహితసుందరవేషు మణివిభూషు

తే. కంతుశతకోటిమోహనాకారు ధీరు
రవికులాంబుధిచంద్రు శ్రీరామచంద్రు
సంతతాక్షయశరధి దాశరథి నెపుడుఁ
దలఁచి కొలిచిన నశుభంబు దలఁగు టరుదె. 55

సీ. వీణాక్వణనసత్ప్రవీణులు నారద
ప్రముఖులు గానంబు పరిఢవింపc
నవసర మీక్షించి యమరగణంబులు
ద్వారాంగణక్షోణిc దారసిలcగ
సనకసనందనాద్యనుపమయోగప్ర
సిద్ధులు కెలcకులc జేరికొల్వc
గనకసచ్ఛాయాంగి జనకరాజాత్మజ
డాపలికుఱువున నేపుమీఱ
తే. రత్నమంటపమధ్యవిభ్రాజమాన
కనకపీఠంబుపై నోలగమున నున్న
సారకారుణ్యశరధి దాశరథిc దలcచు
ఘనులకుc బరాభవము త్రిలోకములc గలదె. 56
ఆ.వె. అనుచు ధర్మరహితు లగుమహీసురనృప
వైశ్యశూద్రులకును వనితలకును
బోధచేసి చేసి బాధించు చింత సం
యమనిc జేర్చుదురు కృతాంతభటులు. 57
వ. అని సంయమనీపురమార్గంబు తెఱంగుc దెల్పిన విని గడ
గడ వణంకి రోమాంచకంచుకితశరీరుండై చోరుం డజ్జడ
దారులం గనుంగొని మహాత్ములారా! దీనాంధకృపణు
లం గృపcజూచుట మిముబోcటి సాధువులకు నైసర్గిక
గుణంబు గావున సన్మార్గోపదేశం బొనరించి యసన్మా

ర్గవర్తి నగు నన్నుం గృతార్థునిం జేయవలయు నని ప్రా
ర్థించిన వార లిట్లనిరి. 58

చ. కలుషలతాలవాలము న
కారణవైరధురంధరంబు దు
ర్విలసితచౌర్యకార్యఘన
విశ్రుతమున్ మలినాలయంబునై
వెలయుకిరాతజాతిఁ బ్రభ
వించి కులోచితకర్మకర్తవై
మలసిన నీసమాన మగు
మానవుఁ గానము మానవోత్తమా! 59

తే. జాతి చండాలతాసమాఖ్యాతి గాని
కర్మచండాలవిఖ్యాతి గలదె నీకు
జాతిఁ జండాలుఁ డగువానిజని సుఖంబు
కర్మచండాలుఁ డగు వానిఘనత కీడు 60

వ. ఈయర్థంబునకుఁ బురందరదండధరసంవాదం బనునితి
హాసం బార్యవర్యాదరణీయంబై ప్రవర్తిల్లు నది వచియిం
చెద మని యిట్లనిరి. 61

తే. యముఁడు చండాలవేషంబు నవధరించి
శునకపలలంబు సురఁ గూర్చి పునుకఁ దుఱిమి
చర్మమునఁ గప్పి పితృవనజ్వాలనకీలఁ
బాక మొనరింప వీక్షించెఁ బాకభేది. 62

వ. నితాంతాద్భుతాకాక్రాంతస్వాంతుండై యింద్రుండు, దీనికి
నెక్కుడైన యపవిత్రవస్తువుఁ గల్గునో యని తలంచి
యతని నడిగిన నతం డిట్లనియె. 63

క. సురభూసురవిత్తంబులు
నిరతిన్ హరియించునట్టినీచాత్ములపా
దరజంబు దొరఁగు ననువెఱ
గరిమం బునుకపయిఁ దోలు గప్పఁగవలసెన్. 64

ఉ. ఈవిధి దుష్టతం బరగు
హేయపుమాంసము భక్షణక్షమం
బై విలసిల్లు; విప్రధన
హర్తలపాదరజంబు చిందినం
బావనహీనమై యది య
భక్ష్య మగుం మముబోఁటివారికిన్
ఏవముకన్న నేవమగు
నిద్ధరఁ దచ్చరణాబ్జరేణువుల్. 65

వ. అనిన నిందుఁ డిట్లనియె. 66

ఆ. అవని దుష్టభావు లగుచు దురాచారు
లై జనింతు రర్వ నధమజనము
లీ వెఱుంగు దేని యెఱిఁగించి నాసంశ
యంబు దీర్పఁదగు నయంబు మీఱ. 67

వ. అనిన విని యాచండాలుం డిట్లని తెల్పె. 68

క. విను పూర్వాదృష్టవశం
బున దుష్టజనంబుతోడఁ బొందగుఁ దద్వా
సనఁజేసి తాదృశాకృతి
జనులు దురాచారు లగుచు జనియింతు రిలన్. 69

తే. జగతి దుర్జాతిసంగతి సలిపెనేని
యచటఁ దద్వాసనారూఢుఁ డగుచు జీవుఁ
డవలిభవమున దుర్మతి యగుచుఁ దనరు
నిరయగతిఁ జెందుఁ బాయనినిందఁ గుందు. 70

వ. అట్లు గావునఁ గర్మచండాలురసహవాసంబు పరిహరణీ
యంబు. 71

పృథ్వి. చెలంగి ద్విజులం దిరస్కృతులఁ జేయుటన్ వేదముల్
లలిం బరిహసించి యిల్లడ లలంచి యీకుండుటం
బ్రిలోభత ద్విజామరార్థములు పొందిమం దోఁచుటం
గులంబు లకులంబులై కొఱలు గుప్తపాపంబులై. 72

క. వృత్తవిహీనుఁడె హీనుఁడు
విత్తవిహీనుండు హీనవృత్తుఁడె తలఁపన్
విత్తము వోవున్ వచ్చున్
వృత్తము రక్షింపఁదగు వివేకులు పుడమిన్. 73

తే. కరితురగధేనుబృందముల్ గలిగెనేని
వృత్తహీనతఁ బరగి దుర్వృత్తి మనిస

యాకులము కాకులం బయి *యాకులత్వ
మొందుఁగాక సువృత్తి నింపొందఁ గనునె. 74

ఆ. తపము దమము నన్నదానంబు బ్రహ్మవి
త్త్వము తితీక్ష మఖము శమము నెచట
నమర నుండు నది మహాకుల మగు నవి
లేకయున్నకులము కాకులంబు. 75

ఉ. ఎవ్వఁడు సాధువృత్తి మను
నెవ్వఁడు ధర్మ మొనర్చు సూనృతం
బెవ్వఁడు పల్కుఁ గీర్తిలత
కెవ్వఁడు మూలము వాఁడు పుట్టఁగా
నవ్వల దూష్యమైనకుల
మైన మహాకులమై చెలంగి తా
నివ్వసుధ న్మహోన్నతి వ
హించు దమాదిగుణప్రసిద్ధమై. 76

ఆ. చండకర్మ కర్మచండాలుఁ డుదయింపఁ
గుల మకులతఁ దనరి కొదవ లొదవు
సాధుకర్మనిరతుజననంబుచే నకు
లంబు కులతఁ దగు నిలాతలమున. 77

వ. వెండియుఁ జండాలసహవాసంబును జండాలాన్నభక్షణం
బును వర్జింపవలయు. 78

* యాకులంబుఁ జెందుఁగాక — వ్రా. ప్ర.

ఉ. మే లగు భైక్ష్యజీవనము
మే లగు శాకము దింట యంతకున్
మే లగు నంబుపాన మటు
మే లగుఁ బంచదినోపవాసముల్
మే లగు దైన్యజీవనము
మే లగుఁ బ్రాణవిసర్జనంబు చం
డాలునియన్నభక్షణము
డాసి యొనర్చుటకంటె నొంటిగన్. 79

క. చండాలవేషభాషల
మెండుగఁ దద్భక్తభుక్తి మెయి పెంచుచు న
చ్చండాలసేవ సలుపఁగ
దండిం దాదాత్మ్య మబ్బుఁ దచ్చేష్టలతోన్. 80

తే. మీఱి చండాలచేష్టల మెలఁగుకంటె
హాలహాలభక్షణంబు దిగంబరతయు
వ్యాఘ్రముఖగిరిమరుదేశవాసములును
గాననావాసమును మేలుగాదె తలఁప. 81

వ. ఏతద్విషయంబైన యొక్కయితిహాసంబు పురాతనం బ
యినది గల దది వివరించెద. 82

ఆ. ఉంఛవృత్తియైన యొకబ్రాహ్మణుఁడు సత్య
సంధుఁ డఖిలవేదశాస్త్రవిదుఁడు

నిర్జితేంద్రియుండు నిర్మత్సరుఁడు కృపా
కరుఁడు ధర్మపరుఁడు గలఁడు తొల్లి. 83

తే. దయయు సత్యంబు నీతనితల్లి దండ్రి
శాంతి దాంతియు నీతనిసహజగుణము
లనఁగ ధ్యక్తప్రతిగ్రహుం డగుచు నతఁడు
పుణ్యనదిచెంత నొకవనమున వసించు. 84

క. పావనతారుచిరములై
శ్రీవనితాధీశభక్తసిద్ధద్విజసం
భావనత నలరి వెలయుఁ
భూవినుతము లగుచుఁ దత్తపోవనమహిమల్. 85

శా. ఆతం డీగతి ధర్మకర్మపరుఁడై యప్పుణ్యగణ్యాపగన్
బ్రాతస్స్నాన మొనర్చి చేతులఁ బవిత్రంబుల్ దగం దాల్చి సం
ప్రీతి న్నిత్యము నిత్యకర్మము సమాప్తిం జెందఁగాఁ జేయుచున్
సీతారాముల నాత్మలోఁ దలఁచు నక్షీణానుభావోన్నతిన్. 86

సీ. మందారుతరుమూలమణిగణఖచితసిం
హాసనాసీనుఁడై యలరువాని

నీలజీమూతేంద్ర నీలనిభప్రభ
నలరారుమేచాయచెలువువాని
హారసారసనకేయూరకంకణముఖ్య
భూషణాలంకృతిఁ బొదలువాని
భానుసంభవమరుద్భవముఖవానర
సేనలు గొలువంగఁ జెలఁగువాని

తే. తామరసపత్త్రనేత్రు సీతాకళత్త్రుఁ
గోటిభాస్కరతేజు సద్గుణసమాజు
భర్మమయరమ్యచేలుఁ గృపావిశాలు
రాము నరపాలకలలాము బ్రేమఁ దలఁచు. 87

క. కల్పద్రుమసుమమాల్యా
కల్పుఁ బ్రమోదయుతకర్దమచర్చా
నల్పతరశిరస్నేరద
కల్పుఁ ఫణితల్పుఁ దలఁచుఁ గడు వేడుకతోఁ. 88

తే. నిమిషమైనను మఱి యర్ధనిమిషమైన
విష్ణుఁ జింతించు నెవ్వాఁడు విహితసరణి
నతఁడు కులకోటిఁ గూడి శ్రీహరినివాస
మైన వైకుంఠపథమున నధివసించు. 89

సీ. కావున నవ్విప్రుఁ డీవిధిఁ జింతించి
రాము మానసపూజ బ్రేమఁ దన్పి

యభ్యంతరంబు బాహ్యము తన్మయంబుగఁ
దలఁచి సాంద్రానందజలధిఁ దేలి
యట నికటస్థితపుటభేదనంబున
నలరువై దికగృహంబులకు నరిగి
యాయవార మొనర్చియందు యథాలాభ
సంతుష్టనిర్మలస్వాంతుఁ డగుచు
తే. నిజతపోవనమున కేఁగి నియతితోడ
స్నానసంధ్యలు దేవపూజయును సల్పి
యతిథిసంతర్పణముచేసి యంతఁ గుడిచి
సత్కథాశ్రవణంబునఁ జరుపుఁ బ్రొద్దు. 90

క. చండాలుం డాపురి నొకఁ
డుండున్ ధనధాన్యసంపదుజ్జ్వలుఁడు దయా
ఢ్యుండు సుజనప్రియుండు న
ఖండితదానఖని సుకృతకాముఁడు ధరణిన్. 91

క. ఒకనాఁ డావిప్రుఁడు పా
వకనిభతేజుండు విప్రవాటిఁ జరింపన్
బ్రకటితమతిఁ గని యాతం
డకుటిలమతిఁ దలఁచె నిట్టు లని మదిలోనన్. 92

క. ఏతాదృశపాత్రంబున
నేతతినయిుచన్ ధనంబు లిడనేరక నే.

నేతరి నయితిఁ మఱి యిం
కేతరిఁ దరియించువాఁడ నీచరితాబ్ధిన్. 93

ఆ. హితము గోరుమనుజుఁ డెలమి సత్పాత్రంబు
నరసి యొసఁగవలయు గరిమ వెలయ
ధర నపాత్రములకు దాన మొసంగి యా
ఫలము గనక నిరయపథముఁ గాంచు. 94

ఉ. ఇంత కృతార్థజన్మునకు
నీయనియర్థము వ్యర్థ మయ్యె నా
యంతవివేకశూన్యుఁ డొకఁ
డవ్వల నెవ్వఁడు గల్గు నింక నే
నెంతటనైన నీఘనున
కీప్సితవస్తు వొసంగి భద్రముల్
గాంతు నటంచు సర్వగుణ
గౌరవుఁడై తలఁచె న్మనంబునన్. 95

తే. మొదల నితఁ డప్రతిగ్రహుం డదియుఁ గాక
యిపుడు చండాలధనము గ్రహించువాఁడె
యైన నొకయుక్తి చేయుద ననుచు నెంచి
యాతఁ డొకవైశ్యుతోడ సఖ్యం బొనర్చి. 96

వ. వానితో నిట్లనియె. 97

వనమయూరము.

కోరి ధన మిచ్చెద నకుంఠితగతిం బే
హార మొనరింపు మఱి యందు గల లాభం
బౌరసి సగంబు గొను మంతఁ బెఱసామ్ముం
బాఱుల కొసంగుము శుభస్థితి చెలంగన్. 98

ఆ. అని యనంత మైన ధన మిచ్చి యవ్విప్రు
గుఱుతు చూపి యతనిగుణము చెప్పి
యీమహానుభావుఁ డేమైన నడిగిన
నెంతయర్థ మయిన నితని కిమ్ము. 99

తే. అడుగఁ డేనియు నడుగక యతులభక్తి
మించి సేవించియైనఁ బ్రార్థించియైన
నేయుపాయంబుచేనైన నితని కొసఁగి
ననుఁ గృతార్థునిఁ గావింపు మనఘచరిత. 100

ఆ. అనుచుఁ గీర్తికాముఁ డై దివాకీర్తి త
న్నేరి గారవింప నూరుభవ్రుఁడు
ధనముమీఁదియాశ మనమునఁ బెనఁగొన
నీయకృత్యమునకు నీయకొనియె. 101

సీ. అర్థాతురుం డైన యతఁడు సద్గురువృద్ధ
బంధులపైఁ బ్రియభావ మెడలు
దేవభూదేవతాదీనధనంబులు
హరియించు దురితంబు లాచరించు

నీచసేవ యొనర్చు నిందకు రోయఁడు,
కార్యంబు దెలియఁ డనార్యవృత్తి
యాశాపిశాచికావేశవశంబునఁ
బొదలి యెవ్వరినేనిఁ బొగడుఁ దెగడుఁ
తే. బరుల నెలయించు సభ్యులఁ బరిహసించుఁ
దొడరి కోశస్థితాసి నా దుస్స్వభావ
మెఱుకపడనీక వంచన నేపుమీఱు
సాధ్వసమున నమస్కృతుల్ సలుపు మొఱఁపు. 102
వ. విశేషించియు నతండు దరిద్రుండును వైశ్యుండునుం గా
వున హేయంబునకు రోయఁడయ్యె నంత నొక్కనాఁ డప్ప
ణ్యవీథిం జరించునప్పుఁడయ్యం గని సాష్టాంగం బొఱఁగి
వినయావనతుండై యి ట్లనియె. 103
క. ధన్యుండ నైతిఁ ద్విజగ
ణ్యాగ్రణ్య! భవద్దర్శనమున మత్పితృతతియున్
ధన్యతఁ బరగె న్నీపద
విన్యాసరజంబుచేఁ బవితుఁడ నైతిన్. 104
ఉ. విప్రులు లేరె భూస్థలిఁ బ
విత్రచరిత్రు లఖర్వసర్వవి
ద్యాప్రతిభాతియోగ్యులు ద
యామయ! వారలు నీకు సాటియే

యపరిమితమార్థనిస్పృహుఁడ
వై భువనంబు దృణీకరించి సీ
తాప్రియభక్తియుక్తి దురి
తంబులు దోలెద వీవు నిచ్చలున్. 105

తే. దినము రామార్పితాన్నంబు దినఁగ మాని
యలరి రాము భజింపని యధమనరులు
పూని యుచ్ఛిష్టకర్దమభుక్తి నఱచు
కాకభేకంబులకు నీడుగారె తలఁప. 106

తే. రాముఁ బూజించునవియె కరములు ప్రేమ
రాముఁ గనునవి కన్నులు రాముఁ దలఁచు
నదియె హృదయంబు రామకార్యార్థ మరుగు
నదియె పదయుగళంబు కృతార్థునకును. 107

క. సీతానేతన్ శుభసం
ధాతన్ దాతన్ భజించు నరుఁ డురుసుకృతో
పేతఖ్యాతుఁడు దురిత
వ్రాతం బాతనికి నొకలవంబును గలదే. 108

సీ. ఇన్ని సద్గుణముల నెన్నికఁ జెందిన
పూర్ణకాముఁడ వార్యపూజితుఁడవు
కృతకృత్యుఁడవు పుణ్యమతివి వి న్గాంచిన
నారాముఁ గాంచినయట్ల నాదు

పాపముల్ దొఱఁగ శుభంబులు బెఱుఁగ నేఁ
డని యాత్మమందిరంబునకు నతనిఁ
గొని చని వ్యజనవీజనమున శ్రమ మార్చి
యక్షకర్దమము దేహమున నలఁది
తే. కుసుమదామంబు లొసఁగి యక్కమతి యపుడు
పుత్త్రపౌత్త్రసమేతుఁడై పూజసేయ
దీవన లొసంగి పొంగి యద్ద్విజవరుండు
చనియె నల్లన తనపర్ణశాల కెలమి. 109

క. వేషము నమ్మఁగఁ దగ దిల
వేషము దోషాస్పదంబు వెలయఁ బరివ్రా
డ్వేషమున దశగ్రీవుఁడు
భీషణగతిఁ గొని చనండె పృథ్వీతనయన్. 110

క. రంగన్నేపథ్యాదుల
రంగుల దుర్జనుఁడు తన్నుఁ బ్రచ్ఛాదించున్
రంగాజీవుఁడు మెలఁగు తె
ఱంగున సజ్జనుల నెల్ల భ్రమయించుటకున్. 111

ఆ. రేయి మృగయుఁ డేచి మృగములు చెదరంగ
ఘంట మొరయఁ జేయుకరణి సుజను
మోహపఱచుఁ గుజనుఁ డూహచే నటుగాన
శీల మెఱిఁగి మైత్రి సేయు టొప్పు. 112

వ. అమ్మహానుభావుం డవ్వణిక్కులాధము దంభకుంగా నె
ఱుంగక యతం డొనరించిన యుపచారంబునకు నచ్చెరు
వొందుచుఁ దనమనంబున. 113

చ. ఫలితరసాలసాలముల
భంగిఁ జెలంగి పరోపకారవం
తులజననంబు లొప్పు నతి
దూరతరోన్నతిఁ జెన్నుమీఱి ని
ష్ఫలత వెలుంగుబూరుగుల
చందము నొందుఁ బరోపకారహీ
నులచరితంబు వారలఁ గ
నుంగొనఁ గోరిక దీర దారయన్. 114

ఉ. ఎంతకృపాళుఁ డెంతకృత
కృత్యుఁడు వైశ్యకులోత్తముండు నేఁ
డెంత ప్రియం బొనర్చె నని
యెన్నుచుఁ దత్కృతసత్కృతుల్ మదిం
జింత యొనర్చి సంతసము
చిప్పిలనొప్పగనుండువేళఁ దా
నంతట వచ్చి యవ్వణిజుఁ
డాయనకు న్వెస మ్రొక్కె నమ్రుఁడై. 115

క. బృందావనాంతికమున న
మందానందమున నక్షమాలిక చెవి నిం

పొంద బృసీమధ్యంబున
నందముగా నున్న యమ్మహామహువలనన్. 116

వ. కొన్నిధర్మంబులు విని చని మరల వచ్చె నిట్లు. 117

ఉ. పొందుగ సత్కథ ల్వినుచుఁ
బోవుచు వచ్చుచు నమ్మహాత్ముతోఁ
బొం దొనరించి తత్సుగుణ
ముల్ వెస నభ్యసనం బొనర్ప క
మ్మందుఁడు వంచనాగుణము
మానక పూనిక మీఱె నట్ల యాఁ
జందనవృక్షవాసి యగు
సర్పము దర్పము మాననేర్చునే. 118

వ. క్రిమ్మఱ నమ్మూర్ఖుం డమ్మహాత్ముని వంచింపందలంచి యుపాయంబు గానక యనుదినంబు మైత్రి పాటించుచు ననేకదినంబు లుండు నంత నొక్కనాఁ డాద్విజకులతిలకుం డన్నగరంబునకు భిక్షార్థియై చనినం గని నేఁ డిత్తఱిం గుననయిన నీభూసురపుంగవునకు మతంగపుంగవువిత్తంబు నొసంగవలయు నని తలంచి సంతుష్టాంతరంగంబున నిజమందిరంబునకుం దోడ్కొని చని తొంటియట్ల యర్ఘ్యపాద్యంబు లొసంగి పూజించి పుణ్యకథలు వినుచుం గొండొకతడవు నిల్చి యతం డరుగ నుద్యుక్తుం డయిన నిట్లనియె. 119

చ. మిటమిట నెండ మెం డమర
మిత్రుఁ డమిత్రునిరీతి లోకముల్
పెటపెట వేపఁ జొచ్చె నతి
భీష్మతరోష్మత గ్రీష్మ మెంతయున్
బటపట నేల వ్రక్క లయి
పాయఁగఁజేసె నలంత సధ్వగుల్
కటకటఁ జెంది వంద వడ
గాడుపు వీవఁగఁజొచ్చె హెచ్చుగన్. 120

తే. ఇట్టిబె ట్టగు వెట్టకు నట్టుఁ జెంది
జడలఁ జదలేఱు దాలిచెఁ జంద్రమౌళి
శ్వసనమిత్రుఁడు చేఁబూనె విసనకఱ్ఱ
కడమవారలకథ లింక నొడువనేల. 121

చ. రణమున శౌర్యధుర్యుఁడు క
రంబుల శాతశరంబు లేర్చి భీ
షణగతి వైరివీరుల వె
సం బన నేసిన వైఖరి న్నభో
మణియుఁ దపర్తునన్ గగన
మధ్యగుఁడై జగ మేఁచఁజొచ్చె దా
రుణకిరణప్రసారణత
రుద్రనిమూర్తి యతండు గావునన్. 122

సీ. ఘనసారమృగమదగంధసారోదార
యక్షకర్దమచర్చ నలరవలయు
మరిచధూళీగుడగురుకపిత్థోర్వారు
ఫలభక్షణావాప్తిఁ బరగవలయు
మహితసౌరభలసన్మల్లీమతల్లికా
దామసందోహముల్ దాల్పవలయు
సారపన్నీరసన్నీరచుంబితసూక్ష్మ
గౌరచేలంబులు గట్టవలయు

తే. కుందరదనాపయోధరకుంభికుంభ
శైశిరస్థలి వాసంబు సలుపవలయుఁ
జెలఁగు వైశాఖమున నిట్లు సలుపలేని
మతివిహీనులు దైవవంచితులు నిజము. 123

సీ. గజవాజిరథములు కమనీయగేహముల్
బంధుపోషణము సద్భాషణంబు
సర్వవిద్యావిచక్షణతావిధేయులై
పొదలు కళత్రసత్పుత్త్రచయము
ధనధాన్యసంపదయును సుఖాప్తి
యనవరతంబు దేహంబు దృఢత
యతిథిపూజయు ధర్మమతి రాముపై మతి
ధృతి జాహ్నవీసరిత్తీరవసతి

తే. చిరతరాయువు సజ్జనాదరనిరతియు
జానకీజానిఁ గొలువంగలేనివాని
కెట్టెఱంగున నబ్బుఁ దా నెంతప్రతిభ
పూనెనేనియు భూరివిద్యానిధాన ! 124

ఆ. భోజ్యవస్తు పమర భుజియించుశక్తియు
మెలఁత యొదవ రతులమెలపుశక్తి
ధనము గలుగ దాన మొనరించు శక్తియు
వరతపఃఫలములు వసుధయందు. 125

ఆ. రోగపీడనము కురూపతాప్రాప్తియు
దీనతయును వృత్తిహీనతయును
సారశూన్యగృహము సర్వానుసరణంబు
నలఘుదురితకర్మఫలముగాదె. 126

క. పరగేహనివాసంబును
బరులన్ *భజియించుటయును బరదేశములం
దిరుగుటయుఁ గుపుత్త్రప్రాప్తియు
దరిద్రతయు దుఃఖములు సదా యూహింపన్. 127

తే. అతిథిపూజ యొనర్చుచు నధికనిష్ఠఁ
దపము సల్పుచు సత్కర్మతానిరూఢు
లయిన మీకేదరిద్రత యర్హమగునె
కావున ధనార్జనంబుపైఁ గాంక్ష మేలు. 128

* హరించుటయును—బ్రా. ప్రం

సీ. ఏను వైశ్యుండఁ గులీనుండ మఖముఖ
సకలసుకర్మముల్ శాస్త్రసరణి
సలుప నర్హుండ నావలనఁ బ్రీతి గ్రహిం
చిన నీకు దురితముల్ చేరఁగలవె
మణిగణకనకాదిమహనీయవస్తువు
లొసఁగెదఁ గొని సుఖం బెసక మెసఁగ
పుత్త్రకళత్రాదిపోషణం బొనరించి
దేహసంశోషణస్థితి దొలఁగు
ఆ. మార్యవర్య ధర నకార్యశతం బైనఁ
జలిపి తల్లిఁ దండ్రి సతుల సుతుల
నతులగతుల మనుప నగు నని ప్రాజ్ఞులు
దెలుపునీతిపోలుపు దెలియ వినమె. 130
వ. అనిన విని యవ్విప్రుం డిట్లనియె. 131
ఆ. రహి విరక్తునకును రాజ్యంబు తృణ మగు
దాత యగునతనికి ధనము తృణము
జూదగాని కధికసుఖము తృణం బగు
సారె నిస్పృహునకు జగము తృణము. 132
ఉ. రామకథాసుధారసని
రంతరనిర్వృతమానసుండు సు
త్రాముని నైన వానరుతె
ఱంగునఁ జూచు నృపాలకీటక

స్తోమముఁ జెప్పనేల పరి
శుద్ధత రాముఁ దలంచుచుఁన్ మదిన్
రాము భజించుకంటె సుక
రం బగు సౌఖ్యము గల్గనేర్చునే. 133

క. దానముఁ గొనువానితపో
హానియు మఱి నిత్యకర్మహానియు నగు న
ద్దానంబుఁ గొనియెనేనియుఁ
బూని మరల నిత్యకర్మముల్ సలుపఁదగున్. 134

తే. ఉగ్రదుర్దానవస్తుపరిగ్రహంబు
సలుపఁ బరలోకనాశంబు గలుగు నట్లు
గాన పరలోకభీరువు లైనవార
లుగ్రదానపరిగ్రహం బుడుగవలయు. 135

ఆ. రహిఁ బరాన్నభుక్తి రసనయు మఱి ప్రతి
గ్రహము కారణముగఁ గరము నన్య
లలనవలనఁ జిత్తజలజంబు బల మఱి
శక్తి ద్విజున కెట్లు సంభవించు. 136

క. అమవసఁ బరాన్న మెవ్వఁడు
నమలు న్నెలనాళ్ళు వాఁ డొనర్చిన హోమ
ప్రముఖసుకర్మావళిఫల
మమరఁగఁ దద్దాతఁ జెందునందురు సుమతుల్. 137

తే. ధర్మ బరాన్నము దినుచు నేధరణిసురుఁడు
కర్మ మొనరించుచుండుఁ దత్కర్మఫలము
నందు నొకభాగ మాతనిఁ జెందుఁ బిదప
నన్నదాతల భాగత్రియంబు సెందు. 138

క. వర్షాశనమున బ్రితుకుచు
హర్షంబును జెందు నెవ్వఁ డావిప్రుఁడు త
ద్వర్షకృతకర్మఫల మ
వ్వర్షాశనదాత కిడు ధ్రువం బూహింపన్. 139

ఆ. గజము మ్రింగువెలఁగకాయ రూపావళి
ష్టత వహించునట్టిచంద మమర
నవనినిర్జరుఁడు పరాన్నంబు మెసవిన
సారహీనుఁ డగు నిజంబు ధరణి. 140

సీ. అప్రతిగ్రహుఁడైన యవనీసురోత్తము
నుతియింపఁదగు నని శ్రుతులు నొడువు
నదనున విప్రుఁ డాపదతటి నైనఁ బ్రి
తిగ్రిహింపఁగరాని తెల్ల మరయ
నతిదరిద్రున కైన నతిధని కైన నాఁ
కలి సమంబయి ప్రాణములు హరించు
విరసభోజన మైన సరసభోజన మైన
నమృతోపమానమై యమరు నప్పు

తే. డట్లు గావున శాకమూలాశనమునఁ
దృప్తిఁ బొందుదుఁ గాని ప్రతిగ్రహింప
నిట్లు నిర్బంధ మొనరింప కేఁగు మనినఁ
బాఱునకు నిట్టు లనియె నయ్యార్యభవుఁడు. 141

ఉత్సా. పోవ యాయవరము సేయఁ బ్రొద్దు గలదె యామమా
త్రావశిష్ట మయ్యె దివస; మయ్య నేఁటి దేవపూ
జావిధానపాకవిధికిఁ జాలుమాత్ర మైన స
ద్భావమున నొసంగెదం గృపం బరిగ్రహింపవే. 142

క. శ్రద్ధ గలవారుఁ డొసఁగిన
యద్ధనము పరిగ్రహింప ననువగు మఱి య
శ్రద్ధ గలముని యొసంగిన
యద్ధనము పరిత్యజింప నగు ననిరి ఘనుల్. 143

తే. అనుచుఁ బ్రార్థించి సాష్టాంగవినుతి సేయ
నమ్మహాత్ముఁడు నాఁటిపాకార్థవస్తు
వందికొన నమ్మతించెఁ దా నప్పు డాతఁ
డంత సంతోషితస్వాంతుఁ డగుచు నగుచు. 144

చ. ఎనయఁగ శాలితండులము
లిక్షురసోపమ మైన తైలముం
గనకసరూపసూపమును
గప్రపుఁదావులఁ బొల్చు నాజ్యమున్

బనసరసాలముఖ్యఫల
పంక్తియు రామరమ్ముఁ ఘటంబు లిం
ధనములు చింతపండు లవ
ణంబు గుడంబును శృంగబేరముల్. 145

చ. ఉరుకదళీదళావళులు
నొఱ్ఱనియావయు జీలకఱ్ఱయుఁ
మిరియము గోదుమల్ మఱియు
మే లగుగందము తమ్ములంబులుం
బెరుఁగును గూరగాయలును
బ్రీతిఁ దలిర్పఁగఁ దెచ్చి యమ్మహీ
సురవరుముందర న్నిలిపెఁ
జూచి యతండు ముదంబు నొందఁగన్. 146

తే. ఆత్మబంధులు దాను నయ్యార్యవర్యుఁ
డప్పదార్థముల్ దెచ్చి యయ్యవనిసురుని
మందిరంబునఁ జేర్చి యమందమోద
మగ్నమానసుఁ డగుచు నమస్కరించె. 147

వ. అంత. 148

ఆ. అన్న మొసఁగి గెలుచు నన్నుల సద్వస్త్ర
సమితిఁ గట్టి గెలుచు సభలఁ బ్రిబల
మొక్కి విప్రనికరముల గెల్చు శీలంబు
పసఁ గులంబు గెల్చు పార్ష్ణిఁ డవని. 149

తే. నెలఁతలకు భోజనంబును నిధువనంబు
హితము లగు నవి గల్గినగృహము గృహము
పతియె పతి యవి లేని తద్భవన ముగ్ర
వనము తద్వల్లభుండు జీవన్మృతుండు. 150

ఉ. కావున నమ్మహీసురుని
కాంతయు వైశ్యుఁ డొసంగినట్టి య
ప్పావనవస్తుసంతతులు
పల్మఱు గన్గొని విస్మితాత్మయై
భావమునన్ ముదం బొదవ
పాక మొనర్చి నిజేశు దేవపూ
జావసరం బెఱింగి విన
యంబున నాయితపెట్టె నత్తఱిన్. 151

ఆ. దేవపూజ సల్పి నైవేద్య మొనరించి
యతఁడు సుతసమేతుఁ డగుచు భక్ష్య
భోజ్యలేహ్యచోష్యములు సాధ్వి వడ్డింప
నారగించి ప్రముదితాత్ముఁ డయ్యె. 152

క. ఆపడఁతియు నవశిష్టము
లై పరగినయట్టి షడ్రసాన్నాదికముల్
సూపాపూపాజ్యప్రము
ఖోపేతంబుగ భుజించె నురుహర్షమునన్. 153

ఉ. అంత ననంతదివ్యమహి
మాదృతసత్కథలన్ దినాంతప
ర్యంతము పొద్దుపుచ్చి యతఁ
డర్హవిధుల్ దగఁ దీర్చి మందిరా
భ్యంతరసీమ నల్లన ల
తాంతశరాహవదోహలస్థితిన్
గాంతఁ గవుంగిలించి కడఁ
కన్ ఋతువాసర మాట యెంచుచున్. 154

క. ఆతతదృఢభోజనసం
జాతహ్రాదజ్ఞాతజాతచకితుం డగుతా
నాతరుణికి ఋతుదిన మఁట
యాతనితమకంబు వేఱ యడుగఁగ నేలా. 155

ఆ. అతులగతులఁ జొక్కి యాతఁడు సురతాంత
తాంతగాత్రుఁ డయ్యె నంత నంత్య
జాతవస్తుజాతరేతఃపరిష్కృత
మగుచుఁ జాలు నిల్చె నతివ కపుడు. 156

తే. జనులు భుజియించునన్నంబు జఠరపిఠరి
నొనరు భాగత్రయం బయి యొకట మనము
నొకట వీర్యము మలము వేఱొకట నగుచు
నమరియుత్తమమధ్యమాధమనిరూఢి. 157

ఆ. శిష్టభోజనంబుచే సాత్త్వికం బగు
మానసంబు జనసమాజమునకు
దుష్టభోజనమునఁ దుష్టి పొందిన మాన
సంబుఁ దామసాస్పదంబు గాదె. 158

ఉ. కావున శిష్టభోజనము
కాంక్ష నొనర్చి దురాన్నభీతిచేఁ
దా విలసిల్లునట్టియతి
ధన్యుఁ డమర్త్యుఁడు గాక మర్త్యుఁడే
పావన మైనద్రవ్యమును
బాకము భాండము నబ్బెనేని స
ద్భావన శిష్ట మా సదియు
భక్ష్య మభక్ష్య మెఱుంగఁజొప్పడున్. 159

తే. వంగకాయయు మాడిసవంటకంబు
పొసఁగ నిందుగుకాయయుఁ బుచ్చకాయ
మేడి మారేడుకాయయు మెసవు నెవ్వఁ
డాతనికి దూరతరుఁ డగు నచ్యుతుండు. 160

తే. కదిసి వటుత్రవ యగుసొరకాయ యెఱ్ఱ
మునుగయును రక్తరూపశాకినియు రక్త
మూలకంబును బచ్చలి ముదముతో భు
జించి చాంద్రాయణం బాచరించవలయు. 161

తే. తుమ్మి బలుసును గందమూలమ్మి నసఁటి
యుసిరికయుఁ గర్మవిధికి నత్యుత్తమములు
పులగమును బాయసమును జక్కిలములును య
వాన్నమును దేవతార్పణార్హములు తలఁప. 162

క. తల్లియుఁ బినతల్లియుఁ దన
యిల్లాలుం దాను సుతుఁడు హితశిష్యుండుఁ
జెల్లెలును మేనయత్తయు
నెల్లెడఁ బాకంబుసేయ నెంతయు నర్హుల్. 163

సీ. పాకంబుసేయ మృద్భాండముల్ మేలవి
నిత్యనూత్నంబులై నెగడు టొప్పు
ప్రాజ్ఞసమ్మతిఁ గాంస్యపాత్రంబున భుజింపఁ
బ్రజ్ఞాయశోబలప్రతిభ లమరు
రజతసువర్ణపాత్రంబులఁ గుడిచిన
వానికి సిరి తాన వలచి పొందు
భిన్నపాత్రంబులఁ బ్రీతిచే మెసవిన
యతఁడు దరిద్రతావాప్తిఁ గుందు

తే. తాడి తుమ్మికి రేచకిదళములందు
రావిమఱ్ఱులఁ బుట్టుపర్ణములయందు
మొగలి జిల్లేడుతలిరులఁ దగ భుజించి
మించి చాంద్రాయణంబు చరించవలయు. 164

ఆ. బ్రహ్మమేడియాకు పాలాశమును నిప్ప
యాకు తామరాకు నరఁటియాకు
నమరు కొడిసెయాకు నతిపవిత్రంబులు
వానిలోనఁ గుడిచిరేని మేలు. 165

చ. అది యటు లుండెఁ దద్ద్విజని
జాంగనదుర్భరగర్భ మిట్లు తో
మ్మిదినెలలుం భరించెఁ దత
మేచకచూచుకపాండుగండసం
పద యుదరస్థశాబకుని
భావము పుల్కసతాగ్రజన్మతా
స్పద మని తెల్పు మెల్పమర
సారె సుఖప్రసవాప్తిఁ గోరుచున్. 166

క. పదియవమాసంబున న
మ్మదవతి సుకుమారుఁ డగుకుమారునిఁ గని నె
మ్మది ముదము గదురఁ బెనుపఁగ
నదనున మూఁడేండ్లు పెరిఁగి యబ్బాలుండున్. 167

ఉ. చౌలము సల్పునీడున స
సంభ్రమతం బసరంపుటెమ్ముకల్
మాలికగా నొనర్చి గళ
మధ్యమునన్ దవిలించి మించి చం

డాలునిలీల నాశ్రమము
 డగ్గఱ శైశవకేళిఁ దేల న
బ్బాలు నదల్చి తండ్రి వెసఁ
 బాఱఁగఁ జిమ్మె తదస్థిహారముల్. 168

తే. అతఁడు స్నానార్థమై నది కరిగె నరుగ
నంత నర్భకుఁడును దొంటియట్ల యస్థి
మాలికలు గేలఁ దాల్చి చండాలులీలఁ
గేలి సల్పె జనంబులు గేలిసేయ. 169

క. అమలమతి నప్పు డాభూ
మ్యమరుఁడు నియతుఁడయి దూర మరిగి బహిష్కా
ర్యము దీర్చి మృత్తికాశౌ
చము సేయఁగఁ గణఁగె నంత శాస్త్రోక్తముగన్. 170

తే. ఒనర నొకపరి మేహనంబున గుదమున
మూఁడుమాఱులఁ గరముల నేడుమాఱు
లంఘ్రియుగమున ముమ్మాఱు నవల నెడమ
పాణిఁ బదిమాఱు లొనరించెఁ బ్రౌఢి మెఱసి. 171

క. ఇనుఁ డుదయించినపిమ్మట
ననువునఁ బలుదోము నెవ్వఁ డప్పంచజనుం
డినుఁ గబళించినదురితముఁ
గనుఁ బిత్రువంశమున కెల్ల ఘాతుకుఁ డగుచున్. 172

తే. వెలయఁ జిటికెనవ్రేలంత వలము గల్గి
కంటకక్షీరయుక్తంబు గాఁ జెలంగి
ద్వాదశాంగుళమానిమై తగినపుడుక
దంతధావన మొనరింపఁ దనరు నంద్రుఁ. 173

ఆ. అట్టినీతి యెఱింగి యమ్మహామహుఁడు శౌ
చమును దంతధావనము నొనర్చి
స్నానముఖ్యవిధు లనూనముగాఁ జల్పి
సత్వరమున నరిగె సదనమునకు. 174

వ. అప్పు డెప్పటియట్ల యాశ్రమాభ్యాసంబున నస్థిమాలికా
ధరుండై చండాలచేష్టలం గ్రీడించుకుమారునిం గాంచి
చంచలితనేత్రుండును భయకంపితస్విన్నగాత్రుండును
నై భార్యం జూచి యిట్లనియె. 175

శా. బాలత్వంబున నీకుమారకుఁడు చె
ప్పం జిట్టగా మీఱుచుం
డాలక్రీడల నస్థిమాలికలు వే
డ్కం గంఠసీమంబునం
గ్రాలం గేలి యొనర్పఁ జూచ్చె మది శం
కాలేశమ్మును లేక యిం
కేలా మాటలు నీదుపాపమున న
య్యెం గాదె యీచందముల్. 176

క. తురగంబుగుఱుక నుఱుమును
నిరతము వర్షంబు గురిసి నిలుచుటయును సుం
దరిమనము పురుషుభాగ్యము
సుర లెఱుఁగరు నరుల కెఱుఁగఁజొప్పడునె ధరన్. 177

తే. దురితనిరతంబుచేఁ గ్రూరచరితమైన
పువ్వుబోఁడులమానసం బెవ్వఁ డెఱుఁగు
మొలకనగవులు నమృతంబు చిలుకుపలుకుఁ
గాంచి భ్రమఁ జెందుఁ బురుషుండు కామినులకు. 178

మత్త. సారెఁ దా రపవాదభీతిఁ బొసంగి యుందురు గాని దు
ర్వారమారశరాహతిన్ వసివాడి వీడిసవ్రీడలం
దారి వారిజలోచనల్ సతతంబు డంబున మంజులా
కారపూరుషుఁ జూచి సంగమకాంక్ష సేయుదు రెంతయున్.

క. రూపవతు లైనయువతుల
నేపునఁ గామించి పురుషుఁ డిది దురితౌఘ
ప్రాపక మని కవయం డది
పాప మనుచుఁ దలఁప దింతి పరపురుషేచ్ఛన్. 180

క. ఆహారము ద్విగుణం బగు
నూహాయొనర్పంగ బుద్ధియుఁ జతుర్గుణ మా
సాహసము షడ్గుణం బగు
నాహా! మగువలకుఁ గామ మష్టగుణ మగున్. 181

ఉ. అంతిపురంబులందుల ని
జాంగనలం దగ నుంచి ధారుణీ
కాంతులు ద్వారదేశములఁ
గావలిగా నిడి రక్షసేయ న
య్యింతులు రూపహీను లని
యెంచక కుబ్జజడాంధవామనా
ద్యంతికవర్తులం గలసి
యంగజకేళి యొనర్తు రింపుగన్. 182

చ. మన సాకచోట నుంచి నెఱ
మక్కువ యొండొకదండ నుండ వం
చన గననీయ కెంతయు స
సాధ్వసనైఖరి యుల్లసిల్లఁ దా
రెనసి ప్రియుం బ్రియోక్తి భ్రమ
యింపుదు రింపుగ నట్లు గావునన్
వనితల భక్తియుక్తులు భ్రమ
వమ్మగ నమ్మఁగఁ బోల దేరికిన్. 183

క. పతిరతిఁ గవయుచు సతి తన
మతి నెవ్వనిఁ దలఁచుఁ దత్కుమారకుఁడు తదా
కృతిఁ దాలిచి తత్కర్మం
బతులితగతి నభ్యసించు నని మును వినమే. 184

ఆ. సతియుఁ బతియుఁ బ్రేమ సమముగా రతిసల్పు
తఱిఁ బరస్పరంబు దలఁచిరేని
తల్లి యాకృతియును దండ్రిగుణంబును
బూనుఁ దత్సుతుండు పుష్పఁబోఁడి. 185

క. సుతునిగుణోన్నతిఁ గనుఁగొను
మతివా! చండాలలీల నలవఱుచుచు సు
ధతిఁ గీకసమాలాలం
కృతుఁడై యిటు లున్నవాఁడు క్రీడాపరతన్. 186

వ. అనిన విని యాసాధ్వి యతని కిట్లనియె. 187

సీ. అనఘ! మీ రానతిచ్చినయది నిజ మగు
నైన దుర్గుణవతు లైనసతులు
కొంద ఱంతియె కాని యందఱు సుందరు
లకు నట్టిదుష్టశీలంబు గలదె
సత్యవ్రతంబును సత్యశీలంబును
దమకు నిత్యంబులై తగఁ బొసంగి
ధృతి మనోవాక్కర్మరతిఁ బతిసేవ సే
యుచుఁ దదన్యసుఖంబు లుజ్జగించి

తే. యదియె నిఖిలాధికం బయి ముద మొసంగ
సర్వలక్షణవతు లయి సంవిశుద్ధ
మతుల నతులమహోకులోన్నతుల నలరు
సతతభాగ్యవతులు పతివ్రతలుఁ గలరు. 188

క. అందముగాఁ బతిసేవా
నందంబునఁ జొక్కునట్టి నారులు శయ్యా
మందిరభూషణతోషణ
నందనచందనసుఖంబునం బొదలుదురే. 189

మ. పతిపాదాంబుజసేవనాదరసుధా
పానప్రమోదంబుచే
నతులానందము నొందుకాంతలకు బ్ర
హ్మానందము న్బూరి యౌఁ
బతి దైవంబు నితంబినీతతికిఁ ద
ద్భక్తిప్రభామారసం
శ్రితధర్మంబు శ్రీమైకహేతు వగు సు
స్థేమప్రభావోన్నతా. 190

వ. ఇందుల కుదాహరణంబై యొక్కపురాతనేతిహాసంబు
పెద్దలవలన వినంబడు నది యెట్లనిన. 191

మ. ఒకవిప్రుం డతిదుర్భగుండు దురితో
ద్యోగానురక్తుండు కా
మకలాలంపటుఁ డాతతాయిజనసం
భావ్యుండు దుశ్శీలుఁ డా
త్మకులాచారవిదూరుఁ డార్యగుణనిం
ద్యక్రూరకర్ముండు ము

న్నొకయూర నివసించి హేయగుణసం
యోగంబున నవ్వర్ధిలుఁ. 192

ఉ. ఆయనభార్య యార్య యరు
ణారుణపాణి వినీలవేణి ప
ద్మాయతపత్త్రనేత్ర కన
కాభశుభాంచితగాత్ర దర్పణ
ప్రాయకపోల ఖండశశి
ఫాల ప్రవాళజయాతిలోహితా
మేయసుధాధరాధర సు
మేరుపయోధర యెన్నఁ జెన్నగున్. 193

క. పతిసేవాహేవాక
వ్రతవతియై సుగుణశీలవతియై ధృతి న
ప్పతిదేవత మెలఁగుం దన
పతి పతితుం డనక కినుకఁ బదరక నియతిన్. 194

ఆ. అతనివిధివశాన ననిలరుగార్తిచేఁ
జరణములకు గమనశక్తి దఱుఁగ
సిరియుఁ దొలఁగె నట్లు చెడినదురాత్మునిఁ
దొలఁగ కేల నిలుచు జలజనిలయ. 195

ఆ. శీలవంతుఁ జేరు సిరి శీలవంతుని
గాంచి జనత ప్రీతిఁ గారవించు

శీలహీనుఁ జేరు జ్యేష్ఠ రోగంబులు
బలయుఁ జనము దినము పరిభవించు. 196

వ. అప్పు డప్పల్లవాధరి వల్లభు నెల్లిదంబుసేయక యుల్లంబు రంజిల్ల దేవభావంబున సేవించుచు లేవడి గావున నతని నిజస్కంధంబుపై నిడికొని భిక్షార్థం బన్నగరంబునఁ గ్రిమ్మరుచున్న నొక్కయెడ. 197

చ. అలరుమొగంబు కైవగయు
నబ్జనిరూఢిఁ బూసంగ లోచనం
బులు నవలగ్నసీమయును
బుష్కరవైఖరి మీఱ నోష్ఠముఁ
వలనగుసంఘ్రియుగ్మముఁ బ్ర
వాళరుచి న్నిరసింప నయ్యెడం
జెలు వమరంగ నొక్కవెల
చేడియ యాడితకాంతి నొప్పుచున్. 198

సీ. పంచమషడ్జవిపంచీస్వరంబులు
పికమయూరములకుఁ బ్రీతిఁ బెనుప
మోవి బింబభ్రాంతి మునరి కీరంబు ల
య్యారవోదారత నభ్యసింపఁ
గుచతటనికటసంగుప్త మహా సారకాయఁ
గని పెఱితుంబి యాఘనతఁ గోర

నాలాపతతికి వనాగముల్ నాగముల్
దలిరించి కరఁగి యందముగఁ జొక్క

తే. నాగవాసంబులో మదనాగయాన
నాగకన్యానిరూఢి నందముగఁ బాడి
వీణె వాయించె సిబ్బితి వీడనాడి
పల్లవులు ఘొల్లముగఁ జేరి యుల్లసిలఁగ. 199

మ. అప్డాపైదలిఁ గాంచి మోహవివశుం
డై భూసురాభాసుఁడా
చపలాక్షిం దలపోయుచుం బొరలి య
స్వస్థాత్ముఁ డయ్యెం దమిం
గృపణున్ యాచకు వ్యాధిబాధితకరాం
ఘ్రిం దీనునిం బూని ని
ష్కృపచే నేఁచు మరుండు తన్మహిమలుం
జిత్రంబు ధాత్రీస్థలిన్. 200

మత్త. సారె దిక్కులు చూచు నూరుపు సారెసారె విదిర్చు వే
సారెఁ గన్నుల నీరు నించుచు సారె నీరము గ్రోలుఁ బ
ల్మాఱు వారవిలాసినీసుకుమారభావము లెంచు వే
మాఱు మారునిధాటి విప్రకుమారుఁ డెంతయుఁ జింతిలున్.

తే. ధరణిఁ గామాంధునకును నిద్దురయు సుఖము
త్రపయు మఱిఁ బరలోకచింతనము గలదె

యస్థిచర్మావశిష్టుని నన్నహీన
కాయునైనను గాయంబు కాయజుండు. 202

క. ఘురునికిఁ గృపయు దరిద్రున
కురుతరసౌఖ్యానులబ్ధి యొనరుటయు దిగం
బరునకు లజ్జయు విధవా
తరుణికి సురతమును లేదు తథ్యం బరయన్. 203

వ. అంతఁ గంతువ్యథ నత్యంతచింతాక్రాంతస్వాంతుండైన
కాంతుం జూచి యతనికులకాంత యంతరంగంబు గలంగ
భీతయై యత్తెఱం గతని నడిగి తెలిసి తత్క్షణంబున
నబ్బ్రాహ్మణి యున్న యెడకుం జని ప్రియోక్తిం దేల్చి నిజ
ప్రియుండు రతిప్రియుని ములుకులకు నులుకుటయుఁ దన్మో
హంబును నవ్వారారోహకుం దెల్పి యభీష్టం బగుధనంబు
మనంబు దనియ నొసంగి యొడంబఱిచి పురబహి
రంగణగోత్రశాలాప్రదేశంబునకు రాత్రి నేతెంచు నది
యని సంకేతం బొనర్చి యక్కార్యంబు సంఘటించి
యచ్ఛందం బందంబుగాఁ గాంతున కేకాంతంబునఁ
దెలుప నతండు దుస్తరపారావారనిర్మగ్నునకుఁ దరణి
కరణిఁ దగినయత్తరుణివచనంబు లాకర్ణించి సంభ్రమో
జ్జృంభణంబునఁ బొదలి యథావిధిం బ్రవర్తిల్లుచు
సూర్యాస్తమయంబు గోరి యిట్లని వితర్కించె. 204

కవిరాజవిరాజితము.

అరుదుగ నేకరథాంగశతాంగము
నశ్వము లాఱును నొక్కటిపై
నురగసమూహము లొప్పగు పగ్గము
లూరువిహీనుఁడు సారథి య
ప్పురుసదినంబునఁ బాటిలె మాంద్యము
భవ్యనువస్తువు లబ్బినచోఁ
జరమగిరీంద్రముచాయకు జాఱఁడె
చాయమగం డతివేగమునన్. 205

చ. ఇతనితనూభవుండు యముఁ
డెంతయు దుష్కృతవంతు నొంచు నా
కృతియు సమంజసం బతని;
కీతఁడు దారుణలీల ద్వాదశా
కృతులు సహస్రపాదము ల
కృత్రిమలీల వహించి లోకసం
హృతి నుడికించుఁగాదె తప
నాహ్వయుఁడై యితఁ డెల్లకాలమున్.206

తే. తరణి యన నేల వహ్నికి నరణి గాఁడె
మిత్రుఁ డన నేల కువలయామిత్రు నితని
లోకబంధుఁడె యీతఁడు కోకబంధుఁ
డీనుఁ డనఁగ నేల గ్రహమైనఘనుఁడు గాక. 207

క. మందేహులితని నొంచుచుఁ
గ్రిందున విప్రార్ఘ్యతోయకణహతులై నన్
మందగుఁ డయ్యెనొ మును వా
రందఱు తనుఁ జుట్టుముట్టి యలఁచుటకతనన్. 208

క. ఈరీతి నల్ల నల్లన
నీరవి చరియించుపొంటె నితనికుమారుం
డౌర శనైశ్చరుఁ డయ్యెం
గూరిమికొమరునకుఁ దండ్రిగుణ మొసరదొకో. 209

క. రాకామధ్యగతుండై
యాకువలయహితుఁడు సూర్యుఁ డను నాహ్వయముం
గైకొని విరహుల నేఁచుఁ ద
దాకృతి సూర్యాభిధాన మది యెట్టిదయో. 210

తే. తా వికర్తననామంబు దాల్చి జగము
లదన నిర్దయుఁడై త్రుంచు నదియుఁగాక
ద్వాదశాష్టమజన్మసంస్థానముల వ
సించి జనముల నెల్లఁ గుందించు మరల. 211

ఉ. అంతఁ దదీయమైన విర
హంబు గనుంగొన లేనిరీతి భా
స్వంతుఁడు గ్రుంకెఁ దత్సురత
సంభ్రమసంఘటనేచ్ఛచేబలెన్

ధ్వాంతము గప్పెఁ దద్రతివి
ధంబు గనుంగొనుమాడ్కిఁ జుక్కల
చ్చెంతఁ బొసంగెఁ దద్గతి హ
సించె ననన్ వికసించెఁ గల్వలున్. 212

వ. అయ్యవసరంబున. 213

శా. త్రాసం బింతయు లేక ప్రాకటతమి
స్రం బ్రస్ఫురద్ధైర్యయై
యాసాధ్వీమణి ప్రాణనాయకు నిజాం
సారూఢుఁ గావించి వే
శ్యాసీమంతిని మున్ను రమ్మనిన యా
సాంకేతికాగార మ
త్యాసక్తిన్ వెసఁ జేరఁబోవఁగఁ దద
భ్యాసానుదేశంబునన్. 214

క. కొఱుతపయి నొక్కచోరుం
డఱిముఱిఁ బ్రాణావశిష్టుఁ డై యుండఁగ న
త్తెఱవ యెఱుంగక చనున
త్తఱిఁ దత్పతిశిరము వానిఁ దాఁకెం బెలుచన్. 215

ఉ. వేదనఁ జెంది తస్కరుఁడు
వే నను నొంచినవాఁడు రేపు సూ
ర్యోదయ మైనఁ జచ్చు నని
యుగ్రతమం బగుశాప మిచ్చె నా

పైదలి యాయవాచ్యతర
భాషణముల్ విని యోర్వలేక ఛా
యాదయితోదయం బవధి
యాత్మవరాయువు కంచు నెంచుచున్. 216

తే. స్థిరతరధ్వాంతవార్ధిక దరణియైన
తరణి యుదయింపకుండ నత్తరుణి యుగ్ర
శాప మొనఁగూర్చి దోయిట జలము లెత్తి
చల్లె వైధవ్యమునకుఁ దా నుల్ల మెరియ. 217

సీ. సతి యిత్తెఱంగున శాపం బొసంగ న
హస్కరుం డుదయింపఁ డయ్యె నంత
సంతమసవ్యాప్తి జగ మాకులం బయ్యె
స్నానసంధ్యాదులు హీన మయ్యె
స్వాహాస్వధాదివషట్కర్మములు హవ్య
కవ్యతంత్రములు యాగములు నడఁగెఁ
బాకశాసనపాశిపావకయమసోమ
యక్షరక్షఃపక్షితక్షకాహి

తే. వాలఖిల్యాప్సరోమరుద్వసుగణంబు
జంగమస్థావరప్రపంచంబు నప్పు
డప్పతివ్రతతేజోమహత్త్వమునకు
నచ్చెరువు నొంది యందంద యభినుతించె. 218

ఆ. అయ్యుదంత మంత నఖిలామరగణంబు
లజున కెఱుఁగఁజేసి యతఁడు తాము
హరిఁ బురస్కరించి హరునకుఁ దెలుపఁగ
నరిగి రపుడు రజతగిరికిఁ బ్రీతి. 219

వ. అందు. 220

సీ. స్ఫటికాభశుభగాత్రు శశిసూర్యశిఖినేత్రుఁ
జంద్రకిరీటుఁ బశ్యల్లలాటు
నగకన్యకావిభు నరుణకోటిప్రభు
హాలాహలాహారు నహిపహారు
సర్వలోకశరణ్యు సన్నుతకారుణ్యు
ధరణీశతాంగు సాగరనిషంగుఁ
గాయజసంహారుఁ గరటిచర్మాంబరుఁ
గలుషవినాశు నాకాశకేశు

తే. నఖిలలోకైకరక్షణావ్యగ్రు నుగ్రు
సురమునీశ్వరగురుతరస్తుత్యు నిత్యు
సతతరజతమహీధ్రనిశాంతు శాంతు
దారితకుమారదైతేయదంభు శంభు. 221

ఆ కాంచి నతులు నుతులు గావించి వచ్చిన
తెఱఁగు భక్తియుక్తిఁ దెలుపుటయును
ననిమొ వారితోడ ననుకంపపెంపున
శంకరుండు లోకశంకరుండు. 222

సీ. పాతివ్రతంబైన భవ్యతేజముఁ గని
సర్వతేజంబులు సంచలించు
వలనుమీఱఁగఁ బతివ్రతలు గావించిన
పని యన్యుచేఁ జక్కఁబడునె యెట్లుఁ
గావున నప్పతిదేవతసన్నిధి
కరిగి ప్రార్థింపుఁ డీ రనుచుఁ బలుక
నపుడు సావిత్రియు ననసూయయు శచియు భా
రతియు నరుంధతి రమయు నుమయు
తే. వేల్పుఁబెద్దయు వెన్నుఁడు వేల్పుగమియు
నప్పతివ్రత యున్నెడ కరుగుదెంచి
ప్రస్తుతి యొనర్చి పేర్చి యప్పద్మనయన
వరుఁ జిరాయురుపేతుఁగా వర మొసంగి. 223
ఆ. లోక మంతయును నిరాకులగతిఁ జెంద
సూర్యు నుదితుఁ జేయు మార్య యనిన
సతియు నర్ఘ్య మొసఁగి శాపంబు మరలింప
నరుణకిరణుఁ డుదయ మయ్యె నంత. 224
మణిగణనికరము.
వరము లొసఁగి సురవరు లరిగిన భూ
సురుఁడు సుకృతమున సురుచిరగతియున్
దరుణతయును సిరితరి గని చని య
త్తరుణిఁ గలసి చిరతరముగ మనియెన్. 225

వ. అని కథ చెప్పి యాబ్రాహ్మణి యిట్లనియె. 226

సీ. ఈరీతి ధారుణీధారణకారణ
మతిమతులగు పతివ్రతలు గలరు
వారలచరణసేవకురాల నాథ ! మీ
యంఘ్రిభక్తియ కాని యన్యమెఱుఁగ
సత్యంబు పలికితి నిత్యంబు నిర్దంభ
విస్రంభయోగ్యనై వెలయుదానఁ
గావున దోషస్వభావంబు తెలిఁగు మీ
వలన నైనదియె కావలయు నిపుడు

ఆ. ధీయుతులకు నైనఁ బాయక మోసంబు
గలుగు నాకుఁ గోడిమె గట్టఁదగునె
మీరు ధీరవృత్తి మీఱ విచారింప
వలయు దురితసరణివలను మిగుల. 227

క. ఏరీతి నిజముఁ బల్కియు
నారులు విశ్వాసకారణత మెలఁగుదురే ?
వారక సూనృతగతిఁ జె
ల్వారినయగసాలి పుణ్యుఁ డని నమ్ముదురే ? 229

వ. అని యిప్పగిది నప్పతివ్రత పల్కుపల్కులు విని యప్పు
డప్పుడమివేల్పు సత్యం బని యత్యంతత్వరితంబున నిశాం
తాభ్యంతరంబున కరిగి శుచియై వార్చి షోడశోపచా
రంబుల రామదేవుం బూజించి తదనంతరంబ పద్మాసన

గతుండును సమకాయశిరోధరుండునునై ప్రాణాయామ
త్రియం బాచరించి యల్లనల్లన రామనామంబు జపియిం
చుచు ఘనఘనాఘనశ్యామగాత్రుండును పుండరీకదళ
నేత్రుండును బీతాంబరధరుండును శంఖచక్రగదాధను
ర్బాణకరుండును దారహారకేయూరసారసనకిరీటకుండల
వలయాంగుళీయకాదిభూషణుండును (నిజాశ్రితజనతోష
ణుండును) వసిష్ఠవామదేవసనకసనందననారదహనూమ
త్ప్రముఖార్చితుండును దివ్యచందనచర్చితుండును వన
మాలికావిరాజితవక్షుండును జగదుత్పత్తిసంహారకారణ
దక్షుండును రాకానిశాకరప్రతీకాశముఖుండును లక్ష్మణ
సఖుండును సీతాలింగితాంగుండును రణరంగాభంగుం
డును నగు కరుణాసముద్రు శ్రీరామభద్రుం దనహృద
యారవిందంబున నందంబుగా నిల్పి యాభిధ్యానమా
ర్గంబున నవ్విశ్వరూపునియందు నిలానిలానలజలమహా
బలాది పంచమహాభూతంబుల శింశుమారచక్రచంద్ర
సూర్యాదిగ్రహనక్షత్రధ్రువారుంధతుల వాలఖిల్యగౌత
మాది మహర్షుల గంధర్వయక్షరక్షఃపక్షితక్షకానంత
కర్కోటకాదు లయినపాతాళనివాసుల బలిప్రభృతిరాక్ష
సులఁ గపిలాదిమునీంద్రుల మేరుమందరహిమవద్వింధ్య
లోకాలోకాదికులపర్వతంబుల సప్తద్వీపంబుల సముద్ర
సరిత్తటాకంబుల దిగ్గజంబుల రంభాద్యప్సరసల స్వర్లోక

బ్రహ్మలోకవైకుంఠకైలాసాదిలోకంబుల నగ్నిష్వాత్తాది పితృగణంబులఁ గళాకాష్ఠాలవక్షణముహూర్తప్రహరాహోరాత్రపక్షమాసర్త్వయనసంవత్సరాత్మకంబు లయిన కాలంబుల దర్శపూర్ణమాసయజమానయాజకయూపపశుస్వాహాస్వధాకార వషట్కార వేదికాప్రస్తర హవిఃపురోడాశదర్భపాత్రాదియోగయాగంబుల శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమ ధర్మశాస్త్రాద్యఖిలవిద్యల భూర్భువాదిచతుర్దశభువనంబులస్థావరంబులజంగమంబుల భూతభవిష్యద్వర్తమానవర్తనంబులం గాంచి నెండియు నిజాశ్రమప్రదేశంబును దన్నును బట్టనంబును జండాలవైశ్యసంబంధంబును వైశ్యప్రార్థనంబును వైశాఖమాసంబునఁ జండాలదత్తపాకవస్తుప్రతిగ్రహంబును దదన్నభోజనరేతస్సంగతంబైన నిజాంగనాగర్భసంభవంబును నంశమాత్రప్రవేశంబునఁ గుమారుండు చండాలచేష్టలం గ్రీడించుటయును నిఖిలంబును నిరవశేషంబుగా జ్ఞానసమాధిం గనుంగొని ధ్యానావసానంబున నేత్రోన్మీలనం బాచరించి భార్యకు నయ్యార్యుం డిట్లనియె. 229

సీ. అతివ! నీకతమున నైనదుష్కృతము గా
దది నావలన వచ్చినదియెకాని
యతివదాన్యుం డైనయంత్యజన్ముఁడు ధర్మ
మొనరింపు మని ధనమొసఁగి పనుపఁ

దద్యశవర్తియై దనరువైశ్యుఁడు దెచ్చి
మన కిచ్చె పాకసామగ్రి వినవె
యది యంది నీవు బ్రహ్మానందమును బొంది
యెలమిఁ బాక మొనర్చి తెలుఁగుదుగద

తే. ఆరగించితి మదియు క్షుధాగ్ని యార
మనముఁ గన్నులుఁ దనియంగ మనము మును త
దన్న రేతోంశభవ్యుఁ డైన యాత్మజుండు
మించి చండాలచేష్టఁ గ్రీడించె నిట్లు. 230

తే. అప్రమత్తతఁ జరియించు చలరు నెవ్వఁ
డతఁడు సకలసుఖావాప్తి నతిశయిల్లు
దుఃఖభాజనుఁ డగుఁ బ్రమత్తుఁడు దలంపఁ
దరుణి ! యశ్రాంతమును మనకరణి ధరణి. 231

సీ. తతదుర్వినీతిచేఁ దనరు సాధువుతోడ
భువిఁ జంచలుం డైన బుధునితోడ
మాయావి యైన సంబంధబాంధవుతోడఁ
గృతపాపుఁ డైన పండితునితోడ
స్వార్థపరుం డైన యత్యంతవృద్ధుతో
నతిదురాచారుఁ డౌ సధముతోడ
నర్థార్జనాసక్తి నలరు యతీంద్రుతో
మతిహీనుఁ డగు బహుశ్రుతునితోడ

తే. సర్వవంచనశీలురై జగము లెల్ల
వేషభాషల భ్రమయించు విప్రరాజ
వరులతో సఖ్య మొసరింప వలవ దెపుడు
వారి దవ్వగఁ దొలఁగఁగ వలయు పొలతి ! 232

క. నీరముఁ గ్రోలి వనావని
నీరములం గసవు మెసవు మృగముల మృగయుల్
గార్కించి యవిరతము ని
ష్కారణవైరమున హింస గావింతు రిలన్. 233

ఆ. ఆత్మజీవనార్థ మై సాధువృత్తుల
హింససేయుదురు విహీనబుద్ధు
లట్లు గాన సాధు లప్రమత్తతఁ జరి
యింపవలయు నెట్టియెడల నైన. 234

సీ. ఈకల్మషమునకు హేతుభూతుండైన
యన్నీచవైశ్యుని యన్వయంబు
శాపం బొసంగి భస్మంబు గావించెద
నని క్రోధతామ్రాక్షుఁ డగుచు లేచి
యపుడు విధూమకాలాగ్ని చందంబున
నెలకొని కనుఁగవ నిప్పు లురుల
మృత్యుభీషణుఁడై యమేయరయంబునఁ
బరువడి యవ్వైశ్యభవనమునకు

ఆ. నరుగు దెంచుటయు లయాంతకప్రతిము న
య్యనఘుఁ జూచి వాఁడు నతిభయార్తి
వడఁకి మేనఁ జెమట వడియంగ సుతసతి
ప్రతతిఁ గాంచి యొయ్యఁ బలికె నిట్లు. 235

ఉత్సా. స్వాపతేయలోభమున నిషాదధనముఁ దెచ్చి నేఁ
బాప మనక యొసఁగినాఁడ బ్రాహ్మణునకు వస్తుదా
నాపరాధకారణమున నతఁడు భీషణాకృతిం
గోపమున శపింపఁ బూనెఁ గులము నీఱుసేయఁగన్. 236

తే. ఇతనిక్రోధంబు వారింప నెవ్వఁ డోపు
నహివిషంబును మఱి బడబానలంబు
నొక్కరుని నొంచు విప్రులయుగ్రకోప
మవల నిశ్శేషముగఁ జేయు నన్వయంబు. 237

సీ. అనుచు వారలుఁ దాను సవిప్రపదజల
జాతంబులకుఁ జక్కఁ జాఁగి మ్రొక్కి
గడగడ వడఁకుచు గద్గదస్వరమున
వినుతించి క్షమియింపు మనువు ! మనుచుఁ
గ్రూరచిత్తుఁడ దుర్వికారవంతుఁడ నని
యంఘ్రులు విడువక యభినుతింప
దీనులై సంత్రస్యమానులౌ తత్కుల
పాలికాబాలికాపాళిఁ గాంచి

తే. యతికృపాళుఁడు గావున నయ్యవార్య
రోష ముపసంహరించి నిర్దోషవృత్తి
శాప మొసఁగెద ననినవిచార మెడలి
యమ్మహీసురుఁ డాత్మ ని ట్లని తలంచె. 238

తే. ఎంచ నపరాధి యైనట్టి పంచజనునిఁ
గరుణ రక్షించునతఁడె రక్షకుఁడు గాక
ననపరాధుల రక్షించు టరుదె యట్లు
గాన కోపోపశమనంబు కార్య మిపుడు. 239

సీ. అపరాధి యగువాని ననుకంపఁ గాచిన
యతఁడె మునీశ్వరుం డదియె తపము
కోపంబు తపమునకును హాని యగుఁ గోప
వశుఁడు కృతాంతునివశుఁడు దలఁపఁ
గోపవశంబునఁ బాపంబు మిగులుఁ ద
త్పాపంబు నారకపథముఁ జేర్చు
క్షమయె దానంబును సత్యంబు విద్యయు
ధర్మంబు నర్థంబుఁ దపసులకును

తే. క్షమయె తపమును బరలోకసంగ్రహంబు
క్షమయె బంధులు మిత్రులు క్షమయె తోడవు-
లనుచుఁ జింతించి యపు డమ్మహామహుండు
పలికె ని ట్లని యూరుసంభవునితోడ. 240

స్రగ్ధర. ఔరా క్రూరాత్మ మున్నొక్కవసరమునఁ బా
కార్హసద్వస్తువారం
బారూఢార్చావిధానోద్యమత నొసఁగి త
ద్వ్యర్థ మెవ్వారిదో వి
స్తారోదారోక్తిచేఁ దథ్యముగఁ దెలుపు మి
థ్యావచోవృత్తి వేనిన్
గోహూపవ్యాఘ్రమా! నీకుల మనులతచేఁ
గూల శాపింతుఁ జుమ్మీ. 241

మ. అనినన్ గోమటి వేపమానతనుఁడై
యత్యంతదైన్యాత్ముఁడై
యనఘా! మాలనిసొమ్ము నీకొసఁగి నే
నన్యాయముం జేసితిన్
ధనలోభంబునఁ గన్నుఁగానక దురం
తద్రోహచిత్తుండనై
యనుకంపామతిఁ దప్పు గావు మనుచున్
బ్రార్థించుచున్ మ్రొక్కినన్. 242

సీ. వారుణీపాని కుదారసత్యంబును
గోద్రవంబులయందు గురురసంబు
నామిషాహారున కమలకారుణ్యంబు
పాపకర్మునకును బహుళధర్మ

మూఁకట నలసినయతని కభక్ష్యంబు
శమవంతునకు నసహ్యమగుతలఁపు
మహిఁ గాముకునకు నమందమందాక్షంబు
నాశ్రియాశికి నదాహార్యర్థసమితి

తే. ద్రవ్యలోలుపునకు మిత్రతాగుణంబుఁ
బతితుఁ డగువాని కతులసన్మతియు గతియు
దుర్జనాళికి సుగుణగణార్జవంబు
వెదకి చూచిన లేవుగా విశ్వమునను. 243

మ. లలిఁ బ్రారంభమునన్ సుఖం బొదవు తా
శ్ఛాయచందంబునన్
దలఁపన్ దుర్జనమైత్రి యంతమున సం
తాపంబు గావించు సా
ధులకుం గావున రూపయౌవనమదాం
ధు న్వంచకున్ లోలుపుం
గలుషోద్యోగిని రాజునైన విడువం
గాఁ బాడియౌ దవ్వులన్. 244

తే. ఆశ ధర్మవినాశంబు నాచరించుఁ
దృష్ణ భోగనికాయంబు దీలుపఱుచు
లోభ మన్నిటఁ బోకార్చుఁ బ్రాభవమును
వీని మూఁడింటి నార్యులు విడువవలయు. 245

మ. సరసంబైనను నీరసంబయిన భ
　　క్ష్యంబౌ క్షుధాశాంతి కా
దర మొప్పారఁ గుటీర మైన మఱిసౌ
　　ధం బైన మే లున్కికిన్
ధర యైనన్ శయనీయమైనఁ దగు ని
　　ద్రం జెంద దుష్టాంశుకో
త్కర మైనన్ వరచేలమైనఁ దగు శీ
　　తంబు న్నివారింపఁగన్. 246

ఆ. దుర్జయుండు వీఁడు దురితాత్మకుఁడు దయా
స్నేహవర్జితుండు సిద్ధ మరయ
రామ రామ యనుచు నామహీసురుఁడు ని
జాశ్రమమున కరిగె నశ్రమమున. 247

ఉ. కోమటిదుష్టచేష్ట నొనఁ
　　గూడినవంతకుఁ జింత నొందుచున్
ధామముఁ జేరి సూరిజన
　　తావినుతప్రతతప్రభావుఁడై
యామృదుమానసుండు విగ
　　తాఘునిఁ గా నొనరించెఁ బుత్త్రకున్
రామమనూపదేశము తి
　　రంబుగఁ జేసి గరిష్ఠనిష్ఠతోన్. 248

శా. పాపారణ్యహుతాశనంబు శుభసం
పద్భూజబీజంబు స
ర్వాపద్ధ్వాంతవిభాకరోదయ మశే
షామ్నాయవంద్యంబు సం
తాపాంభోనిధికుంభసంభవ మవి
ద్యామత్తమాతంగవీ
థీపంచాననవిక్రమక్రమము గా
దే రామనామం బిలన్. 249

క. సుర ద్రావుటయును ధరణీ
సురహననము గురునితరుణిసురతంబును భా
సురకార్తస్వరచౌర్యము
నరయఁగ నివి నాలుగును మహాపాతకముల్. 250

తే. అంత్యజన్మునిఁ గాంచుట యంటుటయుఁ ద
దన్నభోజనవేషభాషాభిరతియుఁ
బుష్పిణీగణికామ్లేచ్ఛపుల్కసాది
భామినులఁ గలయుట యుపపాతకములు. 251

తే. ఆననాంచన్మరుద్ధమితాన్నభోజ
నంబు లశునంబు పెలుచశాకంబు లశున
సహితశాకము గోమాంససమ్మితములు
ప్రకటితం బగు క్షుద్రపాతకము లవియు. 252

క. పెస నొకచే జలపానము
నసమానసశబ్దమైనయాపోశనముఁ
బసఁ దామ్రపాత్రమున గో
రస మానుట యనఁగ నివి సురాసదృశంబుల్. 253

తే. అంబువులఁ గ్రుంకి కట్టిన యార్ద్రచేల
కమున సమ్మార్జనము సేయఁగాదు మేను
పూని యవ్విధిఁ గావించి రేని మఱియుఁ
దాన మొనరింపకున్నఁ బాతకముచెందు. 254

వ. ఇట్టిమహాపాతకోపపాతకక్షుద్రపాతకంబులు రామనామ
జాపకునియందు సాగరంబున మహానదులు నామరూపం
బులు విడిచి యడంగుచందంబు నొంది డిందు నని కథ
చెప్పినఁ జండాలభూమికాధారుం డైన యంతకునకు
బలాంతకుం డిట్లనియె. 255

క. నీకంటెఁ గష్టతరుఁ డై
లోకంబున నిందఁ బొందు లోలాత్మకుఁ డీ
లోకమునఁ గల్గునేనియు
నాకుమతిం దెల్పు తెలియ నగు నిక్కముగన్. 256

వ. అనిన నతం డిట్లనియె. 257

సీ. బ్రాహ్మణద్వేషియై పరగి తద్విత్తాప
హారుఁడై క్రూరుఁడై నట్టివాఁడు

దేవభూదేవతాదికదూషణాసక్తి
నన్నృతుఁడై పిశునుఁడైనట్టివాఁడు
భూసురారాధనపుణ్యంబునకు నంత
రాయంబు గావించుమాయలాఁడు
శాంతుఁడై దాంతుఁడై సత్కర్మనిష్ఠచే
మించువిప్రుని నుపేక్షించువాఁడు

తే. వేదవిరహితుఁడైనట్టి విప్రకులుఁడు
సమరమున భీతిఁ జెందిన క్షత్త్రియుండు
స్త్రీఘ్నగోఘ్నోపదేశంబు సేయునతఁడు
ధరణి నాకంటె ఘనకష్టతరులు వీరు. 258

తే. కర్మచండాలు రీవిధుల్ గలుగునరులు
సర్వకర్మబహిష్కృతు లుర్వి నరయ
విద్యఁ గులమున వయసున విత్తమునను
వృద్ధులైనను మత్సముల్ వీరు గారు. 259

వ. అనిన. 260

ఉత్సా. వారివాహవాహుఁడనియె వాహనైరివాహుతో
నార యూర వారుణీరసార్ద్రశౌనకామిషా
హారి వీవు నీకభక్ష్యమైన దొకటి గల్గినన్
వేరు లేక దానిఁ దెల్పు వినఁగ వేడు కయ్యెడిన్. 261

వ. అనిన నతం డిట్లనియె. 262

క. నాకంటెఁ గష్టతరుఁ డని
నీ కిపు డేఁ జెప్పినట్టినీచులయన్న
స్వీకార మనర్థం బగు
మా కాపద్వేళ నయిన మరుదారాధ్యా. 263

తే. క్షత్త్రియుఁ డహరహంబు దోషము లొనర్చు
నతనియన్నంబు శోణితప్రతికృతి యగు
నవనిసురులకు నది యభోజ్యముగఁ బలికి
రనుపమితధర్మమర్మజ్ఞులైనమునులు. 264

క. యజమానుం డొనరించిన
వృజినము లన్నమున నాశ్రయించుట నది దు
ష్టజనము లయిన భుజింపరు
ద్విజులు భుజింపంగరామి తెలుపఁగ నేలా. 265

వ. అనిన విని యింద్రుండు పరాన్నంబు భుజియించినవారల
కెట్టిగతి గలుగు నీ వెఱింగినతెఱంగునఁ దెల్పు మనిన
నతం డిట్లనియె. 266

సీ. అన్నంబు బహువిధం బగు నభోజ్యంబును
భోజ్యంబు నను భేదములఁ జెలంగి
పోరిది క్షత్త్రియవైశ్యశూద్రుల యన్నంబు
పరిహరణీయమై పరగు నందు
శాస్త్రార్థవిదులైన క్షత్త్రియవైశ్యుల
యన్నంబు దిన నర్హమగుఁ దలంప

శూద్రాన్న మాపద చొప్పడు తఱిఁ దక్క
నితరవేళల భుజియింపఁదగదు
తే. వెలయ భుజియించెనేనిఁ బవిత్రమాన
సంబున దినత్రయోపవాసంబు సల్పి
యంతమీఁదట గోదాన మాచరించి
శుద్ధతరుఁ డగు ధారుణీసురవరుండు. 267
ఆ. వాంఛ నేతదితరవర్ణాన్న మనిశంబుఁ
గుడుచు నిహపరముల గొడవ యొదవు*
నిందు నిందఁ జెందు నందుల యాతన
లందుఁ గందు క్షితిసురాన్వయుండు. 268
సీ. ఈనియమం బనుష్ఠానహీనులకును
పారదారకదుర్వ్యవహారులకును
త్యక్తసంధ్యాజపాధ్వరతపోధనుల క
భక్ష్యభక్షణరతిప్రాభవులకుఁ
గఠినాశయులకు దీర్ఘక్రోధులకు నిరం
తరశూద్రసంపర్కతత్పరులకు
దుష్టమార్గులకు వ్రాత్యులకు లేఖకులకు
వరవేషభాషావివర్జితులకుఁ
తే. బావనేతరసేవోపజీవులకును
గాదు పతితులకును; బాతకములు గలవె

* కొదవనొదవు—వ్రా. ప్ర.

శిష్టమతులైన సద్ద్విజశేఖరులకుఁ
దెలుపు మహిమంబు గాని సుధీసమేత. 269

వ. శిష్టు లెట్టివార లనిన. 270

స్రగ్ధర. సామ్యంపాత్రత్వ్వ తాఙ్నల్ సమధికసుకృతుల్
శాస్త్రనిష్ఠాగరిష్ఠుల్
స్థాయత్సన్మార్గవృత్తి ప్రకటగుణమణుల్
పంచయజ్ఞప్రవీణుల్
శ్రేయోహేతుప్రచారోర్జితమతు లనఘుల్
శీలశాలుల్ సమగ్రా
మ్నాయామేయార్థవేదుల్ మథితమదులు ని
ర్మాయు లత్యంతశుద్ధుల్. 271

తే. అతిథిపూజాపరాయణు లగుచు శమము
దమము నాహారనియమంబు దయయు క్షమయుఁ
దమకు నైజంబు లయినవ్రతములు గాఁగఁ
బూని మెలఁగుచు నుండు రప్పూరుషవరులు. 272

తే. వృత్తవిద్యాతపఃక్రియావృత్తి మనిన
వాఁడు శ్రోత్రియుఁ డనఁ జనువాఁడు పుడమి
నవ్విశిష్టుండు శిష్టాన్న మారగించి
యనఘుతరుఁ డగుఁ గలుషంబు లంట వెరని. 273

వ. అన విని యింద్రుఁ డిట్లనియె
నట్టివిశిష్టులు శిష్టభోజులై

యనఘుతఁ జెంది రేనియుఁ బ
రాన్ననివృత్తులు వార లెట్లు లా
ఘనులకుఁ బంచయజ్ఞముఖ
కర్మము లేగతిఁ జెల్లుఁ దత్క్రియం
బనుపుగఁ దెల్పు మా కనిన
నయ్యముఁ డిట్లనియెం బ్రియంబునన్. 274

చ. అనఘు విశిష్టదత్త మగు
నన్నము మున్నుగ వైశ్వదేవ మిం
పున నొనరింపఁగావలయుఁ
బొందుగ మాతులునింట మామయిం
టను గురునింట బాంధవగ
ణంబులనిండుల శిష్యునింట స
జ్జనములయిండ్ల భోజనము
సల్పఁ బరాన్నము గాదు మేదినిన్. 275

మ. బలిమిం బెట్టిన నేనియు న్మఠి మహా
పద్వేళలం జోరబా
ధల నానామయసంకటంబులఁ బరా
ర్థంబై పరాన్నంబు తా
నలవోకన్ భుజియించి భూసురుఁడు పు
ణ్యావాప్తిఁ జెన్నొందు ని

చ్చలు నారీతి భుజించెనేని యఘసం
సద్భాసి యగు వాసవా ! 276

ఉ. శ్రీకరవేదశాస్త్రపరి
శీలురు నధ్వరకర్మకర్తలున్
బ్రాకటసత్పురాణచయ
పారగులు న్నియతవ్రతుల్ స్వయం
పాక మొనర్చుకోఁదగిన
భవ్యులు భిక్షుఁడు బ్రహ్మచారియున్
బాక మొనర్చుకోఁదగరు
పాతకవృత్తులు మున్నుగా ధరన్. 277

తే. యతికి నతిథికి నొసఁగక యతులగతి భు
జించి చాంద్రాయణంబు జరించవలయు
నతిథి భగ్నాశుఁడై గృహపతిసుకృతము
గొని తనదుదుష్కృతం బిడి చను నిజంబు. 278

ఆ. మునుపు వైశ్వదేవమునకుఁ దెచ్చినయన్న
మతిథి కిడినఁ గర్మహాని గదుర
దతని కిడక సేయుఘృతకుంభశతసమి
ద్రచితహోమవిధి నిరర్థకంబు. 279

తే. అన్నసంస్కారకారణం బనఁగవలయు
వైశ్వదేవము నప్పు డావశ్యకముగ

నాత్మసంస్కారకారణం బనఁగవలయు
నతిథి కొనఁగెడువేళ గృహాధినేత. 280

సీ. వేసర కతిథికి గ్రాసమాత్రం బైనఁ
గబళమైనను హంతకారమయినఁ
దతి నిడఁదగు గృహపతి మయూరాండప్రి
మాణమై తగి గ్రాసమాత్ర మమరుఁ
దచ్చతుర్గుణమైనఁ దగుఁ గబళం బయి
దానినాల్గంత లై తనరి హంత
కారంబు చెల్వారు మీఁఱు నాఢ్యత గల్గె
నేని పూర్ణాహార మిడఁగవలయు

తే. నన్నజలఫలమూలశాకాదికంబు
లడిగి కుడువఁగ నగు శ్రోత్రియాలయముల
శ్రోత్రియాన్నము హోమవిశుద్ధశేష
మతిథిభుక్తాన్నశేషము నఘహరములు. 281

వ. అనిన. 282

క. ఎవ్వఁడు శ్రోత్రియుఁ డనఁ జను
నెవ్వనిఁ బూజించి నరుఁడు వృజినవ్రజముఁ
నెవ్వపఱచు నని యడిగిన
నవ్వాసవునిం గుఱించి యముఁ డిట్లనియెన్. 283

ఉ. మానము దంభవేషమును
మాటలు శ్రోత్రియతాగుణంబులే ?

జ్ఞానము హోమముం దపము
సాత్త్వికభావము గల్గి సర్వవి
ద్యానిధి యైన భూమిసురు
నార్యులు శ్రోత్రియుఁ డందు రట్టి స
న్మానితకర్మకర్ముఁ గ్ర
మంబునఁ బూజ యొనర్ప మేలగున్. 284

శా. ఆలీలం దగు శ్రోత్రియోత్తముని బ్ర
హ్మలోకనాసక్తునిన్
సాలగ్రామముఁ బూజసేయఁ దగు ని
చ్చల్ ధర్మకర్మాప్తికై
సాలగ్రామనివాసితావసథ మ
చ్ఛంబై నిరస్తాఘమై
శ్రీలన్ రంజిలుఁ దన్మహామహిమ చ
ర్చింపన్ ధరన్ శక్యమే? 285

క. సమసంఖ్య యుత్తమంబు వి
షమసాలగ్రామచయము చను నధమంబై
సమమున రెండును మఱియు వి
షమమున మూఁడుం ద్యజింపఁ జను నర్చకిలన్. 286

సీ. పండ్రెండు గండకీప్రభవశిలల్ పూజ
సేయు నతండె నారాయణుండు

*సరి నవి పుష్కరసమ మాటఁ బుష్కర
సలిలావగాహనఫలముఁ జెందుఁ
దన్మూర్తివితతి సీతారామసంజ్ఞచేఁ
జెన్నొందెనేని పూజించునరుఁడు
శ్రీరామసామీప్యసారూప్యసాయుజ్య
ములు గాంచి యానందమునఁ జెలంగు
తే. వెండి యవి నూటయిరువదియుండునట్టి
యాలయం బది వైకుంఠ మదియె కాశి
హరిహరహిరణ్యగర్భాదు లచట నిల్తు
రతులపుణ్యాత్ముఁ డాగృహపతి నిజంబు. 287
సీ. అర్థి సాలగ్రామతీర్థపానమున సం
తతజన్మకృతదురితములు దొలఁగు
వఱలు సాలగ్రామవారికణావాప్తి
గంగాదినదుల మునుంగుఫలము
భవ్యసాలగ్రామపాదోదకంబు సం
సారసంతాపనివారకంబు
తివిరి సాలగ్రామతీర్థపావనజలం
బిల సర్వసంపత్సమృద్ధిదంబు
తే. నలువ మును తారతమ్యంబు దెలియఁ గోరి
సర్వతీర్థౌఘజలఫలసంగతమున

* సవినయపుష్కరసమమగుట — వ్రా. ప్ర.

సౌనయఁ దలఁ దూన్ప ములుచూపె వనషువృత్తి
స్థిరతరముగ సాలగ్రామతీర్థఫలము. 288

శా. సాలగ్రామవిలాంబుబిందుతులసీ
సమ్మిశ్రమై వేద్య మి
చ్ఛాలీలన్ భుజియించుమానవుఁడు శ
శ్వద్యాగముఖ్యక్రియా
జాలస్ఫారఫలాప్తిచేఁ బొదలి వి
శ్వస్తుత్యచారిత్రుఁడై
శ్రీలక్ష్మీశసమానుఁడై గుణగణ
శ్రీనిత్యుఁడై భాసిలున్. 289

క. ముక్తాబిందుసమప్ర
వ్యక్తం బగు గండకీస్రవంతీగ్రావా
సక్తజలం బీఁజాలదె
ముక్తులు బాహ్యోదకముల మునుఁగఁగ నేలా. 290

క. మే లగుగంగాజలమును
సాలగ్రామాభిషేకజలమును శ్రీల
క్ష్మీలలనేశార్చనమున్
హేళిం దత్కీర్తనంబు నతిపావనముల్. 291

క. మును సాలగ్రామోదక
మున శుచియై నిత్యకర్మముం జలుపఁదగున్

విను మత్తీ ర్థము సోమము
ఘనముగ హస్తమునఁ గ్రోలెఁ గా దంద్రు బుధుల్. 292

స్రగ్ధర. ధరసాలగ్రామతీర్థోదక మను దినముం
దాగ్రిపఁగా సోమపానం
బరుదారం జేయుపుణ్యం బగు వపురవభో
గ్యామయాధివ్యథాదు
స్తరసంతాపంబు దీఱున్ జముభటతతి వి
స్రస్తచింతానురక్తిన్
జరగున్ జేరంగ లేకన్ జడియుచును బున
ర్జన్మదోషంబు జాఱున్. 293

శా. మాలూరచ్ఛదనంబులం దులసిచే
మల్లీప్రసూనావళిన్
సాలగ్రామముఁ బూన్చువానిఁ గని స్వ
స్థానగ్రహాశంకచే
నాలేఖర్షభముఖ్యనిర్జరులు చిం
తాక్రాంతులై యుందు ర
ట్లాలీలం గృతకృత్యుఁడైన నరుభా
గ్యం బెన్న సామాన్యమే. 294

శా. లాలిత్యం బగు ప్రాజ్యపూజ్యనుతసా
లగ్రామతీర్థప్రసా

దాళిప్రాభవ మెన్నఁగాఁ దరమె య
ల్పాయుర్నరశ్రేణికిన్
హాళి న్మనొ్నకభూసురుండు పతితుం
డై తన్మహాత్మ్యంబుచే
సౌలభ్యస్థితి ముక్తిఁ జెందె నది యెం
చన్ జిత్ర మిద్ధాత్రిలోన్. 295

వ. అక్కథ యెట్లనిన. 296

ఉ. అక్షయపుణ్యశీలుఁ డఖి
లాగమశాస్త్రవిశారదుండు భా
లాక్షుసదృక్షలక్షణుఁ డ
హామ్మతిదూరుఁడు నిర్జితేంద్రియుం
డక్షతసూనృతవ్రతప
రాయణుఁ డింగితవేది మేదినిన్
సాక్షరనామధేయుఁడు ధ
రామరుఁ డొక్కరుఁ డుండు నొక్కటన్.

మాలిని. అతఁడు పురము క్రంతన్ హాళిగా నేఁగి యంతన్
శ్రుతిహితగతిఁ బోడం జూచెఁ దా నొక్కవాడన్
శతదళదళనేత్రన్ జాతరూపాభగాత్రిన్
బ్రతిసుకృతవిరామన్ వారకన్యాలలామన్. 298

శా. ఆలోలేక్షణఁ జూచి సాక్షరుఁడు కా
మాయత్తుఁడై యత్తఱిన్

జాలం దత్తర మంది చిత్తము రిరం
సావృత్తి వర్తిల్లఁగాఁ
దాళంజాలక యావిలాసవతిసాం
దర్యంబుఁ దత్క్రీడలుం
దా లో నెంచుచు నంత నిట్లని మదిక్
దర్కించె నుద్యన్మతిక్. 299

క. ప్రాభినుకు లెల్లఁ జదివితిఁ
గామించెద నిపుడు వారకామిని నకటా
నేమమున నేమి చదివినఁ
గామాంధున కది వివేకకారణ మగునే. 300

మ. బలవత్ప్రాభవ మింద్రియాఘు మది ని
ర్బంధించుచో ధీరచి
త్తులనేనిక్ మఱిఁ గూఁతుతోడనయినం
దోఁబుట్టుతోనైన ని
చ్చలు నేకాంతమునక్ వసింపఁ గడు మో
సం బన్నచో నన్యకాం
తలసాన్నిధ్యమున న్వసించు టఘసాం
తత్యంబు వాటిల్లదే. 301

క. పరనారీసంగమమున
నరయ ననూచానుకులము నాచారంబుక్

బరలోకము దూరము లగు
నిరతము న న్నార్యవితతినింద యొనర్చున్. 302

మ. అని చింతించుచుఁ జిత్తసంభవధను
ర్జ్యాముక్తసూనాస్త్రవే
దనచే నోర్వక యానితంబినిపద
ద్వంద్వార్పితానర్ఘ్యర
త్ననికాయాంచితనూపురంబు లనిశ
స్నానార్ద్రభావాతిపా
వనతాత్మీయశిరోరుభూషణతచే
వర్తిల్లఁగా మ్రొక్కుచున్. 303

క. భూసురుఁడ వేదవిద్యా
భ్యాసం బొనరించినాఁడఁ బండితజనతా
గ్రేసరుఁడ నన్ను మనుపుము
నీసేవ యొనర్తు నింత నిజ మలివేణీ. 304

ఉ. ఓమదిరాక్షి! యోసుముఖి!
యోయరుణాంబుజశోణపాణి! నన్
గాముఁడు నిర్దయుండయి ని
కామశరాహతి నొంచె వంచనన్
నీమధురాధరామృతము
నెమ్మి నొసంగి పొసంగి కామకే

శ్రీమహనీయతాండవము
లెస్సగఁ జూపి ముదాత్ముఁ జేయవే. 305

మ. అని ప్రార్థింపఁగ నానితంబిని నితాం
తాశ్చర్యయై పల్కె నో
యనఘా ! విష్ణుపదానురక్తిఁ జెలువై
యత్యంతసంశుద్ధిజీ
వనసద్భూమిఁ రజోవిఖండనగుణ
వ్యక్తాచ్ఛభావుండవై
ఘనతన్ మీఱిన నీకుఁ జెల్లునె తమః
కాండోద్ధతిన్ వర్తిలన్. 306

సీ. ధారుణీసురుఁడ వధ్యయనపూర్ణుఁడవు కు
త్సితకార్య మిది యని తెలియలేవె
యేవంకఁ జదువఁగ నిడితివి సన్మతి
విద్యాతపోధర్మవృత్తవృత్తి
విను మైహికము క్లేశమునకుఁ దావగు నది
గాన యాముష్మికకాంక్ష యొదవ
క్షణికసుఖంబైన గణికామణీరతి
సద్గతి కెవ్విధిఁ జనియె దీవు

తే. పరసతీసంగమాసక్తిఁ బరగె నేని
ధనము నాచారమును మానధనముఁ గులముఁ

ద్రవయుఁ బొలివోవు లోకనిందయుఁ బొసంగు
నవని నింతకు మిగులంగ నవలఁ గలదె. 307

చ. క్రిమికులసంకులాఢ్య మయి
కేవలమూత్రపురీషపాత్రమై
యమరుచుఁ బూతిగంధయుత
మై శుచి లేక యనిత్యమైన గా
త్రము మలినాలయం బనుచుఁ
బ్రాజ్ఞులు రోయుదు రజ్ఞు లెప్పుడున్
భ్రమఁగొని సౌఖ్యహేతు వని
పాయఁగలేక రమింతు రెంతయున్. 308

మ. పరనారీరత మాయురర్థసుగతి
ప్రజ్ఞల్ దొలంగించు సుం
దరతన్ మీఱు తదీయకక్షకటినే
త్రస్ఫూర్తులుం దత్పయో
ధరముల్ మాంసవికారజంబులు మదిం
దర్కించి యీహేయతా
కరదుష్కర్మము మానుమా శుభసమీ
క్షా భూసురగ్రామణీ. 309

క. అని యాగణికామణి యి
ట్లొనరఁగ బోధించుటయుఁ దదూర్జితమధుర

స్వనరామణీయసంపద
తనవీనులఁ జొచ్చి హృదయతాపము వేఁపన్. 310

శా. మానంజాలక నీతి వో విడిచి ప్రే
మ న్గామమోహాంధుఁడై
దీనారంబులు వే యొసంగి యతఁ డిం
తిం గూడి కేళీరతిన్
సూనాస్త్రం జరితార్థుఁ జేసె నపు డ
చ్చో నివ్విధిం గ్రొవ్వి తా
నానందాంబుధిఁ దేలెఁ గొన్ని దినముల్
హాసాస్పదీభూతుఁడై. 311

సీ. ఆభూసురాభాసుఁ డట క్రమక్రమమున
వారవిలాసినివలలఁ జిక్కి
యొనసి సర్వధనంబు నిచ్చి దరిద్రుఁడై
పూని యర్థార్థియై పురములోనఁ
జౌర్యకార్య మొనర్పఁ జాగిన నయ్యూరి
ప్రజ లెల్ల నతని దుర్మార్గుఁ డనుచుఁ
గళలచేఁ దోలినఁ గ్రమ్మఱ వెత నొంది
యవ్వేలవెలఁదుక నాశ్రయించి

తే. పాదసంవాహనాదిసేవాదరమునఁ
దద్గృహోచ్ఛిష్టభోజియై దానియిల్లు

కన్నపెట్టఁగ నదియు నాగ్రహముతోడ
నిడుమఁ గారించి వాని నిల్వెడల నడఁచె. 312

సీ. పదపడి యాబ్రహ్మబంధుండు చండాల
పుల్కసాంగనలతోఁ బొందు మరగి
యతిజుగుప్సితమతి నఖిలవర్ణాలయ
నికరంబులకు నేఁగి బికిర మెత్తి
పలలకలంజాద్యభక్ష్యభక్షణమున
నలరి యాసవపాన మాచరించి
రేలెల్లఁ జోరుఁడై ప్రోలు గ్రుమ్మరి మఱి
పవలెల్ల నిధువనభ్రాంతుఁ డగుచు

తే. పతితుఁ డైనఁ గనుంగొని పౌరజనత
వీడు వెడలంగనడపిన వెడలి యొక్క
కాననంబున వెలివాడచాయఁ దగిలి
యందు మృగముల వధియించి యమునిఁ బోలి. 313

లయగ్రాహి.
అక్షయధనంబున కపేక్ష యొనరించి నిశి
తక్షురిక కేలఁ గొని రాక్షసుఁడుబోలెన్
దక్షు లగు పాంథులఁ బరీక్షఁ గొని నిర్దయత
రూక్షతరఘోరవిషమేక్షణము లొప్పన్
శిక్ష యొనరించుచు వనక్షితిఁ జరించుమృగ
పక్షివరమాంసము లలక్షగతితోడన్

భక్షణ మొనర్చి సుకృతక్షయకరుం డగుచు
సాక్షరుఁడు వర్తిలె నిరక్షరునిరీతిన్. 314

తే. అంత శతవృద్ధుఁడై యతఁ డనిలపైత్య
కఫవికారాదిరోగసంకలితుఁ డగుచుఁ
గంఠఘుర్ఘురశబ్దంబు గడలుకొనఁగ
మేను గంపింపఁ గన్నులు గాన కపుడు. 315

ఆ. అవ్వనంబు వెడలి యల్లనఁ జనిచని
సరసమైన యొక్కసరసిఁ దఱిసి
నిలిచి దూపటిల్లి నీరానఁ జాలక
పడియెఁ దత్తటమున బడలి యడలి. 316

సీ. మకరాదివాసమై మదనధ్వజమువోలె
హంసానుగతి విహాయసమువోలె
ననిమిషరమణీయమై నాకపురివోలె
నిష్పంకవృత్తి మానిమతివోలె
భ్రమరగీతోద్వృత్తి భాగవతమువోలె
రహిఁ జక్రసహితమై రథమువోలెఁ
శంబరోన్నిద్రమై చంద్రబింబమువోలెఁ
గమలాప్తి శార్ఙ్గివక్షంబువోలె

తే. సత్కవిసమాగమత రాజసమితివోలె
భంగసంగతి దుర్మతిభవమువోలె

లక్ష్మణాదృతి సాకేతలక్ష్మివోలె
రుచిరగతి నెన్నఁ దగుఁ దత్సరోవరంబు. 317

సీ. అచటికి నాసమయంబున నొక్కభూ
సురుఁడు ధర్మవిదుండు శుద్ధబుద్ధి
చనుదెంచి యందుల మునిఁగి సంధ్యాదిస
త్కర్మంబు దీర్చి పాకంబు సల్పి
నీలోత్పలంబుల నీరజాతముల బి
ల్వదళంబులఁ దులసీదళములఁ
జేర్చి మ సీతారామనామసాలగ్రామ
పూజ యొనర్చి సంపూర్ణభక్తి

తే. ప్రబల నైవేద్య మిడి విష్ణుభక్తవితతి
కలర బలివైచి శేషాన్న మారగించి
రామనామకథాసుధారసముఁ గ్రోలి
చనియెఁ గృతకృత్యుఁడై యథాసరణి నంత. 318

క. వటవిటపినికటమున నా
వటముగ వసియించునట్టివాయసయుగ మ
చ్చటికిఁ దీర్థానటమున నా
ర్భటిఁ బడి బలిఁ గొనుచు నెగసి పాటెం బెలుచన్. 319

తే. కాకచంచూపరిచ్యుత మైక డంగి
తత్ప్రసాదకణంబుఁ దీర్థంబుఁ బడియె

సాక్షరునినోరఁ బాఱిణనిర్యాణవేళ
నతఁడు శుద్ధాత్ముఁడై ముక్తుఁ డయ్యె నపుడు. 320

క. విద్యుత్పుంజాభంబై
యుద్యద్గంధవహసఖశిఖోజ్జ్వల మగుచున్
బ్రద్యోతనశుభ్రాంశుమ
హోద్యుతి గల యొకవిమాన మరుదెంచె వెసన్. 321

ఉ. నీలబలాహకాభకమ
నీయశరీరముఁ జంచలప్రభా
జాలపిశంగచేలమును
శంఖసుదర్శనకౌస్తుభంబులున్
బోలఁ జతుర్భుజంబులుఁ బ్ర
భుస్థితిఁ దాలిచి సాక్షరాఖ్యుఁ డ
వ్వేళ సరూపముక్తిఁ గని
వేడుక నెక్కెను వ్యోమయానమున్. 322

తే. అతఁడు మును ఖలుఁడయ్యుఁ దీర్థాంబుకణవి
శుద్ధుఁడై యచ్చరలు దనచుట్టుఁ గొలువ
రత్నభూషణకాంతివిభ్రాజమాన
గాత్రుఁడై యంత విష్ణులోకమున కరిగె. 323

వ. అట్లరిగి రంగత్తుంగతరంగకులసంకులంబు లై సుధారస
ధారాపూరవిరజాఖ్యతరంగిణీ పరివేష్టితంబు లైన సీమా
ప్రదేశంబులవలనను నిరపేక్షిత కమలమిత్రకుముదమిత్ర

వాయుమిత్ర తేజస్సమాజంబులై విశ్వతోవ్యాప్తాత్మీయ
నైసర్గికప్రభావంబుల నద్భుతంబు నాపాదించు గోపురం
బులవలనను ముక్తావితానవితానాలంకృతంబులై హీర
కవాటస్ఫాటికరాజిరాజిత భిత్తికార్వణదర్పణ భాసురంబు
లైన నూత్నరత్నస్తంభకనత్కనకసుందరమందిరంబుల
వలనను భద్రవిద్రుమావక్రశక్రనీలజాలప్రముఖమణిగణ
బద్ధశుద్ధసోపానంబుల రంజిల్లి యమృతమాధుర్యధురీణ
పావనజీవనంబుల సారసౌరభంబులు వెదచల్లు విమల
కమలకైరవకల్హారంబుల విహారంబులు సలుపు చంచ
చ్చంచరీక కాదంబ కదంబ సారసరథాంగవిహంగ మీనా
నూనధ్వానంబుల ముఖరితకకుబంతంబు లయిన యనంత
వాపికాకాసారంబులవలనను సుగంధబంధురఫలభరనమ్ర
కమ్రశాఖాశిఖాసుమనోమనోహరంబులై కాయమాన
మానమానితకల్పకుజకల్పంబు లయిన యనల్పరంభా
రసాలసాలపూగపనసఖర్జూరనారికేళాద్యఖండ వనషండం
బులవలనను వాసుదేవానుభావంబునం జొక్కి తద్దర్శనా
నందమహోత్సవంబునఁ జింత యావంతయు లేక ప్రాజ్ఞు
లై నిఖిలభోగంబు లనుభవించుచు మహాభాగులైన స
ద్భాగవతవతంసంబులవలనను గరంబలరు వైకుంఠపురంబు
సొచ్చి యందు మెఱపులకు నొఱపులు గఱపు నెమ్మేను
లలరగరగరికలు దొడవులకుం దొడవులై యుల్లసిల్ల మరు

నురులసిరుల వఱలి నల్లమొగుళ్ల పెల్లునఁ గప్పంగొప్పుల
నెఱులు తావులక్రొవ్వు లగు సంపంగివిరులసరు లసయం
బునుం బూని వానికి నలికి యులికిన తేఁటిదాఁటుల
నూటాడింపఁ గమ్మఁదనమ్ము గుమ్మరించు తమ్ములఁ
దమ్ము లనం దగి యందమ్ము లయిన నెమ్మొగంబులు
జిగికందునం గుందు నిండుజాబిల్లి నెల్లిదమ్ముసేయ నెలఁ
బ్రాయపుమగకొదమలమొదలఁ దూఱునేరుపున వలరాజు
తూపులకుం బ్రాపు లయిన చూపులు చీకటి నాఁకట
నేఁకటం బడు వెన్నెలపులుగుల సిలుగులం బెట్టఁ బగడం
బుడంబునఁ జక్కెరదీవు లగుమోవుల శేవలు వలరాయని
తత్తడిమొత్తంబులకు దొండపండు లను నిచ్చ నెచ్చరింప
నగవువెన్నెలలువెల్లివిరియించు మోముచందురులచెంతం
బంతంబున నిలిచిన కతంబున విరియకయున్న తమ్మి
మొగ్గల యుద్దిక కొద్దిక లయిన గుబ్బగుబ్బల్లు రేయిఁ
బాయు జక్కవకవల నెక్కసక్కెయంబు లాడఁ
బిఱుందులక్రేఁగున సింగఁపుఁగౌనులు వడంక నల్లనల్లన
నడచు నడపులు మావంతు లిడు వంతలం జిక్కి సింగం
బులదండ నుండక పఱచు నేనికకొదమలనడలఁ బ్రసరి
యొనర్ప నెన్నికగన్న యన్ను లెన్నికకు మిగిలి కలిమి
కొమ్మయెమ్మె నెఱపఁ గనుంగొనుచుం జని చని శంఖ
చక్రగదాహస్తులును గౌస్తుభవనమాలికాపీతకౌశేయాది

శుభవిభవపరిశస్తులును నై సారూప్యంబునఁ దేజరిల్లుచుఁ
దమకుం జక్రికిఁ జిహ్నంబులు నిహ్నవంబు లేక సమం
బయ్యు శ్రీవత్సరహితవక్షంబుల కతంబున భేదంబు
గానుపింపఁ బెంపుమీఱు పార్షదు లనేకవిమానంబు
లారోహించి వెంటఁ నంటి రా గరుడారోహణుండు లక్ష్మీ
పక్ష్మలాక్షీసమేతుండై యెదురుకొని బహూకరింప నప్ప
రమపదంబున నతండు సుఖం బుండె నని చెప్పిన విని
యుదురిండు వెండియు నిట్లనియె. 324

క. గుణదోషవిశేషజ్ఞత.
గుణఖని యనఁ దగినవిప్రకులుఁ డెయ్యది గా
రణముగ దుర్గుణుఁడై గ
ర్హణ మొందె నెఱుంగఁ దెలుపుమా వినవలయున్. 325

తే. అనిన వైవస్వతుఁడు పల్కె నతనితోడ
సద్ధరామరుఁ డాది నత్యంతశుద్ధుఁ
డయ్యు దుర్జనుతోడ సఖ్యం బొనర్చి
దుర్జనుం డయ్యెఁ బిదప నద్భుతనిరూఢి. 326

వ. కావున. 327

తే. దుర్జనునిమైత్రి ధర్మంబు దొలఁగు దురిత
మెక్కుడగు సాక్షరుం డైన హీనమనుజుఁ
బన్నగాశ్రితమణి దుష్టభావుపొందుఁ
బరిహరింపఁగ మే లగుఁ బంచజనుఁడు. 328

ఆ. అవని బండి నైదుహస్తముల్ వీతి నీ
రైదుహస్తములును హస్తి నూఱు
హస్తములుఁ దొలంగ నగు దుష్టమానవు
దవ్వుగాఁ దొలంగఁ దగు నరుండు. 329

క. అవమతి యగు రాజు నుప
ద్రవసహితం బైన వృత్తి రహి నిర్లజ్జ
దవిలిన విధవన్ దుర్జనుఁ
గపగొండక దవులఁ దొలఁగఁగా వలయు బుధుల్. 330

చ. అనిశము వృత్తిహీనుఁ డయి
యాఁకటఁ గ్రుస్సియు విత్తకాంక్ష దు
ర్జనములతోడఁ బొం దమరఁ
జల్పగఁ బోలదు భూతధాత్రి దు
ర్జనుఁడును గృష్ణసర్పమును
సామజముం దటి యైనఁ జంపు నె
మ్మనమున సౌహృదోదయము
మాని యమానితమానసంపదన్. 331

వ. దుర్జను లెట్టివా రనిన. 332

సీ. దేవపూజావైశ్వదేవవిరహితుఁ డై
కొసరి పరాన్నంబు మెసవువాఁడు
వేదశాస్త్రవిరుద్ధవృత్తిచే స్నానసం
ధ్యాదివిదూరుఁ డై నట్టివాఁడు

కదిసి యభక్ష్యభక్షణ మొనరించి స
దాచారహీనుఁ డైనట్టివాఁడు
రూపయౌవనధనరూఢిచేఁ గ్రొవ్వి వి
ద్యామదోన్మత్తుఁ డైనట్టివాఁడు

తే. అగ్నిదుండును గరదుండు నస్త్రపాణి
యన్యవిత్తాపహర్తయు నన్యవనితఁ
గోరువాఁడును క్షేత్రాపహారకుండు
ద్విజులలో దుష్టజనములు త్రిదశవర్య. 333

సీ. జారుఁడు చోరుఁడు షండుఁడు సమయభే
దకుఁడు భూమీసురద్రవిణహర్త
విప్రవిద్వేషియు విప్రనిందకుఁడును
గుండుఁడు బహ్వాశి గోళకుండు
అవిజితేంద్రియుఁడు బ్రహ్మఘ్నుఁడు నీచక
ర్మాభిరతుండు విప్రాధికారి
హింసకుండును గర్మహీనుఁడు ధర్మక
ర్మాంతరాయకరుండు నాతతాయి

తే. జ్ఞానహీనుఁడు నవకీర్ణి యైన వర్ణి
గ్రామసంస్థితఘనవనప్రస్థతతియు
సంగనాధనలోలాత్ముఁ డైనయతియు
దుర్జనులు వీర లమరేశ దురితనాశ. 334

తే. దుర్జనుని లేఖకుని ఘణిఁ దులను నిల్పి
యజుఁడు సరిపడఁ దూన్చె ము న్నట్లు గాన
నేయుపాయంబుచే నైనఁ బాయవలయు
వారి మనుజులు సౌఖ్యంబు గోరి రేని. 335

వ. అనిన నింద్రుం డిట్లనియె. 336

క. చండాలుఁడు ధర నీదృగ
ఖండితపాండిత్యసత్యకలితుఁడె? మాయా
చండాలుండవు నీ వె
వ్వండవు కలరూపుఁ దెలుపవలయున్ మాకున్. 337

తే. అనిన విని యాతఁ డిట్లను నంతకుండ
నేను సంయమనీపురం బేలువాఁడ
ధీరమతి ధర్మజిజ్ఞాసఁ దిరుగునీకు
ధర్మ మెఱుఁగింప వచ్చితి దనుజమథన. 338

క. అని కొంతదడవు రవినం
దనసంక్రందను లొగిన్ మిథస్సల్లాపం
బొనరించి సురలు గొలువఁగ
ననువుగ నిజలోకములకు నరిగిరి వేడ్కన్. 339

క. మును లిద్విధిఁ గథ దెల్పిన
విని చోరుఁడు హర్షవనధి వెలివిరియ వసి
ష్ఠుని మంత్రం బుపదేశం
బొనరింపు మటంచు వేఁడె నురుతరభక్తిన్. 340

వ. అనిన నైమిశారణ్యవాసు లటమీఁదటి కథావృత్తాంతం
బె ట్లయ్యెం దెలుపు మని యడుగుటయు. 341

చ. మరుదరవింద వైరియజమానవియత్సలిలాబ్ధిమేఖలా
హరితహరిప్రభంజనసఖాష్టవిశిష్టతనూవిలాసవి
స్ఫురితజగన్మయత్వపరిశోభిత వైభవ నైభవాఢ్య ది
గ్వరవరమిత్రమిత్రశశివహ్నిసమీక్షణ లోకరక్షణా. 342

క. *శ్రుత్యంతవచోవీథీ
నిత్యాధ్వగసూరిజనవినిర్మలఫణితి
స్తుత్య శిలాదమునీంద్రా
పత్యాచలపుణ్యతమతపఃఫలరూపా. 343

మాలిని. సకలసుజనరక్షా సమ్యగున్నిద్రవీక్షా
ప్రకటితగుణవారా భక్తచేతోవిహారా
యకుటిలతరభావా యప్రమేయప్రభావా
శకలశశికలాపా శశ్వదానందరూపా. 344

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతం బైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

* శ్రుత్యత్యంతవచోవిధి—వ్రా. ప్ర.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## తృతీయాశ్వాసము



శ్రీ తతవక్షఃకలితవి
ధాతృశిరోహార త్రిపురదనుజతమఃప్ర
ద్యోతన శాక్వరకేతన
శీతాద్రిసుతాహృదీశ శ్రీశైలేశా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లనియె నట్లు ప్రార్థితుండై మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుం డమ్మునిముచ్చున కిట్లనియె. 2

క. చోరత్వం బొనరించుచుఁ
గ్రూరాత్ముఁడ వై పుళిందకులజన్ముఁడ వై
కారుణ్యరహితుఁ డగు నీ
కారయ మంత్రోపదేశ మర్హమె చెప్పుమా. 3

తే. ఆస్తికత గల్గి శ్రద్ధచే నతిశయిల్లి
నిత్యకర్మాభినిరతి వినీతవృత్తి
నలరి శుచి యయి విద్వాంసుఁ డైన యవని
దివిజుఁ డర్హుఁడు మంత్రోపదేశమునకు. 4

క. పరహింసయును బరాన్నము
నరుదుగ దుస్సంగతియు దురాలాపము ను*
ద్ధురదుష్ప్రతిగ్రహంబును
వరుసన్ మంత్రార్థి విడువవలయు సుఖాపన్. 5

ఆ. సదయహృదయుఁ డగుచు శమదమవంతుఁ డై
యనఘమూర్తి యగు మహాత్మునకును
నిర్జితేంద్రియునకు నియతి మంత్రోపదే
శంబు సేయఁదగు నయంబు మీఱ. 6

తే. సారహీనుండు గుటిలుండు జడుఁ డశుచియు
నైనవిప్రున కుపదేశ మాచరింప
కచలమతి నన్ను రక్షింపు మనుచుఁ దొల్లి
బ్రాహ్మణునిగూర్చి సావిత్రి పల్కెఁ గాదె. 7

క. ధర మద్యమాంసరతిచే
నిరతము పెంపొందునట్టి నీచాత్ములకున్
హరిహరులు దూరమగుదురు
తిరముగ వారికి మనూపదేశము తగునే. 8

*ను, ద్ధురతరప్రతిగ్రహంబును, న్నుద్ధుతప్రతిగ్రహంబును — ప్రా. ప్ర.

తే. భూసురుఁ గుటిలమతి యని పోవవిడిచి
పొసఁగ శూద్రున కుపదేశ మొసఁగఁదగునె
పాలు పితికెడు నైచికిఁ బాఱఁద్రోలి
రాసభికి నాసపడుదురే వాసి దొఱఁగి. 9

తే. భూసురుఁడు కుత్సితుండైనఁ బూజ్యతముఁడు
నియతుఁ డైనను శూద్రుఁడు నీచజన్ముఁ
డాతనికి మంత్ర మొసఁగిన యవనిదివిజుఁ
డధమగతిఁ జెందుఁ బదపడి యాత్మఁ గుందు. 10

వ. ఈయర్థంబున కుపోద్ఘాతంబైన యొక్క యితిహాసంబు నిఖిలదురితహారంబును గీర్తికరంబును శ్రోతృజనమనోహారంబును నైనయది గల దది యెట్లనిన వేదవేదాంగ పారగుండును సకలశాస్త్రసారగుండును ధర్మిష్ఠుండును గర్మానుష్ఠాననిష్ఠుండును సత్యవాదియు నిత్యమోదియు దీర్ఘయాగియు మహాయోగియు శుద్ధాంతరంగుండును సంత్యక్తసంగుండును జీర్ణపర్ణసమీరనీరనీహారభక్షుండును నిర్జితాత్ముండును రామార్చనపరుండును సుకృతకరుండును నైన భాసురుండైన యొక్క భూసురుం డొక్క నదీతీరంబునఁ బుణ్యాశ్రమంబున వసియించు నదియును ఫలితలలితసారసహకారనారికేళద్రాక్షేక్షు కదళీఖర్జూర ప్రముఖ వనషండ మండితంబును సర్వర్తుకుసుమితచంపక వకుళ మల్లీ తులసీ లసిత ప్రసూనారామాభిరామంబును

గూజత్పికశుకకులసంకులంబును నిరస్తజాతివైరపరస్పరానురాగసమాసక్తహరి కరి హరిణ తరక్షు ముఖ్యజంతుసంతతిసమాక్రాంతకాంతంబును నై నీలకంఠవాసంబు గావునఁ గైలాసంబున కనుప్రాసంబై సుమనోమనోజ్ఞంబగుకతంబున నాకలోకప్రకాశంబై హరివిహారయోగ్యంబగుట వైకుంఠపురంబునకుం దిరంబై గాలవశాండిల్యకౌశికవ్యాసాధిష్ఠానంబు గావున సత్యలోకంబునకు జోకయై భుజంగవిహారక్షమం బయ్యుఁ గాయసంచరణహరణహీనంబై పుణ్యజనాకీర్ణంబయ్యుఁ గారుణ్యశరణ్యంబై యుల్లసితధూమకేతుశతావృతం బయ్యుఁ బ్రశాంతోపద్రవంబై యొప్పు నందు సమద్వంద్వులును జితేంద్రియులును జితాహారులును నియమవ్రతకర్శితులును పదక్రమస్వరసంధివిశేషవేదవిదులును వల్కలాజినవసనులును నైన తపస్వులు పరివేష్టింప నక్కులపతి కృపాఖ్యుండై యవ్వనంబు పరిపాలించుచు నుండు నంత. 11

చ. సుచరితవృత్తి నైన యొక
శూద్రుఁ డుదారత వీతరాగుఁడై
యచటికి వచ్చి యయ్యసఘు
నాశ్రమవాటిక పెంపు నందు న
త్యచలతపఃప్రభావు లగు
నమ్మునిముఖ్యులసొంపు గాంచి త

ద్వచననిరూఢి నచ్చట ని
వాసము సల్పఁగఁ గోరె ధీరతన్. 12

ఉ. ఎచ్చట విద్యయున్ ధనము
నెచ్చట నాత్మసుఖాగమంబు లే
దచ్చట నొక్కనాఁ డయిన
నర్హము గాదు వసింప; బాధ లే
కెచ్చొటు రమ్యమై పరగి
యచ్చట వచ్చు నివాసయోగ్య మా
నచ్చొటు మానవావళికి
నవ్యయసౌఖ్యవిధానదక్షమై. 13

శా. క్రూరుండైన శఠాత్ముఁడైన నతిమూ
ర్ఖుండైన సత్సంగతిన్
సారాచారవిశారదుం డగు జన
శ్లాఘ్యుం డగున్ వృత్తిహీ
నారంభంబున నాధిఁ జెందియును శా
కాహారుఁ డయ్యున్ సుదు
ర్వారప్రౌఢి వసింపఁగాఁ దగుఁ ద్యజిం
పం గాదు సత్సంగమున్. 14

క. హరిభజనంబును భారత
ధరణిం బుట్టువు మనుష్యతయు సత్సేవా

దరనిరతియు ననవరతము
నరయ నకృతసుకృతపరుల కతిదుర్లభముల్. 15

మ. అని యాతండు దదాశ్రమాంతికమునం
దారూఢిచేఁ బర్ణశా
ల నితాంతత్వరఁ గట్టి యందు నధికా
హ్లాదంబుతో నుండె న
మ్మునిసేవాపరుఁడై స్వధర్మనిరతిన్
మోదంబుచే నంతఁ బా
వనుఁడై పాతకజాత మంతయును బో
వంద్రోలి మే లొందుచున్. 16

ఉ. అమ్ముని యొక్కనాఁ డచటి
యాశ్రమవాసులు గానుపింపఁ బా
దమ్ములమీఁద వ్రాలిన ము
దమ్మున నమ్మహాత్మకుండు మో
క్షమ్మున కంతరాయ మని
కానక వానిఁ బరిగ్రహించెఁ ద
థ్యమ్ముగ భ్రాంతి సెందు మఱి
దైవవశంబున నెట్టివారలన్. 17

సీ. తతవివేకులు ప్రమత్తత యుజ్జగింపుదు
రధికార్యమునకు విఘ్నద మటంచు

నది గాన కాధరాత్రిదశుఁడు మత్తుఁడై
యాశూద్రుతోడ సఖ్యం బొనర్చె
నది హేతువుగ మలినాదర్శసన్నిభుఁ
డగుచు నిస్తేజస్కుఁ డయ్యె నపుడు
నీచవర్తనునితో నెయ్యంబు సల్పిన
యతఁడు తేజోహీనుఁ డగుట యరుదె

తే. స్నానసంధ్యాద్యనుష్ఠానహీనజాతి
మాత్రవిప్రాధమునితో దినత్రయంబు
చెలిమిసేయుట గీడనఁ జెనఁటిశూద్రు
చెలిమి గడు మోస మా నని తెలుప నేల. 18

ఆ. నీచసఖ్యములను నిందితకర్మంబు
లాచరించు నెవ్వఁ డాతఁ డవని
నెంతశాంతుఁ డయ్యు నెంతమహామతి
యయ్యు నధమగతులయందుఁ జెందు. 19

ఆ. అంటఁగానిదాని నంటు టభక్ష్యభ
క్షణము సేయుటయు నసభ్యవితతి
తోడఁ గూడి మాట లాడు టపేయపా
నంబు నిరయకారణములు గావె. 20

తే. మొనసి దుర్గంధవస్తువు మూరుకొనుట
నిందితధనార్జనంబును నీచసేవ

తతవణిగ్భావమును దురితంబు లిఖియు
గంగలో గౌతమిని మునుఁగంగఁ దొలఁగు. 21

ఉ. వీతమదుండు నిర్మలుఁడు
విశ్రుతవేదవిదుండు నయ్యు ము
స్నాతఁడు భావిదుర్వ్యథల
కంకురలీల ఘటించు నట్లు శూ
ద్రాతతసఖ్యభావనని
యంత్రితుఁ డయ్యెఁ దలంప నట్ల యా
నేతటి నెంతబ్రహ్మవిదుఁ
డేనియుఁ గర్మముఁ ద్రోయనేర్చునే. 22

చ. అతులితభక్తియుక్తి మెయి
నంఘ్రిజుఁ డమ్మునిరాజసేవ సం
తతమును సల్పుచుండె నతి
ధార్మికుఁడై యట కొన్నినాళ్ళకుం
బితృదిన మేఁగుదెంచుటయుఁ
బ్రీతి దలిర్పఁగ వన్యవస్తువుల్
హితమతిఁ గూర్చి విప్రులకు
నియ్యఁగఁ బూనె ససంభ్రమంబునన్. 23

తే. అమ్మహీసురుఁ డచటికి నరుగుదెంచి
యపుడు విధ్యుక్తముగఁ దత్క్రియాకలాప

మంతయును జేయ నియమించి యాదరమున
నతనిఁ గృతకృత్యుఁ గావించి యంత మఱియు. 24

తే. మంత్రి ముపదేశ మొనరించి తంత్రవిధియుఁ
గఱపె నిరుపమకారుణ్యగరిమ నాతఁ
డట్ల యగుఁగాదె యాత్మార్థ మైన విడిచి
పరులకార్యంబు లొనరించుఁ బండితుండు. 25

క. ఆశూద్రుం డది మొదలుగ
దేశికుఁ డుపదేశ మిచ్చు తెఱఁగున నపవ
ర్గాశఁ స్వధర్మపరుఁడై
ధీశుద్ధిం బ్రిబలి కొన్ని దినముల కంతన్. 26

తే. అంతమును జెంది రాజన్యుఁ డై జనించి
నేల నాలుగుచెఱఁగులు నేలుచుండె
ధర్మమార్గానుసరత; స్వకర్మనిరతు
లైనవారల కౌన్నత్య మబ్బు టరుదె. 27

సీ. శూద్రుఁడు ద్విజసేవ భద్రము ల్గనుఁ దపో
ధ్యానదానక్రియల్ పూన నేల
సతులకుఁ బతియును సచ్ఛాద్రితతికి ధ
రామరుఁడును దైవ మర్హ్యసరణి
నేతదన్యం బైన హీనధర్మలకును
భువిఁ దత్ఫలంబులు పొందు నెట్లు

స్వస్వధర్మావాప్తి వర్ణాశ్రమములకు
స్వర్గాపవర్గముల్ సవధరించు

తే. పాదజుం డేడఁ జతురంగబలసమృద్ధ
రాజముఖ్యాన్వవాయసంప్రభవ మేడ
నీచతరులు ద్విజాశ్రయనిష్ఠకలిమిఁ
గాంతితరు లయి సన్నుతిఁ గాంతు రిట్లు. 28

ఆ. అమ్మహీసురుండు సవకార్యకరణత
వేదశాస్త్రవృత్తి ఫీటిఫోవఁ
దపము నిష్ఫలముగఁ దత్పురోహితుఁ డయి
పుట్టె నంత మందబుద్ధి యగుచు. 29

ఉ. ఎవ్వఁడు జన్మసన్మహిమ
నిద్ధతపంబునఁ జెన్ను మీఱుఁ దా
నెవ్వఁడు ధర్మకర్మముల
నింపగు నాతఁడు నీచసేవచే
నవ్వల ముక్తిఁ జెందఁగ న
నర్హుఁ డగుః మఱి సందియంబు లే
దివ్వసుధామరుండె గుఱి
యీదృగనర్థఫలానులబ్ధికిన్. 30

సీ. ఇత్తెఱంగునఁ బురోహితుఁ డై జనించి య
ఖర్వవిద్యావిచక్షణత మెలఁగ

భూవిభుండును నిజపుణ్యవశంబున
జాతిస్మరత్వవిఖ్యాతి గలిగి
యావిప్రి నొక్కనాఁ డభివీక్ష యొనరించి
తమమిథోజన్మవర్తనము లరసి
యితని తేజస్సమున్నతియు విజ్ఞానంబు
మత్సంగదోషసామగ్రికతనఁ

తే. బొమ్మఁ బ్రిద్యోతనోదయస్ఫురణవలన
తుహిన మణఁగినకైవడి నహహా యిట్టి
యవనిసురసత్తములకు నీచానుసేవ
యవనిఁ బాతిత్యకారణం బగుఁ దలంప. 31

చ. అని మది నెంచి దానసమ
యంబున మంత్రవిధిజ్ఞు నాతనిం
గనుఁగొని నవ్వె నవ్విటయుఁ
గాంచి యవాఙ్ముఖుఁడై యపత్రపా
వనధి మునింగి యింటికి న
వారణమైఁ జనుదెంచి రాజున
వ్వనకు నిదాన మాఱయఁగ
నోప కతండు వగం గృశించుచున్. 32

ఉ. అమ్మఱునాఁడు రాజనిల
యంబున కెప్పటి యట్ల యేఁగి దా

సమ్ము ప్రతిగ్రహించుతఱి
నవ్వె నతం డది కారణంబుగాఁ
గ్రమ్మఱ లజ్జితుం డగుచు
గౌరవహీనతఁ జెంది కుంది గే
హమ్మున కేఁగి నిద్దురయు
నన్నము మున్నుగ మాని దీనతన్. 33

క. ఇవ్విధమున దినదినమున్
నవ్వఁగ రాజన్యునవ్వునకు హేతువు తా
నెవ్వలన నరసి కానక
యవ్విప్రుం డొకవివిక్త మగుసమయమునన్. 34

వ. అమ్మహీపాలున కిట్లనియె. 35

సీ. అఖిలజనస్తుత్య మైనయనూచాన
వంశసంభవుఁడనై వఱల ననియొ
ఘనతర శ్రేయఃప్రకారణం బగుపురో
హితకృత్య మంతయు నెఱుఁగ ననియొ
వేదవేదాంగాదివిద్యార్థజాతంబు
ధీవిశారదుఁడనై తెలియ ననియొ
బాల్యచాపల్యంబుపస మంత్రితంత్రవి
స్ఫురణంబు తడఁబాటు వారయు ననియొ
తే. స్నానసంధ్యాదికర్మముల్ సలుప ననియొ
వేలతన మేమి గాంచితివో నేఁడు చేసి

నవ్వెదవు రాజకుంజర నన్నుఁ జూచి
తెలుపు మక్కారణంబు సందియము దీఱ. 36

చ. అనుడు నృపాలుఁ డిట్లనియె
నన్నిటఁ బూజ్యుఁడ వీవు నీకు నా
కును గిరిసర్షపాంతరము
గోరి యొనర్చితి మున్ను నీపదా
ర్చన మిటు పూర్వజన్మమున
సంస్మృతి దాన జనించె నాదున
వ్వునకును గారణం బదియెఁ
బో వచియించెదఁ జిత్తగింపుమా. 37

తే. నేను మును శూద్రకులుఁడనై నెవ్వఁ జెంది
వృత్తిహీనతఁ గుంది దుర్వృత్తిఁ గోర్చి
బికిర మెత్తఁగ నదియును బెట్ట కపుడు
నాగరులు నిర్దయాత్ములై ననుగుఱించి. 38

క. వడి గలిగినవాఁడవు లే
వడి వందఁగ నేల భారవహ మొనరింపం
గడి మాడసేయు భోజన
మిడుదుము భిక్షాటనం బి దేలా నీకున్. 39

సీ. అని యుల్లసము లాడి హాసం బొనర్చిన
నాఁకట నలఁగుచు నడవి కరిగి

యందు ఫలంబుల నాహార మొనరించి
వనచరసాహాయ్యమున వసించి
యల జుగుప్సితమైన యాటవికమ్లేచ్ఛ
శబరదుస్సంగతిఁ జాల రోసి
సత్సంగమముఁ గోరి చని యొక్కమునిపతి
యాశ్రమావనిఁ గని యచట రుచిర

తే. కిసలకోరకసత్ఫలకుసుమవిసర
భరనమితపాదపాంచితోపవనవాటి
యఖిలజంతుమనోహరం బగుటఁ గాంచి
యది నివాసార్హ మగు నని యాత్మ నెంచి. 40

తే. ఇదియు దేవగణపార్శ్వ మీడ్యమహిమ
నహహ ననుబోఁటిదురితాత్ము లైనయట్టి
హీనజన్ములు చేరఁబోల దేమొ యనుచుఁ
గొంకి యల్లనఁ జొచ్చితిఁ గోరి కలర. 41

క. ఫలమూలజీర్ణపర్ణా
నిలఖరకరకిరణజాలనీహారాహా
రులు శాంతిదాంతినిష్ఠులు
జ్వలనాధికతేజు లందు వసియించుమునుల్. 42

శా. ఆమౌనీంద్రులదర్శనంబున మనం
బానందవిస్ఫూర్తిచేఁ

కామక్రోధవివర్జితం బగుడు ను
త్కంఠం దదీయాంతిక
శ్రీమత్పుణ్యతరంగిణిన్ మునిఁగి సు
స్నిగ్ధద్రుమచ్ఛాయలన్
సామోదంబున నున్న నన్ను ఋషిక
న్యల్ గాంచి కారుణ్యతన్. 43

తే. భిక్ష మారసి యొసఁగ సంప్రీతి మెసవి
యంతఁ దత్రత్యమానిజనాంఘ్రిసేవ
యాచరించుచు వారలయనుమతమున
నధివసించితిఁ గొన్నినాళ్ళులఘుచరిత. 44

క. ఆసౌఖ్యము వాసవునా
వాసంబున నచ్యుతునినివాసంబునఁ గై
లాసంబునఁ బరమేష్ఠిని
వాసంబున లేదు విప్రవర యూహింపన్. 45

తే. అంతఁ గ్రమమున నయ్యాశ్రమాధినేత
యైన కులపతిదర్శనం బాచరించి
సేవ సలుపఁ గృపాళుఁడై చేసె నతఁడు
మంత్రతంత్రోపదేశంబు మహితలీల. 46

క. దీనుం గృపణు దరిద్రుం
బూని సుహృద్భావ మెలయఁ బురుషప్రవరుల్

ధీనిధులఁ జేయుదురు స
న్మానించి దయారసార్ద్రమానసు లగుటన్. 47

తే. అతనిసన్నిధి సన్నిధి యగుచు నన్ను
నిట్లు క్షితిపతిఁ గావించె నేమి చెప్ప
నమ్మునీంద్రుఁడు నీవె సు మ్మనఘ! మనకు
నిట్టిపుట్టువు లొనగూడె నిరువురకును. 48

క. భావింప సేవ్యసేవక
భావము దుష్కర్మమున విపర్యయ మొందుం
గావున నకర్మకరణత
భూవిబుధుం డధమగతులఁ బొందుట యరుదే. 49

క. విను మాపదతతినైనన్
మనుజుఁ డకృత్యంబు సేయమాని యనిశమున్
వినుతశ్రుతిహితకర్మముఁ
బనుపడి యొనరింపవలయు భద్రాపేక్షన్. 50

వ. అనిన విని పురోహితుం డాపత్కాలం బెయ్యది యదియును ధర్మాధర్మంబులును నీ వెఱుంగుదేని యెఱింగింపు మనిన నమ్మహీపతి యిట్లనియె. 51

సీ. తనతండ్రిగూర్చిన ధనము భూమియుఁ దోఁట
ప్రభుసన్నిధియు నిరుపద్రవములు
నింద్యకర్మము సేయు నీచాత్మకుఁడు రాజ
దండనార్హుం డగుఁ దలఁచి చూడ

ధన మొనగూర్చు విద్యయుఁ దపంబును హీన
మైన నాపత్కాల మదియె చువ్వె
యపకార్యకరణత నర్థ మార్జించిన
నదియు నాపత్కాల మనఁగఁ జెల్లుఁ

తే. ప్రభువు దుర్మార్గవర్తియై బాంధవులు ని
రర్థకరు లయి క్షేత్రధనాదికము వి
నాశమునఁ జెందె నేని యద్దేశవసతి
యనఘ యాపద్దశాహ్వయం బగు నిజంబు. 52

తే. అన్యధర్మపరిత్యాగ మాచరించి
నైజధర్మజ్ఞుఁ డై పరాన్నంబు గొనక
శాస్త్రనిష్ఠాగరిష్ఠుఁ డై సత్యసంధుఁ
డైనవిప్రుని నుతియింతు రమరవరులు. 53

మ. సమరక్షోణులఁ గొంకులేక యనల
స్ఫారోగ్రశాతాస్త్రవ
ర్షముచే వైరుల నోర్చుభూపతి ప్రశం
సాయోగ్యుఁ డాయుత్తమో
త్తముఁ డింపార వసించుదేశము పవి
త్రం బాతఁ డాత్మీయధ
ర్మమునన్ విష్ణుపురాధివాసుఁ డగుఁ బే
ర్మన్ సాన్వయుండై తగన్. 54

క. ధరణీవిబుధుఁడు శూద్రున
ఉరుతరమంత్రోపదేశ మొసఁగవలవ దు
ర్వర నిట్లు చేసెనేనియుఁ
బరలోకము దూర మగు విపద్దశఁ జెందున్. 55

మ. అని పల్క న్విని యాపురోహితుఁడు భూ
పాగ్రేసరుం జూచి యి
ట్లనియెన్ శూద్రుఁడ వీవు కర్మతతి సే
యంగాదు నీ కెవ్విధం
బున రాజత్వము గల్గెఁ దెల్పు మనఘా
ము న్నన్యకర్మాప్తి చే
జనముల్ తామసయోనిఁ బుట్టుదురు సం
సారవ్యథాఖిన్నులై. 56

సీ. అనిన భూపాలకుం డతని కిట్లను విను
వినుపింతు నట్ల యవ్విధము దెలియ
నంఘ్రిజన్ములకు ధరామరశుశ్రూష
పరమధర్మం బగు భవ్యచరిత
యతఁడు తదన్యకర్మానురక్తి మెలంగఁ
బాతిత్య మగు నని పల్క విందు
నది గాన నిజధర్మ మ్మై విలసిల్లిన
విప్రసేవాదిసత్ప్రీతికతన

తే. రాజ వై పుట్టి జాతిస్మరత్వమహిమఁ
దేజరిల్లితి శూద్రోపదేశకలన
వలనఁ బౌనర్భవప్రాప్తి గలిగె నీకు
నియతిఁ గైవల్యమును జెందనేర వైతి. 57

క. భూవిబుధుఁ డన్యకర్మం
బావిలమతి నాచరించి యశుచి యగు న్మా
న్నీ వకళంకుఁడ వయ్యును
ధీవర మాలిన్య మొందితి వకృత్యకృతిన్. 58

క. అని నరపాలుఁడు దెల్పిన
విని విప్రుఁడు పూర్వజన్మవృత్తము సకలం
బును బ్రత్యక్షముగాఁ గని
ఘనతరచింతాబ్ధి మునిఁగి కళవళపడుచున్. 59

క. మును దననిక్షేపార్థము
గనరాని తెఱంగు దెలియఁగా నిశ్వాసం
బొనరించుచు రాజన్యుని
గనుఁగొని యిట్లనియె దైన్యకలితాననుఁడై. 60

తే. ఆశ్రమస్థుండనై యున్న యతులనిష్ఠ
యడఁగి నరపాల స్వప్నభ్రమైంద్రజాల
మాయ తెఱఁ గయ్యె నీసఖ్యమహిమవలన
నెద్ది గతి యేమిసేయుదు నెద్దుఁ జూపు. 61

వ. అని యివ్విధంబునఁ దన్ను నిందించుకొను పురోహితుం గని రాజిట్లనియె నీశ్వరునిసంకల్పంబు బలవత్తరం బజ్ఞానవంతుం డగు జీవుండు స్వతంత్రుండు గాఁడు, అజ్ఞానంబున నహమ్మతి యుదయించు నందుఁ బదునాల్గులోకంబులు భ్రమఁజెందు సాగరంబునఁ గులకుధరంబులు నణఁగు రేణువులుం దరతమభావంబు లేక మునుంగు తెఱంగున నమ్మాయాసాగరంబున బ్రహ్మాదిపిపీలికాంత జంతుసంతానంబులు మునుంగు స్వేచ్ఛాకల్పితశరీరుండై పరమాత్మ యగు రాఘవుండు బాలుండు బొమ్మల నాడించు కైవడి స్థావరజంగమంబుల నిజేచ్ఛాంగ్రీడాపరత నాడించు బ్రహ్మాదిదైభవంబు లతనిమాయావినిర్మితంబులై తారతమ్యకర్మంబుల విలసిల్లు జీవాదృష్టసహాయంబున జగంబు సృజియించి స్వయంప్రకాశుండైన యయ్యీశ్వరుం డందుఁ బ్రవేశించి కర్తయుం గార యితయు నగు జీవాదృష్టంబు సుకృతదుష్కృతసంజ్ఞల నిరుతెఱంగై యొప్పు నందు సుకృతంబున దేవత్వంబును దుష్కృతంబున నీచజన్మంబును దదుభయకర్మంబుల మనుష్యత్వంబునుం గల్గి భోగసంపత్తియు నిరయవాసంబును జెందును రామమాయామోహితులై పుణ్యంబు సేయక యేతత్ఫలం బపేక్షించియుఁ బాపంబుసేయుచుఁ దత్ఫలంబు గోరకయు నిట్లుండు రనిన విప్రుం డిట్లనియె. 62

తే. ఈశ్వరుఁడె కర్త యేనియు నేల సేయు
నొకనిఁ బాపాత్ము నొక్కని సుకృతమతిగఁ
బక్షపాతంబుగలదె యాప్రభుని కెందు
జనమునకుఁ బుత్త్రు లందఱు సములు గారె. 63

వ. అనిన నరపాలుం డిట్లనియె. 64

సీ. అత్తెఱం గెఱిఁగింతు నవనీసురోత్తమ
తెలియంగ వినుము సందియము దీఱ
నిగమంబు లీశ్వరనిశ్వసితములు త
ద్వచనముల్ విధినిషేధములు దెల్పుఁ
దత్ప్రవర్తననివర్తనవిధానంబున
నిఖిలలోకంబులు నివ్వటిల్లి
యొనరుఁ గావున సకలోపాధివర్జితుం
డయి సాక్షి యగు పరమాత్మ యంద

తే. రూఢ మై యుండుఁ గర్తృతారోపణంబు
నిజముఖవినిస్సృతంబులై నెఱయు శ్రుతులు
కర్త లగుట నతండు దాఁ గర్త గాఁడె
సైన్యముజయంబు భూపాలుజయము గాదె. 65

తే. అనిన భూసురుఁ డిట్లను నతనితోడ
నట్లు సకలజగత్సాక్షి యైనశివుఁడు
వేదములు లేక కర్తయై వెలయరాదె
తా స్వతంత్రుండు గాఁడె యుత్తమచరిత్ర. 66

వ. అని యడిగిన నతనికి భూపాలుం డిట్లనియె వేదంబులు
నిర్మింపక యున్న మర్యాదాతిక్రమంబై జగం బంధుం
డై సపాంథుం డడుగడుగునం బెడురీతి నడవనేరక యడంగు
వేదోక్త మార్గంబునఁ జతుర్ముఖుండు చరాచరం బైన
జగంబు సృజియించు లోకపాలకమనువసుగ్రహతార
కంబులును వసిష్ఠవాలఖిల్యపరాశరరోమశమార్కండేయ
పర్వతనారదప్రభృతు లయినమహర్షులును పృథుభగీరథ
యయాతి దిలీప నహుష రఘు కల్మాషపాద భరతాదు
లయినరాజర్షులును వేదజ్ఞానంబునం బుణ్యంబు లొనరిం
చుచుఁ బాపంబుల నివర్తింపుదురు గావున నప్రమత్తుండై
వేదవిహితపుణ్యకర్మంబులు సేయునతండు కృతకృత్యుం
డగు వేదంబు నాదరింపక ప్రమత్తుం డగు నతండు దుర్గతిం
జెందు భగవంతునకు సుకృతదుష్కృతప్రేరకత్వంబు
సమానంబు పుణ్యపాపంబులకు వేదజ్ఞానంబె కారణం బని
యెఱుంగు మనినం బురోహితుం డిట్లనియె. 66

క. ఏ నీక నెద్ది యొనర్చిన
భూనుతగతి బ్రహ్మభూయమును జెంది యజ
స్రానందంబునఁ బొదలుదు
భూనాయక యవ్విధానముం దెలుపు దయన్. 67

సీ. అనిన ధరిత్రీశుఁ డతనికి నిట్లను
బ్రాహ్మణ్య మతిదుర్లభంబు సువ్వె

నరులు విప్రత్వంబు తరులు యూపత్వంబు
పశువులు గోత్వంబుఁ బడయఁగోరుఁ
బదిజన్మముల వేదభాసురుం డగు వేద
విదుఁ డగు శతజన్మవిలసనమున
నాధాని యగును సాహస్రజన్మంబుల
మఖి యగు లక్షజన్మముల నంత

తే. నుత్తమబ్రాహ్మణత్వసంయుక్తిఁ దనరు
భూసురుఁడు దాన విజ్ఞానపుణ్యకలన
బ్రహ్మభూయంబు జెందునే భవ్యచరిత
వేదశాస్త్రపురాణసద్వృత్తి దొఱఁగి. 68

ఆ. ఇత్తెఱంగుఁ దెల్పు నితిహాస మొక్కటి
గలదు వినుము నిఖిలకలుషహరము
మును మతంగుఁ డనఁగ మునితుల్యుఁ డొక్కభూ
సురవరుండు గలఁడు శుద్ధబుద్ధి. 69

శా. ఆతం డధ్వరకర్మకర్తలకుఁ దా
నార్త్విజ్యముం జేయుచున్
శ్రౌతస్మార్తవిధిజ్ఞుఁడై నిఖిలదే
శస్తుత్యసద్వీర్యుఁ డై
ఖ్యాతాఘుండు వినిర్జితేంద్రియుఁడు సం
తుష్టాంతరంగుండు నై

ఖ్యాతి సర్వమహీసుపర్వనృపలో
కాచార్యుఁడై వర్తిలుఁ. 70

తే. సతత మార్యానురంజనచతురుఁ డగుచు
మఱియు ద్విజరాజశేఖరమహిమ గాంచి
యలరి సర్వజ్ఞతాఖ్యాతి నతిశయిల్లె
నతఁడు కేవలమనుజుఁడే హరుఁడు గాక. 71

తే. మఖము సేయుచు నొక్కచో మౌనివరులు
యాజకత్వం బపేక్షించి యతనిఁ బిలువఁ
బనుపుటయు దూతజనులసంప్రార్థనమున
నపుడు గమనోత్సుకుం డయ్యె నచటి కంత. 72

క. ఖరికిని హరికిని బుట్టిన
యురుతర మగు వేసడముల నొగిఁ గట్టినయొ
క్కరదంబు నెక్కి యతిస
త్వరమున రొప్పుచును నమ్మతంగుఁడు చనఁగన్. 73

తే. అందు నొకవేసడంబు నిజాత్మజునకు
స్తన్య మొసఁగుచు నిల్వ నతండు కోప
తామ్రముఖుఁ డయి కశఁ గొని దాని నేయ
నదియు ననిలజవంబున నరుగఁజొచ్చె. 74

వ. అప్పు డప్పిల్లయు నాఁకట నలంగి నడువనేరక నిజజనని
యగువామిం జూచి గద్గదస్వరంబున నిట్లనియె. 75

శా. తల్లీ! యాఁకటిఁ జెంది దూపటిలి సం
తాపంబునం గుందు నన్
జెల్లంబో యిటు లుజ్జగించి చన మె
చ్చే యన్యకార్యత్వరో
ద్యల్లీలన్ సుతమోహముం దొఱఁగ నా
యంబే దయాహైన్యచి
త్తోల్లాసంబున రామరామ దురితో
ద్యుక్తిం బ్రవర్తిల్లుదే. 76

మ. అనినన్ గర్దభి వాని కిట్లనియె వ
త్సా! నేఁ బరాధీననై
చనుదుష్కర్మ మొనర్చితిన్ మొదల నీ
చండాలుఁ డింపొంద నె
క్కినయానంబు వహించి నిల్వనగు నే
క్రీడానురక్తిన్ గవా
శనచండాలురఁ గొల్చువారలకు నై
జంబుల్ గదా దుర్వ్యథల్. 77

ఆ. ఇట్లు వెతలఁ గుంది తే మన మనతొలు
బాముసందు ఘోరపాపవితతి
సలిపినార మగుటఁ జండాలుఁ డెక్కిన
రథము తిగియఁదగిథెరా కుమార. 78

వ. అని యూరార్చినయవసరంబున మతంగుండు సర్వజీవ
భాషాభిజ్ఞుండు గావున నవ్వచనంబులు విని విస్మితుండై
యరదంబు డిగ్గ నుఱికె యిది దేవతాస్వరూపం బగు నని
యగ్గర్దభికిం బ్రదక్షిణంబుచేసి యిట్లనియె. 79

చ. పొదలి విశిష్టవిప్రజన
పూజ్యమహాకులసంభవుండనై
చదివితి వేదశాస్త్రములు
శ్రౌతము సర్వము నభ్యసించితిన్
సదమలనిత్యకర్మములు
సల్పుదు మత్సము నెందుఁ గాన నే
ర్పొదవె సమస్తవిద్యల న
యో నను నీగతిఁ బల్కఁబాడియే. 80

సీ. సంధ్యాదిసత్కర్మసమితి యుద్వాసింప
శాస్త్రార్థవిదుల దూషణము సేయ
నవనీశసభ విప్రు నాక్షేప మొనరింప
నారామవిచ్ఛేద మాచరింప
యతిథుల కొసఁగక యారోగిణముసేయ
నవనీసురద్రవ్య మపహరింపఁ
దతపాపమతి గృహదాహంబు గావింప
స్త్రీగోద్విజులఁ దిరస్కృతి యొనర్ప

తే. నగ్నిగురుయతిశుశ్రూష యాదమఱవ
నొనర నాత్మీయకర్మంబు లుజ్జగింప
నన్యజాతీయ మగుకర్మ మాచరింప
నేల చండాలుఁ డనియె దీవేల నన్ను. 81

మ. అనినన్ గర్దభి పల్కె నీ వనుట త
థ్యం బీవు శాస్త్రార్థచిం
తను గర్మం బొనరింతు గాని విను మం
తస్సారహీనుండ వె
ట్లనినన్ భూసురకాంత మంగలికి నె
య్యంబార ని న్గాంచెఁ గా
వునఁ జండాలుఁడ వౌదు సందియము లే
దూహింప నిప్పట్టునన్. 82

తే. అనినఁ గటకటఁబడి యిట్టు లనియె నతఁడు
జాతిచండాలి వీ వంటఁజనునె నిన్ను
నవని గర్దభకాకగృధ్రాదికముల
నంటి తానంబు గావింప నర్హ మండ్రు. 83

ఆ. దేవదారుయూపదేవలచండాల
చర్మకారదురితకర్మలోహ
కారరజకకుంభకారకువిందుల
ముట్టిరేని నీర మునుఁగవలయు. 84

క. అగ్రజునకన్న మును పా
ణిగ్రహణం బాచరించునీచు వికర్ణో
దగ్రుం గృతఘ్ను దూషకు
నగ్రమునం గాంచి జలము లాడఁగవలయున్. 85

ఆ. నీచజాతి వయ్యు నింద యొనర్చెద
వకట నన్నువంటియార్యజనుల
నెరయు వైరబుద్ధి నీ వనుమాటలు
పాటిసేయఁదగునె పలుకు లేల. 86

వ. అనిన గర్దభి యతని కిట్లనియె. 87

క. నిను నిందసేయుదునె యే
నొనరఁగ నీపట్లు నాకు నొంటేమి తగ దే
లినవానిం దూషించి శ
మనపురియాతనలఁ గుందుమనుజులఁ గనమే. 88

సీ. నీకూరిరవృత్తిచే నిర్ణయించితి నీదు
హేయదుర్జన్మం బ దెట్టి లనినఁ
బేరెండఁబడి దగ నోరెండనాచిన్ని
కోపుర్రుసకును జనుగుడుపనీయ
కదలించి నొంచితి వదయత బాలెంత
యక్కట దుర్బల యనక కినుక
దృఢశక్తి గలిగిన తెలవల కయిన తూ
పటు బలంబు వ్రిస్సూతి యగుటకేతనఁ

తే. బుత్త్రవతు లైన సతు లెల్లఁ బురుషులకును
దయకుఁ బాత్రము లగుటఁ దద్రక్షణంబు
సేయువారలు నాకంబు చేరి నిఖిల
సౌఖ్యములు గాంతు రందు నిస్సంశయంబు. 89

క. హృదయం బదయం బయి నీ
కొదవెఁ గశాఘాతముల నయో నొంచితి వీ
విధి మృత్యువుగతి నిట్లా
పదఁ జెందితి నడువ నెట్లు పదములు వచ్చున్. 90

తే. ఇట్లు కష్టంబు నొందితి మేమి చెప్ప
నోయి నీకతమునఁ దనయుండు నేను
నట్లు గావునఁ గ్రూరకర్మాభిరతుఁడ
వీవు చండాలజన్ముఁడ విది నిజంబు. 91

క. అన విని భగ్నోత్సాహం
బునఁ గ్రిమ్మఱి యాత్మనిలయమునకు నరిగె నా
య్యన నతఁ డయ్యెడ జనకుం
డనఘా కుశలంబె నీకు నని యడుగుటయున్. 92

ఆ. అప్పు డవనతాస్యుఁ డై కుశలంబు నా
కిట్టితల్లి గలుగ నేమి బ్రాఁతి
యనుచుఁ బల్కి యొకరహఃప్రదేశమునకు
నాపెఁ జీటి యిట్టు లనియె నతఁడు. 93

క. అనులోమంబునఁ బుట్టిన
తనయులకున్ ముఖ్యజాతి దగుఁ బ్రతిలోమం
బునఁ గలిగినతనయులకున్
వినుమీ చండాలజాతి విస్పష్ట మగున్. 94

తే. క్షత్త్రియాంగన విప్రునిసంగమమునఁ
గనిన యాత్మజుఁ డుత్తమక్షత్రియుండు
భూసురాంగన క్షత్రియుపొందువలనఁ
గనినతనయుండు మానవాఖ్యాతి నమరు. 95

క. నీవలనం బుట్టిన నా
కేవపుఁజండాలజన్మ మేగతిఁ గలిగెన్
నీ వడఁచిన నాజన్మం
బావల గర్దభి ప్రకాశ మగునటు చేసెన్. 96

తే. ఎవ్వనికులంబు జన్మంబు నెఱుఁగఁబడవు
వానినడవడి నెఱుఁగంగవలయు నవియుఁ
దనదుచెయ్వులు దాఁపఁగ ననువు గాదు
యతికి నైనను ధారుణీపతికినైన. 97

క. ఆచారంబున జాతియు
నాచేష్టల శీలమును విహారాదిలస
త్ప్రాచుర్యంబున జన్మము
ధీచతురతఁ దెలియ నగును ధీవరులు తగన్. 98

చ. జనని యెఱుంగు నాత్మజుని
జన్మముచందము నట్లుగాన నా
జననివి దుష్టచారిణివి
సత్యము దెల్పుము నాదుజన్మ మే
యనువున నయ్యె మిథ్యఁ దగ
నాడితి వేనియు నంతకాలయం
బున వసియించి యాతనలఁ
బొందెదుసూ యిదె చాటిచెప్పెదన్. 99

క. అని తను నిర్బంధించిన
తనయునిఁ గని జనని గొంతదడపునకుఁ దగ్రిపా
వనతాననయై గర్దభి
యనినతెఱఁగు నిక్క మనుచు నల్లనఁ బల్కెన్. 100

క. ఆపలుకులు విని యంత
స్తాపము గదురంగ నమ్మతంగుఁడు ధైర్యం
బేపఱ బ్రాహ్మణ్యమునకు
నై పూనెం దపముసలుప నటవి దిటముగన్. 101

మ. చలికాలంబున నీరమధ్యమున వ
ర్షావేళ బైల న్సము
జ్జ్వలితోష్ణాగమవేళ నగ్నినడుమన్
జా నొందఁగా నిల్చి ని

శ్చలనిష్ఠం దప మాచరింప దివిష
త్సంఘంబుతో నింద్రుఁ డి
మ్మల నేతెంచి ప్రసన్నుఁడై పలికె స
మ్మోదంబు సంధిల్లఁగన్. 102

క. ఘోరతపం బొనరించితి
వారా యిఁకఁ జాలు వత్స యతులితగతి బ్రం
దారకలోకానందం
బారూఢిగ ననుభవింప నరుదెమ్ము తగన్. 103

తే. అనిన నాతండు పల్కె నోయమరవర్య
నాతపంబున కీవు సంప్రీతి నొందె
దేని బ్రాహ్మణ్య మొసఁగుము త్రిదివసౌఖ్య
మేఁటి కేనొల్ల ననుడు దేవేశ్వరుండు. 104

క. త్రిదశులకైనను దుర్లభ
మది యెవ్విధి నొసఁగఁబొసఁగు నని పనివినియెం
బదపడి యతండు నలువన్
మది నిల్పి తపం బొనర్చె మహితసమాధిన్. 105

క. ఒకమాస ముపవసించియు
నొకమాసము నీరుగ్రోలి యొకమాసమునం
దొకయామునఁ దినియు నీగతి
నకుటిలమతిఁ దపముచేసె నమరు లరు దనన్. 106

చ. అపుడు ప్రసన్నుఁడై జలరు
హాసనుఁ డెంతయు ఘోరమైన నీ
తప మిఁకఁ జాలు నామది ము
దం బొదవెన్ భవదిష్టభోగముల్
కృప నెలఁగన్ సమగ్రముగ
నిచ్చెద వేఁడు మనంగ నంత న
త్తపస్వి ధరామరత్వ ముచి
తంబుగ నిమ్మని మ్రొక్కె మ్రొక్కినన్.

సీ. అప్సరోవనితలు నతులభూషణములు
మానాధికవ్యోమయానములును
సర్వభోగమ్ములు సర్వజ్ఞతయు వార్ధి
పర్యంతరాజ్యాధిపత్య మైన
నిచ్చెద బ్రాహ్మణ్య మిఁకఁజాల నతిదుర్ల
భము దేవదానవప్రతతి కైన
సర్వజన్మములకుఁ జరమంబు బ్రాహ్మణ
జన్మంబు దేవతాశ్రయుఁ డతండు

తే. వేదశాస్త్రాదివిద్యల వెలయునతఁడు
స్నానదానాదికక్రియల్ సలుపు నతఁడు
తత్ప్రభావంబు వర్ణింపఁ దరమె యంచుఁ
గమలసంభవుఁ డాత్మలోకమున కరిగె. 108

వ. వెండియు నమ్మతంగుం డుడుగక యొక్కసంవత్సరం
బుపవసించి యొక్కదినంబున నాహారంబు గొనుచుఁ
దిృషవణస్నానంబు గావించుచు మౌనవ్రతంబు పూని
విష్ణుపూజాపరాయణుం డయి యనేకసహస్రవర్షంబు
లద్దేవునింగూర్చి పరమదుష్కరం బగుతపం బాచరించు
చుండె నిట్లుండఁ బెద్దకాలం బరిగినయనంతరంబ. 109

సీ. మేలిమబ్బులచాలు నేలఁజాలినడాలు
గలిగిననెమ్మేనిచెలువ మమర
నందుఁ బాయక పొందు నిందుకందువఁ జెందు
మెఱపన సిరు లిచ్చు తెఱవ దనర
మట్టుగా నట గట్టుచట్టుపల్ దెగఁగొట్టు
సామివి ల్లనఁ గేల శార్ఙ్గ మమర
దాన మానవిసోనవానమానమున
ననూనకృపారస ముల్లసిల్ల

ఆ. నెమ్మి గ్రిమ్మి చెలఁగు నెమ్మిదాఁ టన జడ
దారిగములు గేరి దారి నడవ
వచ్చెఁ బ్రౌఢబ్రవైభవంబున శుభ
లక్షణుండు నీరజేక్షణుండు. 110

తే. ఇట్లు ప్రత్యక్షమై విష్ణుఁ డిష్ట మడుగు
మిచ్చెద ననంగ బ్రాహ్మణ్య మిమ్ము నాకు

నిచ్చెదేనియు నాకోర్కి యిదియె యనిన
వానితో నిట్టు లనియె శ్రీవల్లభుండు. 111

సీ. జన్మపరంపరాసంప్రాప్త మగుచుండు
బ్రాహ్మణ్య మది దుర్లభంబును వ్వో
యగ్నియు విప్రుండు నమరగణంబుల
యాస్యంబు లగుటచే ననఘవృత్తి
నతనిఁ బూజించిన నఖిలసుపర్వులు
దృప్తిఁ జెందుటకు సందియము లేదు
హరుఁడు నేను నజుండు నంబికాంబాసర
స్వతులు బ్రాహ్మణపూజ సల్పికాదె

తే. యింతమహిమంబు నొందితి మేమి చెప్ప
నతఁడు వెలిగాఁ జలింపక యణఁగు జగము
నిట్టిబ్రాహ్మణ్య మొసఁగ నే నితరవరము
లడుగు మిచ్చెద వలసిన ననుచుఁ బలికె. 112

క. హరి యరిగె నంత వెండియు
హరుఁగూర్చి తపం బొనర్చె నతఁ డొకసంవ
త్సర మనిలాశియు నొకవ
త్సరము జలాశియును నై యుదంచితనిష్ఠన్. 113

క. తులసీదళముల బిల్వీ
దళముల సుమములఁ దిలాక్షతములన్ ధూపా

దుల నైవేద్యముల న్ని
చ్చలు శివుఁ బూజించె నతఁ డచంచలభక్తిన్. 114

శా. ఈలీలన్ బహుళాబ్దముల్ దప మతం
డేపారఁ గావింప న
న్నీలగ్రీవుఁ డుమాసహాయుఁ డయి వి
ష్ణిద్రిప్రభావోన్నతిన్
శ్రీలక్ష్మీశవిధాతృముఖ్యదివిజ
శ్రేణుల్ దనుం గొల్చి రా
నాలో వచ్చి ప్రసన్నుఁడై పలికె న
ద్యత్ప్రీతి సంధిల్లఁగన్. 115

తే. అలసితివి వత్స ! దుష్కరం బయినతపము
సలిపి నామది కెక్కె నీయలఘునిష్ఠ
వాంఛితం బెద్ది యొసఁగెద వరము గోరు
మనుడు విస్మితుఁడై నతు లాచరించి. 116

తే. దేవదేవ ! మహాదేవ ! దివిజవంద్య
చంద్రశేఖర ! క్రోధ్యు లొసంగుదేవ
యభిలషించితి విప్రత్వ మది యొసంగు
మనిన నద్దేవుఁ డిట్లని యానతిచ్చె. 117

ఆ. సకలయోనులందు జనియించి నియతుఁడై
నట్టివానికర్మ మడసి యడసి

యటఁ గ్రమక్రమమున నతనికి విప్రత్వ
మిత్తు మక్రియమున నియ్య మదియు. 118

చ. ఎనుఁబదిలక్షలై పరగి
యేచినజీవులయందుఁ బుట్టి తా
ననుపమపుణ్యముల్ సలిపి
యంతఁ గ్రమంబున బ్రాహ్మణత్వముఁ
గను నరుఁ డందు శుద్ధుఁడయి
కర్మము లొప్పుగ నాచరించెనే
జననము నొందఁ డెంతయు న
జస్రము మోక్షముఁ బొందుఁ బొందుగన్.

సీ. అతిదుర్లభం బైనట్టి బ్రాహ్మణత్వము గాంచి
[illegible]వృత్తికిం దొలఁగవలయు
వేదశాస్త్రాదిసద్విద్యాప్రవీణుఁడై
నిత్యకర్మ మొనర్చి నెగడవలయు
వ్యర్థకర్మంబులవలనఁ గాలక్షేప
మొనరింపక సువృత్తి నొనరవలయు
ధర్మ మించుకయైనఁ దప్పక నైమిత్తి
కాదిసత్క్రియలచే నలరవలయు

తే. నిట్లు వర్తించువానికి నేమి చెప్ప
మోక్ష మఱచేతిదై యుండు ముఖ్యలీల

నవ్విధానంబు సలుపనియాత్మవంచ
కుండు నిరయాధివాసియై కుండు నిజము. 120

తే. అతిథిపూజాపరాయణుం డగుచు న్యాయ
ధన ముపార్జించి సత్యంబు దప్పఁద్రొక్క
కతులితజ్ఞానవంతుఁడై యలరుచున్న
యట్టిగృహియైన ముక్తికి నరుగుఁగాదె. 121

ఉ. కావున విప్రకామినికిఁ
గల్గినమాత్రనె నీకు నబ్బునే
పావనమైన భూసురత
బాలిశ ! యీమెయితోడ? బాలకుం
డావిలబుద్ధిఁ జందురుని
యందు వసించుసుధారసం బొగిన్
ద్రావఁగఁ గోరున ట్లనుచి
తంబుగఁ గోరితి విట్టు లజ్ఞతన్. 122

చ. ఇతరవరంబు లీ వడుగు
మిచ్చెద నావుడు వాంఛితంబుపై
నతఁడు నిరాశఁ జెంది ఫణి
హార ! క్రమంబున నట్ల యిమ్మ వి
పృత ధరణీసురోత్తములఁ
బాయక సేవ యొనర్చునట్టి స

ద్గతిఁ గలిగింపు మిప్డు డది
కారణమై తగు నిష్టసిద్ధికిన్. 123

తోటకవృత్తము. అని కోరఁగ నాతని నాదరతన్
గని యట్ల యొసంగి జగంబులు దన్
వినుతింప హరుం డజవిష్ణులు దోఁ
జనుదేరఁగ నేఁగె ససంభ్రమతన్. 124

చ. అని కథఁ జెప్పి యానృపతి
యాత్మపురోహితుఁ గాంచి పల్కె ని
ట్లనితరదుర్లభం బగుధ
రామరజన్మము నీకుఁ గల్గె నిం
దనుచితవృత్తి సల్పిన మ
హానిలసంవృతదీప మెవ్విధం
బునఁ జనుఁ దేఱిలే కటుల
పోయెద వీ వనుమాన మేఁటికిన్. 125

చ. మును ముని వయ్యు శూద్రకుల
ముఖ్యునిసఖ్య మొనర్చి నీతపో
ధన మఱి విప్రజన్మమున
ధారుణిఁ బుట్టితి వట్టుగాన యి
త్తనువున మోక్ష మబ్బు దుచి
తంబుగఁ దొంటిమునిత్వలబ్ధికై

యను వగుకర్మముల్ సలుపు
మా యపవర్గము గాంతు వజ్జనిక్. 126

ఆ. అనుడు నతఁడు పల్కె నవనీప ! మునిజన్మ
మధికపుణ్యలభ్య మనఁగ వింటి
మదియు విత్తసాధ్య మర్థహీనుండ నే
నెట్లు సంభవించు నిత్తెఱంగు. 127

క. అన విని జనపతి యప్పు డా
యనపైఁ గారుణ్య మొలయ హారులుం గరులున్
ధనధాన్యసూత్న రత్నా
ద్యనుపమసంపదల నొసఁగె నధికప్రీతిన్. 128

తే. అతఁడు జన్నంబు లొనరించి యంతఘోర
తపము గావించి యటు మునిత్వంబుఁ బడసి
యనఘుతరుఁ డయ్యెఁ దపముచే నందరాని
వస్తు వెయ్యది యిద్ధరావలయమునను. 129

వ. అని చెప్పిన వసిష్ఠుం డిట్లనియె. 130

క. క్షురధారఁ బోలు విప్రత
గరిమం గర్మ మనుసానఁ గడు పాఁడి యగున్
ధర నట్లు గాక మలినతఁ
బొరయుఁ బనికిమాలి మొక్కపోవు *ధుతంబై. 131

* దితంబై, దురితంబై, దిరంబై — అని వ్రాఁత ప్రతులు.

వ. వెండియు దేవవిప్రుండును మునివిప్రుండును ద్విజవిప్రుం
డును రాజవిప్రుండును వైశ్యవిప్రుండును శూద్ర
విప్రుండును మార్జాలవిప్రుండును బశువిప్రుండును
మ్లేచ్ఛవిప్రుండును జండాలవిప్రుండును నన బదితెఱం
గులవిప్రులు గలరు తల్లక్షణంబు లెట్టి వనిన. 132

సీ. వేదశాస్త్రజ్ఞుఁడై విజ్ఞానవంతుఁడై
పొదలు నెవ్వఁడు వేదభూసురుండు
వనవాస మొనరించి వన్యాశనుం డయి
పుణ్యాత్ముఁ డగు మునిభూసురుండు
ఇరుప్రొద్దు వేల్చి తా నేకభుక్తము చేసి
పొలుపొందు నాద్విజభూసురుండు
శస్త్రాస్త్రములు పట్టి సంగ్రామనిరతుఁడై
భువిఁ గ్రూరుఁ డగు రాజభూసురుండు

తే. కృషియు వాణిజ్యమును జేసి కృపణవృత్తిఁ
బొంది పశుపాలుఁ డగు వైశ్యభూసురుండు
తైలమధుదధిలాక్షాఘృతమ్ము లమ్మి
బుధవినిందితుఁ డగు శూద్రభూసురుండు. 133

సీ. ఆత్మార్థమునకుఁ బరార్థంబు వోఁజేయు
బుద్ధివాఁడు బిడాలభూసురుండు
తగ నగమ్యాగామి యగుచు భక్ష్యాభక్ష్య
భుక్తిఁ జెన్నగు పశుభూసురుండు

ఆరామగృహతటాకాదులు నిశ్శంకఁ
బోకార్చుఁ దెగి మ్లేచ్ఛభూసురుండు
సురగురుద్విజధనహారణుఁ డై నిర్దయా
వాసుఁడౌఁ జండాలభూసురుండు

తే. సొరిది నీరీతి మెలఁగు భూసురులలోన
మ్లేచ్ఛచండాలభూసురుల్ మిగులఁ గీడు
యవనసేవాదివేషభాషాభినిరతుఁ
డై నవిప్రుఁ డధోగతియందు డిందు. 134

తే. యవనసంసర్గ మొనరించు నట్టివాని
తపముఁ గీర్తియుఁ గర్మము ధర్మ మడఁగు
యవనునకు మించు నీచుఁ డెందైనఁ గలఁడె
వేదబాహ్యుఁ డతండు పృథ్వీతలమున. 135

సీ. ఋతుకాలమున నిజసతిఁ బొంది సత్కర్మ
పరత వర్తిలుగృహి బ్రహ్మచారి
పరుల నెంచక మనఃకరచరణంబుల
నియమించువాఁ డొందు నిత్యసుఖము
లాపదఁ బాపి బ్రాహ్మణుల సంరక్షించు
నాతఁడు బ్రహ్మణ్యుఁ డనఁగఁ జెల్లు
సద్విప్రతతిపూజ సల్పువాఁ డైహిక
భోగముల్ గని నాకమున వసించు

తే. విప్రపూజావిహీనుఁడై వెలయునతని
జన్మ మదియు నజాగళస్తనమువోలెఁ
గడు నిరర్థక మగు నాత్మకర్మనిరతు
లయినవిప్రులకడ నుందు రమరవరులు. 136

సీ. విప్రవర్యులసభ విష్ణురూపము దానిఁ
బూని మ్రొక్కుట దేవపూజనంబు
తత్పూజ నాపద దలఁగుఁ బద్మాప్తుని
కరములచే నంధకారమట్లు
ప్రత్యక్షదేవతల్ బ్రాహ్మణుల్ వారి న
ర్చింపంగ మలినంబు చేర వెఱచుఁ
గామధేనువుఁ బోలి గలిగించుఁ గోర్కి పా
పంబు లడంచుఁ దత్పాదభక్తి

తే. యబ్జనాభునిరూపంబు లమ్మహాత్ము
లతని జపియించుచుండుదు రనఘవృత్తిఁ
దత్సహాభాషణంబు తద్దర్శనంబు
గలుగువా రచ్యుతపదంబు గాంతు రెందు. 137

చ. ఎలమిఁ బతివ్రతామణుల
హేమవృషంబుల గోవు ధార్మికుల్
జ్వలనుని శ్రోత్రియోత్తము న
జస్రము ప్రొద్దునఁ గాంచ మే లగున్

మలిన సనంగు దుర్భగుని
మత్తుని ముక్కుఁడిఁ బాపకర్మునిం
గలయఁ బ్రభాతకాలమునఁ
గాంచిన నాపదఁ బొందు ముందరన్. 138

క. సితచేలమాలికాలం
కృతు భుజియించినమహాత్ముఁ గృతకృత్యుని నం
చితమతి నెదుటం గన నీ
ప్సిత మబ్బుఁ బ్రయాణవేళ సిద్ధం బరయన్. 139

సీ. బ్రాహ్మణవచనంబు రాముబాణముగతిఁ
దతి శుభాశుభములు దప్ప కొసఁగు
ధర నసద్వృత్తి యై తనరువిప్రుని నైన
నిందసేయక భక్తి నెఱపవలయుఁ
దనపాపసంఘంబు దలఁగింపఁగోరిన
వానిదోషము లెన్న వలవ దెపుడు
తద్గుణావళు లెన్నఁ దగు మనుజుండు శ్రే
యఃపరంపర వాంఛ యయ్యె నేని

ఆ. యఖిలయుగములందు నధమవిధిజ్ఞు లై
నట్టి ద్విజులనింద యనుచితంబు
పూజ సేయఁదగుఁ బ్రబుద్ధమనస్కుఁ డై
యందుఁ దారతమ్య మరసి తెలిసి. 140

వ. అని తెల్పి వసిష్ఠుం డీయర్థంబునకు నుపాఖ్యానం బొక్కటి
గలదు దాని వచియించెద నని యిట్లనియెఁ దొల్లి సప్త
కల్పానుజీవి యగు మార్కండేయుం డొక్కనాఁడు
చతురాననుం దర్శించుతలంపున నరిగి స్వర్గాదిలోకంబు
లతిక్రమించి సకలలోకంబులకు నుపరిభాగంబున మేరు
శిఖరంబున ద్వాదశలక్షయోజనవిస్తృతం బై యొప్పు
సత్యలోకంబుఁ గాంచి యందు. 141

చ. మణిమయభర్మహర్మ్యములు
మంజులహీరకవాటజాలముల్
క్వణితవిపంచికామధుర
గానవిలోలవిలాసినీగృహాం
గణములు రత్నవేదికలు
గాంచనరాజతచిత్రకుడ్యముల్
గణనకు నెక్కుడై పరగఁ
గన్గొని యమ్మునివిస్మితాత్ముఁడై. 142

సీ. ఒకరుండు మెలఁగిన ముకురకుడ్యంబుల
కతనఁ బెక్కండ్రుగాఁ గానవచ్చు
నొకపాదపంబున సకలభూరుహముల
కుసుమగుచ్ఛంబులు గోయవచ్చు
నొకరుండు పల్కిన శుకపికనికరంబు
బలసి తేనియగుల్కఁ బల్క వచ్చు

నొకకొలంకుజలంబు లొగి నైక్షవక్షీర
లాంగలిజలరుచుల్ చెంగలించు

తే. నొక్కమందిర మఖిలరత్నోరుదీప్తి
యగుట సితపీతనీలరక్తాదివర్ణ
దీధితులు గానఁగావచ్చు దివ్యమహిమ
నెలమిఁ దల్లోకసౌభాగ్య మెంచఁదరమె. 143

సీ. పద్మరాగాంచితసద్మంబు లొకచోటఁ
దగసాంధ్యరాగంబు దాపుకొల్పు
నీలమణీమయనిరుపమనిలయంబు
లొకదారిఁ జీకట్ల నొదవఁజేయు
ముక్తావితానసంయుక్తమందిరము లొం
డొకయోరఁ దారకాయోగ మొనయు
వజ్రనిర్మితగృహావర్గంబు లొకయోరఁ
బ్రభ సాంద్రచంద్రాతపంబు గాయు

తే. సాంధ్యరాగంబు దమము నక్షత్రసమితి
చంద్రికయుఁ గాన మని పౌరజనత గోర
విధియె నిర్మించెఁగాఁబోలు వీని నిట్టు
లనఁగఁ జెలువొందు రత్నగేహంబు లచట. 144

తే. అప్పురము కాంచనాంచిత మగుచు నుండు
కతమున నజుండు కాంచనగర్భుఁ డయ్యె

నమితరత్నమయం బగు నది శిరమునఁ
బూనుకొని మేరుగిరిరత్నసాను వయ్యె. 145

క. కాంచనమణిసోపానా
భ్యంచితసౌవర్ణవాలుకాఢ్యములై ని
శ్చంచలమధుమధురాంబు
ప్రాంచత్పద్మాకరము లపారము లచటన్. 146

క. అందములై కదళీమా
కందదాడిమద్రాక్షకపిత్థఖర్జూరము లిం
పొందుఁ ఫలబృందముచే
నందుకొనం దనరి తద్గృహారామములన్. 147

మాలిని. అసమకుసుమశోభాహాస మొప్పన్ వనంబుల్
కిసలయకరసంజ్ఞం గ్రేటుపాంథాళి జేరన్
భసలసరసకీరస్ఫారసారారవోక్తిం
బ్రసవఫలశలాటూపాయనం బిచ్చు వేడ్కన్. 148

చ. నలువున నల్లిబిల్లిగ ఫ
ణాధరవల్లులు చుట్ట నిట్టలై
పొలిచి తదంతికోపవన
పూగమహీరుహషండముల్ కరం
బలరు నిరంతరంబును బి
గ్యాపరిరంభణసంభ్రమంబుచే

మొలచినకూర్మి నాకసము
ముట్టిన కాముకసంఘమో యనన్. 149

ఉ. నారికెడంబు లెక్కి యరు
ణద్యుతిఁ జెన్నగు బొండముల్ శుకీ
వారము త్రోటిఁ జీరి యని
వారణతద్విఫలత్వ మెంచి య
చ్చేరువఁ గేరి చేరి నగు
చెల్వలమోవుల దొండపండ్లచే
ల్వారసి చేరఁగాఁ జకితు
లై చనుచెంతురు వార లిండ్లకున్. 150

మహాస్రగ్ధర.
చెలువల్ సర్వర్తుపుష్పాంచితభవనవనిం
జేరి క్రీడించు తేఁటుల్
దలమై నై జాంగకామోదముపసిబడి మో
దంబునం జేరి రా న
వ్వెలఁదుల్ తద్భీతి నేఁగన్ విడి తుటుములు వె
న్వెంటఁ జొత్తెంచు భృంగా
వళియో నాఁ జెల్వు మీఱున్ వసుధఁ గభ్రులన
ద్వర్ణనావాప్తి నింపై. 151

ఉ. చందురుకాంతియున్ సలిల
జంబువికాసము గుండనంబులో

నందినతేటయు౯ విరుల
నాఁగినతావియుఁ గూర్చి పద్మజుం
డందు సుధారసంబు గల
య న్జిలికించి యొనర్చె నేమొ కా
కందలిసుందరీమణుల
యందముచందము లింతయొప్పునే. 152

సీ. అంధకారమునకు నంబుజాహితునకుఁ
బగ లొనర్చినయట్టి పరుసఁదనము
చంచరీకములకుఁ జాంపేయకళికకు
నొంటమి చేసిన గొంటుతనము
కీరంబులకుఁ జెలువారు బింబములకు
వేరంబు గావించు వెట్రితనము
కరికుంభములకుఁ గేసరిశాబకములకుఁ
గైలాట మొనరించు నాలితనముఁ

తే. చాపుకోనఁ బోలు నచ్చటిపద్మముఖుల
నెఱులు మోములు చూపులు నిడుదనాస
లలరుపలుకులు మోవులు గులుకుగుబ్బ
లలఁతికౌనులు గావించి యబ్జభవుఁడు. 153

తే. నిఖిలవిద్యాప్రవీణులై నిత్యతృప్తు
లగుచు బలరూపగుణయుక్తి నతిశయిల్లి

పద్మజునితోడ ముక్తికిఁ బాలుపడిన
పురుషులు ఋషులతెఱఁగునఁ బొలుతు రచట. 154

క. ఆనియతులు మణిఖచితవి
తానాంచితపటకుటీవితానములఁ బయః
ఫేననిభశయనములఁ దమ
మేనుల సుఖ మెలయ విశ్రమింపుదురు దగన్. 155

వ. ఇత్తెఱంగున నిరుపమానసంపదలసొంపునఁ బొంపిరి వోవుచు నితరజనదురవాపంబై పునరావృత్తిరహితంబైన సత్యలోకంబుఁ జొచ్చి యందు జ్యోతిర్మయంబైన సభాస్థలంబున మరుద్వసుగణంబులును వాలఖిల్య భృగుసనకాదితపోధనులును దిక్పాలకులును సురాసురులును శుక్రబృహస్పతులును రంభాద్యప్సరోనివహంబును సేవింప నిలింపగంగాదినదులును గులశైలంబులును వేదశాస్త్రస్మృతీతిహాసపురాణనాటకాలంకారంబులును జతుర్దశవిద్యలును ద్వాత్రింశదాగంబులును మూర్తిమంతంబులై కొలువ సరస్వతీసమేతుండై సింహాసనాసీనుండై మునీంద్రులకు బ్రహ్మజ్ఞానం బుపదేశించుచునున్న యరవిందభవునిం గని నమస్కరించిన నాదరించి భ్రూసంజ్ఞం గూర్చుండ నియమించి కుశలప్రశ్నంబుచేసి యాగమనప్రయోజనం బెఱింగింపు మనిన నమ్మార్కండేయుం డిట్లనియె. 156

తే. అంబురుహజన్మ! సప్తకల్పాంత మగుచు
నాకు నాయుష్య మమరె నిరాకులగతి
నంతరంగమునం దసహ్యాత జనించె
నదియుఁ గడుఁ దడ వగుకాల మగుటఁజేసి. 157

వ. ఇది మదాగమనకార్యం బనిన నతనియాశయం బరసి
పితామహుం డిట్లనియె. 158

క. కీకటదేశమునకు న
వ్యాకులగతి నరిగి తీర్థయాత్రనెపముచే
నాకడ విప్రులఁ గనిర
మ్మా కోరిక సఫల మగు మునీంద్రప్రవరా! 159

తే. రహిఁ గళింగాంగవంగసౌరాష్ట్రమగధ
దేశముల కగ్రజన్ముఁడు తీర్థయాత్ర
వెలిగ నరుగంగఁ జన దట్లు వెడలెనేని
మగుడ సంస్కారమున కర్హుఁ డగు నిజంబు. 160

తే. పెంపున యుగంధరంబునఁ బెరుఁగు ద్రావి
యచ్యుతస్థలి నొక్కనాఁ డధివసించి
భూత లయమున నట్ల యంబువులఁ గ్రుంకి
మగుడ సంస్కారమున కర్హుఁ డగు ద్విజుండు. 161

క. అని పనుప నజునియనుమతిఁ
జని కీకటవసతిఁ జొచ్చి సంయమి యచటన్

గనుఁగొనిరె దురాచారం
బున మ్లేచ్ఛప్రాయులైన భూసురవితతిన్. 162

మత్త. దానధర్మవివర్జితుల్ పరదారజారులు ఘోరులున్
స్నానహోమజపాదిహీనులు చండవిక్రమణక్రముల్
మానమత్సరశాలు లప్రతిమానశౌర్యధురంధరుల్
పూని యందు వసించి మించిన భూసురాధము లందఱున్.

పంచ. విరుద్ధవేషభాషణుల్ సువిప్రచిహ్నవర్జితుల్
పరార్థవంచకుల్ పుళిందబర్బరోపజీవకుల్
దురంతనిర్దయుల్ తపోవిదూరు లార్యబాధకుల్
నిరంతరాపవిత్రు లందు నిల్చుధారుణీసురుల్. 164

ఉ. కొందఱు పుణ్యవిక్రియులు
గొంద ఱనారతభారవాహకుల్
గొందఱు పుచ్ఛకచ్ఛులును
గొంద ఱధర్ములు గొంద ఱర్థులున్
గొందఱు నీచసేవకులు
కొందఱు శుద్ధివిహీనకాయు ల
య్యందఱు వారలం గనఁగ
నంట ననర్హము శిష్టకోటికిన్. 165

వ. ఇవ్విధంబున. 166

మ. క్షణమైనన్ నియమస్థితిం బరగ కి
చ్ఛావృత్తి మతిల్లు ని

ఘృణులం గాంచి తదీయదుశ్చరితముల్
గీర్తించుటల్ మాని యం
దణుమాత్రంబు గుణంబు గన్గొనిన ను
ద్యత్ప్రీతిఁ గొండంతగా
గణుతించుం బ్రణుతించుఁ జిత్తమున మా
ర్కండేయుఁ డెంతేనియున్. 167

ఆ. ఇత్తెఱంగుద్విజుల నీక్షించి వెండియు
నమ్మహాత్ముఁ డరిగి యవలఁ గొంద
ఱవనిసురులఁ గాంచె హాలికవృత్తుల
దుష్టతముల వేత్రతోత్రకరుల. 168

ఉ. అమవస నొక్కభూసురకు
లాధముఁ డొక్కట నేరు దున్న న
క్కమలహితాభుఁ డత్తెఱఁగు
గన్గొని చిహ్నముఁ జూచి వానిభూ
మ్యమరునిఁ గాఁ దలంచి యక
టా పితృవాసరయోగ్యకర్మముల్
గ్రమమున మాని వీఁడు హల
కర్మము సల్పఁగఁ జొచ్చెఁ గ్రచ్చఱన్. 169

వ. ఇటమీఁద నెత్తెఱంగువృత్తిం బ్రివర్తిల్లం గలండో నిరీక్షించెదంగాక యని తలంచి యటమున్నె యుషస్స్నానాది నిత్యకృత్యంబుల నాచరించినవాఁడు గావునఁ

గేదారసేతుస్థలంబునఁ గూర్చుండి యుండె నయ్యవస
రంబున. 170

తే. ఓరగోఁచియు వలకేల నొక్కకోల
యెడమహస్తంబునందిట నిడిన జన్ని
దంబు వీడినసిగ పదత్రాణములును
దనకు నందముగా ద్విజాధముఁడు దనరి. 171

క. బల మఱినబలీవర్దం
బులఁ గాఁడిం గట్టి హలము పూంచియు వానిం
బలుమఱు దుర్భాషణములు
వలుకుచుఁ బ్రిహరించుచుం గృపావిరహితుఁడై. 172

తే. లాంగలం బీడ్వలేక కలంగఁబడిన
యుక్షములఁ దిట్టి కొట్టి నిట్టూర్పు లెసఁగ
నాఁకట నలంగి దప్పిచే నలసి సొలసి
వేసరఁగ నంత నపరాహ్ణవేళ యగుడు. 173

సీ. మలినాంగమునకు నెచ్చెలివోలెఁ దగుమాసి
పరుసనై తగు జీర్ణపటము గట్టి
యిలుపిచ్చుకలగూళ్ళ నెక్కసక్కెయమాడు
కురులు చెంపల వ్రేలుకొప్పు మఱిమి
మరకతచ్ఛవిఁ బ్రాఁచి మలయు దంతముల మే
లంబుగాఁ జేలాంచలంబు గఱచి

వదరులగతిఁ గూలి వ్రాలినపాలిండ్ల
నడుముగాఁ బయ్యెద నాఁటుకొల్పి

తే. యవని నిది విప్రకామిని యగునొ కాదొ
యనిన విచికిత్స చూపఱ కావహిల్లఁ
బక్వశాకాన్నపరిపూర్ణపాత్రహస్త
యగుచు నరుదెంచె నచటికి నతనిగృహిణి. 174

శా. దారిం గాంచి యతండు లాంగలము దో
దాదవ్వుల న్విప్పి కే
దారాంతంబునఁ గూరుచుండి చరణ
త్రాణంబు లంఘ్రిద్వయిన్
జాఱంజేయక కాంస్యపాత్రమున న
చ్ఛంబైనయన్నంబు చె
ల్వారం జూచి కరంబునం గబళ మ
త్యాసక్తిచే నంటుచున్. 175

తే. కాంతఁ బల్కె నతం డనుకంప వెలయ
నంబ భుజియించినదొ లేదొ యంబుజాక్షి
తథ్యముగ దెల్పు మీవు మిథ్యాప్రగల్భ
వేని తెగఁజూతు ననవుడు నింతి యపుడు. 176

ఉ. జాలము గాదు వల్లభ ని
జాలకఁ జెప్పెదఁ జిత్తగింపుమా

హాలికవృత్తి వాసల మ
 హానిలబాధలఁ జిక్కినీకు క్షు
ద్వేళ యతిక్రమించె నని
 వేగమె వచ్చితి నింకఁ బోయి నే
హాళిగ నామెఁ జేటి సర
 సాన్నముఁ బెట్టెద నారగింపుమా. 177

మ. అనివార్య రోషకషాయితాక్షుఁ డయి య
 య్యన్నంబు వోఁజల్లి పె
ల్చన రామస్మరణంబు చేసి మునికో
 లన్ ఱోలఁగాఁ జొచ్చెఁ ద
త్తనువెల్లన్ రుధిరంబు గ్రమ్మ నతఁ డం
 తం గాంత నోఁజంత ! నా
జననయితిర్ భుజియింపఁబెట్టక భుజిం
 చంగాదు నా కిమ్ములన్. 178

తే. మున్నె కన్నులఁ గానదు మూఁడుగాళ్ల
ముసలి యింతకు క్షుధ నెంత కసరె నొక్కొ
తల్లి హర ! హర ! యెంతపాతకము గదిరె
ననుచుఁ గన్నీరు నించి యయ్యతివఁ జూచి. 179

తే. వేగ నీ వేఁగి యన్నంబు వెట్టి రమ్ము
బ్రాహ్మణుఁడు నది యేఁగి సంపూర్ణభక్తి

నత్త నాహారకలనచే నలరఁజేసి
మరలి విభునకుఁ దెల్పె సమగ్రగరిమ. 180

తే. తల్లి భుజియించె ననుటకు నుల్లసిల్లి
యంత నాతఁడు పక్వాన్న మారగించె
నిత్తెఱంగులు కని విని యిచ్చ మెచ్చి
యామ్మృకండుతనూజుఁ డత్యాదరమున. 181

క. ఇది యుత్తమధర్మం బీ
సదయునకు నమస్కరింపఁ జను నా కనుచు
మదిఁ దలఁచి లేచి యతనికిఁ
బ్రిదక్షిణము సల్పి భక్తిఁ బ్రణుతి యొనర్చెన్. 182

వ. అట్లు కావున. 183

క. ఆచారహీనుఁడై తగు
నీచాత్మునియందు గుణము నిల్పు న్సుజనుం
డాచరితవ్రతుఁడైన స
దాచారికి ఖలుఁడు దోష మాపాదించున్. 184

క. కీకటదేశవిహారం
బీకరణిం జేసి యమ్మునీంద్రుఁడు తద్వా
ర్తాకథనార్థము గ్రిమ్మఱి
నాకమలజుసభకు నరిగె నతిహర్షమునన్. 185

చ. అజుఁడును నమ్మునీంద్రు నన
లాధికతేజునిఁ గాంచి పల్కె నో

ద్విజవర ! కీకటాఖ్య మగు
దేశముఁ జూచితె యందు నున్నయా
ద్విజులతపంబు శీలమును
ధీచతురత్వము నెవ్విధం బగుఁ
నిజముగఁ దెల్పుమా యన ము
నిప్రవరుండు విరించి కిట్లనుఁ. 186

ఉ. అందఱు నిత్యసత్యరతు
లందఱు సద్గుణశీలశాలు ల
య్యందఱు సద్వ్రితాచరణు
లందఱు వేదవిధిజ్ఞు లైనవా
రందు వసించువిప్రులు మ
హర్షిసమానులు వారిఁ జూచి నే
నంద మెలర్ప మ్రొక్కి కొని
యాడితి నిర్మలకర్మధర్ములఁ. 187

ఆ. అనఘు లయిన యమ్మహాత్ములఁ గనుగొంచు
నందుఁ గొన్నిదినము లధివసించి
వచ్చినాఁడఁ జేయవలసినపని యింక
నెద్ది తెలియఁ బల్కు మిద్ధచరిత. 188

వ. అనిన నతం డిట్లనియె. 189

క. నిందార్హు లయినవిప్రుల
నిందించెద ననుచు నెఱిఁగి నిన్నుఁ బనిచినఁ

నిందింపక పొగడితి వీ
వందుకతన ద్విగుణ మయ్యె నాయువు నీకున్. 190
వ. అనిన మార్కండేయుం డద్దేశంబునకుఁ గీకటత్వం బెట్లు
సిద్ధించె నందు ద్విజన్ములకు నివాసంబు సేయరాకుండ
దూష్యం బేల యయ్యె నెఱింగింపు మనిన నచ్చతురా
ననుం డిట్లనియె. 191
తే. అలవసిష్ఠుని కినుమన్మఁ డనఁగ శక్తి
మనుమఁ డనఁగఁ బరాశరతనయుఁ డనఁగ
శుకునితండ్రి యనంగఁ బ్రస్తుతికి నెక్కి
తనరు వ్యాసుండు శ్రీశావతార మగుచు. 192
క. ఆవేదవ్యాసులరో
షావేశత నింద్య మయ్యె నద్దేశము నీ
కావిధ మెఱిఁగించెద న
న్పావనమతి మున్ను కాశిఁ బ్రతివసియించున్. 193
వ. అక్కాశీపరిభావం బెట్టి దనిన. 194
క. అవిముక్తమహాక్షేత్రము
శివునకుఁ బరమాస్పదంబు చిరతరమహిమన్
దివిషన్మోహనకర మది
యవివాదము ముక్తు లగుదు రందఱు నచటన్. 195
సీ. శండాలమైనను క్షుద్రకీటంబైన
శశక మైనను నీచమశక మైన

భూమీసురుండైనఁ బుల్కసాధముఁడైనఁ
బృథివీశ్వరుం డైన భృత్యుఁ డైన
నపసిద్ధుం డైన సుప్రసిద్ధుం డైన
యతియైన నిష్కరుణాత్ముఁ డైన
మండూకపతి యైన మత్స్యసంతతి యైన
బక్షంబు లయినను బక్షులైనఁ

తే. గాశిలోఁ బెద్దనిద్దురఁ గన్ను మొగిచి
శివునిసారూప్యము వహించి చెప్పకొందు
రందఱుఁ బరస్పరంబు నిజాదిజన్మ
వర్తనంబులు ము న్నిట్టి వార మనుచు. 196

తే. అద్భుతముగాదె కాశి నున్నట్టిజనులు
వంతఁ జెందరు మృతికి నావంతయైన
మది ముదంబున నతిథికి నెదురుచూచు
కరణి మృత్యువురాకకుఁ గాచియుందు. 197

చ. అగవిశిఖాసదివ్యవపు
రర్ధనివాసిని గౌరి కాశిలో
నగణితసత్కృప న్నిజకు
చాంచలలోలపటాంచలంబుచే
మృగమదగంధబంధురస
మీరహతిన్ మృతిఘర్మ మార్చు విం

తగఁ బ్రణవోపదేశము
దంచితవేళల జంతుకోటికిన్. 198

క. వారణసిమహిమయో భా
గీరథిమహిమంబొ కాని గెడసి నరుం డం
దారూఢి మరల యోషి
త్పూరుషమయమైనరూపమున నుదయించున్. 199

ఉ. ఆమరగంగ కీమ్మొగ హ్రా
దంబుజకర్ణిక నాఁ బొసంగి గౌ
రీముఖతీర్థతామరస
రేఖకుఁ గర్ణిక నాఁ బొసంగి తా
నీమహి మోక్షలక్ష్మి చెవి
కింపగు కర్ణిక నాఁ బొసంగు నా
శ్రీమణికర్ణికన్ మునుఁగఁ
జేరు నిరంతరసౌఖ్యసంపదల్. 200

తే. ఊర్ధ్వగతి నిచ్చుఁ గ్రిందుగా నోపి మునుఁగ
నసలు పూసిన నైర్మల్య మావహించు
నంబువుల సంసరణభూరుహంబుఁ దోలఁచు
నట్టిమణికర్ణికకు నతు లాచరింతు. 201

క. కాశీక్షేత్రము పంచ
క్రోశం బగు నందు దివిజకోటులు నిధనం

బాళింప నితరమానవు
లాశాపరవశత నొందు టది యద్భుతమే. 202

ఉత్సా. వారణాసియందు మేను వైవవలయు వైవఁ ద
త్కారణమున మగుడ మేను గాంచ రట్లు గాంచినం
దారు నొసలఁ గన్ను విషము దాల్చుగళము మౌళిపై
వారిజారికళయుఁ గల్గి వఱలియుందు రందఱున్. 203

క. వారాణసీనివాసుల
బేరం బద్భుతము గాదె పృథుమహిమ నొకం
డారయఁ బంచత్వము గని
మీఱుచు నెనిమిది తెఱంగు మిగులుం దిరమై. 204

చ. దళముగ రామనామసుధఁ
ద్రావుచుఁ ద్రావుచుఁ దారకాఖ్యచేఁ
జెలఁగిన బ్రహ్మముఁ దలఁపుఁ
జేర్చుచుఁ జేర్చుచు జంతుకోటికిం
బ్రళయముపేళఁ గర్ణములఁ
బల్కుచుఁ బల్కుచుఁ గాశిలోపలన్
వలనుగ నొక్కతాపసుఁ డ
వారణఁ ద్రిమ్మరు వీథివీథులన్. 205

ఉత్సా. భైరవుఁడు త్రిశూలధారఁ బట్టి కట్టి గడియలో
నూఱుకోట్లకల్పములకు నోరఁ గొఱకరానిదు

ర్వారకర్మముల్ హరించినవై వ నంత శివుఁడు చె
ల్వారుమంత్రి మొసఁగు ముక్తు లగుదు రందు జంతువుల్.

క. వివిధాజాండప్రకరము
జవమఱి ప్రళయమునఁ గూలుసమయమునం ద
య్యవిముక్త మహాక్షేత్రము
శివుఁడు త్రిశూలాగ్రధారఁ జేర్చి మనుచున్. 207

క. కదిసి మణికర్ణికాంత
స్సదమలసలిలముల మునుఁగఁ జను సురగణముల్
పదునాల్గులోకములుఁ గా
మదమగు తీర్థావళియును మధ్యాహ్నమునన్. 208

ఉ. తత్తఱ మింతలేక ప్రమ
దంబున డంబగువారణాసిలో
నుత్తరవాహినిన్ మునుఁగ
నుద్యతుఁడై తగువానిమేనిలో
సత్తినపాపసంఘము ర
యంబున రూపఱి నిర్గమించి య
య్యుత్తలపాటుచే నెగయు
నొయ్య నిరాశ్రయవృత్తిఁ గూయుచున్.

తే. పాపకర్ములకున్ దురావాప మైన
యమ్మహాక్షేత్రమునకు సాయాహ్నవేళ

హారుని విశ్వేశు వీక్షింప నరుగు దెంతు
రమరగంధర్వరాక్షసయక్షవరులు. 210

వ. మఱియును. 211

క. నరులుం గిన్నరులుం గిం
పురుషులు ఋషులుఁ సమస్తభోగులు యోగుల్
దరులుం దిగ్వరులుఁ ఖర
కరహిమకరసారతారకానికరములుఁ. 212

మ. పితృసంఘంబును సిద్ధసాధ్యు లమరీ
బృందంబు తీర్థాదిదే
వతలు న్దివ్యమునీంద్రులుఁ యతివరుల్
వైకుంఠసంవాసులుం
బ్రతిభన్ వత్తురు వేయు నేల నిఖిల
బ్రహ్మాండభాండోదర
స్థితదేవౌఘము కాశికానగరికిన్
జేరుఁ దినాంతంబునఁ. 213

వ. ఇట్లు పరమేశ్వరనివాసంబు చేరనరిగి యందు సౌవిదల్లు
లగు నందీశ్వరభృంగీశ్వరాదులు వేత్రిప్రిహారంబుల
నలంకరింపం ద్వారదేశంబున నివారితులై యమ్మంది
రాంగణంబున నిలిచి యవసరంబు ప్రతీక్షించుచు. 214

మహాస్ర. కటకంతుం జూడ నేనుం గమలనయనుండుఁ
గాంక్షతో నేఁగ మాయి

ద్దలు వెంటం బ్రౌఢిమైఁ గొండఱు చొర నితరుల్
తండుభృంగీశు లట్లే
మఱి యుండం జొచ్చి యొక్కుమ్మడిఁ జన జనస
మ్మర్దభీతిన్ మఱిం గొం
దఱు దూరం బేఁగి గంగాధర ! హర ! యనుచుం
దారు నాట్యంబు సల్పన్. 215

శా. కొందఱు వీరశాంభవులఁ
గోయనిఁ గంచుకు లేఁగి తోడితేఁ
గొందఱు వారివెంబడి న
కుంఠితమైత్రిఁ బొసంగి పోవఁగాఁ
గొందఱు ద్వారపాలు రను
కూలతచేఁ జననీయ నేఁగి యి
ట్లుండఱుఁ గాంతు రయ్యభవు
నవ్యయు నిర్మలు నిర్వికారునిన్. 216

వ. వెండియు. 217

సరసిజమణిగణనికరనవాంకురవృత్తగర్భితకందద్వయము.

క. చారూదారుఁ ధీరవి
చారుఁ సరసిజభవముఖసకలసురనుతుఁ
గౌరీకాంతుం బౌరద
గౌరుం గరిదనుజదమను ఘనవృషగమనున్ 218

గారుణ్యాత్మ్యుఁ బీరవి
కారుణ్ ఖరకిరణతుహినకరశిఖినయనున్
హారిన్ క్ష్వేళాహారిఁ బు
రారిన్ హరు సుమశరమదహరు హరిణకరున్. 219

తే. హారకుండలమకుటకేయూరకంక
ణాంగుళీయకమేఖలాద్యఖిలభూష
ణాభిశోభితుఁడై దుకూలాంబరంబు
దాల్చి మోహనమూర్తియై తనరువాని. 220

వ. కాంచి తదీయవామభాగంబున. 221

మ. ఘననీలాలకఁ బూర్ణచంద్రవదనం
గర్ణాంతవిశ్రాంతలో
చన మాద్యత్కలహంసయాన బిసహ
స్తం జక్రివాకస్తనిం
దనుమధ్యం గిసలారుణద్యుతిపద
ద్వంద్వం బ్రవాళోష్ఠిఁ గాం
చనవిద్యుల్లలితాంగి లోకజననిన్
శర్వాణి వీక్షించుచున్. 222

తే. అట్టియాదిమదంపతు లగునుమామ
హేశ్వరులఁ గాంచి యానంద మెసకమెసఁగ
జయజయేతిప్రవాదులై సకలసురలు
నతులు నుతు లొనరింపుదు రతులభక్తి. 223

చ. హరుఁడు ప్రదోషవేళఁ జెలు
వారఁగఁ దాండవమాచరించు చో
సురగణముల్ తదీయనవ
సుందరవేషము గాంచి మోహసం
భరితమనస్కులై యచటఁ
బాయఁగఁజాలక కొల్చియుందు ర
వ్వరుస నిజాధికారముల
వాంఛలు మాని యనూనహర్షతన్. 224

క. సరసిజనయనుఁడు నేనుం
బురహరు శృంగారవేషముం గని మోహా
తురతం జొక్కఁగ నిఁక నా
హరిహయముఖసురలు భ్రాంతు లగు టబ్బురమే. 225

సీ. ఇట్లు మోహితులైన యింద్రాదులమనంబు
గాంచి యిట్లైన లోకములు డిందు
నని చిత్రకాయాజినాంబరావృతము భ
స్మాంగరాగంబు ఖట్వాంగహస్త
మహిపభూషితము జటాకలితంబును
నగువిరుద్ధపువేష మలవరించు
హరుఁ గాంచి సురలు లాస్యావసరంబున
నేరూపము వహించి తీవు మరల

తే. నట్టిరూపము చూపుమో యభవ యనుడు
నిత్యమును నిర్వికల్పంబు నిష్కలంక
మద్వయంబు చిదానంద మగు మదీయ
మైనరూపంబు వీక్షింప నగునె మీకు. 226

ఆ. అట్టిశుద్ధవిగ్రహంబు గౌరి వీక్షింప
నర్హమయ్యె నంతరరివశమున
నెలయు మీరుఁ గాంచ నెట్లగు నిప్పుడు
గనినయదియె చాలుఁ గలుష మణఁప. 227

క. తరియించినారు మీ రిఁక
నరుగుఁడు మీలోకములకు నను సర్వేశ్వరుని
శ్వరునానతి దలమోచుక
యరుగుదురు నిజాలయముల కమరులు మునులున్. 228

క. కావునఁ బ్రిదోషములఁ గా
శీవిభు విశ్వేశుఁ గాంచి శివతాదాత్మ్యం
బావలనఁ జెందుదురు నరు
లావిధి బహుసుకృతకరుల కయినం గలదే. 229

ఆ. సారహీనమయిన సంసారమున సార
మమరు నెపుడు నాలుగంశములను
గంగ నాడుటయును గాశి కేఁగుట యందు
నిలుచుటయును హరునిఁ గొలుచుటయును. 230

క. పంచమహాపాతకముల
వంచించుం గాశిఁ జేరువాఁడచ్చోటం
బంచత్వము ప్రాపించిన
పంచజనోత్తమునితపముఫల మల్పంబే. 231

తే. శివునియానతి లేక భైరవుఁడు చొరఁగ
నియ్యఁడక్కాశిలోనికి నిందు వినయిన
ననినచోఁ గర్మసంభరితాంగు లయిన
నరులకుఁ దదాజ్ఞ లేకెట్లు చొరఁగఁదరము. 232

ఉ. ఇష్టము పూర్తముల్ వ్రతము
లిద్ధతపంబును దీర్ఘయాత్రలు
త్కృష్టపరోపకారములు
నిమ్ముగఁ జేసినవాఁ డగు న్నిజా
దృష్టతఁ గాశి కేఁగి నిట
లేక్షణు నీశ్వరు విశ్వనాథు భ
క్తేష్టదుఁ జంద్రశేఖరు మ
హేశ్వరుఁ జూచినవాఁడు ప్రోడిమిన్. 233

తే. నీలకంఠు విరూపాక్షు శూలహస్తు
భుక్తిముక్తిఫలప్రదు భువనవంద్యుఁ
గాశికాధీశు విశ్వేశుఁ గాంచు నాతఁ
డెవ్వఁడయినను ముక్తుఁడౌ నిది నిజంబు. 234

క. భక్తిం గాశికిఁ జన ను
ద్వ్యక్తిం దగుహానిపితృసముత్కర మత్యా
సక్తిం బాడుచు నాడుచు
నక్తం దివమును ముదంబునం బొదలు మదిన్. 235

సీ. అప్రయాసంబున నపవర్గ మాశించు
నరుఁడు కాశి వసింప నరుగవలయు
సంసారభారదుస్సంగతిఁ జనలేక
జవమఱినట్టియశక్తుఁ డైన
నిత్యంబు తద్ధ్యాననియతిచే వారణా
సీనివాసఫలంబుఁ జెందుఁ బిదపఁ
గాశి కాశి యటంచుఁ గాశి నెప్పుడు జపి
యించునతండు భజించు ముక్తి

తే. కాశి కరుగుదు నచ్చటఁ గదిసియుందు
ననుచు నశ్రాంతమును బల్కునట్టివాఁడు
చెలఁగి కాశిని వసియించుఫలముఁ గాంచు
నింట వసియించియేనియు నిద్ధచరిత. 236

వ. అని చెప్పిన మార్కండేయుం డిట్లనియె. 237

శా. ఆలాస్యావసరంబునన్ భవునిభ
వ్యాకార మింద్రాదిది
క్పాలశ్రేణికి మోహసంజనకమై
పాటిల్లె నా వింటిఁ గ

ర్ణాలంకారము గాఁగ నింక గిరిక
న్యారూపసౌందర్యల
క్ష్మీలీల ల్వీన వేడుకయ్యె నవి నె
మ్మిం దెల్పవే వాక్పతీ! 238

వ. అనినం బరమేష్ఠి యతని కిట్లనియె. 239

శా. ధీరుండై విషయాతిదూరుఁ డయి దీ
ప్తిప్రాభవుండై చిదా
కారుండై తగుమారవైరి మదిఁ జొ
క్కంజేయు నగ్గౌరి యా
కారశ్రీవిభవాభిరామత* లశ
క్యం బెన్న నిస్తుల్యమై
మీఱుం దద్గరిమంబు లోకములఁ బే
ర్మిన్ సంయమిగ్రామణీ. 240

చ. నలుమొగముల్ పటూక్తులు ఘ
నంబుగఁ గల్గినవాఁడ నిట్టినా
కలవియె శైలజాతరుచి
రాకృతి నెంచఁగ నర్థవాదతం
బలుక మృషార్థసంగతిగఁ
బల్కఁ దదీయసురూపలక్ష్మిలోఁ
దిలపరిమాణమైన గను
తించి నుతింపఁగ నోప రెవ్వరున్. 241

* రామము—వ్రా. ప్ర.

ఉ. ఆనగకన్యకాపరిణ
యంబున నేను పురోహితత్వముం
బూనితి నిర్జితేంద్రియత
బుద్ధిబలంబున వృద్ధ నౌట నీ
శానవివాహయాజకత
సల్పఁగ నాసముఁడైన యొక్కప్ర
జ్ఞానిధి లేమిఁ జేసియు భృ
శం బగువేడుక చెంగలింపఁగన్. 242

సీ. శక్రాదిసుర లుపచారము ల్గావింప
మునులు దత్తత్కర్మములఁ జెలంగ
వందిమాగధులు కైవారంబు సేయంగ
సనకాదిమౌనులు జయజయ యన
తుంబురునారదాదులు గాన మొనరింప
నప్సరోవితతినాట్యంబు సల్ప
మీఱి రక్కసులు సంభారముల్ మోవంగ
జీవాదివిప్రు లాశీర్వదింపఁ

ఆ. జెలఁగి విశ్వకర్మ శిల్పికర్మము సేయఁ
బ్రమథగణము లన్నిపనులు నరయఁ
జిత్రమహిమ వమరె శివుపాణిపీడనం
బధికవైభవాఢ్య మగుచుఁ దొల్లి. 243

తే. చెయ్వి లోనరించు వెన్నుఁడు శివునియాన
ననినచో సురవరులు విద్యాధరులును
యక్షకిన్నరగంధర్వరాక్షసులును
సిద్ధసాధ్యులుఁ జేయుట చెప్ప నేల. 244

తే. ప్రౌఢిమిూఱ రత్నాకరరత్నసాను
రత్నగర్భాధరంబులు రత్నములును
గాంచనము దెచ్చి రాసులు గాఁగ నింప
దశదిశల ధాగధగ్యంబు దారుకొనియె. 245

తే. పుడుకుఁదోడుకును గల్పకంబును బ్రశస్త
వస్తువులు గోల కెక్కుడై వఱల నించె
లలితమౌక్తికతోరణాలంకృతంబు
లై నమణిగణమయకాయమానములును. 246

క. మణికుడ్యంబులు ముక్తా
మణిరచితతిరస్కరిణులు మణివేదికలున్
మణిదీపంబులుఁ గలగృహ
మణు లచ్చటఁ జూపఱన్ భ్రమం గొల్పుఁ దగన్. 247

సీ. ఘనసారకాశ్మీరకస్తూరికాగరు
లేవంకఁ జూచిన నిచ్చువారు
జాంబూనదాంబరతాంబూలజాలంబు
లెచ్చటఁ జూచిన నిచ్చువారు

సుమహితమాణిక్యసుమదామసందోహ
మేజాడఁ జూచిన నిచ్చువారు
భక్ష్యభోజ్యాదిసంభరితదర్వ్యాహార
మేదారిఁ జూచిన నిచ్చువారు

తే. నైరి వినయంబు భక్తియు నతిశయిల్లఁ
జంద్రవదనలుఁ బూరుషచంద్రములును
దద్వివాహమహామహోత్సవదిదృక్ష
నరుగుదెంచినవారల కందఱకును. 248

మ. ఘృతదధ్యాసవసూపగౌడజలగో
క్షీరప్రవాహంబులుం
దతశాల్యోదనశాకజాలగిరులుం
దద్వైభవాలోకనా
గతనారీనరతాద్భుతావహములై
కానంగ నయ్యో న్యథే
ప్సితలీలన్ భుజియించినం దఱుఁగ క
చ్ఛిద్రప్రభావంబునన్. 249

చ. అణుపరిమాణమధ్య లుప
యామవితర్దికచుట్టు నుల్లస
న్మణిమయపూర్ణకుంభములు
మంజులలాజసుమాక్షతాచ్ఛద

ర్పణగణరత్నదీపములు
పాలికలుఁ నెలకొల్పి రంతఁ గం
కణరవ ముప్పతిల్లఁ గనుఁ
గల్వలకాంతలు చొకళింపఁగన్. 250

చ. గురుతరకేశపాశకుచ
కుంభనితంబభరంబునంబలెన్
గర ఘురుదైన మందగమ
నంబులు చూపఱ కింపు నింప నం
బురుహదళాయతేక్షణలు
పొందుగ ధౌతదుకూలజాలకా
స్తరితసువర్ణపీఠములు
దార్చిరి పెండ్లియరంగుమీఁదటన్. 251

క. వాణియు నింద్రాణియు హరి
రాణియు మేనక వసిష్ఠురాణియునుం గీ
ర్వాణుల పికవాణులు శ
ర్వాణిం గైసేసి రమృతవాణిశ్రేణిన్. 252

క. సురతరులు విరులు గురియఁగ
సురదుందుభినినదగరిమ శోభిలఁగ వధూ
వరు లిరువురుఁ దెరమఱువుల
నురుతరశుభవేదిమీఁద నుండిరి వేడ్కన్. 253

మ. వెస నన్యోన్యముఖావలోకముల కు
వ్విళ్లూరుచుం జిత్తసా
రసముల్ వేడుక లెచ్చరింప సుముహూ
ర్తం బెంతయుం జెంతగాఁ
బసమీఱం దెరదీయ నొండొరులు చె
ప్పం జిట్టలా కోరికల్
గొనరం జూచుచు దంపతు ల్బైరసి ర
క్కొండంతసంతోషముల్. 254

క. మంగళకర మిది యనుచున్
మంగళసూత్రంబు సర్వమంగళ మెడ సా
రంగాంకధరుఁడు గట్టెఁ గు
రంగాక్షులు మంగళంబు రంగుగఁ బాడన్. 255

ఉ. ఆనగకన్య ధన్య తన
యంజలి రంజిలు క్రొత్తముత్తెముల్
మానుగఁ గెంపులంచు నను
మానమునం దలఁబ్రాలు నించి యా
శానునిమేను సోఁకి తెలి
చాయఁ జెలంగిన వానిఁ గాంచి లో
నానఁగరానినాన నగి
యాఁదల వెండియు నించెఁ బ్రాంచుచున్.

చ. స్మరహారపాణిముక్తనవ
శౌక్తికమౌక్తికజాల మింతిక్
శిరమున నేత్రికంఠకుచ
సీమల నారున జాతిజాతి య
గ్గురుఘనమీనకంబుగజ
కుంభభుజంగమలీలఁ జెందె ని
ట్లరుదె సువృత్తశాలి యధి
కాశ్రయతన్ ధర నుల్లసిల్లుటల్. 257

ఆ. ఆయహీనభూషణాఢ్యు లగ్గౌరాంగు
లాసితాబ్జనేత్రు లాశివాఖ్యు
లిత్తెఱంగువిధులఁ గృతకృత్యులై వల
గొనిరి పవనసఖునకును ముదమున. 258

వ. అంత. 259

చ. మణిమయనూపురాంచితము
మంజులయావరసార్ద్రిము స్మరు
ద్గణవినుతంబు నై పరగు
గాత్రివసుతారుణపాదకంజ మా
త్రిణయనుఁ డాత్మహస్తమునఁ
దేలఁగఁ బట్టిన విప్రలంభధో
రణికిఁ గలంబువోలెఁ దగి
రంజిలె సాప్తపదక్రమాంగతిన్. 260

ఉ. అప్పుడు చూచినాఁడ జగ
దంబఘనం బగురూపవైభవం
బిప్పుడు తత్ప్రతీక మొక
టేనియు నెంచఁ దరంబుగాదు నా
యొప్పగునల్మొగంబులకు
నూహకు నా మఱి యేరికైన నా
యొప్పులనప్పచక్కఁదన
మోపి వచింపఁ దలంప శక్యమే. 261

వ. అయినను. 262

మ. అనఘం బైనతదీయవర్ణనము మ
ర్త్యశ్రేణికి న్ధాత్రివా
గ్జనిసాఫల్య మొనర్చుఁ గావున యథా
శక్తిన్ రచింపందగున్
వినతానందనుఁ డైన నొక్కపరి ను
ద్వేగంబునన్ మింటఁ బో
వునె దా నట్లఁ క్రిమక్రిమప్రతిభ చే
నొప్పరు వర్ణింపఁగన్. 263

శా. ఆలోకేశ్వరి నాజగజ్జనని ని
త్యంబు న్విశుద్ధాత్మ్యఁడై
యాలోకం బొనరించు నెమ్మది నెవం
డాతండె కైవల్యల

ష్మిలోలుండు కులీనుఁ డార్యుఁ డతుల
శ్రీమంతుఁ డత్యంతపు
ణ్యాలీఢుం డఖిలార్థవేది వ్రతచ
ర్యానిష్ఠుఁడు న్యోగియుః. 264

తే. పార్వతీపరమేశ్వరప్రౌఢితోడ
ననఘ బ్రహ్మంబు రూపద్వయంబు దాల్చె
సర్వమంగళయును బురశాసనుండు
జగములకుఁ దల్లిదండ్రులు సంయమీంద్ర. 265

ఆ. సిరియు హరియు శివయు శివుఁడు నీనల్వుర
యందు భేద మించుకైనఁ గలుగ
దాగిరీంద్రతనయ యానందరూపిణి
సకలలోకములకు జననిసుమ్ము. 266

క. ఆదేవిసుప్రసాదం
బాదరమున నిశ్చయింతు రజహరిహరశ
క్రాదు లిఁక మానవులు త
త్పాదాబ్జము గొల్చునట్టిపని యద్భుతమే. 267

తే. ఆచిదానందరూపిణి యగజ తనక
టాక్ష మెవ్వానిపై నుంచు నతఁడె బ్రహ్మ
యాతఁడె శివుండు విష్ణుండు నతఁడె కాఁడె
వాని కఖిలార్థసిద్ధులు తోన కలుగు. 268

తే. అన్నపూర్ణ భవానియు నఖిలలోక
భర్త విశ్వేశ్వరుండును భైరవుండు
బిందుమాధవదేవుండుఁ బ్రియముతోడ
మనుపుదురుగాత శుభ మిచ్చి మనల నెపుడు. 269

ఉ. కాశికి నేఁగి యందు మణి
కర్ణిక మజ్జన మాచరించి వి
శ్వేశు నుమాసహాయుఁ బర
మేశ్వరు నిమ్మెగఁ బూజచేసి మో
హాశతఁ బ్రస్తుతించిన మ
హాత్ముఁడు ముక్తిరమామనోహరుం
డై శివలోకవాసమున
నవ్యయసౌఖ్యముఁ గాంచు నిచ్చలున్.270

వ. అని తెల్పిన విని మృకండనందనుండు శివపూజాప్రభా
వంబు వినవలతు తచ్ఛ్రవణం బఖిలదురితహరం బని
విందు నెఱింగింపవే యని యడిగినం బితామహుం
డిట్లనియె. 271

తే. అఖిలలోకైకనాయకుం డయినత్రిపుర
హరున కంజలి ఘటియించి యమ్మహేశు
పూజ యొనరించుమహిమ మింపుగ వచింతు
మౌనిపుంగవ విను మవధానమునను. 272

సీ. అవిముక్తమున భూసురాభాసుఁ డొక్కరుం
డతిదుర్వినీతుఁ డై యధివసించు
సకలపాపములకు జన్మభూమి యనంగ
నాతఁడు పశుకర్ముఁ డై మెలఁగుచు
నొకవారనారితో నొనగూడి కవగూడి
వలచి తత్పాదసంవాహనాది
నీచకృత్యంబులు నిత్యంబు సల్పుచు
నుండు నిట్లుండి తా నొక్కనాఁడు
తే. దాని కలరులు దెచ్చునుత్కంఠ మదిని
బూని యారామసీమకుఁ బోయి యెక్క
చ్చంపకానోకహం బెక్కి సొంపుమీఱు
కుసుమవిసరంబు బిసబిసఁ గోయుచుండె. 273

వ. అప్పు డప్పడంతిం దలంపునం జేర్చి యిట్లని తలంచె. 274

క. ఇవి పాలిండ్లను జేర్పుదు
నివి సరములు గూర్చి కబరి నిరవుగ నిడుదున్
శ్రవణావతంసములుగా
సవరించెద నివియు వికచసారసముఖికిన్. 275

చ. అనుపమసౌరభాంచితము
లై కనకప్రభ నొప్పు నివ్విరుల్
గనుఁగొని కామినీమణి ని
కామనిరర్గళహర్షసంపదం

దనరదె దాని నెమ్మది ము
దం బొదవించుట గల్గెనేని నా
జననము సార్థకం బగు ని
జంబు కృతార్థుఁడ నేన యిమ్మహిన్. 276

తే. ఈసువర్ణప్రసూనంబు లాసువర్ణ
గాత్రిసన్నిధి నిడి మ్రొక్కి గారవించి
చరణయుగళము గడిగి ప్రసన్నఁ జేసి
కదిసి యంత నలంకృతఁ గా నొనర్తు. 277

క. ఈచంపకసుమమాలిక
లాచంపకగంధికుచయుగాగ్రము సోఁకన్
వైచి తదీయాధరసుధ
వాచవిగొని కౌఁగిలింతు వదలనిప్రేమన్. 278

తే. చెలఁగి ము న్నివి దముఁ జెంతఁ జేరనీని
పగ మనంబున నిడి యళిపఙ్క్తి పిండు
గూడి చిక్కించుకొనునట్టి కొమరు నొందఁ
గలికివేనలి నీచంపకములు దుఱుమ. 279

వ. అని. 280

క. ఉవిదకు నన లొసఁగు మహో
త్సవ మెన్నుచు ని ట్లతండు సారెకుఁ బల్కెన్
శివమాయామోహితులై
యవమతిఁ గామాంధు లెట్టు లని పల్కు రిలన్. 281

ఉ. అంత నతండు పుష్పనిచ
యాపచయాంతమునం గరాహతిక్
వృంతము వీడి జాటి పృథి
విం బడుకొ్రిన్నన గాంచి యందు న
త్యంతనిరాశుఁడై యది శి
వార్పణ మస్తని పల్కి యేఁగి తా
నెంతయు వేడ్క నిచ్చెఁ దర
ళేక్షణకు న్సుమనఃపరంపరల్. 282

క. ఇవ్విధమున దుర్వర్తన
జవ్వనమునఁ దిరిగి యంత శతవృద్ధుండై
గ్రొవ్వారి గతభోగుండై
యవ్విప్రుఁడు మరణకాంక్షి యై యుండంగన్. 283

ఆ. అపుడు క్షేత్రపాలుఁ డఖిలధర్మాధర్మ
నయవిదుం డజాండనాయకుండు
వారణాసికా నివాసి పాతకిజన
భైరవుండు కాలభైరవుండు. 284

వ. వెండియు నతండు భావాతీతనిజప్రభావనిర్జితోద్యన్మా
ర్తాండతేజోమండలుండై నీలలాంఛనయుతంబును సాంద్ర
చంద్రికాకలితంబును నగు పూర్ణిమాశశాంకబింబంబు
డంబు నెనయుచు మకుటతటకుంచితాంచితనీలాలకజాల
పరివృతంబై మందహాసభాసురంబైన సుందరవదనార

విగ్రహంబును సౌవర్ణకర్ణకుండలమండితనూత్నరత్నావిచ్ఛి
న్నచ్ఛవిచ్ఛన్నంబై ముక్తికామిని మోజఁ గై సేయు
తఱి దర్శించునాదర్శయుగళంబుగతి నొప్పారు విప్పారు
గండమండలంబులును నాత్మీయారుణారుణరుచిర రుచి
నిచయంబున నచ్ఛాచ్ఛామలకీఫలస్థూలతరముక్తాహారం
బులం దోరంబుగాఁ గంజరాగంబు లనుశంక యంకు
రింపం జేయువక్షస్థలంబును శోణమాణిక్యాంగుళీయాం
గదకంకణాద్యలంకారవారంబులకు నిజావయవరక్తిమ
నామ్రేడితదీధితి నెలకొల్పి సంధ్యారాగం బెప్పుడు
గుప్పించు నిరర్గళబాహార్గళంబులును ముగ్ధవలగ్నస్నిగ్ధ
కాంచీవలయసలయరణన్మణికింకిణీగణప్రభాశోభితం బై
పరివలయితఫణిఫణారత్నశోభావిభవస్థగితంబైన మందర
ధరాధరనితంబస్థలంబు చెలువంబు ననుకరించు కటీరం
బును మంజులతరమంజీరరంజితం బయి భక్తజనశరణం
బైన చరణయుగళంబును విలసిల్ల జపాప్రసూనవర్ణుం
డును దాండవానందసంపూర్ణుండును దిగంబరుండును
గపాలశూలధరుండును గరుణాకరుండును నై హరిహరు
లకుఁ దుల్యప్రియుండై యుండి శివాత్మకుండై కాశీ
పురనివాసు లయినసర్వప్రాణులం బాలించుచు నిగ్ర
హానుగ్రహదక్షుండై యచ్చట మర్త్యాత్మం బ్రవర్తించి
రేని యక్షగంధర్వసిద్ధసాధ్యదేవదానవమానవుల నైనఁ

బంచక్రోశబహిర్దేశంబునం బడవైచుచుఁ దేజరిల్లుం
గావున నద్దురాచారుం డగు విప్రు నందుండనీయక
యుచ్చాటనం బొనరించె వాఁడును మందదృష్టియై
యష్టి యవలంబించి యల్లనల్లన నడచుచు భిక్షాశనుం
డై సర్వామయసంపూర్ణం బైనకాయంబు నిర్వహింపం
జాలక పంచత్వంబునొందె ననిచెప్పి బ్రహ్మ యిట్లనియె. 285

ఆ. కుపథవర్తులకును గుజనాప్తులకుఁ గృత
కల్మషులకుఁ గాశికాపురమున
నెట్లు గలుగు మరణ మిరవొంద నవ్విధి
పుణ్యవర్తనులకుఁ బొసఁగుఁగాక. 286

వ. ఆసమయంబున. 287

సీ. యమరాజకింకరు లసితాద్రిసన్నిభ
గాత్రములును రక్తనేత్రములును
భల్లముద్గరశూలపరశుపాశాంచిత
హస్తంబులును ఘోరమస్తములును
వజ్రదంష్ట్రారుచివ్యక్తకజ్జలమషీ
వర్ణంబులును ద్రోణకర్ణములును
బంచాస్యశార్దూలభల్లూకనిభవక్త్ర
తుండంబులును గర్తగండములును

తే. దనరఁ గరిహరిముఖ్యవాహనము లెక్కి
వానిఁ గొనిపోవ నచటికి వచ్చి రపుడు

పగ్గములఁ గట్టి కొట్టి అంపములఁ జీర
వలయు నని పల్కుచును గోధవంతు లగుచు. 288

క. లెక్కకు నెక్కుడు దురితము
లిక్కజనుఁ డొనర్చె వీని నినజునిపురిలో
నుక్కఱ వెతపఱుపం దగు
నిక్కం బిరువదియునాల్గు నిరయములందున్. 289

క. అని పలుకుశమనదూతలఁ
గనుఁగొని భీతిల్లి యతఁడు కాశీపురిఁ జే
సినతనకలుషతఁ దలఁచెన్
ఘనతరదైన్యమున శుష్కకంఠుం డగుచున్. 290

తే. స్థూల మయినను మఱి యతిసూక్ష్మ మయినఁ
దొలుతఁ దా నొనరించిన దుష్కృతంబు
గాంచుఁ బ్రత్యక్షసిద్ధముగా నరుండు
యాతనలఁ గుందువేళ నిజాత్మయందు. 291

ఉ. ఆతఱి నీలకంఠు లలి
కాంచితనేత్రులు శుద్ధవిగ్రహుల్
భూతివిభూషణుల్ సుగుణ
పూర్ణులు ధర్మహితు ల్మహాబలుల్
ఖ్యాతచరిత్రు లార్యు లమృ
తాప్లుతకాయులు శంభుకింకరుల్

చేతుల శూలము లెమ్మెఱయఁ
జేరఁగ వచ్చిరి వాని సమ్యోధన్. 292

శా. వారిం గన్గొని భీతి వోవవిడిచె
న్వాఁ డంతట న్వానికై
పోరం జొచ్చిరి కాలకింకరులతో
భూరిత్రిశూలంబులన్
ఘోరాసివ్రజచక్రతోమరగదా
కుంతంబులన్ వ్రేసి య
గ్గౌరీశానుచరుల్ ధరిత్రిరజ మా
కాశంబునం బర్వఁగన్. 293

క. యమదూతలు ప్రమథులచే
నమితాయుధహతుల నొచ్చి యఖిలాంగములుం
దుముకురై రక్తము గారఁగ
సమరమునకు విముఖు లగుచుఁ జని చని మరలన్. 294

శా. వారిన్ శంకరకింకరావళిగ భా
వప్రౌఢి నూహించుచున్
వీరల్ శౌర్యసమగ్రు లార్యులు జగ
ద్విఖ్యాతచారిత్రు లీ
సారాచారులతోడఁ బోరఁదగునే
సామాన్యులే యంచు స

త్కారం బొప్పఁగ మ్రొక్కి యిట్లనిరి భీ
తపస్వాంతులై శాంతులై. 295

చ. ఇతనికి ధర్మకర్మ మొక
యించుక యైనను లేదు పాపసం
హతి యొనరింపఁ జొచ్చె జని
యాదిగ దుష్టతరుండు మీదుసం
గతి వసియింప నర్హుఁడె స
కల్మషసన్నిధి నుండువాఁడు దు
ష్కృతుఁ డగు వీనిచెంత వసి
యింపఁగ మీకును గూడ దారయన్. 296

ఉ. క్రూరునిఁ గాంచ నంటఁ గెడఁ
గూడఁగఁ గూడునె యట్లు గాన మీ
రూరక వీని డించి చనుఁ
డున్నతసౌఖ్యము లాసచేసినన్
మీరలు సూక్ష్మదర్శను ల
మేయగుణాఢ్యులు శంభుదాసు లి
ద్విజుఁడి సేయుపుణ్య మర
వీసము గల్గిన నానతీఁదగున్. 297

మ. అనినన్ వారలు పల్కి రీద్విజుఁడు పు
ణ్యాచారవంతుండు తా

ననఘుం డై శివపూజ సల్పె నిమిషం
బైనన్ శివుం బూజచే
సినధన్యుం డఘసంఘముల్ దొఱఁగి యా
శ్రీకంఠసాయుజ్యముం
జన నొప్పుం గనుఁ దత్ఫలంబు దెలుపన్
శక్యంబె యానల్వకున్. 298

తే. కోటిజన్మార్జితము లైన ఘోరపాత
కములఁ బోకార్చు నివి యొకొక్కటియె చాలు
నిమిష మైనను మఱి యర్ధనిమిష మైన
స్మరహరునిపూజనధ్యానసంస్తవములు. 299

ఆ. భక్తి నైన మిగులఁ బరిహాసమున నైన
మాయ నైనఁ జౌర్యమహిమ నైనఁ
బత్త్రపుష్పచుళుకపరిమితజలములు
శివున కొసఁగి ముక్తిఁ జెందు నరుఁడు. 300

క. శివపూజకు నభిముఖు డగు
నవసరమునఁ దొలఁగు విప్రహత్యాయుతముల్
వివిధాగమ్యాగమసం
భవ మగు వృజినవ్రజంబు మానవతతికిన్. 301

క. ఈపుణ్యుఁడు కాశి న్వే
శ్యాపరతంత్రుఁ డయి పూని చంపకతరుసూ

నాపచయం బొనరించుచు
నాపు వ్విలఁ బడఁగ నది శివార్పణ మనియెన్. 302

ఆ. కొమ్మనుండి దిగువకును జాఱునంతలో
సుమహితముగ నట్టిసుమముచేతఁ
దరుణచంద్రధరుఁడు హరుఁ డర్చితుం డయ్యె
నితనిదురిత మంతకతన డిందె. 303

మ. ప్రకటాంచత్సితభూతి ఫాలమున నో
ప్పం దాల్చి రుద్రాక్షమా
లిక గంఠంబునఁ బూను ధన్యతరు హా
ళిన్ శంభులింగంబుఁ బా
యక పూజించి నుతించుపుణ్యతముఁ డ
ద్ధ్యానైకపారీణు మీ
రకలంకస్థితిఁ జేరఁ గేఁగుడు మహే
శాజ్ఞావిధిప్రాజ్ఞులై. 304

తే. భువిఁ బరబ్రహ్మ మొకటియు భూతి యొకటి
ఘోరసంసారతారణకారణములు
కదిసి యీరెంటిలోన నొక్కటి భజింప
వలయు నపవర్గకాంక్షచే వఱలువారు. 305

మ. అతులైశ్వర్యసమగ్రరాజ్య మిడు మో
క్షావాప్తి గావించు ద

ష్కృతభూతౌఘపిశాచరాక్షసగణ
ప్రేతాదులం దోలు నూ
ర్జితసౌఖ్యప్రదమై యరిష్ట మణఁచుం
జేకూర్చుఁ దేజంబు సం
తతముం గావున భూతి దాల్పవలయున్
ద్రాఘిష్ఠనిష్ఠ న్నరుల్. 306

తే. ఊర్ధ్వరేఖ ఋగ్వేదమై యొప్పుమీఁఋ
మధ్యరేఖ యజుర్వేదమహిమ నమరుఁ
దతి నధోరేఖ సామవేద మయి తనరుఁ
గాన ధరియింపవలయు రేఖాత్రయంబు. 307

క. గురుపత్నిఁ గలసి విప్రుం
బొరిగొని సురఁ ద్రావి కనకము హరించియుఁ దా
నరుదుగ భసిత మలందుచుఁ
బొరి రుద్రాధ్యాయి యైనఁ బూతాత్ముఁ డగుఁ. 308

క. రుద్రాక్షమాలి యగు ని
ర్నిద్రప్రతిభాతియోగ్యు నెఱిఁ గనుఁగొని య
క్షుద్రమతి నెఱిఁగి యరుగుఁడు
భద్రం బగు మీకు శమనభటవరులారా! 309

క. రుద్రాక్షసహస్రముచే
ముద్రితుఁ డయి భూతిఁ దాల్చి మోదంబున శ్రీ

రుదు్రి భజియించుసుగుణాస
ముద్రికరం గేలుమొగిచి మ్రొక్కుఁడు మీరల్. 310

ఉత్సా. అనుచుఁ దెలిపి శమనభటుల ననిచి యమ్మహామహుల్
కనదనేకనూత్నరత్నకల్పితాభ్రయాన మా
యనఘు నెక్కఁజేసి లాసికాప్సరోవిలాసినుల్
మొనసి కొలువ శంభులోకమునకు నరిగి రింపుగన్. 311

సీ. అదియు ననేకసహస్రసహస్రగ
భస్తిప్రశస్తభాభాసురంబు
మాణిక్యమందిరమహనీయబహుయోజ
నానాహపరిణాహమానితంబు
ఫలభరవినమితపనసరంభాదుమ్రిఖ
ర్జూరప్రముఖవనశోభితంబు
చక్రవాళాచలసన్నిభాభ్రంకష
ప్రాకటమణివజ్రపరివృతంబు

తే. నగుచు శశధరమకుటనీలగళనిటల
నయనసితతనుముఖ్యచిహ్నములతోడ
శివునిసారూప్యముక్తితోఁ జెలఁగునట్టి
ప్రమథులకు నాటపట్టయి పరగుచుండు. 312

అచ్చతెనుఁగుసీ. జిగివెల్లి వెలయించు మగరాలతలుపులు
పాపమేపరిపచ్చపలకగడప

లింపులు నింపు బల్ గెంపులగోడలు
బంగారుమెఱుఁగుటరంగుగములు
డంబుమీఱిన పవడంపుఁగంబములును
వేలుపురాఱాలదూలములును
గ్రొత్తముత్తెపుగుత్తు లత్తుదోరణములు
తలఁపుఱామానికమ్ములగవనులు
తే. మిసిమిక్రొమ్మించులను మించు పసిఁడియినుము
కలువనెచ్చెలిఱాతిఱాకట్టనములు
గలుగు నందలియిండ్ల సింగార మెన్నఁ
గలరె చిలువలదొర యైన నలువ యైన. 313

సీ. కందుకుందును లేని యిందుబింబంబులో
నెమ్మి నిక్కొమ్మలనెమ్మొగములు
వలలఁ జిక్కక పూతివలువనిమీనులో
గరిమ నీయన్నులకన్నుఁగవలు
మెత్తనై తేనియ లత్తినకెంపుతో
తతి నీసుదతుల రదచ్ఛదములు
రెక్క లెత్తక యొకరేయును బాయని
జక్కవకవలో యీసతులచనులు
తే. మెఱచి పఱవని యొఱపుల మెఱపులొక్కొ
యీనెలంతలమేనులఁ బూనురంగు

లనఁగ నగకన్యకాస్వరూపానురూప
సుందరీబృంద మెలమి నింపొందు నందు. 314

ఉత్సా. కల్పతరువు లిరువు మీఱ గంధసారకుంకుమా
నల్పదివ్యనవ్యభూషణాంబరంబులు న్సుధా
కల్పభక్ష్యభోజ్యముఖ్యకమ్రవస్తుతతియు సం
కల్పమునకు మిగుల నిండ్లఁ గలయ నించు నచ్చటన్. 315

సీ. హరిహరిన్మణితోరణగణము లా
ఖండలకోదండఖండములుగ
రామాలలామాభిరామాంగకాంతు లు
ద్దామసౌదామనీదామములుగ
పణవవీణావేణుపటహభేరీసన్మృ
దంగరంగధ్వనుల్ స్తనితములుగ
గంధర్వసదనూనగానస్రవద్రత్న
బృందాంబువులు వృష్టిబిందువులుగ

తే. సౌధవీథి ఘనాఘనసమితిఁ బోలి
వజ్రిముఖ్యామరమయూరవారములకు
వామదేవాదిచాతకవ్రాతములకు
ముద మొదవఁ జేయు నింపులు గదుర నచట. 316

సీ. అచటివీథులనిడు పస్తోదయాస్తాక
కుధరదూరంబులకొలఁదు లరయు

నచటిరత్నాంచిత హైమవిమానముల్
సురగిరిరోహణగిరుల నవ్వు
నచటినిష్కుటకుసుమామోద మామర
భూరుహసుమములఁ బ్రోదిసేయు
నచటిపూరుషులు దివ్యజ్ఞానసంపత్తి
సనకాదిమునులకుఁ జాటుచుందు

ఆ. రచటిపువ్వుఁబోండ్ల హావభావములకు
మునిసమూహ మైన మోము లెత్తు
నచటు సుకృతరహితు లగువారలకు దుర
వాప మగు దలంపువలన నైన. 317

దోదక. ఈసరణిం గడు నింపగు నక్కై
లాసమున న్సువిలాసతరంబై
భాసురరత్నవిభాకలితంబై
వాసుకిభూషునివాసము వొల్చున్. 318

వ. అదియును నరుణమణికిరణజ్యోతిరింగణాయమానఖర కిరణబింబంబును బరస్పరప్రతిఫలితలలితతోరణదేహళీ వ్యత్యస్తప్రశస్తతరారుణమణిహారితమణి ఘృణిసంతానంబును ననేకరత్నస్తంభసంభృతంబును రత్నవితర్ది కాసమన్వితంబును చంద్రదినేంద్రప్రభానిభరత్నదీపదీపితవిశాల సభాశాలావిరాజితంబును రత్నకల్పితానల్పతల్పాద్యుప

కరణసంయుతంబును నిజాకారానుకారిముక్తాసముల్లస
దుల్లాభ సుహ్మాల్లాభ విభవ ముదిత తారకావారంబును
మందిరైందవ ముకుర ప్రాకారాయమాన హీరకవాట
హాటకద్వారబంధురంబును మందరధరాధరసమున్నత
సుందరమందిరసహస్రాభిశోభితంబును శివసంచారసౌ
గ్యభాగ్యరత్నరచితకుట్టిమస్థలంబును గిసలకుసుమఫల
భరితసురతరుపంచకాంచితంబును ప్రమథగణరక్షితంబు
నై యవాఙ్మానసగోచరవైభవంబున నుల్లసిల్లు నందు
సుషమాసదనంబు లగువదనంబులచెలువంబుల రిక్క
రాయని వెలవెల్లంజేసినకతంబున నతనిఢాకకుం దాళక
యోడివచ్చి నిలువ నెల వెఱుంగక తిరుగుచుఁ బగతు
పగతురగుటంజేసి బంధుభావంబున వాని నాశ్రయించి
వెనుచొచ్చినధ్వాంతసంతతులకుం దగి యందుఁ జెలీవిన
చంపకదామంబులు మెఱపులయొఱపు నెఱపం బఱపగు
ధారాధరంబులయందంబుల నొప్పు కప్పంగొప్పులును
త్రిజగద్విజయసిద్ధిఁ బ్రసిద్ధిఁ జెందిన యసమబాణుబాణం
బులయవతారంబులై ప్రాగ్వాసనావశంబున యువజన
మర్మనిర్మథనంబులై కర్ణాభ్యర్ణంబునకుం జాఁగి వలపుల
తేనె చిప్పురుటరిగలపొలుపుఁ దెలుపు రత్నతాటంకంబు
లంచులుమించకయుండ నానయిడి యాఁగిన నచ్చట
నిల్చినతెఱఁగున రంగమరు కనుంగవలును హీరద్యుతి

పూరంబులం దోరంబు లయిన రదంబులును గుందం బుల కందంబులుగా నిలిచిన చివురుసవురు నెఱపు కెమ్మోవులం గఱవం బఱతెంచుపికనికరంబు చెంతం గపోలతలంబుల నున్న మృగమదకుంకుమపత్త్రంబులం బొంకంబు లయిన మదనుటెక్కియంబు లగు మకరం బులం గాంచి మట్టనోడి చుట్టంబులై కంఠలక్ష్మికి నిజ స్థానంబులం గానుకయొసంగె ననందగి శ్రోత్రజనంబు లం గర్ణికారవంబులగతి నలరంజేయు కులుకుటెలుంగు లును బయోధరధరాధరభరంబున ఖిన్నంబులై వడవడ వడంకు బడుగునడుముల విన్నందనంబు గాంచి యాద రించి పారిపై నిలిచిన మేఖలాదామంబుల కీర్తిస్ఫూర్తి పరిదానంబు లనం గట్టినవిశదాంశుకంబులు బాలాతప మిళచ్ఛురచ్ఛురదశకలంబులరూపంబున నేపుచూప నరుణ కాంతులు వెలికింజిమ్ము నితంబుబింబంబులును బ్రణయ కలహంబునం బొగులు మగువలకు నొంటమిమాన్చి నీటుందనంబు నెలకొలుపుపరిచయంబునం బరిసవశరవిరిం చుండు రంభాస్తంభంబు లూరుదంభంబున నిల్పి తద్వై రంబునం బరగు వారణయానంబు లందు నొనగూర్చె ననం దనరు మందగమనంబులకుం గారణంబులై కంద ర్పునియఘటనఘటనాపాటవంబును గొనియాడు వంది బృందంబుచందంబు నొంది మొఱయు నందియలసందడి

నందంబు లయిన చరణారవిందంబులుం గలిగి మవ్వం
బగు జవ్వనంబునం గ్రొవ్వి కంజకింజల్కసువర్ణవర్ణరంజి
తంబులైన మంజుపరాగంబులుం దశయోజనపర్యంతంబు
కై రవసారససారసౌరభంబులు వెదచల్ల నృత్తగీతవాద్య
హృద్యానవద్యవిద్యాప్రవీణలై వీణెలు వాయించు
శివకన్యాగౌరీకన్యకోట్లు బలసికొలువఁ దన్మధ్యంబున
దరస్మితకౌముదీముదితంబై చంద్రబింబంబునుం బోలు
మొగంబును బాహామృణాలసంజాతంబు లగు కంజాతం
బులంబోలు కరతలంబులును శ్రోత్రపుటకూపపతనో
న్ముఖంబులైన మీనంబులం బోలు నాయతనేత్రంబు
లును ఫాలబాలచంద్రరుంద్రవైరాహవదోహలంబున
వ్యూహంబయిన సంతమససంతతిం బోలు నీలకుంచిత
కుంతలవ్రాతంబులును విశదదశనహీరసంగతం బయిన
యరుణమణింబోలు నధరంబును ముక్తాకంచుకజాల
కీలితం బైన చక్రవాకమిథునంబులంబోలు కుచయుగం
బును లోకత్రయాతిశయసౌందర్యధుర్యతకు నభిజ్ఞాన
సంజ్ఞ యనం దగు వళిత్రయంబును దారుణ్యప్రవాహ
తటస్థితం బగు సైకతంబుంబోలు కటిస్థలంబును నూరు
కాండప్రకాండశుండాదండవిలసితం బైన వేదండయానం
బుంబోలు నడపులును నరుణపదసంధ్యారాగయోగం
బునం జాటలవర్ణంబు లయిన తారకంబులంబోలు నఖం

బులును దనకు నందంబులై తనర మంజీరకాంచీవలయ హారకేయూరమకుటతాటంకకంకణాంగుళీయకాదిసర్వా భరణభూషితయును ముక్తాధవళాంబరాలంకృతయు నుద్య త్ప్రభాకరనిభాకృతియును నై వామాంకస్థిత యగు సర్వమంగళతో సరససల్లాపంబు లాడుచు మునిదేవతా సంస్తూయమానుండును బ్రమథగణసంసేవ్యమానుండును రత్నసింహాసనాసీనుండును నైన పరమేశ్వరుండు సకల లోకపాలనం బొనరించుచునుండ నవ్విప్రుం డచ్చటికిం జని యమ్మహాదేవునకు నమస్కరించి తత్సమీపంబున వసియించె మునీంద్రోత్తమా! యిట్టిదిసుమీ యీ శివపూజా విధానంబునకు ఫలం బని చెప్పి శతానందుం డిట్లనియె. 319

క. శివపూజ సేయుభాగ్యము
భవకోటులనయిన దుర్లభము మనుజులకుఁ
భువి నిది ప్రదోషముల సం
భవ మగు టత్యంతదుర్లభమును మ్మనఘా. 320

క. స్మరహరచరణాబ్జస్తుతి
పరులకుఁ దద్ధ్యానయోగపరిచయులకు శ్రీ
కరభూతిభూషితులకుం
గరతలమున నమరినదియకా మోక్షు మిలన్. 321

క. శివ శివ శివ యని యైనను
భవ భవ భవ యనియు నైనఁ బలుమఱు గౌరీ

ధవ హర హర యని మైనన్
శివుని న్భజియింపఁగదవె చిత్తమ యెపుడున్. 322

తే. హీనకులజన్ముఁడై పరహింససేయు
శబరుఁడైనను వేఁటాడుసమయమునను
బ్రహర మాహర హర యని పల్కెనేని
కలుషములఁ దోలి పుణ్యలోకములు గాంచు. 323

ఆ. అని యజుండు చెప్పె నని వసిష్ఠుఁడు చోర
పుంగవునకుఁ దెల్పు పుణ్యగాథ
లాలకించి మాను లవ్వలికథ యెట్టు
లయ్యెఁ దెలుపు మనుచు నడుగుటయును. 324

ఉ. వారిచరాంకదుర్మదని
వారణ వారణదైత్యకృత్యదు
స్తారిభయార్తలోకచయ
తారక తారకమేదినీధరో
దారనివాస వాసవము
ఖామరమౌళిలతాంతమాలికా
వారిరసాభిషిక్తపద
వారిజ వారిజగర్భసన్నుతా. 325

క. కందర్పదర్పమర్దన
మందరకుధరధరకాండ మఘవముఖమరు

ద్వందితపదనీరేరుహా
బృందారకవైరివీరబృందవిదారా. 326

మాలినీ. వాసుకికంకణ వహ్నిశశాంకది
వాకరనేత్రి శివప్రద కై
లాసనివాస వలక్షశరీర సు
లక్షణచంద్రికళామకుటా
కాసరవాహనగర్వనిషూదన
గాంగఝురాంచితగౌరజటా
భాసుర సంతతభక్తవశంకర
భాస్కరకోటివిభాకలితా. 327

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీఁదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## చతుర్థాశ్వాసము

శ్రీరమ్యాదారువనముని
దారమనశ్చౌర్యధుర్య దైనందినసం
ధ్యారంభరచితతాండవ
క్షీరాంభోనిధినిషంగ శ్రీగిరిలింగా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు
సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లని చెప్పె న
ట్లంభోజసంభవుండు మార్కండేయున కిట్లనియె. 2

మ. అలవారాణసిలోఁ బరాశరసుతుం
డామున్ను భిక్షార్థి యై
కలయం గ్రుమ్మఱి విప్రవాటికల భి
క్షాలబ్ధి లేకున్న నాఁ
కలిచేఁ జిక్కియు నెండఁ జొక్కియును ద
త్కాశీపురావాసులం

జలమొప్పఁ శపియింపఁగాఁ దలఁచి రో
షపరిస్ఫురన్మూర్తియై. 3

గీ. అపుడు విశ్వేశ్వరునిమందిరాజిరధర
నిలిచి కోపంబు తాపంబు నివ్వటిల్ల
గటము లదరంగ మేనఁజెమ్మటలు వడియఁ
బలికె నిట్లని సోత్ప్రాసఫణితి చెలఁగ. 4

గీ. సత్య మగు నిది వెండియు సత్య మరయ
సత్యముగ వచియింతు భుజంబు లెత్తి
వేదశాస్త్రంబులను మించ విద్య లేదు
కేశవుని మించ లేఁడు దేవేశుఁ డొకఁడు. 5

సీ. అని చేతు లెత్తి రోషావేశమునఁ బల్కు
సత్యవతీతనూజాతుఁ గాంచి
పురశాసనునిపార్శ్వచరవరు లైన భృం
గీశ్వరుండును నందికేశ్వరుండు
నాయనభుజయుగ్మ మట్ల నిల్పుటయు సు
రాసురగంధర్వయక్షపతులు
మునిజనంబులు చతుర్ముఖుని కీవృత్తాంత
మంతయు వివరించి యతఁడుఁ దారు

తే. రభసగతిఁ గాశికానగరమున కరిగి
విశ్వభర్తకు సాష్టాంగవినతిఁ జేసి

సంస్తుతించిరి తద్భుజాస్తంభశాంతిఁ
గోరి గంభీరవాచానిగుంభనముల. 6

సీ. ఖరకరనీహారకరధనంజయనేత్ర
తారశరచ్చంద్రగౌరగాత్ర
త్రిజగజ్జనాత్యయస్థితిజనికారణ
యహినాయకాంగదహారిచరణ
శయశతదళతలసలలితసారంగ
సరసిజహితనిశాకరరథాంగ
చిత్రకాయాజినాంచితసత్కటీదేశ
ధననాథసఖ పురదైత్యనాశ

తే. శిఖరికన్యాకళత్ర రాజితచరిత్ర
నీలకంధర నిర్ఝరిణీధర హర
కాశికాధీశ యీశ యాకాశకేశ
నిర్జితానంగ జయ ధరణీశతాంగ. 7

చ. అని కొనియాడి దేవగణ
మాహరునాసతి మానియొద్దకుం
జని శివనింద సేయుదురె
సంయమి కాశి వసించి యిట్టులీ
ఘనతరనిందకున్ ఫలముఁ
గాంచితి వింక నిజంబు పల్కుమా

నినుఁ బరమేశ్వరుండు గరు
ణించు నటంచు హితోక్తిఁ బల్కెనన్. 8

వ. అప్పుడు సత్యవతీనందనుండు. 9

గీ. సత్య మగు నిది వెండియు సత్య మరయ
సత్యముగ వచియింతు భుజంబు లెత్తి
వేదశాస్త్రంబులను మించ విద్య లేదు
శంకరుని మించఁ బరతత్త్వ మింక లేదు. 10

మ. అని పల్కన్ సురదుందుభుల్ మొరయ రం
భాద్యప్సరోలాస్యముల్
గగనవ్యోం నవవాన పెల్లు గురియం
గంధర్వగానంబు పె
ల్చన వీతేర మునీంద్రచంద్రుని భుజా
స్తంభంబు శాంతించె నం
త నిజస్థానము లొయ్యఁ జేరిరి నితాం
తప్రీతులై నిర్జరుల్. 11

వ. వెండియుఁ గృష్ణద్వైపాయనుండు వారాణసీపురంబున
భిక్ష గానక క్షుత్పిపాసాపరవశుండై శపియించుతలంపున. 12

చ. ఇది మొద లెవ్వఁడేని నరుఁ
డీయవిముక్తధరిత్రి నీల్గినం
దుదఁ గను గర్దభత్వ మతి
దూరతరుం డగు మోక్షలక్ష్మి కీ

యదనున నేను సత్యముగ
నాడితి నంచు జలంబు దోయిటం
గదియఁగఁ బట్టి చల్లెఁ గడఁ
కం గనుఁదమ్ములఁ గెంపు ముంపఁగన్. 13

శా. ఆశాపాంబు లిలాస్థలిం బడఁగ నీ
కంతం గపాలంబుచేఁ
గాశీపాలకుఁ డైన భైరవుఁడు చి
క్కంబట్టి వేవేగ య
క్కాశీదేశము కీకటాఖ్య నెనయం
గాసిం బడంజేయు పా
రాశర్యార్యకృతాపరాధ మనలా
రం దెల్పె విశ్వేశుతోన్. 14

మ. శితికంఠుం డపు డజ్జలంబు పరణా
సీదేశదూరక్షితిన్
ధృతిమైఁ జల్లు మనంగ నట్లు యతఁ డెం
తే వేగ మేపారఁగా
నతివేలోద్ధతిఁ జల్లె నాఁడుతుదగా
నద్దేశరాజ్యంబు దూ
ష్యతమం బై తగెఁ గీకటాహ్వాయతఁ ద్రిం
శద్యోజనాయాతమై. 15

క. అందు మృతులైనవారల
కందఱకును గర్దభత్వ మగు సత్యవతీ
నందనుశాపోదక మా
చందమునన్ భైరవుండు చల్లుటకతనన్. 16

ఉత్సా. కాశి నుండవలవ దనుచుఁ గాసిఁ బెట్టి భైరవుం
డాశివాజ్ఞఁ బూని వెడల నడిచె నపుడు వ్యాసమా
నీశు నత్తెఱంగు వినయ మెసఁయఁ దెల్పికొనిన నా
కాశికేశుఁ డిట్టు లనియెఁ గనలు గదుర నతనికిన్. 17

ఆ. క్రోధ మంగకలితమై ధర్మము హరించు
రవి నిదాఘువేళ రసముఁబోలి
క్రోధవహ్ని యన్నిగుణములఁ బోకార్చుఁ
గ్రోధవంతుఁ డఖిలబాధకుండు. 18

క. క్రోధి యొరుం దను నెఱుఁగఁడు
క్రోధము బలవద్విరోధి క్రోధి యకార్యా
రాధనపరుఁ డగుఁ గావునఁ
గ్రోధము విడువఁదగు శుభము గోరు జనంబుల్. 19

చ. అరుగుము సంయమీశ్వర ని
జాశ్రితపాతకజాతమేదినీ
ధరశతకోటికిన్ జనవి
తానమనోరథదాననిర్జితా

మరుతరువాటికి న్విబుధ
మానితపుష్కలతీర్థకోటికిన్
నిరతసమస్తసద్గుణమ
ణీగణపేటికి దక్షవాటికిన్. 20

సీ. అఖిలముఖ్యస్థాన మై వింధ్యదక్షిణ
ధాత్రి గోదావరీతటమునందుఁ
బాదగయాక్షేత్రపరిసరంబున నొప్పు
నదియు రెండవకాశి యనఁగఁ బరగుఁ
బ్రాజ్ఞకోటికి మఖప్రముఖకర్మములు ని
రంతరాయక్రియ నమరు నందు
నధివసియింతు నే నచట నిత్యము శైల
కన్యతోఁ బ్రమథసంఘములు గొల్వ

తే. సిద్ధచారణగంధర్వసేవితంబు
సన్మునీశ్వరదేవతాసంకులంబు
నగుచుఁ దనుఁ గాంచ దురితసంహతులఁ దొలఁచు
ధరణిచరణతులాకోటిదక్షవాటి. 21

ఉ. శ్రీ విలసిల్లు నన్నగరి
చేరువధారుణి గంగ లేదునుం
బ్రో వయి యొక్కపుణ్యనది
భూనుతలీలఁ దనర్చు సప్తగో

ధావరి నా౯గ నందు నుచి
తస్థితిఁ దాన మొనర్చి సప్తగో
దావరుల న్మనుంగు సుకృ
తంబు గను న్మనుజుండు సంయమీ. 22

శ్లో. సప్తగోదావరీస్నానం। భీమనాథస్య దర్శనం
ఏకరాత్రినివాస శ్చ। నాల్పస్య తపసః ఫలం॥
సప్తగోదావరీస్నానం। మణికర్ణికయా సమం
దర్శనం భీమనాథస్య। కాశీవిశ్వేశదర్శనం॥

ఆ. ఈరసమునసైన నిల మాయచేసైన
వారనారిఁ గలయువాంఛసైన
దక్షవాటిలోనఁ దగ నొక్కరేయి వ
సించెనేని ముక్తిఁ జెందు నరుఁడు. 23

క. చులుకజల మయిన బదరీ
ఫలమాత్రం బైన బిల్వపత్రం బయినం
జెలు వమర దక్షవాటీ
స్థలి నొసఁగిన మోక్షలక్ష్మి దక్కు నతనికిన్. 24

ఉ. అవ్యయసౌఖ్యసిద్ధి యగు
నచ్చట నిల్చినఁ గాశికావియో
గవ్యథ యించుకేనియును
గల్గదు నీ కతులప్రభావనం

భావ్యమనీష నేఁగు మని
పల్కిన నయ్యవిముక్తదేశవా
స్తవ్యనియానతిం జనియె
సాత్యవతేయుఁడు దక్షవాటికిన్. 25

ఆ. అమ్మహానుభావుఁ డపు డత్తెఱంగునఁ
గతిపయప్రయాణగతుల నరిగి
కనియె నంతఁ బీఠికాపురపరిసర
క్ష్మఁ దనర్చుఁ బాదగయఁ బ్రియమున. 26

ఉ. శ్రీపరిపూర్ణవైభవవి
శేషవినిర్జితగోపురంబు క్షో
ణీపదనీరజాతరమ
ణీయరణన్మణినూపురంబు చం
ద్రోపలజాలనీలమణి
యోజితరాజితధర్మనిర్మితో
ద్దీపితగోపురంబు నయి
తేజునఁ బీఠపురంబు డంబగున్. 27

సీ. చరధరాధరసముత్కరలీల నొప్పు న
భంగురతుంగమతంగజములు
నలగంధవాహవాహవ్యూహగతి మించు
రయవయాంచితసితహయచయంబు

మఘవసన్మానవిమానసన్మానతఁ
గర మరుదగు శతాంగములగములు
నరివనపవనసఖాకృతి ధృతిఁ దగు
సమరమటోత్కటుల్ చటులభటులు

ఆ. గణన మిగుల నమలగుణమణిగణముల
గరిమకతనఁ గాంచికాపురంబు
చెలియ లనఁగఁ దనరుఁ గలుములజవరాలి
కాపురంబు పీఠికాపురంబు. 28

సీ. సత్యభామానురంజనపూరుషోత్తమ
కమనీయ మగు ద్వారకాపురంబొ
శత్రుఘ్నరామలక్ష్మణముఖ్యనృపలోక
దీపితం బగు నయోధ్యాపురంబొ
విబుధశతక్రతువిభవసమృద్ధిచేఁ
జూపట్టు నమరావతీపురంబొ
హయముఖసేనాసమాక్రాంతలీలలఁ
గాంతమై తగు నలకాపురంబొ

తే. ధర జగత్ప్రాణవిఖ్యాతిఁ దనర నౌనరి
తేటఁ జెన్నగు గంధవతీపురంబొ
యీపురం బని భువనంబు లెన్న నెగడి
చూపఱకు నింపొసఁగుఁ బీఠికాపురంబు. 29

ఉ. అందలిసుందరీమణుల
యచ్ఛతనుద్యుతిఁ గాంచి మించు ల
య్యందము నొందలే కతిర
యంబున సిబ్బితి నేఁగుటంజుమీ
యందె క్షణప్రభాఖ్య యొఱ
పై నఘనాశ్రియ మబ్బె నేనియుం
బొందునె చంచలాత్మలకుఁ
బూర్ణచిరప్రభ ధారుణీస్థలిన్. 30

చ. జలరుహగంధు లందు మణి
సౌధము లెక్కి నఖాంకురంబులం
దిలకము దీర్చి క్రేవల వి
దిర్చినకస్తురి చెంత నేఁగు వె
న్నెలదొరమేన నంటుకొను
నీలిమఁ గాంచి కళంకి యందు ర
య్యలఘుగుణోత్తరుం గువల
యాప్తున కెందుఁ గళంక మబ్బునే. 31

ఉ. అచ్ఛము గాఁగఁ గేతనప
టాంచలచంచలపాణిసంజ్ఞలం
గ్రిచ్చఱ హీరసారమణి
కాంతిలసద్దరహాస మొప్ప వై

యచ్చరపట్టనప్రికట
హార్మ్యములం గలహింపఁ జేఁసు నా
నచ్చటిచంద్రశాలికల
హార్మ్యసమున్నతి యొప్పు నెప్పుడున్. 32

ఉ. అమ్మహి నింపు నింపుచు ధ
రాధిపవై భవగౌరవంబుచేఁ
గొమ్మలమీఁద వేలుపుల
కొమ్మలు ఖేయమునందుఁ దేలి నా
గమ్ములకొమ్మలుం గొలువు
గాఁ గొలువుందు పసిండికోట నె
య్యమ్మిగురొత్త విష్ణుపద
మంటినఁ గల్గవె భూరిసౌఖ్యముల్. 33

చ. జగములు నిల్పఁగాఁ దలఁచి
చక్రిధరుండు త్రివిక్రమాకృతిన్
జగము నుతింపఁగాఁ బెరుఁగు
చందము నొందుచు నచ్యుతప్రభన్
గగనతలంబు ముట్టెఁ గడఁ
కన్ వరణంబు పురంబుచెంగటం
దగియె నగడ్త యాయనప
దద్వయిఁ బుట్టిన గంగపోలికన్. 34

చ. హరికరివారశూరసుభ
టార్భటిఁ సంగరకాంక్ష పూని దు
స్తరగతి వచ్చు వైరుల క
సాధ్యగతిం *దదభేద్యవృత్తియై
యరు దగువీఁకతో స్వరణ
మంఘ్రితలంబున హీరనూపురం
బురుబిరుదంబుగాఁ దొడిగె
నో యన నొప్పగు ఖేయ మప్పురిన్. 35

చ. కనఁదగి యందుఁ గల్పతరు
కల్పతరుప్రికరాన్వితంబులై
వనిచిననందనంబునకు
నందనరాజి యనంగ లోకపా
వనము లగు స్వనంబు లభి
వాంఛితసత్ఫలదానవైఖరిన్
ఘనత శుకాదిసద్ద్విజశి
ఖామణుల న్నిరతంబుఁ బ్రోచుచున్. 36

మ. పురసౌభాగ్యదిదృక్షచేబలెఁ బరి
స్ఫూర్తిం బటీరక్షమా
ధరము న్వేఁడిగి యంతరాంతరసరి
త్పద్మాకరాళీసము

---

* దళభేద్య—పాఠాం.

త్త్రరణప్రక్రియ డస్సి యల్లఁ జని కం
దర్పాహవవ్యస్తత
త్పురనారీశ్రమ మార్చుచుణ్ మెలఁగు నం
దు న్వాతపోతౌఘముల్. 37

చ. అతివ ! సుమమ్ము లమ్మొదవె
యమ్మొదనే మరుబేరసూటి నీ
గతిఁ గను మోపిన న్వలపు
గల్గినక్రొన్నన లిమ్ము కొమ్మ య
ట్లిత వగునేని మాపటికి
నిచ్చెద సొమ్మువు డిమ్మటంచుఁ దా
రతులమృదూక్తులణ్ విటుల
నాడుదు రప్పరిపుష్పలావికల్. 38

మ. క్రమ మొప్పం జతురాననత్వమును వా
క్కాంతత్వముం దుల్యమై
యమరు న్బ్రహ్మకు నందు విప్రులకు న
వ్యపౌఢిచే నైన దా
రమితానందసమగ్రపూతమతు ల
య్యార్యుల్ శతానందుఁ డ
క్కమలపోద్భవుఁ డంచు నెన్నుదురు వే
డ్కం దారతమ్యంబులన్. 39

మ. నిరతావక్రపరాక్రమప్రకటనో
న్నిద్రప్రభావోదయుల్
పురిరాజన్యులు సద్వశానుగతిచేఁ
బొల్పొంది సామోద్భవ
స్థిరవిఖ్యాతియు దానవైభవము ను
ద్దీపింప నిశ్శేషభూ
భరణప్రక్రియఁ దేజరిల్లుదురు చె
ప్పఁగ సార్వభౌమాంకులై. 40

చ. అనవనవాంక శేవధిస
మగ్రిత నెచ్చెలి యైన కృత్తివా
సుని ధనిఁ జేయలేఁ డనుచుఁ
జూచి హసించు ధనాధినాథునిన్
సునవనవాంక శేవధులఁ
జొప్పడి మిత్రుల కంశుకానులే
పనధనసంపదల్ నినిచి
పట్టనహట్టకిరాటసంతతుల్. 41

చ. సిరి నుఱవైన హాలికులు
చేసినధాన్యపురాసు లందు భూ
ధరసముదగ్రత న్నభముఁ
దాఁక నభోమణి తేరిగుఱ్ఱముల్

ఖురముల డిగ్గి యందులఁ ద
గుల్కొన నెత్తుచుఁ బోవుటంజుమీ
యరుదుగ నుత్తరాయణము
నందుఁ ధిరంబుగఁ బొద్దు నిల్చుటల్. 42

చ. పలుకు వినంగ నాసగొని
పాంథులు మార్గము వేఁడ వారికిం
దెలుపు మృదూక్తికీరముల
తేఁకువ సిగ్గున ముంపఁ బయ్యెదల్
తొలఁగి చనుంగవల్ వెలికి
దోఁపఁగ మవ్వపుఁగ్రొవ్వెదల్ విడం
బులుఁగుల రొప్పుచుండుదురు
పొంధుగ నందులశాలిపాలికల్. 43

మ. యతినైన న్విటుఁ జేయ నేరుతురు న
ర్మాలాపవాగ్వైఖరిన్
రతినైనం దలవంపఁ జేయుదురు స
ద్రమ్యాకృతిన్ భారతీ
పతినైనం దతగీతలాస్యకలనా
ప్రాగల్భ్యసంపత్తి న
ద్భుతపాథోధి మునుంగఁజేయఁగల రం
దు న్వారకన్యామణుల్. 44

వ. ఇట్లు సమస్తవస్తువిభవశోభితం బగు పీఠికాపురసమీపం
బునం గరం బలరు పాదగయాక్షేత్రంబున నప్పారాశర్యుం
డుచితవిధులు దీర్చి యుండునంత. 45

శా. ఆమౌనీంద్రునిఁ జూడ కశ్యపపుల
స్త్యాగస్త్యమైత్రేయవి
శ్వామిత్రక్రతుతుల్యమంకణభర
ద్వాజాత్రిభృగ్వంగిరో
రామాత్రేయవసిష్ఠకణ్వబకదూ
ర్వాసోజరద్గౌతమ
శ్రీమద్గౌతమరోమశాదిమును ల
ర్థి న్వచ్చి రచ్చోటికిన్. 46

క. వచ్చి మనంబునఁ గదిరిన
యచ్చెరువున నతనిఁ గని తదాగమనవిధం
బచ్చుపడ నడిగి తమలో
నుచ్చావచవచనరచన లొనరఁగ నంతన్. 47

చ. అరిగిరి యమ్మహాత్ము లపు
డమ్మునిఁ దోడ్కొని శక్రదత్తభా
సురవిభవాప్సరోగణవి
శుద్ధతరాన్వయజాతనూతన
స్ఫురదురురూపయౌవనసు
శోభితవారవధూటికిం జిర

స్థిరసముపాశ్రియాభిమత
దిక్ప్రియశాటికి దక్షవాటికిన్. 48

ఉ. ఆవిధి నేఁగి యందు నిఖి
లాఘనివారణకారణంబులై
పావనజీవనోదయద
భంగతరంగఘటాఘుమంఘుమా
రావవచోవిలాసముల
రమ్మని పిల్వఁగఁ జేరి సప్తగో
దావరిఁ గ్రుంకి చల్పి రుచి
తక్రియ లమ్మునిరాజు లందఱున్. 49

లయగ్రా. ఈనది శివాగమపథానుచరణప్రవణ
మానివరసీతలసమానసితతోయం
బీనది మనోజ్ఞపవమానసుఖితోభయత
టానుగతనిర్జరవిమానరమణీయం
బీనది కుశేశయరసానుభవలోలదళి
గానకుతుకప్రణుతిమానితగుణౌఘం
బీనది నిసర్గజకృపానిధిగదా శుభవి
తాన మొసఁగుం గడఁగి తాన మొనరింపన్.

మ. అని ద్వైపాయనముఖ్యమానినికరం
బాసప్తగోదావరిం

జనవొప్ప న్వినుతించి దేవమకుటాం
చత్పద్మరాగాదిర
త్ననికాయద్యుతిశోభమానచరణ
ద్వంద్వార్పితాహీనసూ
తనమంజీరుని భీమనాయకుని నం
త న్గాంచి మోదంబునన్. 51

హయగతిరగడ.

జయ జయ సర్వసుపర్వకిరీటల
సన్మణిఘృణిరాజితపదపల్లవ
జయ జయ వక్షస్సంగితశిఖరిజా
స్తనఘనమకరికాదళసంపల్లవ
జగదభిరక్షణదక్షిణతాభి
జ్ఞాపకగళసంభృతహాలాహల
యగణితనిజగుణగణపరిగణనా
యత్తశ్రుతినన్నుతికోలాహల
శతదళబాంధవ జీవంజీవక
సత్సఖ వైశ్వానరవరలోచన
హితనిజచరణాంబుజయుగసేవా
హేవాకాశ్రితబంధవిమోచన
శరధిసుతాకుచలికుచమృగమద
స్థాసకరచనాకర్మఠసాయక

నిరుపమితాత్మధ్యానశ్రీద్ధా
నిధ్యానపరాభీష్టవిధాయక
దారువనాంతస్థితవాచంయమి
దారస్ఫారమనోధనతస్కర
సారాచారవిశారదనారద
సంయమిమానససారసభాస్కర
యనిలానలవసుధాంబరశంబర
హరిశశియజమానాత్మకవిగ్రహ
సనకసనందనసందనకరణ
స్వాంతనిరంతరజాగ్రదనుగ్రహ
*దాససముత్కరతారక తారక
ధరణీధరసంకేతనికేతన
*దాస†గణాధిపతావాహనతా
దౌవారికతాకేతనకేతన
వారిజసంభవముఖసురదరకర
వారణదానవమాననివారణ
ధారావాహికభువనావసనం
ధాసంజననవిదారణకారణ
రంగదభంగురమధురమధురసా
రసభాసురహృదయంగమభాషణ

* దాన † గుణాధిక దావానావాదావాలికదా కేతనకేతన—వ్రా. ప్ర.

యంగజసితభసితాలంకృతవిశ
దాంగవిభాసిభుజంగవిభూషణ
యినశశిచక్రాంచితరథసమలం
కృతికృత కేతరవచనతురంగమ
యనయపురాసురజీవానిలపా
నామితపీవరబాహుభుజంగమ
సప్తవ్యసనాభ్యసనవినిందిత
సంవిజ్జనతాఘనతామర్దన
సప్తమునీశ్వరనీతస్రోత
స్సలిలసలీలానందితకపర్దన
దక్షంమన్యప్రేక్షాదీక్షిత
దక్షవిధాతృవితానవిభంజన
యక్షవిజయనియమాక్షయయోగా
ధ్యక్షాభిమతవ్యంజనరంజన
ప్రతిదినరజనీముఖనిర్వర్తిత
పటుతరనర్తనముఖరితదిఙ్ముఖ
వ్రతతేరమ్మదవారకతారక
వర్ధకిరీటితనవకువలయసఖ
జయ జయ మృత్యుంజయ భీమేశ్వర
శాశ్వతభక్తశివంకర శంకర

దయయాస్మానవ దక్షిణాకాశీ
ధవ శివ భవ భవభావభయంకర. 52

మ. జనిసంరక్షణ*కారణక్షమమిథ
స్సంగ్రామరంగాజిరా
వనిసంలక్షితధూమధామమహిమా
వర్ణోర్వరులింగాఖ్యసం
హానసాదృష్టశిరోంఘ్రిహంసకిటిరూ
పాబ్జాసనశ్రీశస
ద్వినుతప్రాభవభావ మమ్ముఁ గరుణన్
వీక్షింపు భీమేశ్వరా. 53

చ. అని కొనియాడి వేడుకల
నందలితీర్థము లెల్ల నాడి పా
వనమతులైన యుబ్భువన
వంద్యులు సప్తమునీశ్వరావగా
కనకసహస్రపత్త్రిమృదు
గంధధురంధరగంధవాహముల్
మనముల కింపొనర్ప గరి
మ న్వసియించి కథాప్రసంగతిన్. 54

వ. ఇట్లనిరి. 55

* కారణాక్షమ—పాఠాం.

శ్రీ

# ధర్మఖండము

(ద్వితీయసంపుటము)

ఈఁదులపల్లి భవానీశకవీంద్ర

ప్రణీతపద్యకావ్యము



శ్రీపీఠికాపురసంస్థానాధీశ్వరుల యాజ్ఞ ననుసరించి

విమర్శాదర్శక

నడకుదుటి వీరరాజకవిగారిచే

బరిష్కరింపఁబడి

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాశాలయందు

ముద్రింపఁబడినది.

1931.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## షష్ఠాశ్వాసము



శ్రీకరమౌళిశశాంక
ప్రాకటనవకౌముదీనిరాకృతలోకా
నీకాంధకారచయహా
శ్లోకరరాజన్యవలయ శ్రీగిరినిలయా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు బృహస్పతి సురపతి కిట్లనియె. 2

క. రక్షోవరుఁ డైన హిర
ణ్యాక్షుఁడు దెగటార నతనియనుజుఁడు పంకే
జాక్షునితోఁ బగఁగొనియెన్
సాక్షముఁడై కనకకశిపుఁ డాగ్రహవృత్తిన్. 3

మ. హరిదేవాలయపంక్తిఁ ద్రోచి హరివే
షాన్వీతులన్ శ్రీహరి
స్మరణాసక్తుల నూర్ధ్వపుండ్రతులసీ
సన్మంజరీధారులన్
బరమామర్షత నొంచె విష్ణుహితదం
భప్రక్రియున్ వేదశా
స్త్రరహస్యార్థము లుజ్జగించితిరి మీ
ర లుండ్యు లంచున్ వెసన్. 4

క. కమలాక్షునిభక్తుల రై
క్రమమున శివనిందసేయుకష్టులు మీరల్
శమనుఁడు దండించు మిమున్
శమనుఁడు నేఁ గాక యొండు శమనుఁడు గలఁడే. 5

ఆ. అనుచు విష్ణుభక్తు లనఘమహావిబుధుల
ఫాలభాగరచితభాసమాన
శృంగభంజనంబు చేసి బాధించె నా
దితితనూభవుండు ద్వేషపరత. 6

వ. అంతఁ గులవృద్ధులను బంధుమిత్రాదులను గనుంగొని
యిట్లనియె. 7

గీ. హరి మదగ్రజుఁ డగు హిరణ్యాక్షుఁ దునిమె
నతనిఁ గ్రమ్మఱఁ దునుమక యాఱ దీయ

నల్పశోకాగ్ని తజ్జయోపాయ మరసి
తెలుపఁదగు మాకు మీరలు గలఫలంబు. 8

వ. అనిన విని వారలు దేవా! నీ వెఱుంగనికార్యంబు
లెయ్యవి బలశౌర్యవంతుం డగు నీకు నింత విచారింప
వలయునె యైనను మానేర్చుతెఱంగున విష్ణుని జయించు
నుపాయంబు దెల్పెద మని యిట్లనిరి. 9

సీ. అఖిలలోకంబులు వ్యాపించి విష్ణుండు
వెలయు నాత్మవిభూతి విలసనమున
నబ్జాకరముల దేవాయతనంబుల
యజ్ఞవాటముల ఋష్యాశ్రమముల
బిల్వవటాశ్వత్థపృథ్వీరుహముల ను
మారామభూముల యతులయందు
వేదశాస్త్రపురాణవిద్యాధ్యయనధరఁ
బావనస్థలుల బృందావనముల
సత్యవంతులయెడఁ బ్రియాశాలికలను
వ్రతపరాయణు లగు విప్రవరులయెడల
ధర్మపరు లగు క్షత్రియోత్తములయెడలఁ
దరల కుండును విష్ణుండు దనుజనాథ. 10

ఆ. పుణ్యతీర్థములను భూరిసాలగ్రామ
పూజనముల సత్త్రభూములందుఁ

బుణ్యకర్మ లైన భూసురులందు మ
హాహోమహాండు విష్ణుఁ డధివసించు.

క. పదునాల్గులోకముల నె
య్యది నిరతశ్రీసమృద్ధి నలరు మఱియు నె
య్యది ధర్మకర్మమూలం
బది హరిమయ మనుచుఁ దెలియు మసురాధీశా.

ఉ. వీరల నిగ్రహించుటయె
విష్ణుజయించుట యట్లు గాన నీ
వోరజనీచరేశ్వర బ
లోద్ధతి సాధుల బాధసేయుమా
కూరిమితోడఁబుట్టువు న
కుంఠితలీల వధించినట్టి య
వ్వైరము దీఱునే యకట
విష్ణుని నీక్రియ నొంపకుండినన్.

వ. కావునఁ జతుర్దశలోకంబులు బాధింపు మని బోధించిన సంతసించి రక్కసులఱేఁడు వారలకుం బరితోషంబుగా ననేకధనంబు లొసంగి యంత.

సీ. దండ ప్రచండ దుర్దండ మషీవర్ణ
వక్రాస్య వికటాస్య వక్రకేశ
శతబాహు దశభుజ శతముఖ దశముఖ
దీర్ఘోష్ఠ రక్తప దీర్ఘజిహ్వ

వహ్నిసన్నిభ కుక్షివక్త్ర చతుర్నేత్రి
11 పలలభుక్కీకసభక్షకోగ్ర
ఘోరాస్య వికట వక్షోలోచ నైకపా
దైకకర్ణ గదాధ రైకబాహు
12 దీర్ఘదంత ప్రభృతిఘోరదివిజవైరి
వీరులను సాధుబాధ గావింపఁ బనిచి
కదలెఁ దానును లోకము ల్గాకుపఱుపఁ
జటులచతురంగవాహినీసహితుఁ డగుచు. 15

వ. హరిపదభక్తులం గడపి
యాగతతు ల్నిరసించి సజ్జనో
త్కరముల నొంచి వనానులమ
దం బడఁగించి తటాకపంక్తు లు
13 ద్ధురదురహంకృతిం గలఁచి
తోఁట లొగిం బడఁద్రోచి ధారుణీ
సురుల వధించి దైత్యులు వ
14 సుంధరఁ గ్రుమ్మఱి రుద్ధతక్రియన్. 16

ఉత్సా. ఆహిరణ్యకశిపుఁ డంత నఖిలలోకపాలురన్
సాహసక్రియం జయించి సర్వలోకసంపదల్
దా హరించి యసురవరు లతండ్రిభక్తిఁ గొల్వ ను
త్సాహదీప్తుఁ డయ్యె వాయుసంగతాగ్నికైవడిన్. 17

వ. ఇత్తెఱంగున( జతుర్దశభువనంబులు జయించి తేసవశంబు
చేసికొని బ్రహ్మాండంబునకు శిక్షకుండును రక్షకుండును
దానయై హరిం బరాజితుంగా( దలంచి యతనిపతా
జయం బెల్లలోకంబుల( జాటించి యుత్సవం బొనరించి
నేన జగన్నాయకుండ నని తలంచుచు నెదురులేక మదం
బునం బొదలుచుండె నిట్లుండి దురితవిపాకంబుకతంబున
నొక్కనా(డు నిజనందనుం డగు ప్రహ్లాదుని రావించిన. 18

క. హరిభక్తు( డఖిలశాస్త్రా
ర్థరహస్యవిదుండు పూర్ణరజనికరకరో
త్కరవిమలు(డు ప్రహ్లాదు(డు
గురుగృహమునను(డి వచ్చె గురుసన్నిధికిన్. 19

సీ. హరి రమాపతి సనకాదిమునిస్తుతు(
డని నెమ్మనంబున( దల(చువాని
[illegible]
[illegible] వేడుక( బఠియించువాని
జగము శ్రీహరిమయం బగు సత్యమని యెంచి
పులకాంకితాంగు(డై పొలుచువాని
ననిశంబు [illegible] సజ్జను(డై సమ
[illegible]జ్ఞుల( గావించు ప్రతిభవాని
తే. [illegible] లోని
విష్ణు[illegible] భావించువాని

వ. ఇత్తెఱంగునఁ జతుర్దశభువనంబులు జయించి తనవశంబు చేసికొని బ్రహ్మాండంబునకు శిక్షకుండును రక్షకుండును దానయై హరిం బరాజితుంగా దలంచి యతనిపరాజయం బెల్లలోకంబులఁ జాటించి యుత్సవం బొనరించి నేన జగన్నాయకుండ నని తలంచుచు నెదురులేక మదంబునం బొదలుచుండె నిట్లుండి దురితవిపాకంబుకతంబున నొక్కనాఁడు నిజనందనుం డగు ప్రహ్లాదుని రావించిన. 18

కం. హరిభక్తుఁ డఖిలశాస్త్రా
ర్థరహస్యవిదుండు పూర్ణరజనికరకరో
త్కరవిమలుఁడు ప్రహ్లాదుఁడు
గురుగృహమునుండి వచ్చె గురుసన్నిధికిన్. 19

సీ. హరి రమాపతి సనకాదిమునిస్తుతుఁ
దన నెమ్మనంబునఁ దలఁచువానిఁ
గేశవాచ్యుతరామకృష్ణహరే యంచు
మించు వేడుకఁ బఠియించువాని
జగము శ్రీహరిమయం బగు సత్యమని యెంచి
పులకాంకితాంగుఁడై పొలుచువాని
ననిశంబుఁ దనుఁగాంచు నజ్ఞులనైనను
బ్రాజ్ఞులఁ గావించు ప్రతిభవాని
తే. జలధిఁ దరఁగలువోలె నీజగము లెల్ల
విష్ణునం దుండు నంచు భావించువాని

విపులతరశంఖచక్రచిహ్నములవానిఁ
గాంచెఁ బ్రహ్లాదు నప్పుడా రక్కసులఱేఁడు. 20

ఉ. ఆయన వచ్చువేళ నను
తాఁకిపుఁ జెవ్వని నెందుఁ గాంచఁ డా
నామెడ వానియందు హరి
యాకృతి గానఁగనయ్యె విస్మితుం
డై యతఁ డంత నన్ను నదె
రా వెలిపింపఁగ విష్ణుఁ డీగతిం
బాయక యిట్టిభూమియలు
వన్నెఁ నటంచుఁ దలంచె నెమ్మదిన్. 21

తే. వీఁడు హరిభక్తి మరఁగెనో వీనిఁ జూడ
హరిఁ గనుంగొనునట్టుల యయ్యె నతని
చిహ్నములు దాల్చి వచ్చె నక్షీణమహిమ
విష్ణుఁ డరుదెంచెనో వీని వెంటఁ దగిలి. 22

తే. చతురమతి వేదశాస్త్రము ల్చదివెనేని
సిరులు వెలలఁగ యువరాజుఁ జేయువాఁడ
మద్విరోధికి భక్తుఁడై మసలెనేని
వీని నిప్పుడె శిక్షఁ గావింతుఁ బట్టి. 23

వ. అని తలంచి భస్మచ్ఛన్నాగ్నిచందంబునఁ దేజరిల్లుచు
నెదుట నిల్చిన కుమారుఁ గనుంగొని యద్దనుజవిభుండు

వత్సా యిన్నిదినంబు లెయ్యైవిద్య లభ్యసించితివి విని
పింపు మనినఁ బ్రహ్లాదుఁ డిట్లనియె. 24

తే. జగము గలిగింప రక్షింప సంహరింపఁ
గర్త యగు హరి ప్రళయమోదకంబుకరణి
నొగిఁ జరాచరముల నిండియుండు ననుచుఁ
దెలియఁ జదివితి నీవిద్య దితిజరాజ. 25

వ. అనిన నతండు దత్సహచరులగు బాలకులం జూచి మీ
రెట్టితెఱంగునఁ జదివితి రనిన వార లిట్లనిరి. 26

క. హరియే తత్త్వము సత్యము
హరి జగముల నిండియుండు నాహరికంటెం
బర మేమియు లే దని యీ
సరణిం జదివితిమి రజనిచరకులతిలకా! 27

వ. అనిన విని క్రోధతామ్రాక్షుండై వారలం జదివించు
గురువులం జూచి యిట్లనియె. 28

క. మిము నమ్మి యాప్తు లనుచుం
గొమరునిఁ జదువంగ నిడినఁ గుత్సితమతి మ
ద్విమతునకు వశ్యుఁ జేసితి
రమరఁగ మీ రాతతాయు లై యిబ్బాలున్. 29

వ. అని వారికి నుచితదండం బొనరించిన వార లిట్లనిరి. 30

ఉ. తాళక నిచ్చలుం దనకుఁ
దా గురుఁడై గురుఁ డయ్యె మాకు నే

వేళల విష్ణుకీర్తనము
విష్ణుకథాకథనంబుఁ జేయు ని
బ్బాలునిచంద మే మనుచుఁ
బల్కెదఁ మోదనుజాధినాథ య
మ్మేలగు వీనిబోధ విని
మేమును నట్టిర మైతి మే మనఁగ. 31

వ. మశకప్రాయు లైనమమ్ము దండింప లాభంబేమి నీకు మారకు శిక్షింపు మనిన నతండును దద్వాక్యబోధితుం డై యబ్బాలుని శిక్షింపు మని క్రూరకర్ము లైన భృత్యుల నియోగించిన వారును నాతని బాధింపఁదొడంగి రంత. 32

చ. శమనునివీటఁబోలె దను
జపతిపురీటఁ దనర్చె యాతనా
సముదయ మంత విష్ణుపద
సారసభావనఁ జొక్కుచున్న య
క్కొమరుఁడు దైత్యభృత్యకృత
ఘోరతరామితయాతనావళిం
దెమలక మించుచే నహీము
దీధితి కై వడి నొప్పె నంతయున్. 33

తే. వెలి మఱచె విశ్వ మంతయు విష్ణునందు
రూఢి నధ్యస్తమై శు క్తిరూప్యభంగిఁ

గదిరె హరియే నిజంబు జగంబు మిథ్య
యనుచుఁ దలపోయుచుండె నయ్యర్భకుండు. 34

ఉ. ఆదివిజారి వీరభటు
లందఱు నొక్కటఁ జేయుబాధ ప్ర
హ్లాదున కెండమావులజ
లంబు తెఱంగున వ్యర్థమయ్యె నా
వేదన యించుకైనఁ బ్రభ
వింపఁగఁ జేయ కసల్పరోషమా
నాదివిదూరుఁడై పరగు
నాతని కాపద లంటనేర్చునే. 35

సీ. మునియందుఁ గడిఁదిమాలనియందు మదమత్త
గజమునందును మశకంబునందు
శత్రువర్గమునందు మిత్రవర్గమునందు
దీనునియందు భూజానియందు
మేదినీస్థలియందు మృదుశయ్యయందును
దారపుత్రికయందుఁ దరుణియందు
స్తుతియందు శాపసంగతియందు నతివదా
న్యునియందు మఱి లోభిజనునియందుఁ
తే. గాంచనమునందు లోష్టనికరమునందు
హీనవంశజునందుఁ గులీనునందు

మాఁడుపులయందు నీచసద్మంబులందుఁ
బరఁగు సమదర్శనస్థితిఁ బండితుండు. 36

వ. ఇట్లు బాధించి విసివి యక్కింకరు లహంకరణంబుఁ దక్కి
హిరణ్యకశిపుం జేరి యిట్లనిరి. 37

మ. శరకుంతక్షురముద్గరప్రముఖశ
స్త్రశ్రేణిచేఁ జించి భీ
కరబుద్ధ్యాహితరక్షఃకుర్కురకము
ఖ్యక్రూరసత్త్వాళిచే
నరుదారంగఁ గఱపించి నొంచితిమి దే
వా పెక్కుచందంబులన్
హరిభక్తుం డగు నీకుమారకుఁడు డ
య్యం డేమిటన్ ధీరతన్. 38

ఉ. అంబులు ముంపలే దనలుఁ
డాఁగి దహింపఁగఁ దక్కె మత్తనా
గంబులు నొంపలేక విము
ఖత్వము గైకొనియెన్ మదీయకృ
త్యంబులు మాకె బాధకము
లై కడుఁ బీడ యొనర్చె నీసుతుం
డంబుజనాభదాసుఁడు మ
హాత్ముఁడు గాక కిశోరమాత్రుఁడే. 39

చ. అనయముఁ గ్రూరకర్ములమ
హార్యశిలాగణకర్కశంబు మా
మనము మదీయరూపము స
మస్తజగజ్జనభీతిదంబు మే
మనితరభేద్యవిక్రముల
మార్కెఱుంగున నిట్టిమాకు నీ
యనఘునిసంగతిన్ మృదుల
తాకరలీలఁ దనర్చె హృద్గతుల్. 40

వ. అని తెల్పిన నతండు క్రోధరక్తాంతలోచనుండును గలు
షీకృతమానసుండు నై భ్రుకుటినిటలతటంబున నటింప
హరిచరణస్మరణపరాయణుం డగు నాశాబకు రావించి
యతనితో నిట్లనియె. 41

మ. హరిసేవారతి మాని నం గొలువు పు
త్రా యాపదాఖ్యంబు బం
ధురకారుణ్యత నిచ్చెదం దనయు లెం
దుర్ ధర్మకాంతాపతిన్
ధరణిం గొల్వఁడుగాం గురుం గురుఁడె తీ
ర్థం బర్థముల్ ధర్మముల్
గురుఁడే భర్తయు హర్తయుం గ్రియయుఁ బె
క్కు ల్వేల్క నిం కేఁటికిన్. 42

వ. అనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 43

ఉ. పుత్త్రసమర్ప విశుద్ధగుణ
బోధకుఁడై తగువాఁడె తండ్రి; యి
ద్ధాత్రి నిజోదరంభరుఁడు
తండ్రియె తండ్రి! ప్రమత్తదానవా
మిత్త్రు హరిన్ భజింప నియ
మించితి వేనియుఁ దండ్రి వాఁడు; స
త్పుత్త్రుఁడు దండ్రిఁ దండ్రి తన
పుత్త్రుఁ దరింపఁగఁ జేయు టొప్పగున్. 44

తే. కులము వెలయించు తనయుండు గలిగెనేని
బితృసముత్కర్ష మెంతయుఁ బ్రీతిఁ జెలఁగుఁ
గశ్యపుఁడు నిన్నుఁ గాంచి సౌఖ్యంబుఁ గానఁ
డయ్యెఁ గ్రవ్యాద నీదుదౌష్ట్యంబుకతన. 45

క. కారాగారములం దిడి
కారించితి వాదితేయగణముల దివిష
న్నారులఁ గైకొంటివి మం
దారాదిస్ఫారసారతరువులతోడన్. 46

చ. గురుఁడు సమస్తలోకముల
కుం గరుణావరుణాలయుండు శ్రీ
ధరుఁ డనిశంబు నాతనిము
దంబునఁ గొల్వక వైరివృత్తిచేఁ

బరగెడు తత్పదాంబురుహ
భక్తి భవాబ్ధికి నావ యమ్మహా
పురుషుఁడు పత్త్రపుష్పఫల
పూజితుఁ డై యిడు వాంఛితార్థముల్. 47

తే. గాత్రిమాత్రింబునకుఁ దండ్రి కారణంబు
గాని విద్యాప్రదుం డైన ఘనుఁడె తండ్రి
హితము సేకూర్చు నహితంబునే పడంచు
నతఁడు గల్గునె బహుళపుణ్యములఁగాని. 48

వ. విద్యాశీలాదు లుపదేశించునతండె తండ్రి దోషదూషి
తుండ వీ వెట్లు తండ్రి వనినం దండ్రి యిట్లనియె. 49

తే. ఏను దయ నన్న మొసఁగి నిన్నేదకున్న
జీవనం బెట్లు గడచురా చెనఁటి నీకు
వ్యక్తి యెందాఁక నిలుచు నీవంతదాఁక
నను భజింపుము చెడనేల యధమశీల. 50

వ. అనినం గొడు కిట్లనియె. 51

తే. జననిగర్భములో నున్న సమయమునను
వృత్తిఁ గల్పించె నెవ్వఁ డవ్విభుఁడు శేష
జీవనోపాయకల్పన సేయలేఁడె
మఱచి నిద్రించునో లేక మొఱఁగిచనునొ. 52

వ. అనిన హిరణ్యకశిపుండు నారాజ్యంబున నుండక యెచ్చటి
కేనియుం జను మనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 53

ఇచట నుండుట యొండెడ కేఁగుటయును
నాకు నొక్కసమం బగు నాకవైరి
యనిశమును సర్వగతుఁ డయి యచ్యుతుండు
వెలయు నతనికి నాకును వేఱు లేదు. 54

అనిన నతండు మదీయంబైన ధనం బంతయుం గొని ధర్మంబు సలుపుచు నాపగతుపక్షంబు విడువు మనినఁ బ్రహ్లాదుం డిట్లనియె. 55

ఏమి యొసర్తు నెచ్చటికి
నేఁగుదు నెద్ది గ్రహింతు నింక నే
నేమి దొఱంగువాఁడఁ బర
మేశ్వరుఁ డంతట నిండియుండ నా
శ్రీమహిళేశుసేవ మెయిఁ
జేకుఱు సౌఖ్యము లిందు నందునున్
వేమఱు నాయసం బరిభ
వించుట పాతకహేతు వారయన్. 56

అనిన నతండు దుఃఖంబుఁ దొఱంగి సుఖ వగు మిట్టి యసహ్యాలాపంబులు మాని హితవచనంబులు వలుకు మనిన నబ్బాలుం డిట్లనియె. 57

దుఃఖ మటు గల్గుచోఁ గదా తొలఁగవలయు
సుఖము గల్గిన మఱిగదా చొక్కవలయు

నాత్మసుఖదుఃఖహీనత నతిశయిల్లు
నాత్మయే హరి హరి నేన యసురవర్య. 58

వ. జగదీశ్వరుం డైన హరి నెఱుంగు మిదియ హితోపదే
శం బనిన దివిజవైరి యిట్లనియె. 59

క. నీవు కులీనుండవు వి
ద్యావిదుఁడవు ఖ్యాతియుతుఁడ వతులజ్ఞాన
శ్రీవిలసద్బుద్ధివి మే
ధావివి నీ కిట్టిభ్రాంతి తగునె కుమారా. 60

వ. అనినం బ్రహ్లాదుం డిట్లనియె. 61

మ. త్రిగుణాతీతు హరిన్ భజించునతఁ డెం
తే సుప్రసిద్ధుండు జ్ఞా
నగరిష్ఠుండు కులీనుఁ డార్యుఁడు జగ
న్మాన్యుండు మేధావి యా
జగదాధారు నెఱుంగునాకు భ్రమ మే
చందంబునం జెందుఁ బాం
దుగ రూప్యభ్రమఁ జెందునే జగతి నెం
దున్ శుక్తి విజ్ఞాతమున్. 62

వ. అనిన నతండు నీవు బాలుండవయ్యు నిర్భయంబున
నాయెదుటఁ బ్రేలుచున్నవాఁడవు నిన్ను శిక్షింతు శిక్ష
వలన ననేకగుణంబులు గల్గు ననిన డింభకుం డిట్లనియె. 63

ఆ. బాల్యయౌవనాదిభావము లేమ్మనికిఁ
గాని యాత్మ కెపుడు గలుగ వరయ
భేదబుద్ధులకును భీతి సంధిల్లు ని
ర్భేదబుద్ధులకును భీతి గలదె. 64

వ. సర్వశిక్షకుం డైన పద్మాక్షునిచే శిక్షఁ గాంచి త్రిగుణా
తీతుండ నై తి నింక నాకు వెండియు గుణరబు లేచందం
బునం గల్గు ననిన విని దనుజభర్త యిట్లనియె. 65

క. మదబంధురసింధుర మదె
యదయత నిను నొంపవచ్చె నర్భక నీ వీ
యదనం బఱవక నిల్చెద
వదెరా నినుఁ గాచు నెవ్వఁ డనుపమకరుణన్. 66

వ. అనినం బ్రహ్లాదుం డిట్లనియె. 67

పంచ. ప్రపంచభేదబుద్ధిఁ ద్రాడుఁ బాము గాఁగ నెంచు వాఁ
డపారభీతిఁ బాఱుఁగాక యద్వయైకనిష్ఠచేఁ
బ్రపూర్ణతామనీష గల్గఁ బాఱిపోవ నేఁటికిం
గృపాకరుండు వన్నుఁ గాచుఁ గేశవుండు వేడుకన్. 68

వ. అనిన నతండు క్రోధఘూర్ణితనేత్రుం డై ఘోరో విష్ణు
నవలంబించి బుద్ధిచాపల్యంబునం బ్రతికూలంబులు పలి
కెద వతం డెం దుండుఁ దెల్పు మనవుడుఁ బ్రహ్లాదుం
డిట్లనియె. 69

తే. ఆతృణంబాది బ్రహ్మపర్యంత మైన
యబ్జజాండంబునందుఁ దా నవిరతంబు
హరి పరేశుఁడు పరిపూర్ణుఁ డై వెలుంగు
సర్వగతుఁ డవ్యయుండు నిస్సంశయంబు. 70

వ. అనవుడు. 71

తే. హరియె సర్వగతుండు దా నన్యుఁ డేని
యతనిభక్తుఁడ వగుచు నీవలరు దేని
యీసభాస్తంభమునఁ జూపు మిప్పు డతని
ననుచు ధట్టించి పల్కె నయ్యసురభర్త. 72

తే. అంత భక్తార్తిహరుఁ డైన హరి హిరణ్య
కశిపు వధియింపఁ దలఁచి యాగ్రహము చెలఁగ
నాసభాస్తంభగతుఁడయి యపు డొనర్చె
ఘనఘనామేయగర్జ యక్కజము గాఁగ. 73

చ. వితతశిఖాకలాపములు
వెల్వడెఁ గంభమునం జటచ్ఛటా
తతనినదంబులన్ విలయ
దావకృశానునిరీతిఁ దత్సభా
పతు లగు రక్కసు ల్గలఁగి
పాఱఁ దొడంగిరి భీతిఁ జెంది య
ప్రతిమజవంబునన్ దనుజ
పాలకుఁ డొక్కఁడు దక్క నందఱున్. 74

ఉ. ఆయెడ దేవసంఘము ల
హార్యసమానవిమానరూఢులై
యాయథమాసురప్రళయ
మాత్మలఁ గోరి పసించి రొయ్య వై
హాయసవీథి నంత నసు
రాంతకుఁ డుద్భవమయ్యె భక్తునిం
గాయ నమోమయం బయిన
కంబమునన్ నరసింహమూర్తి యై. 75

శా. అంభోధు ల్గలఁగెన్ శిలోచ్చయము లూ
టాడెన్ దిశ ల్వ్రీసె ది
క్కుంభీంద్రంబులు మ్రొగ్గెఁ గ్రుంగఁబడియెం
గుంభీనసస్వామి య
య్యంభోజాప్తుఁడు మాసెఁ గ్రోశయుగమై
ర్ఘ్యస్తంభసంభూతుఁడై
యంభోజాక్షుఁడు నారసింహవపురు
ద్యచ్ఛ్రీ విడంబింపఁగన్. 76

వ. ఇట్లు ఘోరాకారుండును దంష్ట్రాకరాళవదనుండును నిశాతవజ్రనఖాయుధుండును గహకహాట్టహాసత్రాసిత భువనత్రయుండును విలయధూమకేతుజ్వాలాజాలాభీలాంగుండును దుర్నిరీక్షుండును నై నృసింహదేవుం డావిర్భవించిన. 77

తే. దితిజుఁ డత్తఱిఁ జిత్రపుత్రిక తెఱంగున
నుక్కు దక్కఁగియు ధైర్యసంయుక్తి కలిమి
ఖడ్గఖేటకహస్తుఁడై కదిసె నతనిఁ
భువనసఖుమీఁదఁ జను శలభంబువోలె.

శా. రక్షఃకుంజరుఁ బట్టి తెచ్చి నరహ
ర్యక్షుండు దిగ్భిత్తులన్
రూక్షాక్షిచ్ఛవి నిప్పు లుప్పతిల నూ
రుస్థాయిఁ గావించి త
త్కుక్షిచ్ఛేదన మాచరించె నఖర
క్రూరాసిధారాహతిన్
రక్షించెన్ భువనంబు లిప్పు డని గీ
ర్వాణుల్ ప్రశంసింపఁగన్.

శా. భక్తోక్తిప్రతిపాలనార్థి యయి శుం
భన్నారసింహాకృతిన్
నక్తంచారి గళాసుఁ జేరి త్రిజగ
న్నాథుండు గోత్రిథంబునన్
రక్తం బొక్కుట దిక్కుల న్నినుచుచున్
రాగిల్లి తదరిక్తసం
హారార్తం బెమ్ము పొల్చె నంత విల్లయా
త్పాల్మలిచందంబునన్.

చ. అభిరతి నప్సరోవనిత
లాడిరి తోడనె దుందుభు ల్గుభుల్
గుభు లని మ్రోయఁజేయుచును
గొల్చిన నహాహ లెసంగ నిర్జరుల్
నభమున నిల్చి సన్నుతి యొ
నర్చిరి పంకజనాభుఁ బద్మినీ
విభుఁడు ప్రభం జెలంగెఁ జెలి
విం దనరారె సమస్తదిక్కులున్. 81

క. ఆనరకేసరి యపు డ
ద్దానవునిం దున్చి దిగ్వితానము లదరన్
దా నద్భుతగతిఁ గ్రోధము
మానక విలయదవదహనుమాడ్కిఁ జెలంగెన్. 82

వ. అనిన నింద్రుండు హిరణ్యకశిపునిం ద్రుంచియు నరహరి మరలం గ్రోధి యగుటకుం గారణం బెయ్యది యానతి మ్మనిన గురుం డిట్లనియె. 83

ఆ. తనదుభక్తుఁ డైన దనుజార్భకుని యార్తి
దలఁచుచునికిఁ గ్రోధకలితుఁ డయ్యె
నచ్యుతుండు తనయమ్మునార్తిఁ దలఁచిన
తండ్రి క్రోధి యగుచుఁ దనరునట్లు. 84

వ. సాత్త్వికియు, రాజసియు, తామసియు నన భక్తి మూఁడు విధంబు లై పరగు నందు. 85

శా. శంభుద్వేషులు దోషదూషితులు హిం
సాతత్పరుల్ క్రోధులున్
శుంభత్కర్మవిదూరులున్ బుధజన
స్తోమక్రియాదూషణా
రంభగ్రస్తులు నైన భక్తులు సురేం
ద్రా! తామసుల్ విష్ణుఁ డా
దంభాచారుల దుష్కుమారులవలెం
దాఁ గన్గొనున్ నిష్కృపన్. 86

మ. ఫలకాంక్షారతిఁ గర్మము ల్సలిపి ద
ర్పక్రోధమానాఢ్యులై
యలవోకన్ హరిపూజసేయుచును భో
గాసక్తులై యుండువా
రు లలిన్ రాజసభక్తు లెంతయును గ్రూ
రు ల్వాసవా వారి న
న్నలినాక్షుం డగుణాఢ్యపుత్త్రులగతిం
బాటించు నెల్లప్పుడున్. 87

మ. నిరహంకారులు నిర్వికారు లనఘుల్
నిర్మత్సరుల్ సత్యవా
క్యారతుల్ నిర్మలు లన్యకర్మవిముఖుల్
నిర్దంభవేషుల్ నిశం

తరవిజ్ఞానులు ప్రీతిసమేతులు సదా
నందుల్ ధరణ్ సాత్త్వికుల్
హరి తద్భక్తుల సత్కుమారులవలెన్
హర్షించి కాంచుం దయన్. 88

ప్రహ్లాదుండు సాత్త్వికభక్తియుక్తుండు గావున హరికిఁ బ్రియుం డయ్యె నంత సురగణంబు లాప్రహ్లాదుని లక్ష్మీదేవిం బురస్కరించుకొని వచ్చి యానరసింహదేవుని నిట్లని స్తుతియించిరి. 89

జగదుద్భవస్థితిసంహారకారిణే
ఫాలేక్షణాయ తుభ్యంనమోస్తు
సకలభూతగ్రహోచ్చాటనహేతవే
ఫణిభూషణాయ తుభ్యంనమోస్తు
నిత్యాయ విష్ణవే నీరజబంధుచం
ద్రాగ్నినేత్రాయ తుభ్యం నమోస్తు
పరయంత్రహరణాయ హరయే విషాగ్నిస
ర్పనిషూదనాయ తుభ్యంనమోస్తు
వ్యాఘ్రచర్మాంబరాయ తుభ్యంనమోస్తు
భయదదంష్ట్రాయుధాయ తుభ్యంనమోస్తు
ప్రబలదైత్యాంతకాయ తుభ్యంనమోస్తు
పాహి నో నారసింహ తుభ్యంనమోస్తు. 90

తే. గీ. మీనకచ్ఛపకిటినర మృగతనువులు
దాల్చి తిఁక వటుభృగుకులోత్తంసరాము
బలజనోత్తమకల్కిరూపములు దాల్పఁ
గలవు జగములు మనుప రక్కసులఁ దునుమ. 91

వ. దేవా- భవదీయవదనగుహానిర్గతశిఖిశిఖాసంతాపంబులు
లోకంబులకు బాధ యొనరించుచున్నయవి. దేవకంటకుం
డగు హిరణ్యకశిపుండు నిహతుం డయ్యె. దేవకార్యంబు
సఫలంబయ్యె నింక నీయుగ్రకోపం బుపసంహరింపుము
శరణాగతుల మగు మమ్ము మనిచి జగంబులకు శుభంబు
గలిగింపు మని యనేకవిధంబులం బ్రస్తుతించి దండప్రణా
మంబు లాచరించిన దరస్మితసుందరవదనారవిందుండై
యద్దేవుం డిట్లనియె. 92

క. ఈదనుజుఁ దునుముటకుఁ బ్ర
హ్లాదహితార్థమ్ముగ నే నయస్తంభంబుం
భేదించి యవతరించితి
నో దేవతలార భీతి యుడుగుఁడు విూరల్. 93

తే. గీ. అనుచుఁ బల్కి ప్రసన్నత నలరు నమ్మ
హాత్ముఁ డాపలికులు వెక్కె నబ్జగేహ
యటఁ దదీయాంగసంగసుఖానులబ్ధి
సురల కభయప్రదుం డయ్యె హరియు నంత. 94

పృథ్వీ. మహర్షులు పరిహృష్టులై మహితవేదసూక్తంబులన్
మహామతి నుతించి రమ్మనుజకేసరిన్ పార్థివా
సహాయు సురదుందుభుల్ చదల మ్రోసెఁ గల్పావనీ
రుహాచ్యుతసుమావళీరుచిరవర్షసామగ్రితోన్. 95

క. ఆదేవుఁ డతులకృపఁ బ్ర
హ్లాదునిఁ జేరంగఁ జీరె యసురాధిపుఁ డు
క్కైది హతుఁడయ్యె నియ్యెడఁ
బా దగుతనపూర్వకర్మపరిపాకమునన్. 96

ఉ. యాచకు దాతఁ జేయు నతి
హర్షితు దుఃఖితుఁ జేయు నెంతయున్
నీచుని రాజుఁ జేయు దరి
ఱీనవమన్మథు వృద్ధుఁ జేయుఁ దాఁ
గాచి దృఢాంగు రోగయుతుఁ
గా నొనరించు నమాన్య మాన్యగా
నేచి యొనర్చుఁ గాలగతి
నేళ్లి మరియుం దురితక్రమోద్ధతిన్. 97

తే. అట్టికాలాత్మకుఁడె నేన యదియుఁ గాక
యాత్మ యంతటఁ బరిపూర్ణమై వెలుంగ
బాధ్యబాధకవృత్తు లేవగిదిఁ బుట్టు
నవియు మాయాకృతంబులై యల్లరఁగాక. 98

వ. కావున నీవు తండ్రికి వగవకుండుము మని పలికి యరుణార

విందసుందరం బగు నిజహస్తంబున నతనియంగంబు నిమిరి కృతార్థుం గావించి దైత్యదానవరాజ్యంబునకుఁ బట్టాభిషిక్తుం గావించి సురగణంబులం గనుంగొని మీరలు నిజస్థానంబులకుం జని సుఖంబున నుండుండు యుష్మత్కృతంబైన స్తోత్రంబున కేను బ్రీతుండ నైతి నీస్తోత్రరాజం బెవ్వండు పఠియించు నతండు దురితవిముక్తుం డగు నని యానతిచ్చి మఱియు నిట్లనియె. 99

చ. స్థిరమతి నెవ్వఁ డేనియు నృ
సింహ నృసింహ నృసింహ యంచుఁ దా
నిరవుగ నెల్లవేళ జపి
యించు నతండు నృసింహమూర్తియై
పరఁగును వానిఁ గన్గొనినఁ
బాఱుఁ బిశాచనిశాచరగ్రహో
త్కరవరమారికాగణము
తద్దయు భీతిలి భూతకోట్లతోన్. 100

మ. అరి మిత్రుం డగు దుష్టనాగచయముల్
హారంబులై చెల్వగుఁ
బరమాపద్వితతు ల్దొలంగు శుభసం
పల్లాభసంసిద్ధి యౌ
నరపాలుం డతివశ్యుఁ డై మెలఁగు నె
న్నఁగ ముక్తి పాణిస్థితిం

బొరయున్ శ్రీనరసింహనామపఠనం
బొల్పొందు మర్త్యాళికిన్. 101

వ. అని యానతిచ్చె నని చెప్పి గురుం డిట్లనియె. 102

తే. నరులబంధంబు లూడ్చుచో నారసింహుఁ
డనఁగ విఖ్యాతిఁ జెలువొందె నమ్మహాత్ముఁ
డాన్నృసింహపదస్మరణాఢ్యులైన
మర్త్యు లనిశము పూజ్యు లమర్త్యులకును. 103

తే. మఱి నృసింహాయుతాక్షరీమనుజపంబు
సేయుమనుజున కిష్టార్థసిద్ధు లెసఁగు
ననఘలీల నృసింహతాపని పఠించు
నట్టినరుఁడు జీవన్ముక్తుఁ డగు నిజంబు. 104

తే. ఘనన్నృసింహు దత్తాత్రేయుఁ గార్తవీర్యు
నవనిజాలక్ష్మణసమేతుఁ డైనరాము
నాత్మఁ దలఁచినఁ జోరబాధాదు లణఁగి
మార్గమున లాభలబ్ధి యగు మనుజులకును. 105

ఆ. ఈనృసింహుచరిత మేప్రొద్దు భక్తితో
వినుచునుండు నట్టిమనుజవరుఁడు
నిఖిలదురితతతుల నిరసించు స్వర్గలో
కమున నధివసించు నమలచరిత. 106

వ. అనిన నింద్రుం డిట్లనియె. 107

క. ఉరువైరాగ్యాన్వితుఁడై
పరగియు దైత్యమణి యైన ప్రహ్లాదుఁడు శ్రీ
హరిదత్తరాజ్యరమ యే
కరణిం బాలించెఁ దెల్పఁగాఁ దగు ధిషణా. 108

వ. అని యడిగిన గురుం డిట్లనియె. 109

ఉ. ఆతఁడు రాజ్యలక్ష్మిఁ గని
నంతనె తొంటివిరక్తి డించి తా
నాతటి నింద్రియప్రతతి
సాఁపఁగఁజాలక భోగలోలుఁడై
భూతల మేలుచుండె సిరి
పొంపిరివోవఁగఁ జిత్తనిగ్రహ
ఖ్యాతిఁ జెలంగ శర్వనకుఁ
గాక పొసంగునె యొండుదేహికిన్. 110

తే. అవని దున్నక పండె ధేనువులు పిదికెఁ
బాలు, జలవృష్టి తస్కరబాధ లేదు లెఁ
వారు లెల్లరుఁ హర్షసంపదఁ జెలంగి
రవనిఁ బ్రహ్లాదుఁ డేలు నయ్యవసరమున. 111

ఉ. భాసురదివ్యమాల్యపట
భవ్యవిభూషణభూషితాంగుఁడై
యాసవశర్కరాజ్యపల
లాంసలుఁడై ద్రమణీమణీరతి

వ్యాసవిలాసతన్ మలయున్
జాగరుచర్చఁ దనర్చి తా నవి
ద్యాసముపేతుఁడై పొదలె
నాతఁడు భోగరసప్రమత్తతన్. 112

తే. అతనికి విరోచనుం డను * నాత్మజాతుఁ
డొదవె నతనికి బలి యమ్మహోద్ధతునకు
బాణుఁ డుదయించె నీగతి బలిసి రసుర
లొక్కఁ డొక్కఁడె జగముల నొదుఁవఁజాలి. 113

ఉ. తక్కటి దైత్యపుంగవు ల
తంద్రబలోద్ధతిఁ దత్సహాయులై
తక్కక యుద్ధకాంక్ష నతి
దర్పితులై యెదు రెందు లేక యే
దిక్కునఁ దారయై మెలఁగి
దివ్యులు † దాపసమానవావళుల్
పొక్కఁదొణంగి రెంతయును
బూర్వగతిన్ భయవిహ్వలాంగులై. 114

క. నానారూపసమన్వితు
లై నిత్యము భోగభుక్తి నలరుచు తల్పా
ధీనమతి నుర్వి నిండిరి
దానవులు హిరణ్యకశిపుతనువు లనంగన్. 115

---

* నాత్మజుండు, వృద్ధై—వ్రాఁ. ప్రతి  † తాపస—వ్రాఁ. ప్ర

వ. అత్త్యవసరంబున నొక్కనాఁడు. 116

ఉ. చారుతటిల్లతాలలిత
శారదమేఘ మనం గడారశ్రృం
గారజటాచ్ఛటాకలిత
గౌరతనుద్యుతి చెంగలింపఁగా
నారదుఁ డేఁగుదెంచె గగ
నంబుననుండి సమీరణాహతిం
దారి విపంచి మించి హరి
తత్త్వమహత్త్వము లుగ్గడింపఁగన్. 117

తే. పింగళజటాప్రభాజాలపీతచేల
మృగమదాసితవల్లకీశ్రీశమూర్తి
దనరెఁ దత్పాండురాంశుసుధాసముద్ర
మధ్యశయనక్రియామేయమహిమ చెలఁగ. 118

క. కృష్ణాజినోత్తరీయుం
డుష్ణాంశుప్రతిమతేజుఁ డురుతరవిద్యా
నిష్ణాతుఁ డఖిలవంద్యుఁడు
కృష్ణస్మరణాఢ్యుఁ డతఁడు కృతకృత్యుఁ డిలన్. 119

తే. అటు యదృచ్ఛాగతుండయినట్టిదివ్య
మునికిఁ బ్రహ్లాదుఁ డెదురుగాఁ జని నమస్క
రించి యుచితాసనం బిడి మించుభక్తి
నాతిథేయపూర్వసత్క్రియ లాచరించె. 120

చ. అతిథిగృహాగతుం డయిన
యప్పుడ యధ్వరవేళ యప్పుడే
పితృమునివర్యతీర్థసుర
బృందసమాగమవేళ యమ్మహా
మతులకుఁ జేయునర్చలు ర
మాహృదయేశ్వరుఁ జెందుఁ దత్తిర
స్కృతి సుకృతంబు నాయువును
శ్రీయు హరించు మనుష్యకోటికిన్. 121

ఆ. అతిథిపూజఁ దనిపి యలరించు నేగృహి
యతనిగృహమె సద్గృహాఖ్య నమరు
నతఁడు విముఖుఁ డైన నమరులు మునులును
విముఖు లగుదు రింక వేయు నేల? 122

క. కావునఁ బ్రిహ్లాదుం డ
ద్దేవమునిం బూజసల్పి ధృతి సంతుష్టుం
గావించి యంత బలద
ర్వావిలమతి నిట్టు లనియె నాతనితోడన్. 123

క. సూర్యగతిన్ లోకముల న
వార్యగతిన్ సంచరించు వలఁతివి నీ వో
యార్యమతి నీమెఱుంగని
కార్యగతు ల్గలుగ వీజగంబులయందున్. 124

వ. సచరాచరం బైన త్రైలోక్యంబున సుపర్వగంధర్వయక్ష

రక్షోగణంబులలోన నన్నెదిరించువీరుం డొక్కరుండును లేఁడు కలిగనేనియుఁ జెల్లుము వానిం జయించెద నిజగంబుల కేన ప్రభుండనై శిక్షణరక్షణంబు లాచరించుచు సర్వవంద్యుండనై వర్తిల్లుదు సమానాధికరహితుండ నిగ్రహానుగ్రహదక్షుండ నేన యని గర్వంబుగాఁ బలికిన విని యమ్ముని తనమనంబున. 125

ఆ. ఇతఁ డభేదబుద్ధియుతుఁ డయ్యు హరిభక్తుఁ
డయ్యు రాజ్యమత్తుఁ డై నకలేన
జ్ఞానహీనుఁ డయ్యె జగతి నైశ్వర్యము
తునకు జ్ఞానసిద్ధి యొనరు నెట్లు. 126

తే. సంగమాత్రిన జ్ఞాన మడంగిపోవు
ననినచో రాజ్యలక్ష్మీమదాంధుఁ డైన
నరున కేరీతి నబ్బు జ్ఞానంబు నడఁచు
వస్తు వొక్కటి సిరికంటె వసుధఁగలదె. 127

వ. రాజ్యధనోన్మాదనిమిత్తంబునను స్త్రీద్యూతాసవనిమిత్తంబునను గులరూపవయోవిద్యానిమిత్తంబునను వినాశకారణంబై మదం బుదయించు నివృత్తజ్ఞానవైరాగ్యుం డగు నితనికిఁ దత్త్వమార్గం బుపదేశించి బోధింప నేల పామండపాపాచారదూషకజార చోర పిశున రాజ్యశ్రీ ధనశ్రీమత్తకోపనుల బోధించిన భస్మన్యస్తహవ్యంబును జలలిఖితాక్షరంబునుంబోలె నిరర్థకం బగు శ్రీమదాంధు

నను దారిద్య్రంబ పరమౌషధం బని విచారించి యన్నా
రదుం డిట్లనియె. 128

తే. అనఘ దైత్యేంద్ర వైకుంఠ మనఁగ నొక్క
వీడు చెలువొందుఁ దత్పతి విష్ణుదేవుఁ
డతఁడు రక్షఃకులాంతకుఁ డహితగర్వ
భంజనుఁడు భక్తలోకైకరంజనుండు. 129

ఉ. ఆతఁడు శంఖచక్రధరుఁ
డామరమౌళిచిరత్నరత్నవి
ఖ్యాతగభస్తిరంజితప
దాంబుజుఁ డంబుదనీలవిగ్రహుం
డాతతశౌర్యశాలి శర
ణాగతవత్సలుఁ డంబుజాతసం
జాతనుతుం డశేషదను
జప్రభుమర్దనుఁ డెన్ని చూచినన్. 130

ఆ. మఱి హిరణ్యకశిపు మధుకైటభుల హిర
ణ్యాక్షు నుక్కడంచె నదియుఁగాక
యతఁడు జగములందు వ్యాపించి యుండు ము
నీంద్రచిత్తనిలయుఁ డీశ్వరుండు. 131

శా. దేవద్రుప్రకరప్రకీర్ణమును సం
దీప్తాచ్ఛరత్నాలయ

శ్రీవిస్ఫూర్తినిరస్తసోమతపనా
ర్చిర్మాలితేజంబునై
భావాతీతమహోచ్చకాంచనమయ
ప్రాసాదసంకీర్ణమై
యావైకుంఠము వొల్చు నన్యుల కజే
యంబై జగద్వంద్యమై. 132

క. ఘనసారమృగమదాదులు
వినుమీ రాసులయి పొల్చు విష్ణునివీటన్
ఘనతరరత్నవిమానము
లనుపమగతి లెక్క కెక్కుడై విలసిల్లున్. 133

మ. హరిణీనేత్రలు సింహమధ్యలు శుకీ
వ్యాహారిణుల్ కంబుకం
ధర లంభోదవినీలవేణులు శర
ద్రాకేందుబింబాననల్
కరిణీయానలు పల్లవోష్ఠులు తటి
ద్గౌరాంగు లాప్రోలిసుం
దరు లావృత్తపయోధరల్ నటనగాం
ధర్వప్రవీణల్ గడున్. 134

వ. కడిందిబలంబు గలదేని యచ్చటికిం జని సాధింపు మని పల్కిన నద్దేవమునిం జూచి యతం డవ్వైకుంఠపతి నట్ల గెల్చెద విజయానందసందోహశాలి నగు నన్ను వీక్షింపు

మని పల్కి యతని ననిచి మణికాంచనమయంబును ముక్తావితానసంయుక్తంబును రత్నతోరణభూషితంబును గంజతాగశిలాబద్ధరంజితంబును రత్నసోపాన మండితంబును యోజనాయామవిస్తారంబును త్రిభువనసారవస్తుప్రశస్తవిభవంబును దేజోమయంబును నైన నిజసభాభవనంబున రత్నసింహాసనాసీనుండై యొక్కయెడ సనకసనందన వసిష్ఠ వాలఖిల్య పులస్త్య పులహ క్రతుముఖ్యులును నొక్కయెడ యక్ష రాక్షస దేవగణంబులు నొక్కయెడ మహీపాలురును నిజముఖవిన్యస్తదృష్టులై హరిదాలీనగాత్రహంబులరీతిం గొలువ వేత్రహస్తులు సాహోనినాదంబుల హెచ్చరింపఁ బేరోలగం బుండి రక్కసులం జూచి యిట్లనియె. 135

తే. ఏను వైకుంఠపురముపై నిపుడు దాడి
వెట్టి తద్విభు గెల్చి యవ్విభవవితతిఁ
గొని యశేషేప్సితభోగంబు లనుభవింతు
నీయుపాయంబు నారదుఁ డెఱుఁగఁజెప్పె. 136

క. లోకంబుల బలవంతుఁడు
నాకంటె నొకండు గల్గె నా విని చిత్తం
బేకరణి సుస్థితం బగు
జోకఁ సుఖనిద్ర యెట్లు చొప్పడు నాకున్. 137

వ. అని పలికి. 138

క. అభియాతిగర్వభిద్దుం
దుభి సలవఁగఁ బనిచి దంతి తురగరథాళీ
సుభటావృతుఁడై దనుజ
ప్రభుఁడు గదలె నతులబలపరాక్రమ మెలయన్. 139

వ. అర్ణవపరివృతం బైన వరుణుండునుంబోలె ననేకసహ
స్రాక్షౌహిణీయాతుధానబలపరివృతుండై చని నాకంబును
సత్యలోకంబును నతిక్రమించి విష్ణులోకంబైన వైకుం
ఠంబుఁ దఱిసి తత్పురోపకంఠోపవనంబుల నకుంఠితో
త్కంఠ దీపింప విడిసిన. 140

తే. అపుడు పురవాసు లాతెఱం గరసి కోట
గవను లిడి తాళము ల్వైచి ఘనతరాయ
పార్గళంబులు గట్టిగా ననువుపఱిచి
ద్వారసంరక్షణస్థితిఁ దనరి రంత. 141

తే. ఉపవనంబులు భంజించి యుగ్రదనుజు
లపుడు శతయోజనోన్నతం బైనకోట
యెక్కఁజాలక యాచుట్టు నొక్కమొగిని
విడిసి యుక్కునఁ బీడ గావింపఁ గాంచి. 142

వ. తత్పురరక్షకు లైన పార్షదవీరవరు లనేకకోటు లశనిప్రా
యంబు లైనయంగారంబులు వర్షించుశతఘ్నిప్రముఖ
శతసహస్రాయసపరుషయంత్రంబులు పన్నియు లోష్ట
పాషాణవర్షు లగు దంచనంబు లెత్తియుఁ దప్పత్తె లకటా

హంబులు నిలిపియు ననేకసైన్యంబులఁ బ్రాకారంబుల
చుట్టు రక్షణార్థంబు నిలువ నియమించియు వ్యూహ
నాథు లగు ప్రద్యుమ్నానిరుద్ధవాసుదేవసంకర్షణులయొ
ద్దకుం జని యిట్లనిరి. 143

మ. ఘోరాకారులు లంబనాసికు లతి
క్రూరు ల్మషీవర్ణు లం
గారాక్షుల్ వికృతైకకర్ణచరణు
ల్గవ్యూతితుంగాంగకుల్
శూరు ల్దైత్యులు జంగమాద్రు లన నె
చ్చోనుండియో వచ్చి ప్రా
కారప్రాంతవనాంతరద్రుమతతుల్
ఖండించి రత్యున్నతిన్. 144

క. వాహిను లంతటఁ బోవక
బాహాబలలీల వెలయఁ బ్రాకారం బా
రోహించి ఘోరయంత్రశి
లాహతులను నొచ్చి చుట్టు నలమిరి మఱియున్. 145

క. ఆరాక్షససేన లకూ
పారముగతి నవధి లేక భాసిల్లి చతు
ర్ద్వారంబు లందు నిల్చి ర
పారబలుల్ దృఢకవాటపాటనపటిమన్. 146

ఆ. పూర్ణశీతభానుపోలుపున ధవళాత
పత్త్ర మబ్బులాధిపతికి నమరె
వ్యజనవీజనముల నలరెడు నద్దురా
త్మకు నుపేక్షసేయఁ దగునె మీకు. 147

వ. అని తెల్పిన వార లిట్లనిరి. 148

తే. వెఱవకుఁడు పురరక్ష యేమఱక సల్పుఁ
డితఁడు ప్రహ్లాదుఁ డను దైత్యపతి రమేశ
దత్తసామ్రాజ్యుఁ డయ్యుఁ బ్రమత్తుఁ డయ్యె
నతులభోగమదోన్మత్తుఁ డగుటకతన. 149

క. శ్రీమద్రాజ్యమదాంధులు
కామాంధులు నొక్కటే యకార్యముఁ గార్యం
బేమియుఁ గానరు సౌఖ్యం
బీమహిఁ గోరుదురు హితుల నెఱుఁగంగలరే. 150

వ. రాక్షసులకు నధర్మగుణంబు నైసర్గికం బని పల్కి వార
లప్పుడ యసంఖ్యాతబలసమన్వితులై చని యారక్కసు
లం దలపడి రంత. 151

క. సరిపోరి రుభయసేనలు
శరముద్గరపరిఘపరశుశస్త్రాహతులం
గరి కరి హరి హరి యరదం
బరదము భటుఁడుఁ భటుండు నతిరోషమునన్. 152

వ. అంత వాసుదేవుండు ప్రహ్లాదునిఁ బ్రద్యుమ్నుండు
విరోచనుని సంకర్షణుండు బలి ననిరుద్ధుండు బాణుని
మార్కొని ద్వంద్వయుద్ధం బొనరించి యనేకశస్త్రా
స్త్రంబుల నొప్పించి విరథులం గావించి సమరపరాఙ్ము
ఖులం జేసి తక్కటిసేనలకుం గవిసి వజ్రంబునం గదలీ
తరుషండంబులం ద్రెంచులీలం బడవైచి విజయంబు
సేకొని మరలి పురంబున కేతెంచి వ్యూహనాథులు
లక్ష్మీకాంతునకుఁ దద్వృత్తాంతం బాద్యంతంబును విన్న
వించిన నబ్భగవంతుం డిట్లని యానతిచ్చె. 153

మ. నరసింహాకృతిచే హిరణ్యకశిపు
న్మర్దించు నవ్వేళఁ ద
త్పరివారం బగు దైత్యబృందములు మ
త్ప్రాంతంబున న్నిల్వలే
క రయోదగ్రతఁ బాఱి రాఖిలులు లో
కంబు ల్వోతం గుంద దు
ర్భరబాధాకరు లైరి మీఱి భువికిన్
భారంబు సంధిల్లఁగన్. 154

తే. వారి నేరీతిఁ దునుమంగ వలయునొక్కొ
యనుచుఁ దలపోయ నారదమునివరేణ్యు
ప్రేరణంబునఁ బ్రహ్లాదుఁ డీరసమున
భోగమదమత్తుఁ డగుట వేవేగ వచ్చె. 155

క. ఈదనుజపరిభుఁ డగుప్ర
హ్లాదుఁడు మద్భక్తియుక్తి నలరియు రాజ్య
శ్రీదర్పితుఁడై జ్ఞానం
బేది బలాన్వితుఁ డగుచు నిట్లరుదెంచెన్. 156

వ. కల్యాణగుణాస్పదులైన మద్భక్తులకు నేన గతి దుర్గతిం బొంద నర్హులు గారు కావున మీరలు మదీయంబైన యాయుధపంచకంబుఁ గొని చని ప్రహ్లాదుండు దక్కఁ దక్కినరక్కసుల నుక్కడంచి యతనిపై శంఖోదకంబు చల్లి సుజ్ఞానవంతుం జేసి చనుదెం డనిన వారలు నట్ల మరలి వచ్చునెడ. 157

సీ. అసురాధిపతియు నిజానీకినుల నెల్లఁ
బురిగొల్పి వారితోఁ బోరొనర్పఁ
గదిసి యథాపూర్వగతి ద్వంద్వయుద్ధమ్ము
విలసిల్లె గజముల బృంహితములు
వాజిఘోషలు రథవరనేమినినదంబు
వీరులయట్టహాసారవంబు
పృథుధనుష్టంకారభేరీవిరావముల్
గగనదిగంతరగహ్వరములు
నిండ శరకుంతముద్గరభిండివాల
తోమరాద్యాయుధంబులఁ దుములసమర

మాచరించిరి యిరువాగు నపుడు బలర
జోంధకారంబు దిక్కుల నాక్రమించె. 158

సీ. అపుడు వ్యూహాధినాయకులు రాక్షసయూథ
నాథులఁ గ్రోధసనాథు లగుచుఁ
గొందఱ నందకక్రూరధారాహతిఁ
గొందఱ శంఖనిర్ఘోషనిహతి
శార్ఙ్గధనుఃక్షిప్తశరవృష్టిఁ గొందఱ
నటఁ గొందఱ సుదర్శనాభిహతిని
బ్రతతకౌమోదకీప్రహతులఁ గొందఱఁ
బరిమార్చి ప్రహ్లాదు విరథుఁ జేసి
దర్పితుని వానిఁ బుత్త్రపౌత్త్రప్రపౌత్త్ర
సహితముగఁ గట్టి వైచి పార్షదులు పొగడ
విజయమంగళకాహళవితతి మొరయ
జితవిరోధులు డించిరి క్షితిభరంబు. 159

తే. అంత లజ్జితుఁ డైన ప్రహ్లాదుఁ జూచి
వాసుదేవుఁడు దరహాసభాసురాస్యుఁ
డగుచు నీజ్ఞాన మెచ్చట నడఁచి తౌర
భోగమత్తుఁడ వై మూఢబుద్ధిఁ దనరి. 160

క. అని శంఖతీర్థజలమా
యనపైఁ జల్లుటయు ననఘుఁడై యతఁ డజ్ఞా

సనివృత్తుఁ డయ్యె మధుభం
జనుకృపఁ గనువారలకును జడమతి గలదే. 161

వ. ఇట్లు జ్ఞానవంతుండై ప్రహ్లాదుండు వాసుదేవునిం గనుం గొని దేవా నాయపరాధంబు క్షమియింపుము దానవులకు బుద్ధి గలదే వారలు ధార్మికు లని విశ్వసింపం దగదు చాపల్యంబును బాపకారిత్వంబును స్వామిద్రోహంబును నసహిష్ణుత్వంబును మొదలు నైసర్గికగుణంబులు దురాత్ములకు ధర్మగుణంబును స్నేహంబును వాత్సల్యంబును బంధుత్వంబును గలుగనేర్చునే యని దండప్రణామం బాచరించి యతనిచే ననుజ్ఞాతుండై నిజరాజ్యంబున కేతెంచి పుత్రుం డగు విరోచనుని రాజ్యంబున కభిషిక్తుం జేసి వీతరాగుండై హరిపూజ సేయుచుఁ గృతార్థుం డయ్యె నిది ప్రహ్లాదుచరిత్రంబు దీని వినినం జదివిన సర్వపాపంబులు దొలంగు నని చెప్పిన. 162

తే. విని బలాసురదమనుఁ డోయనఘవర్య
శ్రీవరాహనృసింహులచేతఁ బొలిసి
దితిజు లిద్దఱు నేమైరి తెలియఁజెప్పు
మనినఁ జిత్రశిఖండినందనుఁడు పల్కె. 163

క. వారలు వెండియు దానవు
లై రావణకుంభకర్ణు లనఁ బుట్టుదు రి

ద్ధారుణిఁ గైకసి యను సుర
నారీమణికిం బులస్త్యునకుఁ గ్రూరాత్ముల్. 164

క. వారలకు ననుజయై తగు
దారుణముఖి శూర్పణఖ మదనగురుభక్తి
శ్రీరమ్యుఁ డంత గల్గు ను
దారుండు విభీషణుండు దత్సోదరుఁడై. 165

ఆ. కడిఁది కుంభకర్ణుకాయంబు త్రిశతయో
జనసమున్నతంబు శక్ర వినుము
బ్రహ్మకడకు నొక్కపర్వకాలంబున
జనకుతోడ నరుగుఘనుఁ డతండు. 166

ఉ. ఆతనిఁ జూచి బ్రహ్మయు భ
యాతురుఁడై కను లెల్ల మూసి నీ
వీతఱి వచ్చినట్టిపని
యెయ్యది దెల్పు మనంగ నబ్జసం
జాతునితోడ నిర్దయ యొ
సంగు మటంచును వేఁడఁబోయి తా
నాతఁడు నిద్ర యిమ్మనిన
నబ్జజుఁ డట్ల యొసంగు నవ్వుచున్. 167

ఆ. అపుడు వానిజనకుఁ డతిదుఃఖితుం డైన
నబ్జగర్భుఁ డీతఁ డాఱునెలల

క్రొక్కాఁడు లేచు నురుభుజబలయుతుం
డనుచు సెల వొసంగఁ జను నతండు. 168

ఉ. రావణకుంభకర్ణులు ది
రంబుగ నుగ్రతపంబు సేసి వా
ణీవరుచే వరంబుఁగొని
నిర్జరమానవదానవావళిం
జేవడి నుక్కడంతు రట
శ్రీదుని గా దని యాతఁ డేలు లం
కావరపట్టణంబు గొని
క్రౌర్యమునన్ వసియింతు రచ్చటన్. 169

ఉ. ఆవరపట్టణంబు మణి
హర్మ్యవితానవిరాజితంబు న
ప్తావరణప్రకాండసము
దంచితకాంచనచిత్రగోపురం
బావృతసింధుబంధురము
నై విలసిల్లి త్రికూటనామక
గ్రావమునం జెలంగు సుర
రాజ సురాసురదుర్విభేద్యమై. 170

ఉ. ఆదనుజాధినాథునిప్రి
యాంగన మంగళగాత్రి యొప్పు మం

ణోదరి నాఁగఁ దత్సుతుఁ డ
మ్మోన్నతుఁ డింద్రజిదాహ్వయుండు ని
న్నాదనుజుండు గెల్వఁగలఁ
డాదశకంఠునియూథపుల్ ప్రహ
స్తాదు లవక్రవిక్రమస
మగ్రు లుదగ్రబలాఢ్యు లెన్నఁగన్. 171

ఆ. నిజసమాను లైన రజనీచరావళి
బలసి తను భజింపఁ బంక్తికంఠుఁ
డఖిలలోకములకు నార్తి యొనర్ప ని
ర్జరులు విష్ణుకడకు నరిగియంత. 172

క. నతులు న్నుతులుం జల్పిన
వితతకృపాదృష్టి వారి వీక్షించి జగ
త్పతి గుశల మడుగ రావణ
కృతబాధలు దెల్పుదురు రమేశ్వరుతోడన్. 173

చ. దనుజుని యి ల్పదాగతి స
దా కసవూడ్చు నంబుదంబు లిం
పునఁ గలయంపిఁ జల్లు శిఖి
పొందుగఁ బాక మొనర్చుఁ జందురుం
డనుపమతాపహారి యగు
నాఁగి నిదాఘమునందు మాల్యముల్

పనుపడుచుఁ బుతూత్కారము
భానుఁడు వేఁడి యగుఁ హిమాగతిన్.

ఉ. అంబుజగర్భుఁ డద్దనుజ
నాత్మజులం జదివించు వేదముల్
తుంబురునారదు ల్గడఁగి
తోరపువీణియ లెత్తి హత్తి ని
త్యంబును బాడుచుందురు
హాళిమెయిం ద్రిదశాళి దాసకృ
త్యంబులు నిర్వహింపుచు భ
యంబున వర్తిలు సేవసేయుచున్. 175

క. పనులయెడ వేళదప్పిన
ననువుగఁ బనిసేయకున్న నసురాధము లీ
సున నీసురనికరములఁ
ఘనగతి నొంపుదురు ముష్టిఘాతోద్ధతులన్. 176

క. నందనవనసంస్థితహరి
చందనమందారపారిజాతాదితరుల్
పొందుగఁ బెఱికి యమందా
నందమునం దనదుపెరట నాటుం గడిమిన్. 177

క. అని విన్నవింప వారల
ననుకంపాదృష్టిఁ జూచి హరి యిట్లను న

దనుజునియెడ భయమేఁటికి
వినుఁడీ రచియింతు నొక్క వృత్తాంతమిఁకన్. 178

ఉ. పూతమనీషి పంక్తిరథు
పుత్త్రుఁడనై జనియింతు రాముని
ఖ్యాతిఁ జెలంగి లక్ష్మణస
హాయతఁ గౌశికు యజ్ఞపాలనం
బాతతిఁ జేసి గౌతముని
యాంగన శాపవిముక్తఁ జేసి నే
సీతఁ బరిగ్రహింతుఁ బుర
జిద్వరచాపము వంచి మెల్పునన్. 179

తే. పరశురామునిఘనబాహుబలముఁ గుంచి
దూషణుని ఖరుఁ ద్రిశిరునిఁ దుంచి యటక
బంధుఁ బొలియించి పంకజబంధుతనయు
నేలి వాలి జయించి యింపెసఁగ నంత. 180

ఉ. భ్రాతృసమేతు నాదివిజ
బాధకు రావణు సంహరించి సా
కేతపురంబుఁ జేరి ముని
కీర్తితకీర్తిఁ జెలంగి పొంగి నే
భూతనయాన్వితుండ నయి
భూతల మేలుదుఁ బన్నొకండువే

లాతతవత్సరంబు లట
నాత్మపదంబున కేఁగుదెంచెదర౯. 181

వ. అని పలికి భగవంతుం డంతర్ధానంబుచేయు, నిక్కడ వాల్మీకి రామాయణంబుగా రచియింపఁగలం డారామాయణశ్రవణపఠనంబుల దురితముక్తియు శుభావాప్తియు నగు నివ్వాల్మీకి యఖిలజగద్ధితార్థంబు తపంబుసేయు చున్నవాఁ డితనివలన భయంబు వలవ దని యనేక విధంబుల బోధించిన గురునివాక్యంబు లాకర్ణించి హృష్టచిత్తుండై సురపతి భీతిఁ దొఱంగి యగ్గురుం బూచించె ననిన విని శౌనకుండు రామాయణశ్రవణపఠనఫలంబు పదేశింపు మనిన సూతుం డిట్లనియె. 182

ఆ. వేదవేద్యుఁ డైన విష్ణుండు దశరథ
పుత్త్రుఁ డగుచుఁ బుడమిఁ బుట్టుకతనఁ
బ్రాఁచి వేదవితతి రామాయణాకృతి
వామలూరుజన్మువలనఁ గలిగె. 183

క. గాయత్రీమంత్రాన్విత
మై యిరువదినాల్గువేల నమరిన శ్రీరా
మాయణము వినినఁ జదివిన
శ్రీయుతులకు నఘము డిందుఁ జెందు శుభంబుల్. 184

వ. ఇందుల కుదాహరణం బైన యొక్కయితిహాసంబు గల దది యెట్లనిన. 185

తే. విప్రవర్యుఁ డొకఁడు వేదవేదాంగపా
రగుఁడు గలఁడు దొల్లి రామభక్తుఁ
డామహామహుండు రామాయణంబు ప
ఠించు ననిశమును భుజించు వెనుక. 186

చ. అతఁడు ధనార్జనమ్మునకు
నై నిజశిష్యసమేతుఁడై ద్విజ
ప్రతతులఁ గూడి పోవుచు న
రణ్యపథంబున నొక్కచోట న
చ్ఛతరజలాంచితం బయిన
చారుతటాకతటంబునందుఁ దా
నతులబుభుక్షు నన్నపచ
నార్థము నిల్చెఁ గృతాత్మకృత్యుఁడై. 187

తే. వండి యుచితనియతి వడ్డించుకొనువేళ
నచటివటతరువును నాశ్రయించి
మెలఁగు బ్రహ్మరాక్షసులు యతిరూపముల్
దాల్చి వచ్చి రపు డుదగ్రబలులు. 188

శా. కక్షాలంబితదండకుండికులు స
త్కాషాయవస్త్రావృతుల్
ద్రాక్షాతీతవచస్కు లచ్ఛతనులి
ప్తస్వచ్ఛభూతుల్ యతుల్

వృక్షచ్ఛాయల నిల్చి యక్షసరముల్
వే పాణులం ద్రిప్పుచుం
భిక్షాం దేహి యటంచుఁ జేరి రఘుజా
పృథ్వీసురాభ్యాశముం. 189

తే. యతికరంబున జల మిడి యంత భిక్ష
మొసఁగి వెండియుఁ దగ జల మొసఁగవలయు
నటఁ దదన్నము మేరుతుల్యంబు తజ్జ
లంబు లంబుధిసమములై డంబుమీఱు. 190

క. కావున యతులకు నబ్జా
దేవుఁడు భిక్ష యిడి తృప్తిఁ దేలిచి తానుం
బావన మతి భుజియించె ధ
రావిబుధులతోడఁ దత్సరఃప్రాంతమునన్. 191

వ. అంత నతండు వాల్మీకికృతంబైన రామాయణంబు పఠి
యించుటకు నవ్వటభూరుహప్రాంతంబున నాసీనుండై
యున్నంత. 192

ఆ. మనము వీరి మ్రింగ ననువు విచారింపఁ
దార వచ్చి యిచటఁ దారసిల్లి
రీవటాంతికమున నిది కార్యసిద్ధికిఁ
గారణంబు మనకుఁ గలిగె భుక్తి. 193

క. అని బ్రహ్మరాక్షసులు తమ
మనముల నూహించి వారి మన్నిగొనఁగ న

ల్లనఁ జనుచో నవ్విప్రుం
డనఘుఁడు రామకథఁ జదువ నాయితపడుచున్. 194

ఆ. అక్ష శిక్షణాతిదక్షుని శేముషీ
మంతు నఖిలలోకమాననీయు
ననిలతులితవేగు ననిలాత్మజుని రామ
దూతఁ గొలుతుఁ గీశనేత నిపుడు. 195

ఉ. రంగదభంగమాఁగళత
రంగభుజంబుల నింగిగంగ నా
లింగన మాచరించుకొను
లీలఁ జెలంగెడువార్ధి దాఁటి సీ
తాంగనశోకభీకరద
వాగ్ని వెసన్ హరియించి లంకఁ ద
త్సంగతి నిర్దహించు సుర
సన్నుతుఁ గొల్చెద నాంజనేయునిన్. 196

క. ఎచ్చట రాముని కథ తగు
నచ్చట సుఖవారిపూరితాక్షుం డగుచున్
నిచ్చలు భక్తిన్ మ్రొక్కెడు
నచ్చతురుని వాయుపుత్త్రు నభివర్ణింతున్. 197

ఆ. అనుచు నాందిఁ జదువ యతివేషధరు లయి
చేరి విప్రవరులచెంత నున్న

పాఱుటసుర లెల్లఁ బఱచిరి భీతిచే
ననిలసూనుపేరు వినినమాత్రి. 198

క. హనుమంతునకుం బీఠం
బనువ్రపఱచి చదువఁదొడఁగ నతఁడు పవిత్రం
బును ముక్తిదంబు నగు రా
మునిచరితం బఖిలభూతములు వెఱఁగొందన్. 199

తే. శ్రోతృజనరంజనప్రౌఢి నాతఁ డిట్లు
చదువుచున్నంతఁ దత్కథాశ్రవణకలన
నలరి బహుపాన్మహానోకహంబు డిగ్గి
వేగ చనుదెంచె బ్రహ్మరక్షోగణంబు. 200

శా. న్యగ్రోధావనిజాతసంశ్రయులు బ్ర
హ్మఘ్నుల్ మహాకాయు ల
త్యుగ్రాకారులు విప్రవేషు లఘుక
ర్మోద్యుక్తు లత్యంతసూ
క్ష్మగ్రీవాఢ్యులు బ్రహ్మరాక్షసు లుద
గ్రస్ఫూర్తి నేతెంచి య
భ్యగ్రక్షోణి వసింప విప్రులు భయ
భ్రాంతాత్ములై రందఱున్. 201

వ. అంత నందుఁ బెద్ద యగు రక్కసుం డవ్విప్రునకు నిట్లనియె.

చ. వెఱవఁగనేల మీరు పృథి
వీసురసత్తమ మమ్ముఁ గాంచి యి

త్తతి భవదుక్త రాఘవక
థాశ్రవణంబున రాక్షసత్వముల్
దొలఁగితి మింక మే మమర
దూతవినీతవిమానపంక్తు లిం
దలమును నెక్కి పోయెదము
నాకమునన్ వసియింప నింపునన్. 203
శ్రీరామాయణపఠనా
పారీణు న్నిన్నుఁ గాంచి భాషించి చనం
గోరి యరుదెంచితిమి నీ
కారుణ్యమె మముఁ బవిత్రగాత్రులఁ జేసెన్. 204
సత్పురుషులతోడ సంభాషించుటయుఁ దత్సహవాసం
బును స్వర్గాపవర్గంబులకుఁ గారణం బగు దురితవిము
క్తియు నగు నిందులకు నేమె దృష్టాంతం బనిన విని
యవ్విప్రుండు మీ రెట్టికర్మంబున నిట్లు బ్రహ్మరాక్షసు
లైతి రని యడిగిన వాఁ డిట్లనియె. 205
వె. ఓమహానుభావ నే మును వేదశా
స్త్రార్థవిదుఁడనైన యవనిసురుఁడ
లేమిచేత నొగిలి భామినీపుత్త్రులఁ
బోవ నెరవు లేక పొలుపు దఱిఁగి. 206
తులాచార్యుండనై పదియార్వురు ఋత్విగ్జనంబులు నేను
దులాపూరుషంబు ప్రతిగ్రహించి యనంతధనవంతుండ

నై నితాంతలోభాకాం్రతమతిం బ్రవర్తిలుచు. 207

చ. అతిథులఁ బూజఁ దన్న నిల
యాగతులైన యతీంద్రులక్ దిర
స్కృతి యొనరింతు నంజలియుఁ
జేయక కేవలదర్శవేళలన్
బితృతతికి న్నివాపజల
బిందుల నైనను దృప్తిసల్ప నే
నతులితలోభదీనమతి
నై ఖలవృత్తి మెలంగుదుం దగన్. 208

ఉ. శ్రీదవినోదసంపదఁ గు
సీదమహావ్యవహారమేదురా
మోదముసందడిన్ ధనస
ముత్కరవాంఛఁ జెలంగి పొంగి నే
వేదము శాస్త్రముం జదువు
వేడుక యూడిచి పుణ్యతీర్థయా
త్రాదులు దేవతార్చనము
నగ్నిసపర్యయుఁ జేయ మానితిన్. 209

క. గాయత్రి వేయిమాఱులు
పాయక నిత్యము జపింపఁ బాపము లడఁగున్
గాయత్రీమంత్రమునకు
నేయెడ నెక్కుడగుమంత్రమిల్లపైఁ గలదే. 210

చ. పది జపియింప నేకజని
పాపము నూఱు జపింపఁ బూర్వజ
న్మదురితముం దొలంగు గరి
మంబున వేయిటినిం జపించినం
గదురు యుగత్రయోపచిత
కల్మషము ల్తొలఁగించు మంగళా
స్పద యగు వేదమాత ఘన
పాతకజాలవనాగ్నికీలయై. 211

ఆ. వె. అనఘ వేదజనని యైనగాయత్రి క
సాధ్య మైనపాపచయము గలదె
యాజపంబు సల్పు నతఁడు జీవన్ముక్తుఁ
డదియుఁ జేయనేర నైతి నకట. 212

వ. ఉగ్రదానప్రతిగ్రహంబుకంటెం గర్మవర్జనంబునం బాపంబు ద్విగుణంబయ్యెఁ దత్కారణంబున ఋత్విక్సహితంబుగా బ్రహ్మరాక్షసుండనై యిమ్మఱ్ఱి నాశ్రయించి దురంతక్షుత్పిపాసాతురతం బరిభ్రమించుచుండితి. 213

క. ఇట మునుపట నొకనాఁ డీ
వ్వటనికటము చేర విప్రవర్యుఁ డొకఁడు వ
చ్చుటయుం గనుఁగొని యేను
త్కటమతి నతనిఁ వధింపఁ దలఁచితి మంతన్. 214

క. అపు డతఁడు జితేంద్రియుఁడుం
జపశీలుఁడు ధర్మయుతుఁడు సదయాత్ముఁడు గ
ర్మపరుండు నగుటఁ జేరక
యపారభీతిం దొలంగి యరిగితిమి వెసన్. 215

వ. శ్రుతివిరుద్ధకర్మంబులును విధిహీనం బగుకర్మంబులుఁ జే
యువారలఫలం బనుభవించుచుందుము మఱియు. 216

తే. గీ. అలికి ముగ్గు ఘటింపని యవనియందు
జనులు భుజియించు నన్నరసంబు మేము
మున్ను మెసఁగుదు మన్నిరసాన్నమంత
జనులు భుజియించిపోవుదు రనఘవర్య. 217

వ. ఇట్లున్నవారము బ్రహ్మకల్పంబునందుం బాయని మా
దురితంబు రామాయణశ్రవణకారణంబున నష్టం బయ్యె
నని పల్కి యవ్విప్రులు గనుంగొన దారుణశరీరంబులు
విడిచి దివ్యదేహంబులు ధరియించి విమానంబు లెక్కి
నాకంబునకుం జని రంత నాభూసురుండు నచ్చెరువు నొం
దుచు యథేచ్ఛం జనియె నని సూతుం డెఱింగించిన. 218

తే. గీ. అంత నాశౌనకాదు లోయనఘచరిత
రావణుఁడు కుంభకర్ణుఁడు రాముచేతఁ
బొలిసి యెచటఁ జనించిరి దెలుపు మనిన
సూతు డిట్లని పలికెఁ బ్రఖ్యాతఫణితి. 219

క. ధారుణిఁ బుట్టిరి వెండియు
వారలు శిశుపాలదంతవక్త్రాహ్వయులై
వారిఁ దునుమ యదుకులమున
శ్రీరమణీశ్వరుఁడు పుట్టె శ్రీకృష్ణుండై. 220

వ. శిశుపాలుండునుదిరినేత్రిచతుర్భుజంబులతోడ నుదయించిన,

ఆ. ఎవ్వఁ డెత్తి కొనఁగ నిబ్బాలువికృతవే
షం బడంగు నతఁడె చదుపు వీని
ననిన నారదోక్తి విని తల్లి యందఱ
చేతి కిచ్చుచుండెఁ జిఱుతవాని. 222

క. ఒకనాఁడు గృష్ణుఁ డయ్యా
ర్భకు నంటఁగ నెక్కుడగు కరంబులు నిటలాం
బకమును నడంగె హరి వా
నికి నరి యగు నని తదంబ నిజమతిఁ దలఁకన్. 223

తే. హరికి మేనత్తయైన యాహరిణనేత్ర
తనయు మనుపు మటంచుఁ బ్రార్థన మొనర్పఁ
గ్రమగతి శతాపరాధముల్ క్షమ యొనర్తు
ననుచు నానతి యొసఁగె నాయనఘమూర్తి. 224

సీ. హరి దేవకీపుత్రుఁడై నందగోకులం
బున నిల్చి పూతన మనికి మాన్చి
శకటతృణావర్తబకమహాజగరవ
త్సాదులం దునిమి దావాగ్ని యార్చి

కాళియాహిపుఁ దోలి కేల గోవర్ధన
గిరి యెత్తి ధేనుకాసురు వధించి
జంగమస్థావరసకలప్రపంచంబు
వేణుగానామృతవృష్టిఁ దన్పి
సద్వశామధ్యమత్తగజంబువోలె
నఖిలగోపాంగనావృతుఁ డగుచుఁ దనరి
యర్కకన్యాతటాంతవనాంతరమున
రాసకేళిమహోల్లాసభాసి యయ్యె. 225

వ. అనిన విని శౌనకాదు లాగోపకాంతలు మోహాక్రాం
తలై హరిం గూడి క్రీడించుటకుం గారణం బెయ్యది
దెల్పు మనిన సూతుం డిట్లనియె. 226

క. నీలేందీవరసురవర
నీలఘనశ్యాము రాము నిర్జరనుతు సీ
తాలక్ష్మణయుతుఁ గనుఁగొని
శ్రీలక్ష్మియు మునులు మోహశీలితమతులై. 227

వ. ఒక్కనాఁడు దండకారణ్యవాసి యగు నద్దేవునిసన్నిధి
కేతెంచి యిట్లనిరి. 228

శా. నీసౌందర్యవిలాసభాసురతనూ
నిర్వంచనాలింగనా
శ్రీసౌఖ్యం బెదఁ గోరి వచ్చితిమి ని
ర్ణిద్రానురాగోద్ధతిం

బ్రిసూనాంబకశంబబాణహతి ధై
ర్యస్ఫూర్తి యూఁటాడె మ
మ్మోమసర్వేశ యనంగసంగరసము
ద్యోగాబ్ధి నోలార్చవే. 229

ఆ. అనినఁ జెవులు మూసికొని రాముఁ డమ్మౌని
వరులఁ జూచి పురుషుఁ బురుషుఁ డెందుఁ
గవయువింత గలదె నవని జాతిభ్రంశ
కాఖ్య మైన దురిత మది తలంప. 230

వ. అదియునుంగాక బాల్యంబునం బలాత్కారంబున నజ్ఞా
నంబునం జేయంబడు పాపంబునకు నిష్కృతి గలదు
గాని బుద్ధిపూర్వకంబుగం జేసిన పాపంబునకుఁ బ్రాయ
శ్చిత్తంబు గలుగనేరదు విశేషించియు మీరు మునిశ్రే
ష్ఠులు జ్ఞాననిధులు నగుట నిట్టివిరుద్ధమనోరథంబు మీకుం
గొఱగాదు తపోధనంబు రక్షించుకొనుండు చనుం డని
పల్కిన వార లిట్లనిరి. 231

ఆ. నీయనుగ్రహమున నిఖిలబంధమ్ములు
నూడిపోవు నింక నొండుబంధ
మెట్లు గల్గు మాకు నే మెట్టు లయినను
నిన్నుఁ జెందెదము వినీలదేహ. 232

తే. ఈశ్వరుఁడ వవ్యయుండవు శాశ్వతుఁడవు
సర్వగతుఁడవు గర్తవు సర్వసాక్షి

వనఘ నీయాత్మ యెఱుఁగని యర్థ మెద్ది
మామనోరథ మీడేర్చి మనుపవలయు. 233

క. అనిన విని రాఘవుం డా
మునులం గని యాదవకులమునఁ గృష్ణుఁడనై
జనియింతు నపుడు మీకో
రినకోరిక దీర్చి మీకుఁ బ్రీతి ఘటింతున్. 234

క. మునులార మీరు గోపాం
గన లయి జనియించి నన్నుఁ గవయుఁడు మీయం
గన లెల్ల ధేనుగణమై
గనియెదరు మదీయకరుణఁ గల్యాణమతిన్. 235

తే. అని పలికి పద్మసద్మయాననముఁ జూచి
నీవు రుక్మిణివై జనియించు మపుడ
యవనిపుల గెల్చి నినుఁ బెండ్లి యగుదు నంతఁ
నగు మదీయాంగసంగసౌఖ్యంబు నీకు. 236

వ. అది గావున నేకపత్నీవ్రతస్థుండనైన నే నిన్నెట్లిప్పుడు
వరియింతు ననినఁ గోపించి లక్ష్మీదేవి యిట్లనియె. 237

ఆ. నీమనోహరాంగనిత్యసౌఖ్యంబు నే
నభిలషింప నన్ను నాదరింప
వైతి నీమనంబు రాతిది నీవును
రాయివై వసింపు రఘుకులేశ. 238

వ. అనిన రామభద్రుం డిట్లనియె. 239

శా. సీతేందీవరచారునేత్రి వినుమా
సీపల్కు తథ్యంబుగా
సాలగ్రామశిలాకృతి న్నెలఁగెదన్
శశ్వత్సవిత్రస్థితిన్
మేలై సర్వజగద్ధితార్థముగఁ ద
న్మిశ్రాంబులేశాప్లుతిం
జాలం గల్గు నశేషతీర్థసలిల
స్నానక్రియాపుణ్యముల్. 240

మహాస్రగ్ధర. ఆసాలగ్రామదానం బఖిలభువనదా
నాదిపుణ్యౌఘతుల్యం
బాసక్తి న్నేను శంభుం డజుఁడును నిజమ
ధ్యస్థితిన్ లీలఁ గ్రాలన్
భాసిల్ల న్నించు లయినన్ బలసి తవుల ని
ష్ఠాట నీటం దొలంపం
దానమ్యాకుచ్ఛదవృత్తిం దనరు నెపుడు త
త్ప్రస్తరం బంబుజాక్షీ. 241

ఆ. అట్టి దివ్యశిలకు నావాహనంబు ను
ద్వాసనంబు లేదు తదభిషేక
జలకణంబు తత్ప్రసాదంబు పాదజా
దులు గ్రహింపఁదగదు జలజవేణి. 242

వ. అని పల్కి రామదేవుండు వారల నందఱ ననిచి యథే

చ్చం జనియెఁ దత్కారణంబునం గృష్ణుండు వేత్రలం
గూడి క్రీడావినోదంబులం గ్రీడించె నంత. 243

క. కంసప్రేరితుఁ డగుచు న్నృ
శంసుఁడు కేశి యను రజనిచరుఁ డశ్వంబై
హింసామతి రాఁగ యదూ
త్తంసుఁడు ఖండించివైచెఁ దత్తనువు ధరన్. 244

ఆ. అంతఁ గృష్ణుఁ బిల్వ నక్రూరుఁ డక్రూర
మతిఁ జెలంగ నందు మందిరమున
కరుగుదెంచెఁ గంసుఁ డనుపంగ గోద్రోహ
నావసరమునందు నర్హగతిని. 245

క. అక్రూరచరితుఁ డగుహరి
యక్రూరునిప్రార్థనమున నగ్రజయుతుఁడై
విక్రమసంపద వెలయ మ
హాక్రూరునిఁ గంసుఁ దునుమ నరిగె మధురకున్. 246

ఉ. హారిరథాధిరూఢుఁ డయి
యంబురుహాంబకుఁ డంబుదాభుఁ డ
క్రూరుఁడు తోడ రా మధుర
కుం జనుచు న్నిజవిశ్వరూప మిం
పారఁగఁ జూపి యాతనిఁ గృ
తార్థునిఁ జేసెఁ గళిందనందనీ

సారససంచరన్మధుప
జాలసమంచితగానలోలుఁ డై. 247

తే. అంత సాయాహ్నసమయంబునందుఁ దత్పు
రాంతికోపవనావని నధివసించె
వనజనయనుఁ డవ్వార్త కంసునకుఁ దెల్పి
చనియె నక్రూరుఁ డాత్మీయసదనమునకు. 248

క. అరుణోదయమున సీరియు
హరియుం గృతకల్యకృత్యు లయి నిరతిశయ
స్ఫురణంబున నా మధురా
పురికిం జని రాజమార్గమున వచ్చుతఱిన్. 249

మ. మదమత్తద్విపరాజయానులు లస
న్మాణిక్యభూషాఢ్యులన్
సదసన్మధ్యుల సంచరత్తుహినకృ
ష్ణత్విమ్మభృదచ్ఛాంగులన్
మృదులశ్యామపిశంగవాసుల దర
స్మేరాస్యులం దత్పురీ
సుదతుల్ సూచిరి రామకృష్ణుల సుధాం
శుబర్హిధ్నరోచిష్ణులన్. 250

ఉ. వీథుల వీథులందు నలి
వేణులు వేణువినోదిఁ జూచు చం

భోషధరచుంబిచంద్రమణి
పుంజితరంజితహైమవిస్ఫుర
త్సౌధము లెక్క వాకెకను
దమ్ములు శోభిలె నల్లగల్వలన్
మాధవుఁ డేఁగుదేర గరి
మంబునఁ దోరణ గట్టిరో యనన్. 251

క. అబ్జాతగంధి యపు డొక
కుబ్జాంగన గంధసారకుంకుమపరిపూ
ర్ణాబ్జమణిపాత్రి మరుణక
రాబ్జంబునఁ బూని చనఁగ హరి సరసోక్తిన్. 252

క. నేమం బోదవు స్త్రీకుం
గామిని మా కిమ్ము యక్షకర్దమ మన న
బ్భామిని మదిఁ బొదలి యదు
గ్రామణి సౌందర్యగరిమ గని విస్మితయై. 253

తే. చక్కఁదనమున వన్నెకు నెక్కు దీవ
యలఁదుకొ మ్మని యొసఁగె నయ్యలరుఁబోఁడి
సాంద్రచందనచర్చానుచర్చఁ దేలి
హరియు నయ్యింతిఁ గరుణింప నాత్మఁ దలఁచె. 254

తే. అది స్వభావముచే నింతి యదియుఁగాక
దాసి యాచారవర్జిత దాని కొసరె

శ్రీవిభునిఁ జందనమున నర్చించుసుకృత
మాసరోజాక్షిభాగ్య మే మనఁగవచ్చు. 255

తే. వాఙ్మనఃకర్మధర్మైకవర్తనమున
నలరి నిర్మలబుద్ధిచే నళిననయనుఁ
బూజసల్పినఁ గోర్కె లప్పుడ ఫలించు
గంద మొసఁగి త్రివక్రి యిం పొందినట్లు. 256

తే. పూర్వజన్మంబునందు నపూర్వలీల
నెంత దప మాచరించెనో యీత్రివక్రి
కాకయుండిన భగవంతుఁ గంతుజనకు
నీశ్వరు నెఱింగి సిరిగంద మెట్లొసంగు. 256

చ. తనదొరయానయుం దొఱఁగి
తత్ హరి వేఁడిన దూషణస్థితిం
దనరక గంధ మిచ్చి వని
తామణి తా మనిర్మల శుభాత్మమై
మొనసి యదూషణోద్యమన
మున్నతభక్తి మెలంగెనేని య
మ్మనుజు నుమాధవుండును ర
మాధవుడుం గృపఁ బ్రోవకుందురే. 257

క. పైదలిపదమునఁ బదమిడి
యాదటఁ దచ్చుబుకసీమ హస్తాగ్రము లిడి యా

శ్రీదయితుఁడు నిగుడించిన
మోదంబున నదియు రుచిరమూర్తి వహించెన్. 25

తే. కుబ్జవంకలు దీరిచి కోర్కు లొసఁగి
యబ్జనాభుండు గంసునియంబరములు
మడఁకలుగఁ జేసికొని వచ్చుచెడుగురజకు
నడిగె మాకిమ్ము చేలమ్ము లనుచుఁ బ్రీతి. 259

వ. ఆరజకుండు రామకృష్ణుల కిట్లనియె. 260

ఉ. కోరఁగఁ జన్నె దుష్టమతిఁ
గోకలు బాలిశులార మీర లా
భీరులు గ్రామ్యవస్తువుల
పేరు నెఱుంగరు మీకు వన్య మా
హార మసారవల్కలము
లంబరముల్ వనచారు లాట నీ
సారెకుఁ దప్పుఁ గాచితి వె
సం జనుఁ డిర్వురు జీవితార్థులై. 261

క. రాజార్హదివ్యవస్తువు
లోజం గామింపఁగూడ దురుబుద్ధులకున్
రాజప్రీతికరాలకశా
యోజన తత్పుత్రమైత్రియున్ మానఁదగున్. 262

క. నృపమంత్రితకార్యంబుల్
కపటస్థితి బయలుసేయఁగా వలవదు త

న్నృపదారలతో నెప్పుడుఁ
జపలమతిన్ మాటలాడఁ జనదు బుధునకున్. 263

క. క్షౌరకరజకులు నృపులకు
నారయ నేకాంతమిత్రు లటుగావున మీ
కోరిక నావలనన్ విని
మారాజు సహింపఁ డిపుడు మాట లిఁకేలా. 264

క. బాలుఁడు చందురుఁ దెమ్మను
పోలికఁ గోరితిరి కంసభూపతివలువల్
మే లగుజీవితముపయిన్
బాళి దొఱఁగెనేమొ మీకు బాలిశులారా. 265

తే. అనుచు విపరీతగతిఁ బల్కు నధమరజకు
ముష్టిహతి నుగ్గుగావించి ముఖ్యవస్త్ర
తతులు రాముఁడు దాను సన్మతి ధరించి
తక్కటివి గోపకుల కిచ్చె దనుజభేది. 266

క. మక్కువనాగరయువతుల
దృక్కుముదము లలర రామదేవుఁడు దానుం
బ్రక్కారునియింటికిఁ జని
తక్కక యచ్యుతుఁడు పుష్పదండలు గొనియెన్ 267

ఉ. ఆతఱిఁ బౌరకాంతలు గృ
హాంతరకార్యము లుజ్జగించి స

త్పాతమతిఁ గనుంగొనిరి
పుష్పవదాభయశఃప్రతాపవి
స్ఫీతుల సింహశౌర్యుల న
పేతకళంకుల శోభనాంగులన్
భ్రాతల రామకేశవుల
రత్నవిభూషణభూషితాంగులన్. 268

*సుగంధివృ. పాత్రిరంబుజాతనేత్రు భాను తేజు నీలజీ
మూతమేచకాంగు విశ్వమోహనాసితాలక
వ్రాతసంవృతాస్యుఁ బీతవాసుఁ గృష్ణుఁ గాంచి య
జ్ఞాతగంధు లెల్లఁ జిత్తజాతకృత్తచిత్తలై. 269

క. మదనోన్మాదభ్రాంతిన్
మదవతులు కనుంగవలును మానసవృత్తుల్
యదునందనుపై నిడి య
య్యదనఁ దగిరి సాలభంజికాకారములన్. 270

ఉ. ఆరయ మేఁకవన్నెపులు
లట్ల యదూద్వహు లంత ఘోరవీ
రారివిమర్దనక్రియకు
నాయితమై చని రంగమంగళ
ద్వారము సొచ్చి రందు బల
దర్పితులం దముఁ గాంచి సైనికుల్

* శరభ్రవిభూషణవృత్తము—పా. ప.

ఫేరవముల్ మృగేంద్రముల
బిట్టు గనుంగొనులీల నుల్కఁగన్. 271

తే. తాళసాలోన్నతంబును స్థూలతరము
యాగయోగార్చితంబును నైన ధనువు
విఱిచి తత్ఖండములఁ గంసవీరభటులఁ
జదిపె నన్నరయుఁ డానును జక్రపాణి. 272

వ. అంత హతశేషు లైన భటులు కంసు డగ్గఱి యిట్లనిరి. 273

ఆ. దీప్తపాండునీలదేహు లమానుషా
హీనసత్త్వు లిర్వు రేఁగుదెంచి
భటుల మూఁడుకోట్లఁ బరిమార్చి యాగీయ
ధనువు ఖండములుగఁ దునిమి రధిప. 274

ఆ. అబ్ధికూపములకు హర్యక్షజంబుక
ములకు క్షీరనీరములకుఁ గల్గు
నంతరంబుసు వ్వె యమ్మహాసింహశ
రాక్రిములకు మాకు రాజవర్య. 275

వ. అని చెప్పిన విని కంసుండు కోపోద్దీపితమానసుం డయ్యె
నంత. 276

తే. అతనిపాలికి నారదుఁ డరుగుదేర
నర్హసత్కార మొనరించి యనఘవర్య
విప్రపితృమాతృబంధువిద్వేషబుద్ధి
యెట్టికారణమున నాకు నెలవఁ జెప్పుము. 277

తే. హరిహరాదులభక్తిపై నాస మాని
వనతటాకాదిభంజనవాంఛ గొలలేఁ
బాపకర్మలతో మైత్రి వరిఢవించె
నామనం బేఁటి కిట్టిచందంబు నొందె. 278

చ. అన విని దేవమానివరుఁ
డాతని కిట్లనుఁ గాలనేమి నాఁ
జను దనుజుండ వీవు మును
సారసనాభునిచే హతుండవై
విను మిపు డుగ్రసేనపృథి
వీపతికిం దగ క్షేత్రజుండవై
యొనరితి కంసనామమున
నుగ్రబలాఢ్యుఁడ వై ధరాధిపా. 278

ఆ. విప్రవిష్ణుబంధువిద్వేషణము నానా
చారజారచోరసాహ్యాదంబు
ప్రాజ్ఞమాతృపితృతిరస్కారణంబును
జారసంభవులకు సహజగుణము. 279

వ. నీవు జారజుండవు రక్కసుండవుం గావున నిట్టిదుర్గుణవిశి
ష్టుండ వైతివి విష్ణుండు కృష్ణుండై జనియించి నిన్నుఁ
దునుముట కరుగుదెంచినవాఁ డిందులకుఁ బ్రతీకారంబు
విచారింపు మని తెల్పి నారదుం డరిగిన యనంతరం
బాకంసుండు చాణూరముష్టికు లను మల్లులను గువల

యాపీడఁ బనుగజంబును గృష్ణవధార్థంబు నియోగించి తానును మహోత్సేధసౌధం బారోహించి రామకృష్ణులం బిలిపించిన. 280

.. వీరలు రామకేశవులు
వింధ్యధరాధరబంధురంబు దు
ర్వారమదాష్టకాన్వితము
వారిజబంధుసుధాంశునిగ్రహో
దారవిధుంతుదగ్రహవి
ధాముహుఃరూర్ధ్వదిశాప్రసారణ
స్ఫారకరాంచితంబు నగు
సామజరాజముఁ గాంచి రయ్యెడన్. 281

.. ఆమదావళంబు నాధోరణప్రియ
త్నమున దానవారి దానవారిఁ
దడిపి బృంహితములఁ దారాపథం బెల్లఁ
బగుల నెదిరి మీఁది కెగయుటయును. 282

.. పుష్కరనయనుఁడు నిజకర
పుష్కరమునఁ గుంభమధ్యమునఁ బొడువ వెసన్
బుష్కరమార్గమునంటన్
బుష్కర మెగయించి తుండి భూస్థలి మ్రొగ్గెన్. 282

వ. వెఱ పొకయింతలేక యదు
వీరుఁడు వారణఘోరదంతముల్

వెఱికి తదీయపాలకునిఁ
బీఁచమడంచి నిశాటకోటి నం
దఱిఁ దెగటార్చి యన్నయును
దాను మహోద్ధతి రంగభూమి న
త్తెఱపి నెదుర్చుమల్లుల వ
ధించి వసించిరి తద్ధరాస్థలిన్. 284

వ. ఇట్లల్పమృగంబుల సింహంబులుంబోలెఁ జాణూరముష్టి
కుల మడియించి రనంతరం బాపౌరులు వారల నుద్దేశించి.

ఉత్సా. వీర లాశ్వినేయు లొక్కొ విధుదినేశమూర్తులో
మారకోటిసుందరుల్ పవిత్రనాగయాను లా
భీరవీరు లిట్టివారె పృథ్వి నెన్న నిమ్మహా
పూరుషు ల్దలంప నాదిపూరుషోత్తమాకృతుల్. 286

మ. అని చంద్రోదయఘూర్ణమానజలధి
వ్యాఘోషలీలన్ జనుల్
ఘనులం దాలఖగాంకులం బొగడ న
క్కాలసుండు హింసామతిన్
దనయోధావళిఁ జీఱి యీకుమతులన్
ఘట్టించి వే త్రోయుఁ డీ
వనసంచారులు మత్సమీపమున ని
ల్వం బాత్రులే కుత్సితుల్. 287

చ. అన విని దండతాడితమ
హాహి తెఱంగునఁ గ్రోధియై జనా
ర్దనుఁడు తనుఙ్ వెసం గదియఁ
దావక్రశానునిలీల వచ్చు న
య్యనఘునిఁ గంసుఁ డుగ్రనిశి
తాసిఁ జలంబున వైచె వైవ దా
నిన కొని వానిమస్తకము
నెట్టన ద్రుంచె సరోజనాభుఁడుఙ్. 288

వ. అంత. 289

క. నీరదవర్ణునిఁ బాడుచు
శారదనారదపటీరచంద్రాంశుసుధా
పారదనిభశుభవర్ణుఁడు
నారదముని నింగి నిలిచి నాట్యము సల్పెఙ్. 290

క. మధురాపురభేదనమున
మధుసూదనుఁ డుండె జనకమాతృయుతుండై
మధురత బాంధవులం గా
మధుగభిమతధనవితీర్ణిమహిమఁ దనుపుచుఙ్. 291

సీ. అంత జరాసంధుఁ డాకంసవధయు శ్రీ
పతి వసుదేవునిసుతుఁ డగుటయు
నిఖిలరాక్షసకోటి నెఱిఁ గూల్చు ననియు నా
రదమునివలన సర్వంబు నెఱిఁగి

యేను మున్నుగఁ గృష్ణు నెదిరించి గెల్చిన
రాక్షసనివహంబు బ్రదుకఁ గాంచు
నని తలంచుచు ననేకాక్షౌహిణీపరి
వృతుఁడై బలోద్ధత రేణుపటలి
కదిసి మిన్నును మన్ను నొక్కటిగ నదుక
దనుజవంశాటవీచ్ఛిదాదక్షరూక్ష
నందనందనపరశువు నవ్యసమర
శాణమువ వాఁడి గావించుజాడ నరిగె. 292

వ. ఇట్లరిగి మధురాపురంబు నిరోధించె నంత. 293

తే. ఫలము దునుకలు చేసి సపత్ను లిరువు
రొకట భక్షింప మానవశకలయుగము
గలిగె జర యనునది వానిఁ గలయ నదుక
నట జరాసంధుఁ డనునాఖ్య నమరె నంత. 294

వ. అని నారదమునీంద్రుచే విని కృష్ణుండు. 295

ఆ. సింహబలుఁడు భీమసేనజరాసంధ
బకసుయోధనులు నపారబలులు
తుల్యసత్త్వ లగుటఁ దుంచు వీరల భీముఁ
డేను వీనిఁ దునుమ నేల యనుచు. 296

ఉ. రాముఁడు కేశవుండు మధు
రాపురి వెల్వడి యేఁగుదెంచి సు

త్రామముఖామరప్రహిత
ధన్వశిలీముఖమండలాగ్రము
ఖ్యామితదివ్యశస్త్రచయ
మక్షయతూణశతాంగసంగతిౝ
వ్యోమపదంబునం డిగ న
యోన్నతిఁ గైకొని రుద్ధతక్రియౝ. 297

చ. పరబలవార్ధిఁ జొచ్చి యరి
భంజను లుగ్రగదాప్రకాండశం
ఖరణనచక్రఖడ్గహల
కార్ముకముక్తమహాశరాహతిౝ
హరుల మతంగజంబుల శ
తాంగములౝ భటకోటులం బొరిం
బొరి నుఱుమాడి రక్తజల
పూరనదుల్ పరగించి రుక్మునౝ. 298

క. రంగస్థలిఁ దగునటులతె
ఱం గమరఁగఁ జిత్రవేషరాజితు లగుచుౝ
రంగద్గతిమాతంగతు
రంగశతాంగతతిఁ జదిపి రహి నాడి రటన్. 299

తే. కృష్ణకార్ముకనిర్ముక్తహేమపుంఖ
కాండములు వైరవీరనికాయకాయ

కాండములఁ జొచ్చి టొప్పెను జండలీల
వామలూరుతతుల్ సొచ్చుపాము లనఁగ. 300

తే. మత్తదంతావళములు తామరసపరసి
నాడు తెఱఁగునఁ గ్రీడించి రమ్మహాత్ము
లరిభటాళి నిజాభిముఖ్యము భజించి
యగ్గిపైఁ బడుశలభంబు లట్లు మడియ. 301

వ. ఇట్లిరువదియక్షౌహిణుల నుగ్గాడి యంత భగ్నశాఖం
బైన వృక్షంబునుంబోలె నున్న జరాసంధునకుఁ గవిసి
ఘోరయుద్ధం బొనర్చి రందు బలుండు హలముసలం
బులు పూని వానిం దెగటార్ప నుంకించి గగనవాణిచేత
నివారితుండై వాని విడిచి విజయంబు గైకొని పురంబుఁ
ప్రవేశించె నంత. 302

తే. ఆజరాసంధుఁ డెప్పటియట్ల బలము
లెక్కుడుగఁ గూర్చుకొని యిర్వదొక్కమాఱు
సమర మొనరింప సైన్యంబు సమయఁజేసి
యతని నొక్కనిఁ బోనిచ్చు నచ్యుతుండు. 303

వ. ఇట్లు ధారుణీభారంబు నివారించుచు వారిజాక్షుండు
మధురానగరంబున నున్నంత నొక్కనాఁడు నారదుండు
కాలయవనునియొద్దకుం జని యతనిచేఁ బూజితుండై
యిట్లనియె. 304

క. జనకుఁడె గురుఁడుం దైవము
జనకుఁడె సద్బాంధవుండు జనకాజ్ఞాపా
లన మొనరించుచు మెలఁగిన
యనఘాత్ముఁడు పుత్త్రుఁ డనఁగ నలరుం ధరణిన్. 305

ఆ. క్షితి నపుత్త్రకునకు గతి లేదు సౌఖ్యంబు
నొందఁ డెందునైన నిందఁ జెందుఁ
బుత్త్రవంతుఁ డఖిలపూజ్యుండు వానికి
నిదియె త్రిదశలోక మెట్టఁగిఁకొనుము. 306

ఉ. యాదవు లాత్మవంశగురు
నాథ్యుని గర్గమునీంద్రుఁ జూచి యి
వ్వేదజడుండు షండుఁ డప
విత్రితగాత్రుఁడు వీనిముట్టఁగాఁ
గాదు నిరర్థకుం డఖిల
కర్మబహిష్కృతుఁ డంచు నార్యమ
ర్యాదఁ దొలంగి మత్తు లయి
హాస్యరసోక్తిఁ దిరస్కరించినన్. 307

వ. ఇట్లవమానితుండై. 308

క. గర్గుం డాయాదవులన్
దుర్గుణవంతు లని వారి త్రుళ్లణఁప జగ
త్సర్గస్థితిలయకారణు
భర్గున్ మది నిల్పుకొని తపం బొనరించెన్. 309

తే. దినదినము లోహచూర్ణంబుఁ దినుచు నిట్లు
ఉగ్రతప మాచరింపఁగ నుగ్రుఁ డింపు
దవులఁ బ్రత్యక్ష మగుచు యాదవులఁ దున్ముచు
నాత్మజుఁ నొసంగె నమ్మని యాత్మఁబొంగ. 310

క. గర్గుం డట దాసీసం
సర్గం బొనరింప నీవు జనియించితి దు
ర్మార్గుల యదుకులజన్ముల
దోర్గర్వ మడంగఁ జేయ ధూర్జటికరుణన్. 311

తే. అంత ననపత్యుఁ డగు నొక్క యవననృపతి
మనుప నటఁ గాలయవనసమాఖ్యఁ జెంది
తీవు జనకునియాజ్ఞ దదీయభక్తిఁ
జలిపి కీర్తి వహింపుము శాశ్వతముగ. 312

తే. యదుకులంబున శ్రీకృష్ణుఁ డనఁగఁ బుట్టి
మధుర నున్నాఁడు దానవమదవిభేది
కంసుఁ దునిమె జరాసంధుగర్వ మడఁచె
నిపుడు శిశుపాలుఁ దెగటార్ప నిచ్చగించె. 313

వ. యాదవవినాశంబునకు గర్గునివలన జనియించిన మహా
బలుండవు యాదవులు మధురాపురంబునఁ గృష్ణపాలి
తులై యున్నవారు వారిని జయింపు మని చెప్పి నార
దుం డరిగిన. 314

చ. యవనుఁడు క్రోధదీప్తుఁ డయి
యావనవీరులు మూఁడుకోట్లతో
జవగతి వచ్చె సాగరము
చందమునన్ మధురాపురంబుపై
నవల జరాసుతుండును మ
హాబలసంవృతుఁడై కడంగి వె
న్వదవులఁగ సర్వయాదవక
దంబములం దమియించునీసునన్. 315

సీ. అతఁడు గర్గాచార్యసుతుఁ డుగ్రుఁ డనుచు శ్రీ
ధవుఁ డాత్మ నెంచి యుద్ధవునిఁ జూచి
విప్రకోప మనిష్టవిధికి హేతువు పరి
హాసంబు సేయంగ నగునె వారి
యాదవు లెఱుఁగక యుపహసించిరి గర్గు
నాయన కోపాగ్ని యవనరూప
మున వచ్చె నే వీనిఁ దునిమినఁ గినియు న
మ్మునివరుం డేక వీనిఁ దునుమకున్న
యాదవులఁ బిల్కుమార్చు నీయవనుఁ డేచి
యాజరాసుతుండును వచ్చి యాజి కొనరె
దీని కెయ్యది నీతి చింతింపు మనిన
నుద్ధవుం డిట్టు లను మధురోక్తు లమర. 316

వ. దేవా నీ వెఱుంగనియర్థం బెయ్యది భవత్సన్నిధానంబున

సమరాచార్యుండును బలుక సమర్థుండె యైననుం జెప్పెద.
ఆ. నీలవర్ణ మధుర నీ వుండి యీరాజరా
తనయుతోడఁ బోరఁ దగవు గాదు
కాలయవను నీవు ఖండింప వలవదు
గర్గకోపవహ్ని గలయు నలము. 318
వ. పదంపడి చేయవలసిన కార్యంబు సేయుం డనిన మెచ్చి
యుద్ధవునిఁ దనబహిఃప్రాణం బని మన్నించె నంత. 319
చ. వననిధిమధ్యదేశమున
ద్వారక యను పురి సంఘటింపు మీ
వని యదునందనుండు దన
కానతియిచ్చిన విశ్వకర్మ య
వ్వననిధినూత్నరత్నము ల
వారణఁ గైకొని చిత్రలీల నే
పున రచియించెఁ బట్టణ మ
పూర్వతరం బయి డంబు మీఱఁగన్. 320
చ. అదితగు దేవదానవదు
రాసదహాటకవప్రదీపముక్త
సదనమణిప్రభాస్తమిత
సాంద్రనిశాతిమిరక్రమంబు శా
రదశశికౌముదీవిశద
రత్నవితానవిరాజితంబు న

భ్యాదితరవిప్రిభాచ్ఛమణి
పుష్కలతోరణమండితంబు నై. 321

క. స్వర్గమునకంటె మిగులు ని
సర్గవిభావైభవమున జనములు గొలువన్
వర్గత్రయి యరుదే యప
వర్గంబును సంఘటించు ద్వారక యెప్పుడున్. 322

ఉ. ఆపురిసౌధవీథుల వి
హారము సల్పు విలాసినీమణుల్
పాపలచేతినూనియల
పాటునఁ గాళిమఁజెందె నంచు న
భ్రాపగలోని పద్మరజ
మాశశిబింబముమీఁద రాచి తా
రేపున నీడఁ జూచుతటి
నేమఱుపాటునఁ బోవు చంద్రుఁడున్. 323

తే. చంద్రశాలల విహరించు చంద్రముఖుల
జడలయందంబు వీక్షించి చంద్రసూర్యు
లడఁగి యడఁగియుఁ బోవుదు రప్పురమున
బహువిధుంతుదతనులతాభ్రాంతు లగుచు. 324

క. ఆరవిసోములు చనుటకు
ద్వారంబులు రెండమర్చి వరణమున కలం

కారార్థంబుగ వెండియు
ద్వారద్వితయంబు త్రిదశవర్ధకి నిల్పెన్. 325

తే. యంత్రపాంచాలికాతతి కమరసతులు
గగనసరిదబ్జకలికలు గానుకిచ్చి
మేడలకుఁ జేర నవియు మాటాడకునికి
విన్ననై చన నగుదు రవ్విటిసతులు. 326

చ. అరుణమయూఖబింబము ర
యంబున నంబరవీథి నేఁగఁ ద
త్పురవరసౌధకేతుహతి
బొందునఁ జిల్లులువోయెఁ గానిచో
నరు దగునట్టి ఘోరసమ
రావనియందు నవార్యశౌర్యులై
పరగిన యోధబృందములు
పల్మరు దూఱఁగ దారిగల్గునే. 327

మ. అగరూద్యద్ఘనధూపధూమ మిభచ
ర్మాచ్ఛాదనప్రక్రియన్
మిగులన్ స్వర్ణది శీర్షసన్నిధిగ నె
మ్మిన్ శోణమాణిక్యకుం
భగణప్రాంశురుచుల్ జటాపటలిగాఁ
బ్రత్యక్షభర్గాకృతిన్

మగరామేడలు తత్పురాంతరమునన్
భాసిల్లు నచ్ఛచ్ఛవిన్. 328

చ. పరిఘజలంబు లాడఁ జని
పన్నగకన్యలు దేలి యిచ్చు సుం
దరమణిహారము ల్గొని ము
దంబున సౌధము లెక్కి సారసుం
దరులకు నిచ్చి వా రొసఁగు
నాకమహీజసుమాళి భోగిసుం
దరులకు నిత్తు రిం పమరఁ
దత్పురకాంతలు మైత్రి పెంపునన్. 329

తే. తత్పురోద్యానవాటికాంతరమహీజ
వితతి యెప్పుడు సుమముల విఱ్ఱవీఁగ
మగుడ దోహదధూపము ల్మగువ లిడుదు
రాసకమినొక్కొ కడు ముగ్ధ లగుటనొక్కొ. 330

క. వరపద్మవితరణంబున
గురుకవితతి మనిచి మధురగుణసంగతిచే
సరసులు సరసులక్రియ సు
స్థిరగతిఁ బురి నమరు నచ్ఛజీవనమహిమన్. 331

వ. ఇట్లత్యంతరమణీయంబుగాఁ బురంబు నిర్మించిన. 332

తే. మధుర నున్నజనంబు లేమఱి సుషుప్తిఁ
జెంద వారల ద్వారకఁ జేర్పు మనుచు

యోగివంద్యుండు హరి నిజయోగమాయ
కానితిచ్చిన పదియును నట్ల చేసె. 333

వ. మధురావాసు లందఱు ద్వారకానగరంబున సుఖంబున నుండి రంత ననంతుండు జరాసంధునితోఁ బోర బల రాము నియోగించి తా నయ్యవనునిం దలఁపడి కొండొ కదడవు సమరంబు సేసి యోడిన తెఱంగునం బఱచి ముచికుందుం డను రాజర్షి నిద్రించుచున్న గుహఁ జొచ్చి యం దొక్కకోణంబున డాఁగి యుండె వాఁడును వెను వెంటన తగిలి యాగుహలోని కరిగి నిద్రించుముచికుం దునిం గాంచి ముకుందుండ కాఁ దలంచి. 334

క. ఓరీ యాదవ నాథ
ఘోరాజి యొనర్చి యలసి కూర్కెదవే యీ
దారుణగుహ నాముందట
నేరీతిం బఱవవచ్చు నెఱుఁగవు కంటే. 335

క. అని నిజపదఘాతిచే న
య్యనఘుని దాఁచుటయు వాతఁ డప్పాటున మే
ల్కని యల్గి చూడ వాఁ డం
తన భస్మీభూతుఁ డగుచు ధాత్రిణిఁ ద్రెళ్లెన్. 336

ఉ. అంతట శంఖచక్రధరుఁ
డాయనఘుండఁటుఁ గౌస్తుభప్రభా

క్రాంతదిశాంతుఁ డై నిలువఁ
గన్గొని చాఁగిలి మ్రొక్కి లేచి దై
త్యాంతక కృష్ణ యాదవకు
లాంబుధిపూర్ణసుధామయూఖ శ్రీ
కాంత భవత్పదాబ్జములు
గాంచి కృతార్థుఁడ నైతి నీశ్వరా. 337

వ. అని వెండియు నమ్ముచికుందుండు. 338

తే. జలచరక్రోడహరివటుజామదగ్ని
కమలహితకులబలజినకల్కిముఖ్య
దివ్యమూర్తులు ధరియించి దితిజసమితిఁ
జమపుప్రోడవు నీకు మ్రొక్కెద ననంత. 339

క. వారిధరవర్ణ పరమో
దారా కుక్షిస్థలోక తామరసాక్షా
వారినిధిశయన హరి గిరి
ధీరా రక్షింపు మమ్ము దితిజవిపక్షా. 340

క. కంసాంతకాయ నిర్జర
సంసన్మకుటమణివిహితచరణాయ యదూ
త్తంసాయ మునిమనోబ్జర
రంసాభృంగాయ కృష్ణరాయ నమస్తే. 341

వ. అని వినుతింప మెచ్చి హరి
యమ్ముచికుందునిఁ జూచి నీమనం

బునఁ గల కోర్కెఁ దెల్పు మది
పొందఁగ దుర్లభమైన నిత్తు నా
విని నిను నిట్లు గాంచియును
వెండియుఁ గోరిక యెట్లు గల్గు నో
వనజదళాక్షుఁ డైన నప
వర్గ మొసంగి కృతార్థుఁ జేయవే. 342

వ. అనిన హరి యిట్లనియె. 343

తే. జ్ఞానమునఁ గాని ముక్తి పొసంగనేర
దీవు క్షత్త్రియుఁడవు మృగయావినోద
మహిమఁ బెక్కుమృగంబుల నన్నిఁగొంటి
వకట హింసాపరుండు మోక్షార్హుఁ డగునె. 344

తే. మద్యమాంసాశనులకుఁ బ్రమత్తరాజ
తతికిఁ గైవల్య మబ్బునే ధర్మశీల
శాంతిదాంత్యాదియుతులకు సాత్త్వికులకు
నతులవైరాగ్యమతులకు నబ్బుఁగాక. 345

వ. అది గావున నాదర్శనంబు గల్గుటంజేసి నీకు జన్మాంతరంబున ముక్తి గల్గు నని యానతిచ్చిన నమస్కరించి ముచికుందుండు బదరికాశ్రమంబునకుం జనియె జరాసంధుండును హరిం బరాజితుంగాఁ దలంచి నిజస్థానంబునకుం బోయెఁ గృష్ణుండును రామసహితుండై వచ్చి ద్వారకాపురంబును బ్రవేశించె నంత కలహప్రియుం డైన నారదుం

డొక్కనాఁడు శిశుపాలునొద్దకుం జని సత్కృతుండై
యిట్లనియె. 346

చ. గుణవతియుఁ మనోరమయు
గుర్వనుకూలినియున్ మనోజ్ఞభా
షిణియును సుందరాంగియు సు
శీలయు బాలికయుం బతివ్రతా
మణియును నైన భార్య గల
మానవుఁడే శుభవంతుఁ డట్టి ల
క్షణవతి లేని హీనవరు
జన్మమునిష్ఫల మెన్ని చూచినఁ. 347

సీ. వినుము కుండినపురంబున భీష్మనరపతి
పుత్త్రి రుక్మిణి యను పువ్వుఁబోఁడి
గలదు సాక్షాల్లక్ష్మికై వడి సర్వల
క్షణలక్షితాంగి యక్కాంతఁ బెండ్లి
యై కృతకృత్యుండ వగు మని నారదుం
డెఱిఁగించి చన నమ్మహీశుఁ డపుడ
బంధువర్గంబులఁ బనిచి యక్కన్నియ
నడిగించి తత్సోదరానుమతిని
నెల్లి లగ్నం బనుచు నిశ్చయించి కదలి
తను జరాసంధముఖ్యమిత్రివ్రజంబు

బలసి చనుదేర కుండినపట్టనంబు
చేరి వైవాహికోత్సవశ్రీఁ దనర్చె. 348

వ. నారదుండును రుక్మిణీదేవిసన్నిధికిం జని యిట్లనియె. 349

చ. తగినమగండు నీకు వని
తా మునితాపహరుండు కృష్ణుఁ డా
నగధరుఁ బూర్ణశీతకిర
ణప్రతిమాననుఁ బీతవాసు న
త్యగణితచిద్విలాసు జల
జాయతలోచను బంధమోచనుం
దగ వరియింపు మింక నొరుఁ
బాపకరుణ్ వరుఁ గోర నేఁటికిన్. 350

వ. అనిన విని రుక్మిణి మున్నె కృష్ణునిం గోరియున్నదిగావున
నద్దేవముని కిట్లనియె. 351

క. ద్వారకకుం జని నారద
సారదయాప్రేమ వెలయ జలజోదరుఁ గం
సారిం గృష్ణునిఁ గని నా
కోరిక వచియించి యతనిఁ గూర్పుము నన్నుణ్. 352

తే. ద్విరదపతిఁ గాచె వైకుంఠపురి వసించి
తనిపెఁ దలిదండ్రులను గంసుఁ దునిమివైచి
రావణునిఁ ద్రుంచె జానకీరమణిఁ బ్రోచె
హరికి నన్నుఁ గాచు టరుదె సంయమివరేణ్య. 353

క. అని నిజకుచమధ్యస్థిత
ఘనముక్తాహార మపుడు కంజాక్షుని కి
మ్మని యొసఁగి యనుప నారద
మునియుం ద్వారకకు నేఁగె మోద మెలర్పన్. 354

ఉ. నీరజబంధుబింబకమ
నీయతనుద్యుతి చెంగలింప న
న్నారదుఁ డేఁగుదెంచి యదు
నందనుఁ గన్గొని యర్ఘ్యపూజ లిం
పారఁగఁ గాంచి రుక్మిణికి
నాత్మఁ బొసంగినకోర్కెఁ దెల్పి తా
నారమణీమణిప్రహిత
హార మొసంగె సుదారవైఖరిన్. 355

ఉ. హారియును గంఠదేశమున
నామణిహారముఁ దాల్చె రుక్మిణీ
తరుణిఁ గవుంగిలించినవి
ధంబునఁ దత్తరళోత్తమంబు త
ద్గురుకుచకుంభసంకుమద
కుంకుమపంకసుగంధబంధుర
స్ఫురణము నొందుటన్ విరహ
పుష్కలతాపము దీఱఁజేయఁగన్. 356

ఉ. ఆమునివర్యుఁ డంత జల
జాయతలోచనుతోడఁ బల్కె న
బ్భామిని నగ్రిజుండు శిశు
పాలుని కీయఁ బ్రతిజ్ఞసేయఁ దా
నామున నట్లు పెండిలికి
నాయితమై యతఁ డేఁగె నోయదు
గ్రామణి సంతసంబున జ
రాసుతముఖ్యనృపాలకోటితోన్. 357

తే. దేవ యాచంద మెఱిఁగి యాదేవి యొక్క
పలుకు నీ కెఱిఁగింపంగఁ బనిచె నవిన
హరికి నప్పల్కు వినుతమి యలమెఁ బతికిఁ
దరుణిపలుకులు భువిసుధాధార లగుట. 358

సీ. దండకాటవిలోన దయ నానతిచ్చిన
పలుకులు వాటింపు పద్మనాభ
కులదేవయాత్రకై గుడికి నే తెంచి నే
నంబికఁ బూజింతు నప్పు డరసి
కడిఁది సింగము జంబుకమ్ములఁ బోఁదోలి
యాత్మభాగము గొనునట్లు వచ్చి
భూపాలకుల నెల్లఁ బోఁద్రోలి నన్నుఁ బ
రిగ్రహింపుము దేవ రేప వచ్చి

యనుచు సద్దేవిసందేశ మమరమాని
దెలుపఁ బులకాంచితాంగుఁ డై జలజనేత్రుఁ
డపుడు గరుడనిపై నెక్కి యతఁడుఁ దానుఁ
జనియెఁ గుండినపట్టనంబునకుఁ బ్రీతి. 359

తే. అంత బలరాముఁడును జతురంగసైన్య
కోటి గొలువఁగ వెన్నునిఁ గూడ నరిగెఁ
గృష్ణుఁ డవ్వార్త యపుడు రుక్మిణికిఁ దెలుప
నారదునిఁ బంచి కుండినసగరి సొచ్చె. 360

క. వనజేక్షణునకు నెదురుగఁ
జని తోడ్తెచ్చెన్ విదర్భజనపతి వినయం
బునఁ దనుఁ గృతకృత్యునిఁగా
మనమునఁ దలపోయుచును సమగ్రప్రీతిన్. 361

సీ. అభ్రంకషస్ఫటికాశ్మవప్రంబుచే
విధుమణిప్రాసాదవితతిచేత
జాతరూపనిబద్ధసదనబృందంబుచే
నవ్యముక్తావితానములచేత
నాగవల్లీదళపూగీఫలాళిచే
రమణీయమణితోరణములచేత
బహువిళవస్తుసమృద్ధిపణ్యవీథికలచేఁ
బ్రవిమలకమలాకరములచేత

నందనోద్యానతులితవనములచేత
నమితచతురంగవాహినీసమితిచేతఁ
దత్పురమతల్లి సురపురితల్లి యనఁగ
నంత యదుకాంతు నద్భుతాకాంతుఁ జేసె. 362

తే. దేవమునియును రుక్మిణీదేవితోడ
దేవదేవుఁడు వచ్చిన తెఱఁగుఁ దెల్పి
హర్షవారిధి నోలార్చి నంతఁ బౌర
తరుణు లుత్కంఠ గదుర సౌధమ్ము లెక్కి. 363

ఉ. శ్యామలకోమలాంగు జల
జాతదళాయతనేత్రుఁ గౌస్తుభ
శ్రీమణిశోభితుం బురుష
సింహునిఁ గాంచనవాసు వీరల
క్ష్మీమహనీయుఁ గృష్ణుఁ గని
శ్రీరమణీమణిఁ బోలు రుక్మిణీ
కామిని కీవిభుండు దగుఁ
గాంతయు నీతనిపత్ని గాఁదగున్. 364

తే. ఇద్దఱకుఁ దుల్యసౌందర్య మెంచిచూడఁ
దగినదాంపత్య మిదియ యిద్ధరణిలోన
నీసతీమణిరూపవిలాసలక్ష్మి
కితఁడె తగినమగండు పర్వేందువదన. 365

వ. అని చెప్పికొని రంత హరిరాక విని రాజు లెల్లరు రుక్మి

ణీహరణంబునందు నిరాశులై రి హరియును రుక్మిణిచేసి
నసమయంబు ప్రతీక్షించుచుండె నంత. 366

ఉ. ఆమఱునాఁడు రుక్మిణియు
సర్హావిధిం గయిసేసి యుబ్బునం
గామునిపూజ్యరాజ్యరమ
కై వడి వచ్చెఁ గడానిపల్లకిన్
సామజరాజవాజిభట
సంఘ మసంఖ్యము గొల్చి రా సఖీ
స్తోమసమేతయై త్రిపుర
సుందరిమందిరసీమ చేరఁగన్. 367

సీ. పూర్ణచంద్రోదయఘూర్ణమానార్ణవ
ధ్వనుల వాదిత్రనిస్వనము లెసఁగఁ
బణ్యపుణ్యాంగనల్ ప్రస్తుతు లొనరింప
నన్యోన్యసమ్మర్ద మరయ కాత్మ
సుందరవదనారవిందవీక్షానంద
కందాత్ము లగున్నృపనందనాళి
కట వేత్రహస్తప్రహారవారచ్ఛిన్న
హారముక్తామణుల్ తార లట్లు
వింత గొలుపంగ నయ్యాదుకొంతుఁ దనదు
స్వాంతమున నిడి దేవినిశాంతమునకుఁ

గాంత వచ్చె సఖీజనాక్రాంత యగుచుఁ
గాంతతరలీలఁ గంతుపూబంతివోలె. 368

క. దేవళము సొచ్చి యపు డ
ద్దేవి యుచితనియతి వెలయ దృఢతరభక్తిన్
దేవోపచారముల న
ద్దేవిం బూజించి ప్రస్తుతింపందొడఁగెన్. 369

చూర్ణిక. జయజయానితంబబింబలంబిసింహికానన్దనభ్రమభృ ద్వేణీబంధనిధ్యానయోగసముద్వేగ సమాకులగళత్సుధా రసవతంసితసుధామయూఖరేఖాంశుసంవృతమేదురమేచక కచనిచయభారే ముఖారవిందసౌందర్యకల్లోలినీవలమాన మీనమిథునవిలాస విలోల కర్ణాంతాయతనయనతరంగిత కరుణాసారే సమంతతోవృత కేశపాశధ్వాంతసంతానాభి యాతిప్రతిబద్ధతరుణారుణారుణకిరణోత్తమ లీలా లసత్సీ మంతసిందూరరేఖాపరిధానే, బంధూకప్రసూనారుణ పరిధానే, రాకాశశాంకవిజయనిజసుషమాసమాహృత తత్తీర్రిప్రతాపడంబరవిడంబినాసామౌక్తికశోణమాణిక్య తాటంకప్రభావిభాసితవదనే, సారఘనసారవీటికాపాటల దాడిమీబీజ విలాస భాసురరదనే, ఆతామ్రమరదచ్ఛదా భరణచ్ఛవిచ్ఛటాన్యకారాంగీకృత పార్శ్వద్వయసేవక భావప్రవాళపల్లీతల్లజ శంకాకృదభంగుర పాటలిమ రంగ న్మృదులబాహాలతాకలితే, వరాభయపాశాంకుశవత్కర

తామరసాతిలలితే, సాధకయూథదారిద్ర్యవిద్రావణానల్ప
విశ్రుతైశ్వర్యకల్పనాకల్పవల్లీమతల్లికే, జంభారి కుంభి
కుంభగరిమకుచకుంభభారసమత్పదసన్మధ్యవల్లికే, గభీర
నాభీసరోవర శ్యామరోమావళీ కుల్యాసముద్ధూత డిండీర
ఖండమండలీసౌభాగ్యసందేహకృత్తారహారభూషితే, హ్రా
ల్లేఖామనుపఠనతత్పరమునిజననమస్యాతోషితే, అనంగ
మంగళశంఖలావణ్యధురంధరబంధురకంధరాబద్ధదేవచ్ఛం
దాదిముక్తావళీసమ్మిళితమాంగళ్యసూత్రే, పత్రపాశ్యాగ్ర
పద్మరాగమణిప్రసరత్ప్రభాభ్రమదకోకనదచ్ఛాయాసము
ద్దీపితనిటలభాగాంచన్నేత్రే, రత్నాకరమేఖలాగరిమధురీణ
శ్రోణిఫలకసమంచితరత్నాకర మేఖలాధాళధళ్యరుచికమ
నీయే, చంద్రికాదరహాసభాసురముఖచంద్రశోభారమ
ణీయే, స్తంబేరమశుండాదండవైరనిర్యాతనార్థనిజరూప
వైభవసమాత్తతద్విజయవిభాసిసుస్నిగ్ధరంభాస్తంభసము
ల్లసదూరులతే, సహస్రదళకమలమధ్యాధ్యాసీనసదాశివ
యుతే, జగత్త్రియవిజయోద్యమమకరపతాకశోణమణి
తూణవిభ్రమభృన్మంజుజంఘాప్రకాండే, చండముండా
ద్యఖండాఖండలారిచండదోర్దండఖండనప్రవీణబాణకాండే,
పురందరసుందరీముఖ్య బృందారకదారబృంద చికురనికర
ఘటిత రాజీవరాగమణిగణ నీరాజితాంఘ్రినీరజాత గుంజ
న్మంజుమంజీరవిరాజితే, ద్వాదశదళాంచదనాహతకమల

సపర్యాచతురసమయమతనిరతపరిపూజితే, కలకంఠకుల
కంఠ కాకలీచంచత్పంచమస్వరప్రపంచితవిపంచీక్వణనతా
లోద్భేదరణన్మణికంకణాంకితకరసరసిజకాంతికాంతే, యో
గీంద్రస్వాంతైకనిశాంతే, సుధాసింధుమధ్యభద్రకల్పద్రుమ
రాజిరాజన్మణిద్వీప చింతామణి సుందరమందిర విహారిణి,
శుంభనిశుంభవిదారిణి, శశ్వదనశ్వరవిలాసరంజితమహే
శ్వరి, సకలభువనేశ్వరి తే నమస్తే నమస్తే నమః. 370

ఆ. అనుచుఁ బ్రస్తుతించి యార్య ! నాకార్యంబు
సంఘటింపు మనుచుఁ జాఁగి మ్రొక్కి
కుండినేంద్రతనయ గుడిలోన వెలువడి
వచ్చె మెచ్చి యెల్లవారుఁ జూడ. 371

క. అటమున్నె రామకృష్ణులు
చటులధ్వజినీకదంబసహితులు బగుచు న
చ్చట నిల్చిరి ద్వారదశను
త్కటగతిఁ దడాఁ (?) జకన్యకాగ్రహణేచ్ఛన్. 372

ఆ. తరుణి మరలి వచ్చుతఱిఁ జూత మనుచు రా
జన్యు లెల్ల నాత్మసైన్యసమితి
గొలువ నిలిచి రంత మొలుపుగఁ దోలకరి
మెఱుపుచంద మమర మెలఁత వచ్చె. 373

మత్త. వ్యోమయానము లెక్కి నిర్జర
యూథముల్ గగనస్థలిం

ప్రేమ నిల్చి కనఁగ సురారివి
భేది కృష్ణుఁడు రాజక
న్యామణిన్ వెసఁ బట్టి తెచ్చి శ
తాంగసంస్థితఁ జేసె న
బ్భూమిపాలకు లెల్ల చిత్రిత
పుత్రికాకృతి నుండఁగన్. 374

ఉ. అప్పుడు చూచి భూమిపతు
లాత్మలఁ గ్రోధ మబాధలీలచే
నుప్పతిలంగ యాదవుఁ డ
యో నృపకన్య గ్రహించె బల్మి నే
మిప్పుడ వీనిఁ జుట్టుకొని
యాతరుణిన్ విడిపింపకున్నచో
నొప్పమి వచ్చు నుగ్రరణ
యోధుల కూరకయుండఁ జెల్లునే. 375

క. గెలిచిన భీష్మకకన్యక
గలుగున్ మడసినను ద్రిదివకాంతలతో ని
చ్చలు చెలిమి గలుగు ఘనకీర్తిఁ
దలఁకఁగ నేమిటికి శూరతరులకు ననికిన్. 376

తే. సమర మొనరింపఁ జాలని క్షత్త్రియుండు
నాత్మకర్మంబు సల్పని యవనిసురుఁడు

కడిఁది పరలోకసౌఖ్యంబుఁ గాంచలేరు
వసుధ నిర్గంధకుసుమముల్ వార కారె. 377

వ. అని సమయంబు చేసికొని యుద్ధంబునకుఁ గవిసి రంత. 378

తే. బలుఁడు గృష్ణునిఁ జూచి యిప్పడఁతిఁ గొనుచు
నీవు ముందఱ నేఁగు మే నిపుడు వీరి
గర్వ మడఁచెద లాంగలాగ్రప్రహతుల
గోరఁ జీరెడు పనికినై గొడ్డలేల. 379

సీ. అని పల్కునంతలో నభియాతివీరులు
గదిసి గదాశూలఖడ్గబాణ
హతుల నొంచుచుఁ జుట్టు నలమిన బలకృష్ణు
లాబలంబులతోడ నని యొనర్చి
యందఱఁ దెగటార్చి యట జరాసుతశిశు
పాలాదినృపతులఁ బాఱఁ దఱిమి
రంతభీష్మకనందనాగ్రణి రుక్మిఁ డ
య్యాదుపతిపై రోష మడర నలిగి
బవర మొనరింప దేవకీపట్టి వాని
గర్వ మడఁగించి పెడకేలు గట్టివైచి
విశిఖ మొక్కటి గొని వాని విశిఖుఁ జేసెఁ
జిఱునగవు మోముఁదమ్మిపైఁ జిగురులెత్త. 380

వ. అప్పుడు రుక్మిణీదేవి హరి వానిప్రాణంబుల కలుగు నని
శంకించి యిట్లనియె. 381

తే. ఈతఁ డపరాధి యగు నైన నితని మనిచి
భ్రాతృభిక్ష నా కొసఁగుము పద్మనేత్ర
సాపరాధుల రక్షించు టరుదు గాక
యనపరాధుల రక్షించు టవని నరుదె. 382

క. అని రుక్మిణి ప్రార్థింపఁగ
వనజాక్షుఁడు వల్కె వీని వైరూప్యయుతున్
గొనిచనియెద ద్వారకలో
ఘనతర కేలీమృగంబుగాఁ జేయుటకున్. 383

క. పాలసుఁడై యీతఁడు శిశు
పాలునకున్ హితముఁ గూర్చి పలుమఱు నన్నుం
గేలి యొనరించె నైనను
బాలింపుదు వీని నీదుప్రార్థన నబలా. 384

వ. ఇట్లు పల్కుచుండె నంత. 385

చ. హలియును నంతలోన నభి
యాతిబలంబులఁ బిల్కుమార్చి యా
జలజదళాక్షుఁ జేరఁ జని
చయ్యన రుక్మినిఁ గాంచి కృష్ణ యి
బ్బలియుని సీగతిన్ వికృత
భావునిఁగా నొనరింపఁ జెల్లునే
యులిపి నటంచు బంధనము
లూడిచె సాంత్వనపూర్వకంబుగన్. 386

వ. ఇంక హరితోడ నెన్నండును విగ్రహింపకు మని యనిపిన
బాణునుం బోయె నంతటఁ గృష్ణుండును రుక్మిణీబలభద్ర
సహితుండై నిజబలంబులు గొలువఁ దనరాకకు నలం
కృతం బైనద్వారవతిం బ్రవేశించి కవిగాయకవంది
మాగధస్తుతిరవంబును శంఖభేరీమృదంగకాహళవీణావేణు
ప్రముఖవాద్యనిస్వనంబును నేకీభవింప నెడనెడ గణికా
సహాసంబులు లాస్యంబు లొనరించుచు నేఁగుదేర
సురలు గుసుమవర్షంబులు వర్షింప నిజమందిరంబున కేఁగు
దెంచి దేవకీవసుదేవులకు నమస్కరించి రుక్మిణిం బరిణ
యంబు గాఁదలంచి యుండునంత. 387

సీ. పాకారిముఖ్యదిక్పాలకుల్ వసువులు
గంధర్వనాగయక్షవ్రజంబు
వామదేవవసిష్ఠవాలఖిల్యసనంద
నాత్రిగౌతమనారదాదిమునులు
నట మేనకానసూయారుంధతీముఖ్య
దివ్యపతివ్రతాస్త్రీగణంబు
చిత్రరేఖాసుకేశీపుంజకస్థలా
రంభాదినిఖిలాప్సరఃప్రతతియు

నవనిఁ గల రాజపుత్త్రులు నవనిసురులు
హరితలంపున వైకుంఠపురసమంబు

నిర్మలము విశ్వకర్మవినిర్మితంబు
నైన ద్వారక కేతెంచి రర్థ్యగతుల. 388

వ. అప్పుడు మహావైభవంబున గర్గాచార్యానుమతుండై కృష్ణుండు రుక్మిణీదేవిం బాణిగ్రహణం బాచరించి యనంతరంబ వైవాహికోత్సవదిదృక్షాసమాగతసురమునిభూసురభూపాలకాదిసకలజనంబుల జాంబూనదాంబరహారమణిభూషణాన్నోదకాదిదానంబులఁ దృప్తులం గావించి యుడుగర లొసంగి నిజస్థానంబుల కనిచి యంత. 389

చ. హరుఁడును గౌరియుం బటి హి
మాద్రియు మేనయు వార్ధియుం సరి
ద్వరయునుబోలెఁ గృష్ణుఁడును
వారిరుహాయతనేత్రి రుక్మిణీ
తరుణియు సంతతంబును ము
దంబునఁ గెళిరసైకలోలతం
గర మనురక్తి సౌఖ్యరమఁ
గాంచి వసించిరి ద్వారకాపురిన్. 390

వ. అనిన నైమిశేయు లనంతరకథావృత్తాంతం బెట్టిదొ
యని యడుగుటయు. 391

శా. దుగ్ధాంభోధినిషంగసంగతపలాం
ధోవిర*రక్షోర్మిసం

* రక్షాశి—పాఠాం.

దిగ్ధాపాటలకైటభారిశర పృ
ధ్వీభృన్మహాకార్ముకా
దృగ్ధామాహతసూనసాయక తను
శ్రీఖండపంకాంకిత
స్నిగ్ధస్వచ్ఛశరీరతోషితభవా
నీమానసాంభోరుహా. 392

చతుర్విధకందము.
గోరాజగమన దురితవి
దారా వారాశితూణ దక్షమఖారీ
తారేశమకుట హార ఫణి
హారా నీరేజకాండహార భవదూరా. 393

స్వాగత. ముగ్ధచంద్రధర ముక్తిద వ్యాఘ్రా
స్ృగ్ధరాపట విరించనశీర్ష
స్రగ్ధరీణ భవజాలతమిస్రా
ప్రాగ్ధరోదయవిభాకరమూర్తీ. 394

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యాదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందు
షష్ఠాశ్వాసము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## సప్తమాశ్వాసము



శ్రీరమణీశ్వరనయనాం
భోరుహపరిపూజితాంఘ్రిపుష్కరనయన
శ్రీరంజితభువనౌఘ యు
మారమణీసంగతాంగ మల్లయలింగా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిమునుల కిట్లనియె నక్కాలంబున సత్రాజిత్తుం డనురాజు సూర్యునిఁగూర్చి పరమదుష్కరం బగుతపంబు సేయం దొడంగె. 2

ఆ. అంబికయును భానుఁ డంబికాసూనుండుఁ
గొలుచువారలకును గోర్కు లొసఁగి
యామయంబు లడఁచి యంతరాయములఁ బోఁ
దోలి మనుపుదురు విశాలకరుణ. 3

ఆ. వేయిమాఱు లాదిగాయత్రి జపియింపఁ
దగు నుపాసకులకుఁ దత్పరమతి
నట్లు సలుపకున్న నమ్మంత్రితతి కుక్కు-
టాగ్రనిహితహేమమట్లు మఱియు. 4

వ. గాయత్రి జపియించి పదంపడి యిష్టమంత్రంబులు జపి
యించిన ఫలదంబు లగు ననంతరంబ హోమంబును విప్ర
సంతర్పణంబును జేయనగుం గావున సత్రాజిత్తుం డట్ల
తత్కర్మంబు లాచరించుచుం దపంబుసల్ప వరదాభయహ
స్తుండును శంఖచక్రాభిశోభితుండును హారకేయూరకిరీట
కుండలాన్వితుండును హిరణ్మయతనుండును నగు
భానుండు ప్రసన్నుండైన దండప్రణామంబు లాచరించి
యిట్లని స్తుతియించె. 5

సీ. గ్రహపతయే హేమకందుకరూపాయ
తిమిరహంత్రే జగద్దీపకాయ
పంకజబంధవే పంకజహస్తాయ
పద్మినీపతయే ప్రభాకరాయ
రవయే రమాధిపబ్రహ్మేశరూపాయ
పరమాత్మనే జగద్బాంధవాయ
శ్రుతిమూర్తయే జగద్ధితచరిత్రాయ ద్యు
మణయే చిదానందమందిరాయ

సమదమం దేహనాశాయ శాశ్వతాయ
సర్వకర్మౌఘసాక్షిణే శర్మదాయ
భాస్కరా యాంఘ్రిపద్మయశస్కరాయ
భానవే లోకచక్షుషే తే నమోస్తు. 6

ఉ. ఒక్కతురంగమంబు మఱి
యొక్కరథాంగము గల్గునట్టితే
రొక్కటఁ బిచ్చుకుం టతిర
యోద్ధతి రొప్పఁగ నంబరస్థలిన్
మక్కువ నేఁగుచుం దివస
మానము తప్పకయుండఁ జేయునీ
యక్కజమైనవింతఁ గొని
యాడఁగ నెంతటివార మయ్యయా. 7

వ. అనుచుం బ్రార్థించిన నద్దేవుండును వరం బడుగు మను
టయు. 8

ఆ. అంగశోషణంబు లగువ్రతములు క్షితి
దానముఖ్యనిఖిలదానవిధులు
యాగయోగతతులు నన్నియుఁ బుత్త్రసం
జననపుణ్యమునకు సాటి యగునె. 9

వ. కావున సంతానం బొసంగు మనిన నట్లకాక యని వరిసే
నుం డనుకుమారుని సత్యభామ యనుకన్యకను శమంత

కమణియును నిచ్చిన సత్రాజిత్తుండును లబ్ధమనోరథుండై
సుఖంబున నుండె నంత. 10

చ. నలినదళేక్షణుండు గణ
నాథునిఁ బూజ యొనర్చి సంతసం
బెలయఁగఁ దచ్చతుర్థినిశి
నిందునిఁ గన్గొని సందియంబునం
గలఁగుచు దేవమౌనివరుఁ
గాంచి గణేశచతుర్థిఁ జంద్రునిం
బెలుచనఁ జూడఁగూడ దని
పెద్దలు పల్కి రదేమి తెల్పుమా. 11

తే. అనిన నారదుఁ డిట్లను నబ్జనాభ
యోగణేశచతుర్థి గణేశుఁ గొలువ
గరిమ నావత్సరమున విఘ్నంబు లణఁగు
నని గణేశుఁ బూజింపుదు రవనిజనులు. 12

చ. నలినదళాక్ష మున్ను గణ
నాయకుఁ డండటుఁ జేయు భక్తిపూ
జలు గొని పాయసాన్నమును
శర్కరయుక్ మఱి లడ్డుకంబులుక్
ఫలములు మోదకంబులు న
పారముగా భుజియించి యంతఁ దా

నలసత నేఁగె మోదకమ్ము
హస్తమ్మునం గొని యల్లనల్లన్. 13

ఆ. బొజ్జ మోవలేక పోవు హేరంబుని
దొనఁగుఁ గాంచి యచ్చతుర్థియందుఁ
దగఁ బ్రదోషవేళ నగియెఁ బక్కున హరి
ణాంకుఁ డపుడు హాస మాఁపలేక. 14

వ. అంత నేకదంతుండు నిజలంబోదరభారంబుఁ గాంచి నవ్వు
టగాఁ దెలిసి యామృగలాంఛనుం గని యోరీ సౌంద
ర్యగర్వంబునం గన్నులుగానక యపహసించితివి గావున
నిన్నుం గనుంగొనినవార లపయశంబునం బొందుదు రని
శపియించె నంత నమరగణంబులు చంద్రశేఖరు సన్నిధికి
నేతెంచి యిట్లనిరి. 15

చ. కరివదనుండు శాప మిడె
కైరవమిత్రున కిప్పు డాతనిం
బొరిఁ గనుఁగొన్న దుర్యశము
వొందు ఘమముం బరమేశ యానిశా
కరుఁ డుదయింపకుండిన జ
గంబులు నాశము నొందుఁ గావునన్
స్థిరకరుణాప్తి నీయుడురుఁ
దీక్షించి ప్రోవుము మమ్ము నందభుక్. 16

ఆ. అనుడు హరునియాజ్ఞ నాశాపవిధికి మ
ర్యాదఁ జేసె నప్పు డచ్యుతుండు
నాగణేశుదినమునందు నిందునిఁ జూచు
వారి కపయశంబు వఱలు ననుచు. 17

వ. అమ్మహాత్ముం డట్లు వ్యవస్థం గల్పించెం గాని శాపనిస్తా
రకోపాయంబు సేయఁడయ్యె నయ్యచ్యుతుండవు నీవ
కావె కావున నీకు దుర్యశఃప్రాప్తి గాఁగలయది భవత్క-
థాకథనంబున జనంబుల కపయశంబు నివర్తించు నని
తెల్పి నారదుం డరిగిన. 18

సీ. అంత సత్రాజిత్తుఁ డంబరమణిదత్త
మణి కంఠమునఁ దాల్చి మధువిరోధి
సభ కేఁగుదెంచిన సభ్యులు తన్మణి
ఘృణికలితాంగు నాన్నృపతిఁ జూచి
వనమాలిఁ గనుఁగొన వచ్చినదినమణి
యని తలపోసి రయ్యదుపతియును
గడు విస్మితాత్ముఁడై కౌస్తుభమణికంటె
నమ్మణిమీఁదఁ బేరాస పూని
దాని నడిగించె నప్పు డుద్ధవునిచేత
నాతఁ డదియును నిత్యంబు జాతరూప
వర్షి యగుటను మది ధనవాంఛ దొరయ
నొసఁగలేఁ డయ్యె నప్పురుషోత్తమునకు. 19

సీ. హరి యొక్కతఱి మృగవ్యార్థం బరణ్యాని
కరిగె రథారూఢుఁ డగుచు నంత
వాసరమణిదత్తవరమణి దాల్చి స
త్రాజితు్తుండును వాజి నెక్కి
చనియె వెంబడిన యాసాయాహ్నమును గూ్రర
మృగముల వేఁటాడి మొగులు పన్ని
పెళపెళ నుఱుముచుఁ బెనువాన గురియ న
వ్వర్షబాధార్తిచే వడఁకునట్టి

నృపభటరథాశ్వమాతంగనికరసహితుఁ
డగుచు నిజపురి కేతెంచె నచ్యుతుండు
నటఁ బ్రసేనుని నొక్కహర్యక్ష మాఁగి
తునిమి యమ్మణిఁ గైకొని చనియె నంత. 20

ఆ. అచ్ఛభల్లనాథుఁ డమ్మణిఁ గొనియె సిం
గంబు నడిచి యంతఁ గపటవృత్తి
నాప్రసేనుఁ దునిమి హరియించె మణి యని
హరికి నింద వఱలె నచట నచట. 21

క. తనకౌస్తుభమణికంటెన్
ఘనమో యీచిఱుతరాయి కమలాక్షునకున్
ధనతృష్ణఁ గొనియె నవనిన్
ధనలోభికి ధర్మమును నధర్మము గలదే. 22

ఆ. ధనముమీఁదివాంఛఁ దల్లిని దండ్రిని
భ్రాతృవృద్ధజనులఁ బరిభవించుఁ
దవిలి నరుఁడు బుద్ధ్యదభ్రాయ మైనకా
యంబు నిత్య మనుచు నాత్మ నెంచి. 23

వ. అని. 24

ఉ. ఈగతి ద్వారకానగరి
నిండుల నిండుల వీథి వీథులన్
నైగమవృద్ధు లెల్ల యదు
నందను నింద యొనర్చుచుండ న
న్నాగశయానుఁడుం దనమ
నంబున నెంతయుఁ గుందుచున్ యదృ
చ్ఛాగతుఁ డైన నారదున
కంజలిచేసి ప్రియోక్తు లొప్పఁగన్. 25

క. లోకంబులఁ గలవార్తలు
మాకుం దెల్పు మన నతఁడు మాధవుతోడన్
నీ కెఱుఁగఁబడనియర్థము
లోకంబులఁ గలదె యఖిలలోకాధీశా. 36

ఉ. ఐనను విన్నవించెదఁ గృ
తాంతసభం గనినట్టివింత ప్రి
జ్ఞానిధి చిత్రగుప్తుఁ డని
శంబు జనంబులపుణ్యపాపముల్

దా నియతిఁ లిఖించు నేఁడ
ద్వారకలోపలిమర్త్యకోటికిం
బూనినపాప మొక్కటి ప్రి
పూజ్యమతిఁ లిఖియించెఁ జెచ్చెరన్. 27

ఆ. జనునిపుణ్యపాపసముదయంబులు ప్రీతి
రాత్రిమును దదీయగాత్రయష్టి
నీడ వోయి తెల్ప నెఱి చిత్రగుప్తుండు
వ్రాయుచుండు ధర్మరాజునొద్ద. 28

క. మణిలోభంబున నతిని
ఘృణుఁడై తునిమెం బ్రసేనుఁ గృష్ణుం డని ప
ట్టణజనులు లేనిపాపము
గణుతించిరి నిన్నుఁ గూర్చి గరుడతురంగా. 29

వ. అట్టిమిథ్యాభిశంసనదురితంబు వారలయింద్రియాధిదేవ తలు ఛాయారూపంబున వసియించి యెఱింగించినఁ జిత్ర గుప్తుండు లిఖియించె నీవు నిమ్మిథ్యారోపణపాపంబు నిర్వాపణంబు సేయందగు నాత్మకృతంబును నారోపితం బును ననం బాతకంబులు రెండు తెఱంగులం బ్రవర్తించు మిథ్యారోపితపాపుండు వ్యవహారదక్షుండు గా నేర్చునే యదియునుంగాక జపాకుసుమసాన్నిధ్యంబున స్ఫటికంబు రక్తవర్ణం బైనయట్లు దురాత్ములసహవాసంబునఁ బురు షుండు గీడొందుఁ గావున నీవును నీదుష్టపరిజనసహవా

సంబు చేసి విశ్వసింపం దగదు వెండియు. 30

తే. వసుధ నల్పున కుత్కృష్టవస్తులబ్ధి
జీవనాశకరంబు ప్రసేనుఁ డడవి
గెడసె మణికారణంబునఁ గేసరియును
సమసె నమ్మణికతన ఋక్షపతిచేత. 31

క. ఆజాంబవంతుచే ని
ర్వ్యాజమతిః దానిఁ దెచ్చి రహిఁ నీ విడఁ ద
దాత్రిజన్మణికతమున స
త్రాజిత్తుఁడుఁ దెగు నిఁక శతధన్వునిచేతన్. 32

వ. ఆశతధన్వుండును నారత్నంబు కారణంబుగా నీచే నిహ
తుం డగు నమ్మణి నిన్నుం జేరఁగలదు బలవద్భాగ్యం
బైన రత్నంబు నీచులం జేరునె యని శుభోదర్కవృత్తాం
తం బెఱిఁగించి నారదుం డరిగె నంత. 33

చ. హరి మఱునాఁడె రేపకడ
యాదవసంఘముతోడఁ జొచ్చి ని
ర్జరముని తెల్పుకేకపది
చాయన యేఁగుచు నయ్యరణ్యముం
గరికిరిసింహఖడ్గవృక
కాసరసంచరణానుగుణ్యముః
దరణికరప్రతారణవి
ధానిబిడాంధతమోగ్రగణ్యముః. 34

ఆ. అట్లు సొచ్చి నిహతు లైనపరిసేనకే
సరులచొప్పుఁ గాంచి జాంబవత్స
దాంకితాధ్వసీమ నల్లన యేఁగి త
ద్బిలముఁ జూచి యచట నిలిచి యంత. 35

వ. నిజాప్తులం గనుంగొని యిట్లనియె. 36

ఉ. ఆయువు నూఱువత్సరము
లందు సగంబు సుషుప్తిచేఁ జెడుఁ
బాయును బాలకస్థవిర
భావములన్ మఱి సాము యౌవన
శ్రీయుతుఁడై వధూమణుల
క్రీడలజాడలఁ జొక్కు నింకఁ దా
నేయెడ నాచరించు నరు
డిద్ధమహామతి ధర్మకర్మముల్. 37

తే. ధర ననాచారరతుఁడైన నరునియాయు
వణఁగు భిద్రఘటాంబువు ననుకరించి
యొగి సదాచారి యపమృత్యువును జయించి
మను శతాబ్దము లమరసమానుఁ డతఁడు. 38

తే. అందఱకు జీవితంబుపై నాస బలియు
నయిన నయశోధురంధరుం డైన నరుని
తనువు వ్యర్థంబు వాఁ డెంతదడవు మనిన
నేమి ధనవంతుఁ డైనను నేమియుఅవు. 39

వ. కావున నాకుం బ్రాపించినదుర్యశంబుఁ బాపికొనుటకు మఱిఁ దే నరిగెద నంధకారబంధురంబును సురాసురాగమ్యంబును నైన యబ్బిలంబు మీకుం జొర నశక్యంబు నారాకఁ బ్రతీక్షించి యుండుం డని వారల నందఱ నచ్చట నిల్పి యబ్బిలంబుఁ జొచ్చి చని జాంబవంతుని ప్రోలు గని యంత. 40

క. సింగము ప్రసేనుఁ దునిమెఁ
సింగంబుం జాంబవంతుచే హత మయ్యెఁ
రంగయినపట్టి! వగవకు
మంగళకర మీశమంతమణి నీయదిరా. 41

చ. అని శిశురోదనప్రశమ
నార్థము పాడిన దాదిపాటఁ దా
విని మది సంతసం బొదవ
వెన్నుఁడు శంఖము మ్రోయఁజేసెఁ ద
ద్ఘనతరనిస్స్వనంబు లయ
కాలఘనాఘనగర్జచందమై
మొనయఁగ జాంబవంతుఁడు స
మున్నతసంశయసంకులాత్ముఁడై. 42

ఉ. ఈనినదంబు నన్ను దయ
నేలినశ్రీరఘురాముశంఖస

ద్ధ్యానము కై వడిఁ శ్రవణ
దారణకారణలీలఁ బొల్చె ము
న్నానినదంబు తా విని ని
జాత్మఁ గలంగి తొలంగి పాతె దు
ర్మ్మాని దశాననుం డమర
మానవిమర్దనకుర్దనుం డనిన్. 43

ఉ. ఆరఘురామదేవుఁడు స
మాగతుఁ డయ్యెనో యంచు నేఁగి యా
శూరుఁడు రుక్మిణీవిభునిఁ
జూచి యమానుషశౌర్యుఁ డితఁ డా
క్షీరసరిద్వరాలయుఁడొ
శ్రీబదరీతరుషండమండితా
గారవిహారియో యొరుఁడు
గాఁ డని విస్మితుఁ డయ్యె నంతయున్. 44

మ. అతనిం గృష్ణుఁడు గాంచి వీఁడు విధిజృం
భారంభవేళాసము
చ్ఛ్రితలీలాజనితుం డఖండితబల
శ్రీశోభితుండై రయో
ద్ధతి హేమాద్రిఁ బ్రదక్షిణించి విజితో
దచ్ఛృంగరాజంబు జా

క్షతలాఘాతములన్ మెలంగు ధర
సెందున్ భగ్నజానుప్రథన్. 45

చ. తతబలగర్వితుం డితని
దర్పము శిక్ష యొనర్ప నేన కా
కితరులచేతఁ గా దనుచు
ఋక్షబలాధిపుఁ డాఁకి యుద్ధ మ
ప్రతిహతశౌర్యదీప్తుఁ డయి
పద్మదళాక్షుఁ డొనర్చె నంతఁ దా
నతఁడును మల్లయుద్ధగతి
నాహరితోడఁ బెనంగెఁ గ్రొవ్వునన్. 46

వ. ఇట్లన్యోన్యవిజిగీష నేకవింశతివాసరంబులు ఘోర యుద్ధం బొనర్చి రంత గోపాలముష్టిఘాతప్రతాడితుండై నొచ్చి భల్లూకనాయకుం డతివిస్మితుండై యితఁడు సాక్షాద్విష్ణుండు గాని ప్రకృతిమనుజుండు గాఁ డని నిశ్చయించి నీ వెవ్వండ వెద్ది కారణంబున వచ్చి తని యడిగినఁ గృష్ణుండు గణేశచతుర్థీచంద్రదర్శనసంభవదుర్యశః పంకసంక్షాళనార్థం బరుగుదెంచితి నని నిజవృత్తాంతం బంతయు వివరించిన నజ్జాంబవంతుండును సంతుష్టమానసుండై జాంబవతి యనుకన్యకామణియు శమంతకమణియు నొసంగి యనుప మరలి ద్వారకకేతెంచి. 47

క. సుత్రామవంద్యుఁ డాహరి
సత్రాజిత్తునకు నొసఁగె సన్మణి కరుణన్
మిత్రామాత్యస్థవిర
శ్రోత్రియబుధబంధునృపతిసూనులయెదుటన్. 48

వ. అప్పుడు సత్రాజిత్తుండును దనమనంబున. 49

ఉ. లోభము క్లేశకారణము
లోభముచేతనె ప్రాణహాని యా
లోభికి దుర్యశం బొదవు
లోభ మనర్థకరంబు లోభి దాఁ
బ్రాభవహీనలీల గురు
బంధుబుధాళిఁ దిరస్కరించుఁబో
లోభసమన్వితుండు భువి
లోఁ గడు నిందితుఁ డౌఁ దలంపఁగన్. 50

క. వైభవము గలిగెనేనియు
లోభికి సౌఖ్యంబు సున్న లోభ మవిద్యా
లాభప్రద మగుఁ గావున
లోభము విడువఁదగు ధరణిలో మనుజవరుల్. 51

వ. అని మున్ను గృష్ణుండు మణి యడిగిన నొసంగ కుండిన
తనలోభంబును నిందించి వెండియు నద్దేవునికారుణ్యంబు
వడయుటకు నుపాయంబు విచారించి. 52

క. దానములలోనఁ గన్యా
దానంబును మేదినీప్రదానము విద్యా
దానము నుత్తమములు దురి
తానీకము నడఁచు నెపుడు నతిఫలదములై. 53

వ. అందు. 54

తే. ఇవల నూఱుతరంబులు నవల నూఱు
తరములును నక్షీణమ పుణ్యతరులఁ జేయు
కన్యకాదాత దత్పుణ్యగణన సేయ
వశమె భూరజ మెన్నంగ వచ్చుఁగాక. 55

తే. మాతృపితృదారకులములమనుజవితతి
కక్షయస్వర్గ మొసఁగుఁ గన్యాప్రదాత
యెన్ని గింజలు తిలరాశి కన్ని వత్స
రములు తాను నాకలోకమున నుండు. 56

క. ఇనమండలపర్యంతము
నెనసినయవరాశి గింజ లెన్ని యగుఁ దా
నను నన్నివత్సరము లు
బ్బునఁ గన్యాదాత త్రిదివమున వసియించున్. 57

వ. ఇంకను.

సీ. ఎవ్వనియాఁరుపు లెల్ల వేదంబులు
వివిధాగమాదిసద్విద్య లెల్ల

నేమహాత్మునిదివ్యనామాంకపఠనంబు
పాపనిర్వాపణప్రాపకంబు
శ్రీకరం బెవ్వానిచిరతరకీర్తి యె
వ్వాఁడు సురమునిబృందవందితుండు
చుళుకాంబుతులసికాదళమాత్ర మొసఁగిన
నెవ్వండు సాయుజ్య మిచ్చుఁ దవిలి

యట్టిపురుషోత్తమునకు విశ్వాధిపతికిఁ
గన్య నిచ్చి కృతార్థతాగరిమఁ గాంతు
ననుచుఁ దనపుత్త్రి సత్యభామాఖ్య నాశ
మంతమణితోడ నొసఁగె శ్రీకాంతునకును. 59

వ. శ్రీకృష్ణుండును సత్యభామాజాంబవతుల మహావైభ
వంబున వివాహం బయ్యె నంత. 60

సీ. దివ్యసంయమిచిత్తభవ్యకంజాతప్ర
భాకరుం డాశ్రితశ్రీకరుండు
దారుకావనమానిదారికామానస
చోరకుం డంహోవిదారకుండు
జగదుద్భవస్థితిసంహారణోదార
కుర్దనుం డంగజమర్దనుండు
జాటజూటకుడుంగసత్సుమాయితవిశా
నాయకుం డపవర్గదాయకుండు

శంకరుఁడు భక్తలోకవశంకరుండు
వారణామరరిపుదర్పవారణుండు
హరుఁడు శ్రీశైలజామనోహరుఁడు ప్రేమ
నాథుకుందునిఁ జూడంగ నరుగుదెంచె. 61

వ. అప్పుడు వివాహవైభవదిదృక్షాసమాగతులైన బ్రహ్మా
దులును పురందరాదిబృందారకబృందంబును నయ్యిందు
ధరునకు వందనంబు లాచరించిరి నందనందనుండును
షోడశోపచారంబుల నద్దేవునిం బూజించె నంత నమ్మహా
దేవుం డందఱం గనుంగొని. 62

సీ. తగ నభోమణి శమంతకమణి సత్రాజి
దవనిపాలున కిచ్చు టాది గాఁగఁ
బద్మాక్షుఁ డీసత్యభామఁ బెండిలియగు
టది తుదిగా నిమ్మహీయచరిత
మెవ్వఁ డేనియును గణేశచతుర్థి మృ
గాంకునిఁ గాంచినయట్టివేళఁ
దతభక్తి నాడువఁ దత్సంబంధదుర్యశః
కలుషంబు వానికిఁ గాక తొలఁగు
ననుచు నానతి యిచ్చిన నమరవరులు
యక్షగంధర్వులును సనకాదిమునులు
నందనందనుఁడును సదానందగరిమఁ
జెంది నుతియించి రప్పు డా శ్రీగిరీశు. 63

వ. అంత నయ్యాశ్వర్యుండొట్టి వేల్పు లందఱును యథేచ్ఛం
జని రని చెప్పి సూతుం డిట్లనియె. 64

ఉ. ఈకథ విన్నమానవుల
కీప్సితము ల్సమకూరుఁ బాపని
ర్మోకవిముక్తి యూఁ జెలఁగి
ముక్తి కరస్థితవర్తి యా మఘా
నీకఫలంబు గల్గు కమ
నీయచిరాయురుపేతులై సుఖ
శ్రీకలితాత్మవర్తన న
శేషశుభోన్నతిఁ గాంతు రుర్వరన్. 65

వ. అని చెప్పి వెండియు నిట్లనియె నట్లు హరి మఱియు
నేవురురాజకన్యకల వివాహంబై ద్వారకానగరంబున
నుండునంత నరకాసురుచేత బాధితులై సురమునిగణం
బులు శరణు నొందినఁ దద్వృత్తాంతం బరుగ నిశ్చయించి
వైనతేయునిం దలంప నక్షణంబ. 66

మ. శరకుందేందుతుషారపారదసుధా
స్వచ్ఛాననాబ్జుండు గ
ర్బురధాత్రీధరతుంగసంహననుఁ డు
త్ఫుల్లాబ్జనేత్రుండు భా
స్కరతేజఃప్రథితుండు తుండనఖశ
స్త్రప్రోజ్జ్వలుం డాశుగ

స్ఫురదుద్యద్గతి నేఁగుదెంచె వినతా
సూనుం డనూనోద్ధతిన్. 67

చ. హరి నరకాసురుం గెలువ
నాయితమై తగ సత్యభామతోఁ
గరుడని నెక్కి కౌస్తుభవి
కస్వరభాస్వరదీధితు ల్విభా
కరకరదీప్తులన్ మలపఁ
గాఁ జని తత్పురపాలకున్ మురా
సురుని వధించె నాబలని
షూదనముఖ్యులు సంతసింపఁగన్. 68

మ. సరసీజేక్షణుఁ డంత భీషణగతిన్
శంఖంబు పూరింపఁ ద
ద్వరకల్పాంతఘనాఘనస్తనితదు
ర్వారారవస్ఫూర్తిచే
ధరణీసూనుఁడు క్రోధదీప్తుఁ డగుచుం
దామోదరుం దాఁకి సం
గరసంక్రీడ యొనర్చె దారుణగదా
ఖడ్గాస్త్రశస్త్రోద్ధతిన్. 69

మత్త. రామరావణులట్ల నిర్జర
రాజవృత్రులయట్ల సం

గ్రామకేళి యొనర్చి రయ్యెదు
రాజదైత్యులు గొంతసే
పామెయిం దగ సత్యభామ ము
రాంతకాజ్ఞ నొనర్చె నా
భూమిపుత్త్రునితోడ యుద్ధ మ
పూర్వవిక్రమవై ఖరిన్. 70

ఉ. అవనితాలలామము ర
యంబున నంబుధరంబు వర్షధా
రావళి యద్రిపైఁ గురియు
నట్లు కదంబకదంబకంబు ల
ద్దేవవిరోధిపైఁ గురియ
దీకొని వాఁడును ఘోరబాణముల్
దేవిపయిన్ వెసం బఱపె
దేవత లచ్చెరు వొంది కన్గొనన్. 71

శా. ఆరామామణి వానిఁద్రుంచుట తృణ
ప్రాయంబుగా నెంచి ప
ద్మారామాధిపునాజ్ఞ లేమి నియతిం
దత్కార్యముల్ మానె భ
ద్రారూఢస్థితి నట్లకాదె ధరఁ బ
త్యాజ్ఞాసముల్లంఘున

ప్రారంభంబు పతివ్రతామణులకున్
భాషావహంబే కదా. 72

సీ. పతియాజ్ఞ దాఁటినసతులపుణ్యం బగ్నిఁ
గార్పాసగిరి యట్ల కాఁగిపోవుఁ
బ్రాణేశు వంచించునది యన్నపానవి
హీనత విధవయై యెపుడుఁ గుందుఁ
బతియె దైవము కులసతులకుఁ దత్సేవ
యిహపరసౌఖ్యంబు లిడుచునుండు
జగతిఁ బాతివ్రత్యసమధికతప మర్థిఁ
దపములలోన నుత్తమతపంబు
భర్తృసేవాదిహీనయై పరగునట్టి
తెఱవఁ బ్రోవంగ నోపఁ డేదేవుఁ డైన
పతియె దైవంబు గురుఁడును బతియె తీర్థ
మతివలకు నొండుధర్మంబు లవనిఁ గలవె. 73

చ. హరియు శరాసనంబుఁ గొని
యానరకాసురుమీఁద మార్గణో
త్కరము నిగుడ్చె వాఁడు నది
గన్గొని వ్యాళగళస్థమైన ద
ర్దురము బుభుక్షఁ దీర్చుకొన
రోయుగతిన్ విజయంబు గోరి ము

ద్గరశరభిండివాలములఁ
గప్పె హరిం గడు మూఢబుద్ధియై. 74

తే. వ్యాళనకులంబు లాఖుబిడాలములును
నాగపంచాస్యములు భేకనాగములును
బోలెఁ బొల్చిరి దానవపుంగవుండు
నబ్జనాభుండుఁ బోరాడునవసరమున. 75

క. శరసంధానము మోక్షము
కరవరలాఘవము యుద్ధకౌశలము నవి
స్మరణంబును నుద్ధతియును
స్థిరతయు ధీరతయు నమరెఁ శ్రీవిభునందున్. 76

మ. కరకంజాంచితశార్ఙ్గకార్ముకము చ
క్రిపరిక్రియం బొల్ప నా
హరి దిగ్భాగగనాంతరాళము శర
వ్యాప్తంబు గావించెఁ ద
చ్ఛరసంధానవిమోక్షణాంతరము లెం
చన్ లేక భూపుత్త్రుఁ డ
చ్చెరువొందెం బెగడొందె దుర్భరబల
శ్రీముక్తుఁ డయ్యెన్ మదిన్. 77

చ. అరుదుగ మేరుమందరహి
మాచలము ల్వెకలించుశక్తిచే

నిరతముఁ గ్రొవ్వినట్టి ధర
ణీసుతుఁ డంబుధివేలవోలె శ్రీ
ధరుని నతిక్రమించుటకుఁ
దానొకయింతయుఁ జాలఁ డయ్యె నా
హరియును జక్రముం దలఁచె
నయ్యసురాధముఁ ద్రుంపఁ బెంపునన్. 78

ఉ. నీరజబంధుకోటికమ
నీయమహామహసీయముఞ్ సహ
స్రారసమన్వితంబుఁ బ్రళ
యానిలతుల్యమహారయోర్జిత
శ్రీరమణీయమున్ దనుజ
శిక్షణదక్షము భక్తలోకమం
దారము నై ప్రసంగిన సు
దర్శనచక్రము వచ్చెఁ జెచ్చెరఞ్. 79

తే. హరి తపం బొనరించిన హరుఁడు మెచ్చి
యాసుదర్శన మొసఁగె నత్యంతకరుణ
నదియు హరిచే నియుక్తమై యసురసమితిఁ
ద్రుంచి తత్కరమున కరుదెంచు మరల. 80

క. చక్రము దారితదానవ
చక్రము శతపత్రనయనసప్తాశ్వసుహృ

చ్చక్రము పాలితధరణీ
చక్రము వేగ చనుదెంచె సాధిష్ఠగతిన్. 81

తే. కృష్ణుఁ డాచక్రి మప్పుడు కేలఁ బట్టి
త్రిప్పుచుఁ ద్రిలోచనునిమాడ్కిఁ దేజరిల్లెఁ
బ్రళయవేళార్కతేజు నాప్రభునిఁ జూచి
జగము లన్నియు భీతిల్లి సంచలించె. 82

ఉ. ఆదనుజుండు యజ్ఞకిటి
యంగనిదాఘపయఃకణాప్తిచే
మేదినిఁ బుట్టెఁ గావున స
మిద్ధబలోద్ధతు వాని సత్యభా
మాదయితుండు పుత్త్రుఁ డని
మన్నక తుంపఁదలంచె నట్ల యౌఁ
గాదె తనూజునైనఁ గృపఁ
గాతురె క్రూరుని ధర్మవర్తనుల్. 83

వ. అప్పుడు నరకాసురుండు శ్రమంబునం గుందక మనఃఖే
దంబుఁ జెందక క్షుత్తృష్ణాలస్యాదిరహితుండై యుద్ధం
బొనరింప నతనిధైర్యస్థైర్యబలమహత్త్వంబులకు మెచ్చి
కృష్ణుం డతనితో నీ కిష్టంబైన వరం బడుగు మిచ్చెద
ననిన నతం డిట్లనియె.

సీ. అపవర్గ మడుగ నే నచ్యుత యది దైన్య
యాచ్ఞాదిగుణముల నబ్బఁగలదె

ధరణి నిష్టాపూర్తధర్మము ల్సేయించి
ఫల మిచ్చి దేహుల భ్రమలఁ బెట్టి
యమ్ముక్తిఁ గాక్షింప నంతరాయము నీవ
చేయుదు వీఁక వేఱ చెప్ప నేల
షండునిఁ గాంచినసతులకుబలె బ్రహ్మ
సంవిదుపయి సురసమితి రోయు

నైన నీచేత హతులైన యట్టివార
లందఱు భవత్పదంబున నధివసింతు
రట్లు గావున ముక్తి నే నభిలషింప
నీదుక్రోధంబె వరమయి నివ్వటిల్లు. 85

సీ. అయినను నొక్కటి యడిగెద నీవు న
న్నేవాసరమున జయించి వెలయు
దావాసరమునఁ దైలాభ్యంగ మొనరించు
నరులకు నెల్లను నరకబాధ
లేకుండ వర మిమ్ము లోకేశ యని పల్కి
నిబిడసాయకవృష్టి నిగుడఁ జేయ
హరియును గుపితాత్ముఁడై చక్రనిహతి న
న్నరకామరారాతిశిరముఁ దునిమె

నంత నచ్చర లెల్ల నాట్యంబు సల్పి
రమరగణములు కుసుమవర్షములు గురిసి

రఖిలదిశలుఁ బ్రసన్నత నతిశయిల్లె
రావణప్రధనావసరమునఁబోలె. 86

వ. అప్పుడు హరివల్లభ యైన భూదేవి సాకారయై చతుర్భుజయును శాలీక్షుప్రముఖసస్యాధిదేవతాసమన్వితయు నై యిందీవరశుకంబులు కరంబులం దనర మత్తమాతంగగమనంబునం జనుదెంచిన మన్నించి కృష్ణుండు తత్పుత్త్రుం డగు భగదత్తునిం బ్రాగ్జ్యోతిషపురంబున కభిషిక్తుం జేసె నంత. 87

తే. ఆశ్వయుజకృష్ణపక్షమహాత్రియోద
శీవిధూదయవేళ నశేషజనులు
చెలఁగి యభ్యంజనక్రియ సేయవలయుఁ
దైలమున నారకవ్యథ దానఁ దొలఁగు. 88

ఆ. ఆదినంబునందు నభ్యంజనము లేని
మూర్ఖజనుఁడు నరకమున వసించుఁ
దైల మబ్బకున్నఁ దద్దర్శనముచేసి
హరి భజించె నేని యఘము అడఁగు. 89

వ. అని లోకోపకారార్థంబుగా మున్ను నరకుండు గోరిన తెఱంగున వరం బొసంగి భూదేవిం బ్రీతాత్మం జేసె నంత నబ్బాదేవత నరకాసురానీతషోడశసహస్రరాజకన్యకల ద్వారకాపురంబునకుం గొనిచని పాణిగ్రహణం

బాచరింపు మని తెల్పిన భగవంతుం డట్లు సమ్మతించి
యానరకాసురునిపురంబుఁ బ్రవేశించె నంత. 90

ఉత్సా. మారకోటిసుందరుం బ్రమత్తనాగయానుఁ బం
కేరుహాక్షు విపులవక్షుఁ గృష్ణుఁ గాంచనాంబరున్
నీరదాసితాంగుఁ జూచి నృపకుమారికామణుల్
భూరితేజు నమ్మహాత్ముఁ బొందఁగోరి రాత్మలన్. 91

వ. ఇట్లు మోహించిన పదియాఱువేవురు రాజకన్యలం గొని
కృష్ణుండు ద్వారకాపురంబున కేతెంచి యంత. 92

సీ. యువతుల నందఱ నొక్కలగ్నంబున
నుద్వాహ మగుటకు నుత్సహింప
నావధూమణులకు హాటకాగారముల్
వేవ్వేఱ రచియించె విశ్వకర్మ
నాకమహీజ చింతామణి సురగవి
ప్రముఖవస్తువులతో బలవిభేది
యరుదెంచె బహుసహస్రాంబుజాక్షీమణి
యుగపద్వివాహమహోత్సవాప్తి
నలరునటు కృష్ణుఁ డని విస్మితాత్ము లగుచుఁ
దరలివచ్చిరి స్వర్గపాతాళమర్త్య
వాసు లందఱుఁ దద్వైభవంబు గనఁగ
నఖిలలోకంబులకు ముదం బావహిల్లె. 93

ఆ. హరియు నపుడు గర్గు నాచార్యకృత్యంబు
నడుపు మనిన నతఁడు నాదుశక్తి
కొలఁదిఁ జల్పువాఁడ గోవింద యనిన న
య్యంబుజాయతాక్షుఁ డల్ల నగుచు. 94

ఉ. ఒక్కొకవేదియందుఁ దగ
నొక్కొకగర్గమునిన్ సృజించి తాఁ
గ్రిక్కున నట్ల వ్యాసముని
గౌతమనారదముఖ్యమౌనులన్
బెక్కువగా సృజించి యటఁ
బెంపునఁ దాను బెక్కురూపులై
యక్కజమైనలీల నుప
యామవితర్దిక లెక్క నొక్కటన్. 95

వ. అత్తెఱంగున విశ్వరూపధరుండై యద్దేవుండు షోడశసహ
స్రరాజకన్యకల నేకలగ్నంబునఁ బాణిగ్రహణం బాచ
రించిన నమ్మహిమంబుఁ గాంచి యఖిలదేవమునిగణం
బులు నితాంతవిస్మయాకాంతస్వాంతులై కొనియాడు
చుండె నాసమయంబున నారదుండు తద్వైభవంబు విలో
కించి కృష్ణుం డొక్కరుండు నిందఱు సుందరుల నొక్క
ముహూర్తంబున నేచందంబునఁ బరిణయం బగునో
యని తత్పరీక్షాసక్తిం దిమ్మరుచు వీణాపాణులును గాన
విద్యాప్రవీణులు నతులతేజోధురీణులు నగు ననేకసహ

స్త్రీనారదులం గాంచి విస్మితుండును లజ్జాకలితుండును
ఖిన్నమానసుండును నై పదంపడి. 96

క. తనవీణియ యొకచో ము
న్ననిచినవాఁ డగుట దాని నొగిఁ దెచ్చుటకున్
జని కానఁడయ్యెఁ బ్రీతిగృహా
మున నొక్క తెలుంగురంగు పూనుకతమునన్. 97

ఉ. నారదుఁ డిట్లు శేషభవ
నంబులు గ్రుమ్మరి పెక్కుకృష్ణులన్
నారదులం గనుంగొని మ
నంబున నచ్చెరువంది కుంది ప
ల్మాఱును వీణ యారయుచు
మాటికిఁ జింతఁ గలంగి క్రుంగి దు
ర్వారతరభ్రమార్తుఁ డయి
వచ్చినచోటికె వచ్చెఁ గ్రమ్మఱన్. 98

క. ఏ నారదుండఁ గానో
పూనిననావీణె యెందు వోయెనొ మద్వి
జ్ఞానం బేమయ్యెనొ యని
యానారదమౌని లజ్జ నతిఖిన్నుండై. 99

ఉ. వారిజనాభమందిర ము
వక్రగతిం జొరఁబోయి యొక్కచో

వారక ద్వారపాలకని
వారితుఁడై యట నిల్చి నే నహో
నారదమౌని నన్న, నగి
నారదు లిందు సహస్రసంఖ్య; లో
చోరుఁడ నారదుం డయినఁ
జూపు విపంచి యటంచు వారనన్. 100

చ. మును దనుఁ గాంచి పూజలు స
మున్నతభక్తిని జాలఁ జేయు న
మ్మనుజులు నీచుఁ గన్గొనిన
మాడ్కిఁ దిరస్కరణం బొనర్చుచున్
వినుతియుఁ జేయ కేగఁ గని
విన్నఁదనంబున నబ్జగర్భనం
దనుఁడు చరించుచుండె భవ
నంబుల వెంబడి వీణె యారయన్. 101

ఉ. గానరసైకలోలుఁ డయి
కంజదళాక్షుఁడు పిల్వఁబంచెఁ బ్ర
జ్ఞానిధి! నీదువీణియ వె
సం గొనిర మ్మని యొక్కరుండు స
న్మాన మొనర్చి తన్నిలువ
నారదుఁ డాత్మవిపంచిలేమి ల

జ్ఞానిరతిం దిరస్కరిణి
చాటున నీఁగెను వాఁడు నవ్వఁగన్. 102

తే. అత్తెఱంగున విష్ణుమాయార్ణవమున
మునిఁగి తిరిమ్మరుచుండె నమ్మునివరేణ్యుఁ
డిట్లు సుజ్ఞానవంతులు నెఱుఁగ రనిన
నెట్లు జడమతు లమ్మాయ * నెఱుఁగఁగలరు. 103

వ. అని చెప్పి సూతుం డిట్లనియె. 104

ఉ. ఆతఁడు మున్ను కృష్ణుని మ
హామహిమంబుఁ బరీక్షఁజేసి తా
నీ తెఱఁగయ్యెఁ గావున న
హీనగుణాఢ్యుని నెవ్వఁడేని దు
ర్నీతిఁ బరీక్షసేయు నత
నిం బెడబాయు సమస్తలోకవి
ఖ్యాతియు భూరితేజము న
ఖర్వమనీషయు శ్రీయు నాయువున్. 105

చ. అతిథుల వేదవిత్తముల
నర్థిజనంబుల నార్యవర్యులం
గృతకమతిం బరీక్ష యొన
రించుటకంటెఁ దృణాదిభక్షణ

* నెఱుఁగువారు.—పా. శాం.

ఒకసతి గేహసీమఁ దన
యుం గృప లాలన మాచరించు నొం
డొకసతికిం గృహోపకర
ణోత్కరముల్ ఘటియించు నర్మిలిన్. 109

సీ. ఒకయింటఁ బుత్త్రుని నుపలాలన మొనర్చు
నొకయింట భోజనయుక్తి నొనరు
నొకయింట సుతవివాహోద్యుక్తిఁ దిమ్మరు
నొకయింట మధుమధురోక్తిఁ దనరు
నొకయింట గానరసోత్సాహరసికుఁ డౌ
నొకయింట సుఖనిద్ర యొనరఁజేయు
నొకయింట సద్ద్యూత మబుసుపోకకు నాఁడు
నొకయింట సద్గోష్ఠి * నోలి మెలఁగు
షోడశసహస్రయువతులతోడ నిట్లు
క్రీడలాడుచు నుండె నా కేశవుండు
తన్మహత్త్వ మెఱుంగంగఁ దరమె కవుల
జాదిసురవరులకు సనకాదులకును. 110

క. ఈపావనకథఁ జదివిన
నోపికతో వినిన శుభసమున్నతి వెలయున్
జ్ఞానసముచ్ఛ్రయ ముదగున్
శ్రీపతికారుణ్య మెలయు క్షితి మనుజులకున్. 111

---

*నోలి మెలంగు—పాఠాం.

సీ. అంత బాణాసురు నని గెల్చి తత్పుత్రి
యగునుషాకన్యక నర్హ్వసరణి,
నాత్మపౌత్త్రుండైన యనిరుద్ధునకుఁ బెండ్లి
గావించి యట ద్వారకాపురమున
నక్రూరవసుదేవహాలధరోద్ధవముఖ్య
హితవృద్ధజనపురోహితసమేతుఁ
డై సుధర్మాఖ్య సభాంతరాళంబునఁ
జెలఁగి సింహాసనాసీనుఁ డగుచుఁ

గొలువు గూర్చుండి కవిబుధగోష్ఠి నలరు
నాయదూత్తముఁ బుండరీకాక్షుఁ జూడ
నమరనాయకుపనుపున నరుగుదెంచె
నారదుఁడు గానవిద్యావిశారదుండు. 112

క. ఆనారదునకు వైద
ర్భీనాథుఁడు పూజ యాచరించినఁ బ్రీతుం
డై నుతియించి పదంపడి
యానిర్జరమౌని యిట్టు లనియె మృదూక్తిన్. 113

తే. దేవ శిశుపాలునాజ్ఞచే ద్విజులు మఖము
లాచరింపక దుర్మార్గులైనకతన
క్షుత్పిపాసార్తిఁ గలఁగిరి సురగణములు
తత్పురోడాశభుక్తిచేఁ దనరలేమి. 114

తే. దేవ పంచమహాయజ్ఞతృప్తి లేమి
నఖిలమునిపితృసుర లనాహారకలన
నలఁగిరి ద్విజాళి స్నానసంధ్యావిహీను
లగుచు శ్రుతిస్మృత్యుక్తవిధదూరు లగుటఁ జేసి. 115

క. భూదేవకర్మముల బ్రి
హ్మాదిసురలు తృప్తినొంది యతులితజవస
త్త్వాదిసమన్వితులై రో
గాదు లడఁగి దీప్తదేహు లగుదురు కడిమిన్. 116

ఉ. బాలిశబుద్ధి యైన శిశు
పాలుఁడు వేదవిరుద్ధకర్మలన్
లాలన మాచరించి మద
లంపటవృత్తి మెలంగు దాన దే
వాలయదేవతాప్రతిమ
లర్చ యొనర్చుజనంబు లేమి బ్రా
హ్మాలి మహిం బడెన్ ద్విజు ల
మాన్యత నొందిరి కర్మహీనులై. 117

వ. కావున నప్పాపాత్ముని సంహరించి లోకంబులు రక్షింపు
మని పురందరసందేశం బెఱింగించె యద్దివ్యముని వెం
డియు నాకలోకంబునకుం జనియె నంత సమరసభామ
ధ్యంబున నున్న పాండురాజతని కిట్లనియె. 118

తే. ఓమహాత్మ యుధిష్ఠిరభీమవిజయ
నకులసహదేవనాములు నాదుసుతులు
మున్ను శతశృంగపర్వతమున వసించి
రిపుడు వా రెచ్చటికిఁ జని రెఱుఁగఁజెపుమ. 119

వ. దేహాంతరప్రాప్తుండ నయ్యుఁ బుత్త్రమోహంబుఁ దొ
ఱంగఁజాలకున్నవాఁడఁ గావునం దద్వృత్తాంతంబుఁ
దెల్పు మనుటయు నారదుం డిట్లనియె. 120

సీ. సీతనూజాతు లజాతారిముఖ్యు ల
నూనసంయమిసేవ్యమాను లగుచు
జననీసమేతులై శతశృంగగిరినుండి
కరిపురి కేతెంచి కరము వేడ్క
సురసరిత్తనయవిదురలాలనంబుచేఁ
గురుకుమారులతోడఁ గూడి క్రీడ
లాడుచు నుండి రయ్యవసరంబున వార
లందఱిలోపల ననిలసుతుండు
బలయుతుం డౌటఁ గాంచి నొంపఁగఁ దలంచి
వ్యాళములచేతఁ గఱపించి క్ష్వేళ మిడియుఁ
గృష్ణరక్షితుఁ డగువాని గెలువలేక
యాత్మలోఁ గుందె ధార్తరాష్ట్రాగ్రజుండు. 121

వ. ధృతరాష్ట్రుండును బుత్త్రమోహంబున దుర్యోధనుఁడు
సేయుకృత్యంబులు నివారింపఁడయ్యె నంతఁ గృపాచార్యు

నొద్ద రాజకుమారు లందఱు విలువిద్యఁ గఱచుచునుండి
రయ్యెడ. 122

ఉ. పాండవకౌరవౌఘములు
పట్టణబాహ్యవనాంతరంబునం
గందుకకేలి సల్పునెడఁ
గాంచనరత్ననిబద్ధమైన యా
గందుక మొక్కనూతఁ బడఁ
గాంచి తదుద్ధరణం బొనర్చె ద్రో
ణుం డను విప్రముఖ్యుఁడు ధ
నుష్కలితోరుపృషత్కపంక్తులన్. 123

ఆ. వేదశాస్త్రముఖ్యవిద్యాన్వితుని ధను
ర్వేదవిదుని ద్రోణు నాదరించి
భీష్ముఁ డాత్మపౌత్రబృందంబునకు నెల్ల
కార్ముకాదివిద్యఁ గఱపఁ బనిచె. 124

చ. అతఁడును రాజసూనులకు
నందఱకున్ వివిధాస్త్రశస్త్రసం
తతు లుపదేశ మిచ్చి ప్రథ
మప్రతిబాధ్యులఁ జేసి యంత ను
ద్ధతబల*వంతుఁ డైనద్రుపద
దక్షితిపాలకుఁ బట్టి తేర నం

*వత్తు — పాఠాం.

చితగతిఁ బంచె వీతభట
సింధురసైంధవబంధుకోటితోఁ. 125

తే. తొల్లి తను నవమానించె ద్రుపదుఁ డనుచుఁ
బగ మనంబున నిడి వానిఁ బట్టి తేర
గురుఁడు పనిచినఁ బాండవకురుకుమారు
లందఱుఁ దదాజ్ఞఁ దలమోచి యరిగి రంత. 126

వ. ద్రుపదభూనాథురాజధానియైన కాంపిల్యనగరంబునకుం జని యతనితోఁ బవరం బొనర్చి కర్ణసహితంబుగాఁ బరాజితులై మరల నరుగుదెంచి రంత నర్జునుం డొక్కరుండును ద్రుపదుం బట్టి తెచ్చుటకుం బ్రతిజ్ఞచేసి చని వానితో మహాయుద్ధంబుచేసి యోడించి పెడకేలు గట్టి గురునకు దక్షిణగా నిచ్చిన. 127

సీ. గురుఁడును ద్రుపదుఁ గన్గొని యుల్లసములాడి
విడిచిన నప్పు డప్పుడమిఱేఁడు
కడు లజ్జితుండయి కాననంబున కేఁగి
యచట దుష్కరతపం బాచరింప
హరుఁడు ప్రసన్నుఁడై యడుగుము వర మన్నఁ
గుంభసంభవు గెల్చు కొమరు నొకని
నర్జుననకుఁ బత్ని యగుపుత్త్రి నొక్కతె
నడిగి తద్వరమున ననలకుండ

మున జనించు ధృష్టద్యుమ్నుఁ డనుతనూజుఁ
గృష్ణ యనుకన్యఁ గాంచి ప్రహృష్టచిత్తుఁ
డయ్యె నయ్యింద్రతనయు బాహాపరాక్ర
మంబుఁ గొనియాడి రఖిలజనంబు లుర్వి. 128

చ. కరిపురవాసు లందఱును
కర్ణసుయోధనముఖ్యులం దిర
స్కరణ మొనర్చి యర్జునుని
సాధితసద్గురుకార్యశౌర్యధీ
గరిమ నుతింపఁ జొచ్చిరి ని
కామముదన్వితచిత్తవృత్తులై
కెరలిన వీఁడు నన్నయిన
గెల్చు నటంచుఁ దలంచె ద్రోణుఁడున్.

క. సురసరిదాత్మజుఁ డప్పు డ
న్నరునిభుజాబలమునకు మనంబునఁ దగ న
చ్చెరు వంది నాదుపిమ్మట
నరిసూదనుఁ డితఁడె యనుచు నభినందించెన్. 130

ఉ. ఈవిధి నింద్రసూను నుతి
యింపఁగఁ గర్ణసుయోధనాదియో
ధావళి సిబ్బితి న్నొగిలి
యాతెఱఁగుల్ ధృతరాష్ట్రుతోడ న

త్యావిలచిత్తులై తెలుప
నాతఁడు పుత్త్రిమతానువర్తియై
భావమునం దలంకి యట
పాండుతనూజులఁ జీటి యిట్లనున్. 131

ఆ. భూరితేజులార వారణావతపుర
వరమునకును మీర లరుగుఁ డదియు
నఖిలవైభవాఢ్య మై సస్యసంపూర్ణ
మగుచు ధర్మకృజ్జనాప్తి నలరు. 132

మత్త. వారణావతపట్టణంబు నివాసయోగ్యము మీకు నో
ధీరవిక్రములార మీర లతిత్వరం జని యందు నిం
పారఁ దద్వరరాజ్యపాలనమాచరింపుఁ డనంగ న
వ్వీరు లప్పురి కేఁగి రక్కురువీరవర్యునియానతిన్. 133

సీ. అపుడు సుయోధనుం డతికలుషాత్ముఁడై
సౌబలకర్ణదుశ్శాసనాది
మంత్రిదుర్మంత్రనిమంత్రణ వారణా
వతపట్టణమ్మున జతుగృహములు
రచియింపఁ బనిచె నారాజన్యు లయ్యిండ్ల
నేమఱియున్న దహింపఁదలఁచి
యంత నప్పాండవు లాలక్కయిండ్లలో
నధివసింపఁగ విదురానుమతిని

ఖనకుఁ డొక్కఁడు ధర్మజుకడకు *వచ్చి
కౌశ్రిధకీలితుఁ డైన దుర్యోధనుండు
సేయుదుర్మంత్ర మంతయుఁ జెప్పి వారు
వెలువడఁగ నొక్కబిలము గావించె నచట. 134

వ. కృష్ణాంగారకచతుర్దశినాఁటి నడురేయిఁ దద్బిలద్వారం
బున జననీసహితులైన పాండవుల వెలువరించి ఖనకుం
డరిగెఁ దదనంతరంబ యాలాక్షాగారంబున వారలు
నిద్రించియున్నవార లని తలంచి. 135

చ. తొడరి సుయోధనప్రహిత
దూతజనంబులు తద్గృహంబు లు
బ్బడర దహించి రట్టితెఱఁ
గారసి పౌరులు సంభ్రమించి య
జ్జడమతు లైన సూతసుత
సౌబలకౌరవనాథముఖ్యులం
గడుకొని నిందసేయుచు ని
కామశుగార్తిఁ గలంగి రయ్యెడన్. 136

ఆ. అయుతవంతిసత్త్వుఁ డనిలతనూజుఁడు
నడువలేక నిదుర జడత నొందు
సోదరులను దల్లి నాదట మోచుక
యరిగెఁ జీకటనకె యతిరయమున. 137

* సరిగి—పాఠాం.

చ. అనిలసుతుండు గండున దు
హోవిపినంబున వీతభీతుఁడై
యనిలజవంబునన్ శ్రమము
నాఁకలి దప్పియుఁ జెంద కేఁగెఁ దాఁ
జనునెడ నూరువేగహతి
సాలలతావళి మొగ్గి డిగ్గనం
బొనుఁగుపడం బదాహతుల
బొందునఁ బ్రస్తరపంక్తి నుగ్గుగన్. 138

తే. ఇట్లు యామద్వయంబున నిరువదేను
యోజనంబులు గడచి సూర్యోదయావ
సరమునం దొకవటతరుచ్ఛాయ డించె
నన్నదమ్ములఁ దల్లి నయ్యనిలజుండు. 139

ఉ. అంత హిడింబ నాఁగ నొక
యాసురకామిని యేఁగుదెంచి దు
ర్దాంతబలాఢ్యు భీము నవ
తామరసాయతచారులోచనుం
గంతుమనోహరాంగుఁ గని
కాంతవకుంతనిపీడితాంగియై
చింతఁ గలంగి యాయనకుఁ
జేతులు మోడ్చుచు నల్ల నిట్లనున్. 140

సీ. అనఘ యివ్వని హిడింబాసురుం డనునొక్క
యసుర గలండు నాయగ్రజుండు
భక్షణార్థము మిమ్ముఁ బట్టి తెచ్చుటకు న
న్ననిచిన నిచటికి నరుగుదెంచి
నవయౌవనాంగుఁ గందర్పప్రతీకాశ
లావణ్యగణ్యవిలాసకలితు
నినుఁ గాంచి మోహించి నిలిచితి నాదుప్రా
ణంబులు నీయధీనములు చేసి
కావున మనోజబాధితఁ గావు నన్ను
నిప్పు డాకూరదానవు నేపడంచి
కాననస్థలి నిష్కంటకప్రసిద్ధిఁ
దనరఁ జేయుము నీకు భద్రంబు లాదవు. 141

వ. అని పల్కునెడ. 142

ఉత్సా. అనుజ రాక మసలె ననుచు నసుర గినిసి దాని న
మ్మనుజవరుల నొక్కపెట్ట మన్నిగొనఁగఁ జేర న
య్యనిలసుతుఁడు వానిఁ దాఁకి యతులముష్టిహతుల న
ద్దనుజుతోడఁ బోరుసల్పె ధైర్యశౌర్యశాలియై. 143

వ. ఇట్లు కొండొకదడవు ఘోరయుద్ధంబుచేసి. 144

ఆ. అంత ముద్గరాభిహతి దధికుంభంబు
వగుల నడఁచులీలఁ బవనపుత్త్రుఁ

డశనికల్పముష్టిహతి హిడింబాసురు
* మస్తకంబు వ్రచ్చి మడిపె నపుడు. 145

క. విజయం బీగతిఁ గైకొని
విజయాగ్రజుఁ డగ్రజునకు వినతుం డగుచున్
నిజజననియాజ్ఞచే నా
రజనిచరాంగన వరించి రతిఁ గరఁగించెన్. 146

వ. అప్పు డదియును. 147

మ. అచలప్రాంశువినీలవిగ్రహుని శ
స్త్రాస్త్రౌఘనిష్ణాతుఁ గా
మచరుం బంక్తిశిరోధిసన్నిభు మహా
మాయున్ బలోదగ్రు రా
త్రిచరాగ్రేసరు వజ్రకర్కశతనున్
ధీరున్ గభీరున్ ఘటో
త్కచుఁ డన్ పుత్త్రునిఁ గాంచె భీమువలనన్
ద్రాఘిష్ఠబాహార్గళున్. 148

వ. అంత. 149

చ. జతుగృహము ల్దహించి విల
సద్గతి దూతలు వోయి తెల్ప దు
ర్మతి యగు కౌరవప్రభుఁ డ
మాత్యులు దానును సంతసించెఁ బ్రి

---

* మస్తకం బగల్చి—పా॥ాం.

స్తుతమతు లైన పాండునృప
సూనులసేమము విన్కిఁ జేసి స
న్మతి విదురుండు సంతసిలి
వ్రాల్కె మదిం దడుదంత మంతయున్. 150

సీ. అంత వేదవ్యాసునను శాసనమునఁ బృ
థాత్మజు ల్విప్రవేషాఢ్యు లగుచు
రహి నేకచక్రపురముఁ జేరి యందొక
భూవిబుధాలయంబున వసించి
వేదము ల్చదువుచు విప్రగేహంబుల
భిక్షము ల్దేర నాపృథయు నందు
సగము భీమున కిడి సగము దా రేవురు
భుజియించుచుండ నప్పురజనములు
భసితసంఛన్నపావకప్రతిము లైన
వారిఁ గన్గొని ధాత్రీశాకారధారణ
చతురమతు లైనదేవాంశసంభవు లని
తలఁచి పరమాన్నభిక్షలఁ దనిపి రెలమిఁ. 151

ఆ. అట్లు భీమసేనుఁ డందఱు దెచ్చిన
సరసభుక్తరాశి సాము దినియు
నుండుఁ దృప్తి నొంద కుపవసించినగతిఁ
ధుంధిలుండు గాన దోఁసగు నొంది. 152

సీ. అయ్యగ్రహారంబునందు బకాభిఖ్యుఁ
డసుర యజస్రంబు నవనిసురుల
దినము నిల్వరుస నొక్కనిఁ దిను నవ్వార్త
విని పాండవులు వానిఁ దునుముననువు
మది విచారించి యొక్కదినంబునందు ని
జావాసదుండైన యవనిసురున
కాబకారాధనం బావశ్యకంబైన
యగ్రజానుజ్ఞచే ననిలసుతుఁడు
విప్రపుత్త్రుని మరలించి వివిధభక్ష్య
భోజ్యములు మెక్కి యన్నసంపూర్ణమైన
శకట మారోహణముచేసి చనియె దనుజుఁ
గెడపి భూసురసమితి రక్షింపఁబూని. 153

వ. ఇట్లేలామరీచిరామఠసంస్కృతవ్యంజనాన్వితంబును భక్ష్య
పూర్ణంబును నైన యన్నశకటం బెక్కి చని బకాసుర
స్థానంబు చేరి యయ్యన్నంబు భక్షించుచుండె నాసమ
యంబున. 154

తే. రక్కసుఁడు భీమసేనుతెఱంగుఁ గాంచి
దండతాడితభోగిచందమునఁ గనలి
దండిహరివాయువులలో నొకండు గాని
యితఁడు మనుజుండు గాఁ డని యిచ్చ నెంచి. 155

చ. అడరెడురోషభీషణత
నక్షుల నిప్పుక లుప్పతిల్ల నె
క్కుడు వెసఁ గాలఁ దాఁచుటయుఁ
గొంకక రక్కసుదిక్కుఁ జూడ క
వ్వడముడి యిక్షుఖండము ల
వారణ మెక్కుడు వారణేంద్రుఁడై
వడి మెసవెం దదన్నము ల
వంబును జిక్కకయుండ మెండుగన్. 156

ఉ. ఈవిధి నిష్టమొప్ప భుజి
యించి మహాజవసత్త్వశాలియై
పావని వానిఁ దాఁకి దృఢ
పార్ష్ణిహతిన్ వెసనొంచె నంత న
ద్దేవవిరోధియుం దిరిగి
దీకొనియెం దగ నిట్టు లిద్దఱున్
భూవర! తుల్యవిక్రమతఁ
బోరొనరించిరి భీమవైఖరిన్. 157

వ. ఇత్తెఱంగునం గొంతదడవు మల్లయుద్ధంబు సేసి. 158

మ. వృకతుండుం డతిరోషదీప్తుఁ డయి దో
ర్వీర్యం బవార్యంబుగా
బకునిం గిటణఁగించి గెల్చుగొని వి
పరిస్తుత్యచారిత్రుఁడై

యకలంకస్థిరకీర్తిశాలికి నజా
తారాతిక్రీ మొ్రెక్కి యం
బకు సమ్మోద మొనర్చి తమ్ములను సం
భావించె నెమ్మిం ధరిత్రీ. 159

ఆ. ఏకచక్రనగరి నీగతి ద్విజులకు
హితముఁ గూర్చి వార లెలమి నుండి
రంత దు్రపదనృపతి యాత్మజాతకు స్వయం
వరము సాటఁ బంచె నరవరేణ్య. 160

తే. అమ్మహోత్సవమునకు రాజ్యమునఁ గల్గు
నరవరేణ్యులు కాంపిలీనగరమునకుఁ
జనిరి చతురంగవాహినీసహితు లగుచుఁ
దరుణి వరియించునాసచేఁ దత్తఱమున. 161

సీ. కౌంతేయు లేకచక్రాపురావనిసుర
సహితులై విప్రవేషములతోడ
నన్నార్థు లగుగతి నరుగుచు మార్గమ
ధ్యమున నంగారపర్ణాభిధాను
గంధర్వు నిర్జించి కాంపిలీనగరంబు
చేరి యందొకకుంభకారసదన
మున వసియించి రయ్యనఘులలోన బీ
భత్సునిఁ గాంచి యాబ్రాహ్మణుండు

మఘవసన్నిభుఁ డీతఁ డీమత్స్యయంత్ర
ఛేదనం బొనరించి యీపృథునితంబ
బింబఁ బాంచాలనృపకన్యఁ బెండ్లియాడు
ననుచుఁ బలికిరి తమలోన సార్వజనులు. 162

ఆ. అపుడు ద్రుపదనృపతి యంబరతలమున
యంత్రమత్స్య మొకటి యనువుపఱిచి
తాళతరుసమానధనువును శరములుఁ
జూపి నిఖిలరాజసుతులఁ జూచి. 163

సీ. ఈవిల్లుమోపెట్టి యెవ్వఁడేనియు నేను
మార్గణంబుల యంత్రమత్స్యలక్ష్య
ఛేదనం బొనరించుఁ బేర్మి నాతండె నా
కన్యకు వరుఁ డని కడఁగి పలుక
నృపతు లాకాంతఁ బరిగ్రహింపఁగఁ బూని
యావిల్లుమోపెట్ట నలసులైన
నంత నర్జునుఁ డొకయంబకంబున మత్స్య
యంత్రంబు ఛేదించి యాశుభాంగిఁ
గొనియెఁ దదనంతరమ కర్ణకురుకుమార
ముఖ్యనృపు లోర్వఁజాలక మొనసి ఘోర
భీమవిజయులు తద్వీరబృందములఁ బ
రాజితులఁ జేసి రుగ్రతరాజిలోన. 164

ఉ. ఆవిధి గెల్చి యొక్కఫల
మబ్బె నటంచు నరుండు చెల్ప మీ
రేవురుఁ బంచికొండని య
హీనదయామతిఁ బల్కె యంత రా
జీవదళాక్షిఁ గృష్ణఁ గని
చిత్తమునం గడు విన్ననై పృథా
దేవి దలంకె భీముని యు
ధిష్ఠిరునిం గవలం దలంచుచున్. 165

ఉత్సా. భీమబలులు పాండుసుతులు భిక్ష లెత్తి తేర సా
శ్రీమనోజ్ఞవేషఁ గృష్ణఁ జీటి కుంతి యిందులో
సాము భీమున కిడి శేషమసగము నాలుపాళ్ళుగా
నోమి సేయు మనుచుఁ బల్కె నున్నయార్యవృతం దినన్. 166

క. ఆగుణవతియును నట్లు వి
భాగము లొనరించి యిడఁగఁ బవనసుతుం డి
చ్ఛాగతి భుజియించియుఁ దా
నోగిరమున కాససేయుచుండు బుభుక్షన్. 167

ఉ. వీరలు రాజనందనులొ
విప్రులొ సత్వరలీల నేఁగి నీ
వారసి రమ్మటంచు ద్రుప
దావనిభర్త తనూజుఁ బంప న

వీరవరుండు పాండవుల
వృత్తము మాటుననుండి కాంచి యీ
ధీరులు భూరివిక్రములు
దేవసమాను లటంచు నెంచుచున్. 168

శా. అన్యవ్యూహాభిదానుచింతనము వా
హారోహాణోహావిధుల్
జన్యోపాయము నస్త్రశస్త్రనియతుల్ .
జానొందఁ గౌంతేయు ల
న్యోన్యంబు న్వచియింపఁ బొంచివిని తా
నయ్యామినిన్ వీరు రా
జన్యుల్ భూసురవేషధారు లని ధృ
ష్టద్యుమ్నుఁ డెంచెన్ మదిన్. 169

వ. మీవేషంబుల విప్రత్వంబును భాషావిశేషంబుల రాజ త్వంబును దోఁచుచున్నయది యిట్టియమానుషకర్మకర ణంబు విప్రజాతికిం గలుగునె ధైర్యగాంభీర్యాదిగుణం బులకతన క్షత్త్రియు లగుట సిద్ధంబు మీర లెవ్వ రని యడిగినఁ బాంచాలనందనునకు ధర్మనందనుం డిట్లనియె.170

ఆ. ఏను ధర్మజుండ నీతండు భీముండు
వాఁడు విజయుఁ డల్లవారు కవలు
వినుము జ్ఞాతిజనులు వేధింప విప్రరూ
పమున వెడలి వచ్చితిమి రయమున. 171

విపుడు పవిత్రమయ్యెఁ బర
మేశ్వర నీవరుదేర నటంచు నా
ద్రుపదసుపుత్రికాధిపుఁ డ
దుర్గ్యాని పూజ యొనర్చె వేడుకన్. 176

శా. విద్వద్వందితుఁ డంబుదాసితమహా
వేషుండు గృష్ణాజినా
చ్ఛాద్యాంసుండు సమస్తవేదపటలీ
శాస్త్రార్థసంధారణా
చిద్విద్యావిభవుండు పింగళజటా
శ్రీభాసురాంసుండు కృ
ష్ణద్వైపాయనుఁ డాపృథాత్మజులఁ గా
న న్వచ్చె న్సభోచ్చాటికిన్. 177

శా. పారాశర్యమహామునిన్ ద్రుపదభూ
పాలుండు వీక్షించి స
త్కారం బింపుగఁ జేసి నీదుపదప
ద్మశ్రీపరాగాప్తిఁ జె
న్నారం బావనమయ్యె మద్గృహము ధ
న్యం బయ్యె మద్వంశముల్
నీరాకన్ మునివర్య యంచుఁ బొగడె
న్నిర్ణిద్రహర్షోన్నతిన్. 178

తే. అప్పుడు ద్రుపదుని గన్గొని యమ్మహాత్ము
నింద్రుం డీపాండవేయుల కేప్రకారము
పెండ్లిసేయుము నీపుత్త్రి బేర్మి ననిన
నమ్మహీపాలకుండు సంశయాత్ముం డగుచు. 179

తే. అచ్చెరువు నొంది యిట్లనె నతనితోడ
ననఘ వివాహమునకికిని మాకాడ వెలితుం
గాని యొక్క_నెలంతకుం గాంతు లేవు
రగుట యేయుగములనైన నవనిం గలదె. 180

వ. అనినయెనంతం గృష్ణుండు ద్రుపదున కిట్లనియె. 181

ఉ. మాతృమహోపదేశగరి
మన్ నృప యీవ్రుపసూను లేవురు
న్నీతనుజాతం బెండ్లియయి
నెమ్మిం జూసంగిన నెగ్గు గాదు ము
న్నీతరళాయతాక్షి పతు
లేవురు గల్గం దపంబు సల్పం డా
నీతటి దత్తపంబు ఫలి
యించె వివాహ మొనర్పు మర్మిలిన్. 182

వ. అని యిట్లు. 183

క. కృష్ణద్వైపాయనుండుం
గృష్ణుండును ననుమతింపం గృతి ద్రుపదుం డా

కృష్ణమృగశాబలోచనఁ
గృష్ణ నొసఁగెఁ బాండవులకుఁ గృప చెలువొందన్. 184

ఉ. ఈవిధి ధర్మజప్రముఖు
లేవురు సాత్యవతేయునాజ్ఞచే
ద్రోవదిఁ బెండ్లియై ద్రుపదు
ప్రోలఁ వసింపఁగ నత్తెఱంగు చా
రావళి దెల్పఁగా విని దు
రాత్మకుఁడైన సుయోధనుండు చిం
తావిలమానసుం డయి స
భాంతరసంస్థితుఁడై రయంబునన్. 185

క. ద్రోణకృపభీష్మవిదుర
ద్రౌణిశకునికర్ణసోమదత్తశలాద్య
క్షోణిపాప్రజ్ఞామాత్య
శ్రేణిం గని పల్కెఁ గార్యశీలితమతియై. 186

తే. వింటిరే పాండవులు విప్రవేషధారు
లగుచు ద్రౌపదిఁ బెండ్లాడి రనఁగ వింటి
వారిఁ గెల్చునుపాయంబు మీర లర్థి
మద్హితార్థులై తెలుపుఁడు మనల కిపుడు. 187

వ. అనిన శాంతనవ్వుం డిట్లనియె. 188

క. కృతపుణ్యులఁ బాండవులం
గృతకమతి న్నీవు సేయుకీడ్తు దవులునే

కృతమతులు యతోధర్మ
స్తతోజయ యనంగ వినవె ధరణీనాథా. 189

ఉ. ఎచ్చటఁ బాండవాత్మజు ల
హీనగతిన్ వసియింతు రింపుగా
నచ్చట వర్షము ల్గురియు
నచ్చట భూరుహము ల్ఫలించుఁ దా
నచ్చట భూమి సస్యవతి
యై కడు సొంపగు ధేనుసంఘముల్
నిచ్చలు నచ్చటం బిదుకు
నిర్మలదుగ్ధము లధ్యయస్థితిన్. 190

తే. వితతధనధాన్యసంపద విఱ్ఱవీఁగి
ప్రజలు ధర్మాభినిరతులై బ్రతుకుఁ గాంతు
రఖిలవిప్రులు వేదశాస్త్రానురక్తి
నుండుదురు వారు వసియించునుర్వియందు. 191

సీ. దివిజసన్నిభులు కౌంతేయులు మును నీవు
సేయుకృత్యంబులఁ జిక్కువడిరె
కాంపిలీనగరిలోఁ గలన రుద్రునిగతి
గెలువఁడే నృపతులఁ గ్రీడి యొకఁడ
యతనిశౌర్యంబు నీ కగపడినదియె యి
ట్లత్యంతబాహాబలాఢ్యులైన

యమ్మహామహులకు హరి మాతులేయుండు
సతతంబు భద్రము ల్సంఘటించుఁ
దత్సహాయుంబుకలిమి గంధవహాదీప్త
హుతవహోగ్రపరాక్రమహాభ్యుదయ తేజు
లైరి పాంచాలపతియుఁ గన్యాప్రదాత
యగుట నుజ్జ్వలగతిఁ దత్సహాయుఁ డయ్యె. 192

వ. మఱియును. 193

మ. నరనారాయణు లాదిమాను లరవిం
దపోద్భవప్రార్థనన్
ధరణీభారము వాపఁ బుట్టిరి నితాం
తస్థేమసంశోభితుల్
నరుఁ డప్పార్థుఁడు నందనందనుఁడు నా
నారాయణుం డమ్మహా
పురుషుల్ సౌహృదవృత్తి వర్తిలుదు రిం
పు ల్మించి యన్యోన్యమున్. 194

ఆ. విను సుజాతశత్రుఁ డనఘుఁడు ధర్మజుఁ
డతని కహితవీరు లనిఁ గల్గ
రట్లు గల్గిరేని యభివృద్ధి నొందరు
వానిమహిమ యెన్నవశమె చెపుమ. 195

ఉ. భీముఁడు భీముఁ డాజుల గ
భీరపరాక్రముఁ డర్జునుండు సం

గ్రామవిశారదుం డహిత
గర్వితమాస్త్రఘనుండు చాపవి
ద్యామహనీయుఁ డద్రినిభ
ధైర్యులు మాద్రిసుతు ల్దలంపఁ దా
నామహితాత్ములన్మనుపు
నచ్యుతుఁ డర్మిలి నెల్లవేళలన్. 196

చ. హరి పరమేశ్వరుండు సఖుఁ
డై నిరతంబును బ్రోవ వైభవ
స్ఫురణము గన్నపాండునృప
సూనుల కాపద గల్గనేర్చునే
కురుకుల మింతయున్ మనుపఁ
గోరితివేనియు వారిఁ దెచ్చి సు
స్థిరతఁ బొసంగి యుండు మిటు
సేయక తక్కినఁ గీడగుం దుదన్. 197

వ. అని పల్కిన విని యుధిష్ఠిరపడి కర్ణుం డిట్లనియె. 198

ఆ. భీష్మ నీవు ధర్మబృందంబు లెఱుఁగుదు
గాని తెలియఁగ వితరకార్యగతులు
వృద్ధ వగుట నీకు నిధి ధర్మములు దెల్పు
వేళ గాని యుద్ధకాల మగునె. 199

క. నీయుద్ధనైపుణియుఁ బ్రా
హాయతశక్తియును గాన నరుదే నిప్పుడు కొం

తేయులకు వెఱచితివి నీ
కాయుర్వృద్ధి యగు నింటి కరుగుము వేగన్. 200

చ. వెఱచినవారిమాటలు వి
వేకధురీణులు విందు రెల్ల ము
న్నెఱుఁగమె పాండునందనులఁ
గృష్ణుఁడు న్ద్రుపదుండుఁ దోడుగా
నెఱిఁ జనుదెంచి రేనియును
నే నొకకోలన వారినెల్ల నే
డ్తెఱ నుఱుమాడి వైచెదఁ గ
డిండిమగంటిమి యుల్లసిల్లఁగన్. 201

వ. అనిన యప్పలుకులకుం గనలి కృపాచార్యుం డిట్లనియె. 202

తే. కర్ణ నీ విట్లు వల్కెదె గంగపట్టి
నతనికిని నీకు గిరిసర్షపాంతరంబు
ద్రుపదుఁ బట్టంగ నేఁగిన యపుడు నీదు
శౌర్య మేమూల కరిగె నిజంబు సెప్పుమ. 203

వ. నరపాలపరిషన్మధ్యంబునం బెద్దలం బరిభవింప వలంతివి గాని సంగ్రామరంగంబునఁ బలాయితుండవు గాక ధనుః కౌశలంబు మెఱసి నిలువంగలిగితివే యని పలికినం గ్రోధించి దందశూకంబుగతి రోషించి కానీనుం డిట్లనియె.

ఆ. భూమిసురుఁడ వీ వపూపవిప్రియుండవు
కలదె సభల నీకుఁ గార్య మొకటి

క్రోఁ దు ఖడ్గధారఁ గువలయాధీశ్వరుఁ
డాజ్యధారఁ గ్రోఁ లు నవనిసురుఁడు. 205

మత్త. బాలు బాలుఁడు వృద్ధు వృద్ధునిఁ బ్రస్తుతించుజగంబునన్
జాల వృద్ధుఁడ వౌట నీగతి సంస్తుతించితి భీష్మ నీ
బాలిశత్వము దెల్లమయ్యెఁ గృపా నృపాలసభాస్థలిం
జేరి దేల తలంగు నీకిది పిండివంటలరాశియే. 206

క. అని పలుకుసూతసూతునిఁ
గనుఁగొని దండాహతాహికైవడి నై దీ
గ్గన లేచి ద్రోణి యందఱు
విన నాతనిఁ బల్కె గోపవివశుం డగుచున్. 207

ఆ. వృద్ధసేవ సల్పువిధమును బ్రాజ్ఞత
లేదు నీకు నొక్కలేశ మైన
నోరి! కురునృపాలు ద్వారంబునందుఁ గా
లేయకంబురీతిఁ గూయు దిట్లు. 208

వ. అని పట్టరం బొఱవెఱికి రాధేయుని వ్రేయఁగమకించిన
దుర్యోధనుండు లేచి కృతాంజలియై దేవవ్రతకుంభసంభ
వాశ్వత్థామకృపాదులకుం బ్రియంబుఁ జెప్పి యాకలహం
బు మాన్చె నంత విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 209

ఉ. నీతివిదుండు ధీరుఁ డవి
నింద్యచరిత్రుఁడు వృద్ధసేవి ప్రి

ఖ్యాతబలుండు దేవసతి
దాత్మజుఁ డాయనబుద్ధి విన్కి మే
లౌతటి నీకుఁ బుత్త్రులకు
నెంతయు సౌఖ్యముఁ జెందుఁ గాన నీ
ధాత్రిపతనూజు లైన యల
పాండవులన్ దయఁ దెచ్చు టొప్పగున్.

ఉ. నీతివిదూరుఁ డుద్ధతుఁడు
నింద్యచరిత్రుఁడు వృద్ధదూషకుం
డాత్మతరోపదూషితుఁ డ
సూయ్యతిమంతుఁడు నైనవాఁడు దా
మాతులపుత్త్రుఁ డైన గరి
మన్ సభ కర్ణుఁడు గాఁడు ధారుణీ
నేత తదీయనీతి విని
నెవ్వగలం బొగులున్ ధరాధిపా. 211

క. దండిమనము లింగంబులు
నొండొరులం గలసి బ్రతుకనొప్పన మోదం
బాండవులుఁ గలయ మీరలు
నొండొరులకుఁ దేజ మొనరు నుర్వీనాథా. 212

వ. అని బోధించిన సాంబకేయుఁడు ముహ
ర్షాదంబునుం జెంది శం

తనుసూనుండును నీవు మాకు శుభసం
ధాత్రల్గదా మీరు చొ
ప్పినచందంబునఁ జేయువాఁడ నని సం
ప్రీతాత్ముఁ గావించి యా
ఘనునిం బంచె నపారవిక్రముల వ
క్కౌంతేయులం జేరఁగన్. 213

చ. పనిచిన నయ్యశోధనుఁడు
పాండుకుమారులపాలి కేఁగి య
ర్హనియతిఁ బూజ నొంది ధృత
రాష్ట్రనిదేశ మెఱుంగఁ జెప్పి య
య్యనఘుల దేవకీసుతస
మన్వితులన్ ద్రుపదక్షితీశ్వరుం
డనుమతి సేయఁ దోడుకొని
హస్తిపురంబున కేఁగుదెంచినన్. 214

ఉ. దుందుభికాహళప్రముఖ
తూర్యనినాదము లొక్కపెట్ట మి
న్నంది సమస్తభూధరగు
హాకుహరావళులం బ్రతిధ్వనుల్
గ్రిందుకొనన్ మతంగజతు
రంగ*శతాంగభటాళి గొల్వ సం

* భటావళి గొల్వవచ్చి—పాఠాం.

క్రిందన వైభవంబునఁ బు
రంబు ప్రవేశ మొనర్చి రా నృపుల్. 215

ఉ. ధీయుతు లత్యుదారులు యు
ధిష్ఠిరముఖ్యులు కుంభజన్మగాం
గేయకృపాంబికేయుల క
కృతిప్రమభక్తి నమస్కరించి రా
ధేయసుయోధనాదుల న
తిప్రమదంబున గారవించి తా
రాయెడ నుండి రార్యనిచ
యం బనుకంప బహూకరింపఁగన్. 216

క. ఈతెఱఁగున వారలు కం
జాతాక్షసమేతు లగుచు సభనుండు తఱిన్
నీతివిదుఁడు విదురుఁడు ప్ర
ఖ్యాతఘనశ్రీఁ బలికె నంబికాసుతుతోడన్. 217

సీ. నీతమ్ముఁ డగుపాండునృపసుతుల్ సత్యప్ర
తిజ్ఞులు నీకు విధేయు లుర్విఁ
బ్రాజ్ఞులు దేశకాలజ్ఞులు ధర్మజ్ఞ
లతులపరాక్రము లార్యహితులు
నగుట దజ్జనకాంశ మగురాజ్య మొసఁగి వా
రలఁ గూడి మనుము నిర్వ్యాజకలన

నిది భీష్మగురుకృపకృష్ణముఖ్యులకు స
మ్మతమును ధర్మక్రియంబుఁ దలఁప
గర్ణదుర్యోధనాఘప్రభంజనకలితమై సు
యోధనానల మీయన్వయోరువిపిన
మంతయు దహించుఁ గావున నయ్యరున్నత
బుద్ధి వినక కౌంతేయులఁ బ్రోవు మనఘ. 218

క. కావునఁ గుంతీసుతులకు
నీ వింద్రప్రస్థనగర మిమ్ము సుఖేచ్ఛన్
భూవర తనయాన్వితుఁడ
వై వెలయుము కీర్తిశోభివై విశ్వమునన్. 219

చ. అని విదురుండు దెల్పుటయు
నాధృతరాష్ట్రుఁడు కుంభజన్మశాం
తనవకృపాదిసజ్జనవి
తానము లుల్లసిలంగఁ బాండునం
దనులకు నర్ధరాజ్యము ము
దంబున నిచ్చె ననంతరంబ య
య్యనఘు లశేషబాంధవస
మన్వితులై చని రార్యసమ్మతిన్. 220

క. ఇంద్రవిభవమున నీగతి
నింద్రప్రస్థంబు చేర నేఁగఁగ నదియున్

రుంద్రిమృగాకీర్ణం బై
సాంద్రలతాగుల్మసాలసంవృత మగుటన్. 221

వ. కనుంగొని ధర్మనందనుండు. 222

మ. ధృతరాష్ట్రుం డతికోపదూషితుండు ధా
త్రీభాగదానోపధి
స్థితి నీకానన మిచ్చె జ్ఞాతిజను లి
స్సీ జ్ఞాతిసద్వైభవో
న్నతి సైరింపఁగ నోపువారె పలుకుల్
నవ్యామృతాసారముల్
మతి దీప్తాగ్నియుపో సగోత్రులకుఁ ద
న్మాహాత్మ్యము ల్వింతలే. 223

ఆ. ఇమ్మహోగ్రవిపిన మెట్లు పురంబుగాఁ
జేయువాఁడ ననుచుఁ జింతఁ గలఁగి
యంబుజాయతాక్షు నడిగిన నమ్మహా
పురుషుఁ డనియె ధర్మపుత్రుతోడ. 224

క. నను నెఱిఁగి పూజసల్పిన
యనఘులకున్ వాంఛితార్థకాముల బ్బున్
వినుము నను మించుపాత్రం
బెనయఁగ వేఱొకఁడు గల్గునే విశ్వమునన్. 225

తే. అనఘ మధ్యాహ్నవేళ సమాగతుండ డగు
నతిథి నను గా నెఱుంగు మీ వతనిఁ బూజ

సేయు ధర్మాత్ముఁ డుజ్జ్వలశ్రీసమృద్ధిఁ
బ్రబలు నతిథిని మించుపాత్రంబు గలదె. 226

తే. విభవముకొలంది నొసఁగక వితతలోభ
కలితుఁ డగు మానవుండు దుర్గతులఁ జెందు
మఱియు నాతండు నూఱుజన్మములదాఁక
నతిదరిద్రితచేఁ గుందు నవనినాథ. 227

తే. కొంచెమైనను ఘనమైనఁ గుతిలపడక
పాత్రభూతున కిచ్చుట పాడి మనుజుఁ
డన్నజలదానకుశలవాక్యములఁ దేల్చి
యాచకులయాస దీర్పంగ నగు నృపాల. 228

క. పాత్రప్రదానమహిమ క్ష
మాత్రీశ్వర యల్పమైన దా నధికంబౌఁ
బాత్రంబ నేనె నన్ను న
కృత్రిమగతిఁ బూజసేయు మిచ్చెదఁ గోర్కుల్. 229

చ. అనవుడు వన్యమూలక ఫ
లాజ్యపయోదధిముఖ్యదివ్యవ
స్తునికర మిచ్చి ధర్మజుఁడు
తోయజనాభునిఁ బూజసేసె న
య్యనఘుఁడు ప్రీతుఁడై యపుడ
యామరవర్ధకిఁ జూచి పాండవుం

దనులకు నొక్కపట్టణ ము
దారగతిఁ సృజియింపు మీ వనర్. 230

క. అపు డాతఁడు నింద్రపు
స్థపురము నిర్మించె శిల్పచాతురిచే నిం
ద్రపురవరలక్ష్మి మిగిలిన
యపరిమితశ్రీసమృద్ధి నలరారంగన్. 231

ఉ. హాస్తిపురంబు దానిపది
యూఱవపాలునుఁ బోలకున్న ద
వ్యస్తుసమృద్ధిచే నిదియె
స్వర్గపురం బని సర్వభూభుజుల్
ప్రస్తుతిచేసి రన్నగరిఁ
బాండునృపాలక ! యంత ద్వారకా
వాస్తునియానఁ గైకొని భ
వత్సుతు లందు వసించి రేపునన్. 232

ఆ. అట్టు లప్పురమున ననుపమవైభవ
కలితు లగుచుఁ దనరి రలఘుమహిమ
ధరణినాథ నీదుతనయుల కీజగ
త్రయి నసాధ్య మెద్ది తలఁచి చూడ. 233

వ. అని తెల్పిన నారదునకుఁ బాండురా జిట్లనియె. 234

ఆ. కర్మదూరులకును ధర్మేతరులకు స్వ
ర్గంబు చొరఁగరాదు బ్రహ్మపుత్ర

ధర్మకర్మరతులకు నిర్మత్సరులకును
దత్ప్రదేశకలన దనరు నండ్రు. 235

సీ. బహుళజన్మార్జితపటుపుణ్యలభ్యమై
యమరినయమరలోకమున నైనఁ
దారతమ్యంబునఁ దనరుభోగంబులు
రాజసూయమహాధ్వరంబు సేసి
యమరేంద్రసింహాసనార్ధభాగస్థితిఁ
దగిరె హరిశ్చంద్రధరణివిభుఁడు
ధనమదాంధుండనై తత్క్రతు వొనరింప
కునికి నిర్జరసభ నున్నవాఁడ
నట్లు గావున మత్సుతుం డైనధర్మ
రాజునొద్దకు నీ వేఁగి రాజసూయ
యాగ మొనరింపఁ బనుపు మీ వతని దాన
శక్రునరస వసించెద సంయమీంద్ర. 236

క. అని పాండుఁ డనుప నారద
ముని యింద్రప్రస్థనగరమున కరిగి పృథా
తనయాగ్రణిఁ గనుఁగొని యా
యనఘుఁ జనకునినిదేశ మంతయుఁ దెల్పెన్. 237

క. యమనందనుఁ డపు డాసం
యమశోభితు నాజ్ఞ మౌళి నమరిచి మదనా

గముగతి నలరుచు నయ్యా
గము సేయఁగఁ బూని మానిఁ గని యిట్లనియెన్. 238

ఆ. ఒకఁడు సేయుధర్మ మొనరంగ నన్యున
కెట్లు చెందు నన్మునీంద్రచంద్ర
తలఁప నితరునకును ఫలమిచ్చునేనియుఁ
గర్త కెట్లు ధర్మగరిమ వెలయు. 239

వ. సర్వజ్ఞుండవు నీవుదక్కం దక్కినవా రోప రీసంశయంబు
వాపవే యని యడిగిన నతనికి నారదుం డిట్లనియె. 240

తే. ధర్మసూక్ష్మంబుఁ దెల్పెద ధర్మరాజ
వినుము తథ్యంబు నీపల్కు వేళ యొకఁడు
సేయుపుణ్యంబు లితరులఁ జెంద వైనఁ
దనయుఁ డొనరించు సుకృతంబు జనకుఁ జెందు. 241

చ. తనయుఁడు సల్పుసత్క్రియకుఁ
దండ్రియ కర్త యగుజ్ జగంబునన్
మును పతి భార్యగర్భము స
మున్నతవైఖరిఁ జొచ్చి పుత్త్రుఁడై
జననము నొందుఁ దాసె విల
సద్గతిఁ దండ్రియనూ కుమారుఁడై
పెనుపగు వార లిద్దఱకు
భేదము లేదు తలంచిచూచినన్. 242

తే. దీపమునఁ బుట్టు వేఱొండుదీపమట్లు
జనకువలనఁ దనూజుండు సంభవించు
నట్లు గావున ధర్మాత్ముఁ డైనసుతుఁడు
తండ్రిఁ దరియింపఁగాఁ జేయు ధరణినాథ. 243

క. తనయుం డధర్మరతుఁడై
జనకునిదుర్గతులఁ జేర్చు జనములు సుతులన్
మును పెక్కండ్రం గోరుదు
రనఘా యం దొకఁడు సుకృతి యగునో యనుచున్. 244

క. పాపముసేయరు ప్రాజ్ఞులు
పాప మిహాముత్రవైరి పాపాత్మునితో
నేపొందుఁ జెలిమిచేసిన
యాపురుషుఁడు తత్సమానుఁ డగు నిక్కముగన్. 245

సీ. అఘకర్ముఁ డగువాఁడు యమలోకమున కేఁగి
యందు నారకదుఃఖ మనుభవించి
వెండియు ధరఁ బ్రభవించి తద్వాసన
నెనసి కుందుచు నుండు నెట్లు లనిన
నసిపత్రవనవాసి యగునట్టి మనుజుండు
వికలాంగుఁడై ప్రభవించుఁ జూవె
తప్తతైలకటాహసుప్తుఁ డౌమర్త్యుండు
రాజయక్ష్మఁ గృశించు రాజతిలక

తో యజనాభునిం బిలువ
దూతజనంబులఁ బంచె నర్మిలిన్. 252

తే. ద్వారవతి కేఁగి వారలు వాసుదేవుఁ
గాంచి ధర్మజుఁ డనిపినక్రమము దెల్ప
నపుడు శిశుపాలుపై దండయాత్రసేయఁ
బయనమై యున్కి నెన్నుండు బలునిఁ జూచి. 253

క. ఆర్య సుహృత్కార్యము సుర
కార్యంబును నొక్కసారి గదిరెన్ ధీచా
తుర్యమునఁ దెల్పు మిం దే
కార్యము సేయంగ నగు జగద్ధిత మొనరన్. 254

తే. అనిన విని యాప్రలంబ దైత్యారి వల్కె
నిపుడు శిశుపాలుఁ దెగటార్చు టిదియ మేలు
ప్రబలతరుఁ డగునభియాతి పైని గలుగ
నిదురవచ్చునె కంటికి నీరజాక్ష. 255

క. హాలహాతి నజాండభాండం
బులు చక్కడఁచెద నరాతిఁ బొడుచుట యరుదే
నిలుపుము సేనలఁ జైద్యుం
బొలియించెద నేన యరిగి పురుషప్రవరా. 256

వ. అని పలికిన. 257

క. అద్ధీరవరుని నడిగిన
పద్ధతిఁ దను నడుగఁ గార్యభాగజ్ఞుండై

బుద్ధిం గీష్పతి కైన యగు
నుద్ధవుఁ డిట్లనియె నయ్యదూద్వహుతోడన్. 258

ఉ. అర్కుఁడు తేజముం జలధి
యంబులు గోరినమాడ్కి విశ్రుతో
దర్కమహాఫలజ్ఞుఁడవు
తామరసాయతనేత్ర నీవు మ
త్కర్కశభాషణశ్రవణ
కాంక్ష యొనర్చితె నీదుసన్నిధిం
దర్కకళాపవీణుఁ డగు
దైవతమంత్రియుఁ బల్కనేర్చునే. 259

ఉ. ఐనను నాకుఁ బోలినకి
య న్వివరింతు మఖంబు సేయఁగాఁ
బూనిరి పాండునందనులు
భూనుతవైఖరిఁ దత్క్రియానుసం
ధాన మొనర్చు వే తోళఁడు
దక్షుఁడు గల్గునె నీవుదక్క నీ
మేనమఱందు లార్యజన
మిత్రులు వారలఁ బ్రోచు టొప్పగున్. 260

వ. కౌంతేయులు నీయధీనులు గావున నచ్చటికిం జని తదీయా
ధ్వరకార్యభారంబు వహింపందగు నదియునుం గాక. 261

ఉ. పంకజపత్త్రనేత్రి శిశు
పాలుఁడు నచ్చటి కేఁగుదెంచుఁ గూ
లంకషగర్వదుర్వహాబ
లంబున నిన్నుఁ దిరస్కరించి ని
శ్శంకఁ జెలంగు రాజపరి
షద్గతు నాఖిలచిత్తు మత్తు నా
వంకనె త్రుంపరాదె సుర
వార ముదారముదబ్ధిఁ దేలఁగన్. 262

క. కావున ధర్మజుపాలికిఁ
బోవుట నీతి యని తోఁచెఁ బొలుపొందఁగ నా
భావంబున నట మీఁదట
దేవరచిత్తంబు సర్వదేవప్రవరా. 263

వ. అని తెల్పిన. 264

క. ఉద్ధవుని మెచ్చి లోకశు
భోద్ధవసంధాత పూరుషోత్తముఁ డయ్యా
గోద్ధరణసిద్ధమతిచే
నద్ధర్మజుపాలి కరిగ సామాత్యుండై. 265

వ. అప్పుడు. 266

ఉత్సా. భ్రాతృసహితుఁ డగుచు ధర్మరాజు వాసుదేవు వి
ఖ్యాతభక్తిఁ బూజసల్పి యాగకరణవాంఛ నా

కీతలిం జనించెఁ దన్మహీయధర్మ మీవు సం
ప్రీతి నిర్వహింపు మనుచుఁ బేర్మి వేఁడె నాయనర్. 267

వ. కృష్ణదేవుండును విశ్వంభరాభారహరణంబునకు నిదియె
బీజం బని విచారించి యిట్లనియె. 268

ఆ. అనఘ రాజసూయయాగంబు సేయంగఁ
దలఁచితేని విశ్వధాత్రిఁ గలుగు
నవనిపతుల గెల్చి యరిగొనవలయు ని
య్యదియె ధర్మమునకుఁ గుదురు తలఁప. 269

క. మున్నె జరాసంధనృపుఁ
మన్నిగొనఁగవలయు వాఁడు మడియక నృప నీ
జన్నమున హావిర్భాగము
లన్నిర్జరు లంద రతిభయాన్వితు లగుచుఁ. 270

క. అని పల్కి ధర్మనందను
ననుమతిఁ గొని పవననందనార్జునయుతుఁడై
చనియెఁ భూసురవేషం
బున హరి మగధాధినాథుపొంక మడంపన్. 271

క. అద్వారంబున నరిగి గృ
హద్వారముఁ జేరి యమ్మహాత్ములు మువురుఁ
విద్వన్ముద్ర న్నిలిచిన
దద్వారస్థితుఁడు చెప్పె ధరణిపుతోడఁ. 272

సీ. ఆజరాసంధుఁడు ననిశంబు భూసుర
వరులఁ బూజ యొనర్చువాఁడు గాన
నలరి చిత్తంబునఁ దలఁచె నిట్లని వీరి
వాంఛితార్థము లియ్యవలయు నిపుడ
వైశ్వదేవక్రియావసరసమాగతా
తిథివర్గములయాశ దీర్పఁ బాడి
సమయసంప్రాప్తుల విముఖులఁ గావించు
జీవనంబునకంటెఁ జావు మేలు
లలితమాధుర్యధుర్యఫలంబు లొసఁగి
తరువు లైనను బ్రాణులఁ దనుపుచుండు
నది తదీయస్వభావంబ యాగుణంబు
మాదృశుల కెల్ల బోధింప మతము గాదె. 273
వ. అని తలపోయుచుండె ననిన విని శౌనకుండు సూతున
కిట్లనియె. 274
ఆ. అఖిలధర్మవితతి నవని పై నిలుపంగ
నవతరించినట్టి యంబుజాక్షుఁ
డతిథిపూజ సల్పు నతిధర్మయుతు మగధ
ధేశు నేల దునుమ నిచ్ఛయించె. 275
వ. అని యడిగిన సూతుం డిట్లనియె. 276
సీ. పరదారహరణంబు పరవంచనంబును
నిజకులోచితకర్మనిరసనంబు

సాధిష్ఠసద్బృందసంపరిత్యాగంబు
సంతతదుర్జనసంగ్రహంబు
సకలజగజ్జాలసంక్షోభకరణంబు
భూరినిజోదరపూరణంబు
ననిమిత్తహాసనపాపానుచింతనములు
నిర్దయత్వము వృద్ధనిందనంబు
నెవ్వనికి నైజగుణము లాహీనమనుజుఁ
డెట్టిసుకృతంబు సల్పిన నేపడంగు
భస్మవిన్యస్తహవ్యంబుభంగి యగుచుఁ
గరటిభుక్తకపిత్థంబుకరణి యగుచు. 277

వ. జరాసంధుండు జగత్సంతాపకరుండై దుర్వృత్తిం బ్రవర్తించుఁ గావున నద్దేవునికారుణ్యంబునకుఁ బాత్రుండుగాఁ డయ్యె నది యట్లుండె నట్లుతం డప్పురుషప్రకాండుల డగ్గఱం జని ప్రాంజలి యై యాతిథేయం బైన యిష్టాన్నం బొసంగి సంతుష్టులం గావించెదం గొనుం డని ప్రార్థించిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 278

మ. సురవిద్వేషివి సర్వభూభుజుల సం
క్షోభింపఁగాఁ జేయు ది
ద్ధరకున్ దుర్భరభారభూతుఁడవు మి
థ్యాదృష్టి వీభావణో

త్కారముల్ నమ్మఁగరాదు మాకుఁ గడు నిం
ద్యం బైన నీయన్న మే
కరణిన్ గ్రాహ్యము నీమనం బిరవు ని
ష్కారుణ్యసంపత్తికిన్. 279

తే. సత్కులీనతయును మదుసలితనంబు
సిరియుఁ గలిగిన దుష్టుండు శిష్టుఁ డగునె
సాధుసజ్జనమానసశల్యతుల్యుఁ
డైనమనుజుండు సాధు వెట్లనఁగఁ బరగు. 280

వ. అనిన విని యాతం డిది దానసమయంబు మీకెద్ది గావ
లసిన నిచ్చెద నడుగుం డనినఁ గృష్ణుండు శక్తి గలదేని
మాతోఁ గయ్యం బొనరింపు మని పలికిన నగి వాఁ
డిట్లనియె. 281

శా. మీర ల్విప్రులు శక్తిహీను లధము
ల్మృష్టాన్నసూపాజ్యముల్
గోరంగాఁ దగుఁ గాక మాదృశులతో
ఘోరాజి చేయ న్మదిం
గోరం జన్నె వసుంధరాధిపులతో
క్షోణీసురు లీ్వరలై
పోరం జేఁటుదురే మనం బలఁచినం
బొండింక మీయిండ్లకున్. 282

క. సమరముసేయఁగ నాతో
సము లెందును లేరు మీ రశక్తులు రణరం
గమున న్నిలువ సమర్థులె
యమితబలోదగ్రు నన్ను నాఁగంగలరే. 283

తే. కలహ మొనరించుకోరిక గలిగెనేని
యట్ల కావింతు విప్రవేషాఢ్యు లగుచు
నేఁగుదెంచితి రిందు మీ రెవ్వ రేమి
పనికి నింతయుఁ దెలియంగఁ బలుకవలయు. 284

వ. అనిన వానికిఁ గృష్ణుం డిట్లనియె. 285

ఉ. భీముఁ డితం డితం డహిత
భీముఁడు ఫల్గునుఁ డేను గృష్ణుఁడన్
బ్రేమను రాజసూయ మొన
రింపఁగ దీక్ష వహించె ధర్మజుం
డేము దదాజ్ఞ ని న్గెలువ
నిచ్చటికిం జనుదెంచినార మి
ట్లామఘులీల కెన్నఁ బ్రథ
మాంగము దుర్జనశిక్ష గావునన్. 286

వ. అనిన విని యతండు దండతాడిత భుజంగంబుభంగిఁ
బొంగి యప్పింగచేలునిం గనుంగొని. 287

సీ. ఓహో సుయోధనుం డోకయూ రొసంగిన
బ్రతుకుధర్మాత్మజుపనుపుచేతఁ

జనుడెంచితే నీవు సత్యంబు వలికితి
చనుఁ జను నీకు నజ్జనపతికిని
శమనాత్మజుఁడు నీవు సమరపరాఙ్ముఖు
లెంతయు దుర్బలు లేమి చెప్ప
యుద్ధరంగమున మున్నోడి వెండియుఁ బారెడ
వులఁగూడి నను గెల్వఁ దలఁచితొక్కొ

యహాహా నీసత్త్వ మెఱిఁగినయదియె తలఁప
బాలుఁ డబలుండు నరుఁడు గోపాల వీఁడు
కలను గావింపఁ జాలఁ డొక్కఁడెబలుఁడు
భీముఁ డొకరుండె నాతోడఁ బెనఁగ వలఁతి. 288

క. అని పలికి మగధనాథుం
డనికిఁ బిలువఁ బవనతనయుఁ డాయితమై గ్ర
క్కున నెదిరి పోరెఁ గ్రీడియు
వనజదళాక్షుఁడును హర్షవననిధిఁ దేలన్. 289

తే. సమర మొనరించి రప్పు డయ్యమితబలులు
సమబలంబున భీమవిక్రమనిరూఢి
నమరగణములు వ్యోమయానముల నిల్చి
సమవధానత వీక్షించి సంభ్రమింప. 290

ఉ. ఒండొరుఁ గిట్టి పట్టుచును
నొండొరుఁ బ్రాయుచు డాయుచున్ మహో

ద్దండతలప్రహారహతిఁ
దద్దయు దద్దరిలంగఁ జేసి దో
శ్చండిమఁ జూపుచుక్ మదగ
జమ్ములచందమునం జెలంగి యా
దండిమగ ల్పెనంగిరి మి
థఃపదతాడనపీడనోద్ధతిక్. 291

వ. ఇట్లు ఘోరయుద్ధంబు సేయునెడ. 292

ఉ. గంధవహాత్మజుం డపు డ
ఖండితసత్త్వసమగ్రతక్ జరా
సంధు మహోగ్రకాయము వె
సం బెనువ్రక్కలు చేసి వైచి త
ద్బంధుల కెల్ల సాధ్వసము
దార్కొన బిట్టుగ నార్చె సర్వది
క్సింధురకర్ణము ల్వగులఁ
గృష్ణుఁడు జిష్ణుఁడు సంతసిల్లఁగన్. 293

వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుమేను రెండువ్రయ్యలుగాఁ
జీరివైచె నసంతరంబ వాఁడును జర యనురక్కసిచేత
సంధింపఁబడి లేచివచ్చి. 294

తే. బవర మొనరింపఁ గరువలిపట్టి వాని
నట్లు చీరిన రెండియు నదుకుకొనియెఁ

జెలఁగి పలుమాఱు లీగతిఁ జీరివైవ
నదుకుకొని వాఁడు గ్రిమ్మఱ నని యొనర్చె. 295

వ. అంతఁ బదునొకొండవయుద్ధంబునందు. 296

తే. పవనజుఁడు చూడఁ దృణము చేఁబట్టి చీరి
యవల నీవలఁ బడవైచె నచ్యుతుండు
తత్ప్రకారంబు గని వానితనువుఁ జీరి
వైచె నత్తున్క లీవ లావలగ నతఁడు. 297

వ. అప్పుడు సురలు పరమహర్షంబునఁ గుసుమవర్షంబులు
గురియించుచు నిర్భయంబున వర్తిల్లి రిట్లు విజయంబు
గైకొని విజయాగ్రజుండు తమ్మికొలంకునం గ్రీడించు
మత్తకరిం బురుడించె నంత. 298

చ. అనిలజుచేత నిట్లు మగ
ధావనిపుం దునిమించి తద్గృహం
బునఁ జెఱ నున్నభూపతులఁ
బొల్పమరన్ విడిపించి వాని నం
దను సహదేవుఁ దత్పదము
నం దగ నిల్పి తదీయనూత్నర
త్ననికరముఖ్యవస్తులు ము
దంబునఁ గైకొని శౌరి గ్రక్కునన్. 299

తే. అనిలజార్జునసహితుఁడై యరుగుదెంచి
యమతనూజునిఁ గని మగధాధినాథుఁ

దునుమువృత్తాంత మాద్యంతమును వచింప
హర్షవారిధి నోలాడి యతఁడు వల్కె. 300

సీ. జగదీశ నీకు నసాధ్యంబు గలదె నీ
నిశ్వసితంబులు నిగమవితతి
కర్తవు భోక్తవు గారయితవు నీవ
ఫలదాయకుఁడ వగు ప్రభుఁడ వీవ
నీయనుగ్రహమున నిఖిలాపదలు మున్ను
గడచితిఁ బ్రఖ్యాతిఁ గాంచఁగంటి
రాజసూయమహాధ్వరంబు సేయించి మ
జ్జనకు వాంఛాపూర్తి సలుపు మింక
శంఖచక్రగదాహస్త జలజనేత్ర
భూతభావన భూతేశ పీతవసన
ద్వారకావాస కేశవ వాసుదేవ
నన్ను రక్షింపు మిదె నీకు నతి యొనర్తు. 301

వ. అనిన భగవంతుం డిట్లనియె. 302

ఆ. దుష్టనృపుల నెల్లఁ దునుమక రాజసూ
యాధ్వరంబు సాగ దవనిపాల
యప్రమేయసత్త్వు లవనిపుల్ రావణ
సములు పెక్కు గలరు జగతిలోన. 303

క. ఆరావణుఁ దునుముటకై
శ్రీరాముఁడు రవితనూజుఁ జేపట్టి మనా

సీరసుతుఁ గావాలిం గపి
వీరున్ సమయించె నొక్కవిశిఖముచేతన్. 304

వ. రాఘవుం డవ్వాలిం దున్మించి త్రిలోకవిజయుం డగురావ
ణుండు సమసినవాఁడకా నూఁటడిల్లె నవ్వాలిపరాక్రమాతిశయం బాకర్ణింపుము. 305

చ. వననిధిఁ గ్రుంకి యాప్లవగ
వల్లభుఁ డొక్కట సంధ్యవార్చుచుం
దనపయి డాఁడివెట్టు బల
దర్పితు రావణుఁ జంకఁబట్టి చ
య్యన నిజవాలరోమమున
నంటఁగఁగట్టి రయంబునం జతు
ర్వనధుల ముంచెఁ దత్సుభట
వర్గము దోమలలీలఁ దూలఁగన్. 306

వ. అంతఁ బులస్త్యప్రార్థితుండై యంభోజసంభవుం డారా
వణు విడువు మని వాలిపాలికి నొక్కదూతం బంచిన.

ఆ. ధాత్రిమీఁద నలిగి త్రైలోక మంబుధిఁ
గలుపువాఁడ ననుచుఁ గపివరుండు
తోఁకఁ జుట్టఁబెట్ట దుర్గ్రహిణుండు భీతిల్లి
యరుగుదెంచెఁ దాన యతనికడకు. 308

శా. ఆకంజోద్భవుప్రార్థనంబునఁ బ్లవం
గాధీశ్వరుం డంతఁ ద

ల్లోకోన్మూలనవాంఛ మాని యట యా
లోకేశునర్తిఁ సురా
నీకారిన్ దశకంధరున్ విడిచె నెం
తే విక్రమప్రక్రియం
బాకారిప్రముఖామరౌఘములు దన్
బల్మాఱు గీర్తింపఁగన్. 309

ఆ. పృథులలోమబంధపీడచే జర్జరి
తాంగుఁ డగుచుఁ బోయి యసురభర్త
వెండి సర్వలోకవితతి బాధించె దు
ర్జనుఁడు శిక్షఁ జెంది సాధుఁ డగునె. 310

ఆ. పరవిహింసనంబుఁ బాపవర్తనమును
జగతి ఖలుల కెన్న సహజగుణము
లట పునర్భవంబు నందియుఁ బరహింస
మానలేరు వారు మనుజనాథ. 311

వ. పతివ్రతయైన యతివ పురుషు ననువర్తించునట్లు సాధు
త్వంబును ఖలత్వంబును జన్మజన్మాంతరంబులం బాయక
ప్రాపించు ఖలులకు నిహపరసుఖంబులు దూరంబు లగు. 312

క. ఆరావణుండు రాముని
చే రణమున నిహతుఁ డగుచు శిశుపాలుండై
ధారుణి జన్మించె దురా
చారుండును భూరిసత్త్వసంపన్నుఁడు నై. 313

వ. జరాసంధుండు హతుం డయ్యె శిశుపాలుండు నమసిన
వాఁడుగాఁ దలంపు మింక దుర్యోధనదుశ్శాసనకర్ణ
శకునిశల్యప్రభృతి నరపతు లోకైకకారణంబున
హతు లయ్యెద రనిన విని ధర్మరా జిట్లనియె. 314

ఆ. ఆజరాసుతుండు హతుఁడైనఁ దాదృశ
క్రూరధరణిపతులు కోటి గలరు
వారి నెల్ల గెలువవచ్చు నాయనుజు ల
ప్పనికిఁ బూనఁగలరె పద్మనాభ. 315

వ. అనినం గృష్ణుం డిట్లనియె. 316

శా. రాజవ్యాజమునం జనించు దనుజ
వ్రాతంబులం ద్రుంప నం
భోజప్రోద్భవుచేతఁ బ్రార్థితుఁడనై
పాల్పొంది కృష్ణాఖ్యచే
నే జన్మించితి యాదవాన్వయమున
న్విశ్వేశ్వరుం డైన యం
భోజాక్షుండఁ జుమీ యెఱుంగు మిదె నక్ష
భూపాలచూడామణీ. 317

తే. అజుఁడు సృజియింపఁ బాలనం బాచరింతు
నేను; హరియించు శంభుఁడు నృపవరేణ్య
హరుఁడు నాశక్తిఁ గొని ప్రోచు నరసి జగము
లేను హరుశక్తిచే హరియింతుఁ జూవె. 318

ఉ. అక్షయదివ్యవిగ్రహుల
మైన హరుండును నేను నెప్పుడున్
శిక్షణరక్షణక్రియలు
సేయుచు నుండుదు మర్వ భంగి నీ
రాక్షసరాజరాజి సమ
రంబునఁ గీటకకోటిఁ బోల నే
శిక్షణ మాచరింతు నృప
శేఖర చింతఁ గలంగ నేఁటికిన్. 319

తే. శివునిఁ బూజించి నను వెలిసేయునతఁడు
శివుని దూషించి నన్నుఁ బూజించునతఁడు
తామసులు వార లిరువురు ధరణిలోన
లేదు హరునకు నాకును భేద మధిప. 320

క. ధాత్రీశ కాశికాది
క్షేత్రంబుల నిరువురము వసింపుదు మెలమిన్
సత్రాశనులం బ్రోచి జ
గత్త్రయిఁ గల దుష్టమతుల ఖండింతు మొగిన్. 321

క. శివుఁ డర్జునుండు ధరణీ
ధవ నే నారాయణుండ దైత్యవధార్థం
బవని నుదయించితిమి యి
ట్లవినాభావంబు మాకు నను వగు నెప్రుడున్. 322

వ. అని యానతిచ్చి భగవంతుం డయ్యుధిష్ఠిరానుజుల నలు
పురియందు నిజశక్తి నంధించి దిగ్విజయార్థం బనిచిన. 323

ఉ. నిర్జరరాజనందనుఁడు
నీరదనీలశుభాంగునానతిఁ
దుర్జయసైన్యసంచయము
తోడ నుదీచికి నేఁగి శౌర్యసం
తర్జితవైరివీరు భగ
దత్తునిఁ బోర జయించి తన్మహీ
పార్జితహేమరత్ననిచ
యంబులు గైకొనియెన్ మగంటిమిన్.323

ఆ. అట చనంగఁ గొంద ఱవనిపు లివ్వీరుఁ
డొడరవశమె మనకు ద్రోణుఁ డనుపఁ
బట్టి తెచ్చె నట్టె! పాంచాలనాయకు
నంగరాంగణమున భంగపఱిచి. 325

తే. యంత్రిమత్స్యంబు భేదించి యవనిపతుల
నాజి నోడించి పరిణయం బయ్యెఁ గృష్ణ
నమరపతి ఖాండవం జేర్చె ననుచు భీతిఁ
జెంది కప్పం బొసంగి పూజించి రతని. 326

వ. అంత. 327

ఉ. కొందఱు రాజనందను ల
కుంఠితదర్ప మెలర్పఁ జేరి సం

క్రిందననందనుం దోడరి
కయ్యపు మొనర్చిరి తత్పరాక్రమం
బెందును మున్నెఱుంగమి మ
దేభశతాంగతురంగపంక్తితో
నందఱు నైకమత్యమున
సాహవదోహలతన్ రయంబునన్. 328

ఉ. అర్జునకీర్తిశాలియు న
యానయశౌర్యవిదుండు నైన య
య్యర్జునుఁ డాన్నృపాలకుల
నందఱ ఘోరరణంబులోన వి
స్ఫూర్జితలీలచే గెలిచి
పుష్కలనిష్కమణిప్రతాన మ
త్యూర్జితవృత్తి వారిదెస
నొప్పుగఁ గైకొని యేఁగె గ్రక్కునన్.329

వ. ఇత్తెఱంగున నుత్తరీయు లగు ననేకదేశాధిపతుల నోడిచి యనంతకాంచనమణిగణరాసు లప్పనంబు గొని హిమాచలంబును మానససరోవరంబును నతిక్రమించి యక్షకిన్నరగంధర్వనివాసదేశంబుల కరిగినం దత్రత్యు లగు ద్వారపాలకు లర్జునున కిట్లనిరి. 330

క. మనుజులకుఁ జొర నశక్యం
బనఘా యిద్దేశ మింక నవలఁ జనకు మే

పని కిచటి కరుగుదెంచితి
వినుపింపుము నీదు తెఱఁగు విస్పష్టముగన్. 331

ఆ. అనుడు ధర్మరాజయాగార్థమై దిగ్జ
యంబుసేయ నిటకు నరుగుదెంచి
నాఁడ నర్జునుఁడ ధనంబు దత్ప్రీతిగా
నొసఁగి తద్వశగతి నుండుఁ డీరు. 332

వ. అనిన. 333

ఆ. వారు నుల్లసిల్లి వాసవి కమితహి
రణ్యరత్నరజతరాసు లొసఁగి
రట్లు గెలిచి ధనముపార్జించి యతఁడు ధ
నంజయాఖ్యఁ దనరె నాఁటఁగోలె. 334

వ. ఇత్తెఱంగున నుత్తరదిజ్నరేంద్రుల గెల్చి నరుం డనేకనర
ఖరోష్ట్రకరిహరిశతవాహ్యం బైన ధనంబు దెచ్చినం
జూచి ధర్మజుండు. 335

క. నిజభుజబలమున ధరణీ
భుజులం దుర్జయుల గెలిచి భూనుతగతిచే
విజయము నొందితి గావున
విజయాఖ్యవహింపు మీవు విశ్వములోనన్. 336

వ. అని యతని మన్నించె దదనంతరంబ. 337

ఉ. ధీచరితుం డదభ్రరవి
తేజుఁడు వాయుసుతుండు ధీరతన్

ళ్ళిచికి నేఁగి యందు శిశు
పాలముఖావనిపాలురం దిర్మియా
మాచరులన్ జయించి గిరి
మన్ మణిహాటకముఖ్యవస్తు లు
ర్వీచర *ఖేచరప్రతతి
విస్మయ మందఁగఁ దెచ్చె గ్రక్కునన్.

ఉ. దక్షిణదిగ్జయార్థము ము
దం బడరన్ సహదేవుఁ డేఁగి వి
శ్వక్షితినాథులం దొడరి
వశ్యులుఁగా నొనరించి వారిచే
నక్షయహేమరత్ననిచ
యంబులు గైకొని నీలుఁ డన్ ధరా
ధ్యక్షునిమీఁదఁ బోయిన న
తండును బోరె నవార్యశౌర్యుఁడై. 339

వ. ఇట్లు మాహిష్మతీపురపతి యగునీలుతో మహాయు
ద్ధంబు సేయునెడ. 340

ఆ. అతని యల్లుఁ డైన యగ్నిదేవుఁడు సహ
దేవుసైన్యసమితిఁ దీవ్రశిఖల
నేర్పఁజొచ్చె దాని నెఱిఁగి యవ్వీరుండు
ప్రస్తుతింపఁ దొణఁగెఁ బవనసఖుని. 341

---

* వీరవిప్రతతి—పాఠాం.

ఉ. హవ్యము మోచి తెచ్చి యాజ
రాళికి హాళి నెలంగ నిచ్చుట్లన్
హవ్యవహాఖ్యచే వెలసి
తాగమసంతతి సంతతంబు నీ
దివ్యమహత్త్వలీల గను
తింపఁగ నాహవనీయగార్హప
త్యాఖ్యయదక్షిణానలస
మాఖ్యఁ జెలంగుదు వాశుశుక్షణీ. 342

క. మారుతసఖ నీకు నమ
స్కారము ధర్మజుఁడు సేయు క్రతుకర్మం బిం
పారఁగ భవదర్థమెకా
యారయఁ దద్విఘ్నకరణ మది యుచితంబే. 343

ఉ. అని వినుతింప హవ్యవహుఁ
డప్పుడ మామకుఁ దెల్పి పాండునం
దనునకు రత్నకాంచనవి
తానము లెంతయుఁ బ్రీతి నిచ్చినం
గొని విజయాధ్యుఁడై యతఁ డ
కుంఠితవైభవ మొప్ప లంకకుం
జనిచె దశాననానుజుని
షాలికి నాప్తుల శౌర్యదీప్తులన్. 344

క. ప్రణిధిముఖంబున నానృప
మణి వచ్చుట దెలిసి యమరమాన్యుండు విభీ
షణుఁడు తన*పాలఁ గల ధన
మణినికరము కర మొసఁగె నమంధవిభూతిన్. 345

వ. ఇవ్విధంబున నవాచీదిగ్విజయం బొనరించి సహదేవుం
డును నిజపురంబున కేతెంచె నిట్లనుజానీతదిగ్జయోపార్జి
తానంతకనకమణిరాసులఁ గాంచి యుధిష్ఠిరుం డత్యంత
హర్షితస్వాంతుం డయ్యె నంత. 346

తే. హరియును ననేకధన ముపాయన మొసంగె
నిట్లు సంపన్నుఁడై యాతఁ డీధనంబు
సద్ద్విజాధీన మొనరించి జలజనాభు
యాక్రతుక్రియ తగ నిర్వహింపు మనిన. 347

వ. కృష్ణుం డతనిం జూచి. 348

క. చేయుము క్రతూత్సవం బెడ
చేయక భద్రంబు లెల్లఁ జేకుఱు నీకున్
నీయనుజన్ములు నేనును
ధీయుత ప్రత్యూహసమితి ధృతిఁ దోలంగన్. 349

తే. అనిన ధర్మజుఁ డానందవనధిఁ దేలి
దేవకీనందనునిఁ బ్రస్తుతించి యమ్మ

* పాలఁ గలిగిన — పాఠాం.

హాపురుషునాజ్ఞ నధ్వరాయతనమునఁ బ్రి
వేశ మొనరించె సమధికవిభవ మెసఁగ. 350

ఉ. ఆతతి హృద్యవాద్యనిచ
యంబులు మ్రోయ నమేయధీయుతుల్
గౌతమనారదాత్రిభృగు
కశ్యపకౌశికధౌమ్యముఖ్యవి
ఖ్యాతమహామునీంద్రు లఖి
లాగమశాస్త్రపురాణపారగుల్
ధాతృసమాను లాన్నృపవ
తంసుని దీక్షితుఁ జేసి రిమ్మగన్. 351

తే. పైలధౌమ్యులు హోతలై పరఁగి రందుఁ
జల్పె బ్రహ్మత్వ మప్పరాశరసుతుండు
యాజ్ఞవల్క్యవసిష్ఠాదు లైనమౌని
వర్యు లధ్వర్యులైరి భావంబు లలర. 352

వ. మఱియు వీరలపుత్త్రపౌత్త్రులును శిష్యవర్గంబులును దత్త
త్కార్మకరణతకుం బాలుపడి ర ట్లొందఱుఁ బుణ్యాహంబు
సేయించి యుచితవిధులం బ్రవర్తిల్లుచుండి రంత, 353

మ. అహితాహంకృతిభంజనపరిస్థితబా
హాస్థేమసంపన్నుఁ డౌ
సహదేవుం డపు డుద్ధరాధిపతియా
జ్ఞం దూతలం బంచి యి

మ్మహిపై నాల్గుచెఱంగులం గల జగ
న్మాన్యావనీదేవుల౯
మహిభృద్వర్యుల వైశ్యశూద్రుల నికా
మప్రేమ రావించినన్. 354

వ. ఇట్లు వచ్చిన నానాదేశాగతజననికరంబులు ధర్మరాజు
చేత నుచితసత్కారంబులఁ గాంచి రంత. 355

తే. అపుడు ధర్మజునానతి హస్తిపురికి
నరిగి నకులుండు ద్రోణకృపాదిగురుల
నాపగేయాంబికేయాదు లైన సర్వ
కురుకదంబంబు నెల్లఁ దోడ్కొనుచు వచ్చె. 356

సీ. బహుమణిభూషణంబులు న
పారధనంబులుఁ దెచ్చి యప్పితా
మహధృతరాష్ట్రసూతసుత
మద్రమహీశసుయోధనాదు ల
మ్మహిపతి కిచ్చి యందు గరి
మ౯ వసియింపఁగఁ జూచి యక్కురూ
ద్వహుఁడు సపర్యలం దనివి
వారల నెల్ల బహూకరించుచున్. 357

మఱియు ద్రుపదజయద్రథభగదత్తశిశుపాలాదిమహీపాల
కులును బలభద్రానిరుద్ధబభ్రుసారణసాంబగదసాత్యకి

ప్రద్యుమ్నచారుదేష్ణాదు లైన యదువృష్ణివీరులును
జతురంగబలసంపన్ను లై యేతెంచి రనంతరంబ. 358

ఆ. నర్తకీజనములు నటులును వేనవే
లరుగుదెంచి రమ్మహాధ్వరమున
కంత వారి కెల్ల నభివాంఛితద్రవ్య
సమితి యొసఁగఁ బనిచె శమనసుతుఁడు. 359

సీ. అతులితభక్ష్యభోజ్యాధికారంబున
వడి దుస్ససేనుఁ గట్టడ యొనర్చి
యుర్వీసురావళి నుచితార్చనక్రియఁ
దేలింప గురుపుత్త్రుఁ బాలువెట్టి
యఖిలరాజన్యుల నరసి పూజింపంగఁ
బటుమతి సంజయుఁ బాదుకొల్పి
వివిధకృతాకృతవిజ్ఞానకలనకు
ద్రోణగాంగేయుల దొరలఁ జేసి
రాజు లిడు కానుకలు గొన రాజరాజు
సర్వనియతి నియోగించి యవనిసురుల
కపరిమితదక్షిణ లొసంగఁ గృపునిఁ బనిచె
నఖిలధర్మవిదుండు ధర్మాత్మజుండు. 360

వ. మఱియు విదురాదిసుహృజ్జనంబులం దగువారల నయ్యై
పనుల నిలువ నియమించి భూసురుల కనేకశతసహస్ర
యుతధేనుమణికనకాన్నదానంబు లొసంగుచు యథోక్త

విధి రాజసూయం బాచరించె నిట్లు దినపంచకంబును
గడచినయనంతరంబ యాంబవదినంబునందు. 361

తే. అఖిలమానివరేణ్యులు నవనిపతులు
సర్వభంగి సమాసీను లైనఁ జూచి
యగ్రపూజ యిం దెవ్వరి కాచరింపఁ
బోసఁగు నని శాంతనవు ధర్మపుత్త్రుఁ డడుగ. 362

వ. అద్దేవవ్రతుం డిట్లనియె. 363

తే. సర్వయజ్ఞమయుండును సర్వగతుఁడు
మానిహ్మాత్మ్యద్మసద్మ్యుండు దానవారి
పద్మనాభుండు దేవకిపట్టి దక్క
వేఱొకఁడు పూజనీయుఁడే ధారుణీశ. 364

వ. కావున సర్వలోకనమస్కృతుండును నిగ్రహానుగ్రహ
దక్షుండును నగు కృష్ణదేవుఁ బూజింపు మనవుడు నట్ల
యద్దేవుం బూజించిన. 365

తే. యమతనయుచేతఁ బూజితుఁ డై విహాయ
సమున గ్రహజాలమధ్యభాస్కరునికరణి
ననుపమాచ్ఛచ్ఛవిస్ఫూర్తి నతిశయిల్లె
నంబుజాక్షుండు రాజసభాంతరమున. 366

సీ. అప్పుడు శిశుపాలుఁ డత్యంతకుపితుఁ డై
యాపగేయునిమీఁద నాగ్రహించి

వీఁడు వృద్ధుఁడు శాస్త్రవిదుఁడు గాఁ డవనీశ
ధర్మంబె ఱుంగక ధర్మజుండు
దలఁకె యాదవునకుఁ దద్బోధితుం డయి
సహదేవుఁడును బూజ సంఘటించె
సత్యప్రతిజ్ఞులు శాస్త్రజ్ఞులును నగు
రాజుల నెల్లఁ దిరస్కరింతు
రటె యపూజ్యులు పూజ్యులు నగుదు రెచటఁ
బూజ్యు లవమాననాప్తిఁ జేఁ బొలుతు రెపుడు
నచట దుర్భిక్షభయమరణాదికములు
సంభవిలు నిక్కువం బిది శాస్త్రసరణి. 367

తే. పెద్ద లుండంగ నీచులఁ బిలిచి తెచ్చి
పూజసేయుట యొక్కటి పాపంబు బుధజనంబు
లందు నర్థవినాశంబు నపయశంబు
శ్రమము నరకంబుఁ గర్తకు సంభవించు. 368

వ. అని పల్కి శిశుపాలుండు. 369

క. తనవాసి యెఱుఁగనేరని
జనములయిండ్లకున్ బోవఁ జనఁగా దని ది
గ్గన లేచిపోవ నపు డా
తని మరలఁగఁ దెచ్చె ధర్మతనయుఁడు నెమ్మిన్. 370

వ. అప్పుడు భీష్ముండు శిశుపాలు నుద్దేశించి ధర్మపుత్త్రు

నితో నీసారమేయంబు వోయిన నేమి యగు నేల
యూరార్చి తెచ్చి తనిన వాఁ డిట్లనియె. 371

మ. తల యెల్లం గడుఁ దెల్లఁగా నరసినం
తం బెద్దవే నీవు నీ
బలముం దృష్టియుఁ బుష్టియుం బొలిసె ని
ర్భాగ్యుండవై పుత్త్రదా
రలఁ బోషింపఁగ నోప కీగతి నిర
ర్థబ్రహ్మచర్యవ్రతం
బిలపైఁ దాల్చితి రాజ్యభారకథ నీ
కెందైన సిద్ధించునే. 372

క. ఇల నృపుల గెలువ నేరుపు
గల దింతియకాని నీకుఁ గార్యాకార్యం
బుల నెఱుఁగఁబోలునే రా
జులసభ నార్యగతిఁ బలుకఁ జొప్పడియున్నే. 373

వ. నీ వుపదేశించు ధర్మంబు ధర్మరాజునకు నీకునుం గాని
రాజవర్యులకు సమ్మతంబు గాదు కులాచారపరిభ్రష్టు
లును రసవిక్రయోపజీవులు నైన యాదవుల నధికులంగా
నెన్నందగునే యనినం గోపించి సహదేవుం డిట్లనియె. 374

ఉ. యాగఫలప్రదుం డగు జ
నార్దనుఁ బూజ్యునిఁగాఁగఁ జెప్పె వి

శ్వాగమపారగుండు సరి
　　జాత్మజుఁ డప్పలుకు ల్సహింపలే
కీగతి దుష్టభాషణము
　　లెవ్వఁడు పల్కిన వానిమౌళిపై
వేగమె వామపాద మతి
　　విస్ఫురితలీల ఘటింతు నీసభ౯. 375

క. ఎఱిఁగించువాఁడు భీష్ముఁడు
మఱి శ్రీహరి పూజ్యుఁ డాశమననందనుఁ డి
త్తఱిఁ బూజకుఁ డిప్పనికిం
గొఱఁత గలదె శ్రుతిహితం బగు న్నిక్కముగ౯. 376

వ. అనియె నంత నాశిశుపాలుం జూచి శాంతనవుం డోరీ మాతృసంబంధదోషంబున దయాపరుండైన ధర్మరాజు భోజనార్థంబు విలిచిన వచ్చితివి యథేష్టంబుగా భుజియించిపోవుట గాక యలర్కంబు పురోడాశం బపేక్షించునట్లగ్రపూజంగోరందగునే వృథార్థ్వానార్థ్వాగర్జ్వాణంబు రాక్షసులకు సహజగుణంబు జన్మగుణచేష్టాదులవలన నీవు రాక్షసుండ వనిన వాఁ డజాతశత్రున కిట్లనియె. 377

చ. కులబలశాలు లైన నృప
　　కుంజరుల౯ వెలిచేసి దుర్మతి౯
మలసితి ధర్మరా జనుస
　　మాఖ్య నిరర్థక మయ్యె నీకు నీ

రలఁ బిలువంగఁ బంచుట తి
రస్కరణం బొనరింపనొక్కొ యీ
యలఘుబలాఢ్యులైన నృపు
లల్పులె నీమదిలోన నెంచుమా. 378

ఆ. కుమతి వగుచు గోపకునిఁ బూజసల్పితి
బ్రహ్మచారిమాట పాటిచేసి
యేమి గల్గె దీన నీరాజవర్యుల
క్రతువు కనుచుఁ బిలిచి గర్వ మణఁప. 379

వ. ఈగోపాలబ్రహ్మచారులకును నీయనుజు లగు భీమవిజ
యులకును వెఱచువా రిం దెవ్వరు లేరు జరాతనయుఁ
గపటవేషంబున జయించుట యాదిగాఁ దత్పరాక్రమం
బందఱకుఁ దెల్లం బయ్యె నని పల్కన. 380

ఉ. అప్పుడు భీమసేనుఁడు ల
యాంతకుఁడై వడిఁ గ్రోధ మత్తులం
జిప్పిల నిల్చి లేచి గద
చే నమరించినఁ దత్సభాసదుల్
దప్పక చూచి చైద్యుఁడు వృ
థా కలహించె మఱత్తనూభవుం
డిప్పుడు రాజబృందముల
నిందఱఁ ద్రుంపఁగ నున్నవాఁ డొగిన్.

క. మనము మన దేశమునకుం
జను లుచితం బార్యనింద సల్పెడు నీదు
ర్జనుపల్కులు వినఁగూడదనె
వినినం బుణ్యములు దొలఁగు వేయును నేలా. 382

చ. చెలఁగి మహాన్నిగర్హణము
సేయుదురాత్మకుఁ బట్టి యాసభన్
వెలువడఁజేయఁగాఁ దగు వి
వేకసమన్వితు లట్లు సేయఁదా
నలవడదేని కర్ణయుగ
మప్పుడె పాణులఁ గప్పి గ్రక్కునన్
దొలఁగుట మేలు దచ్ఛ్రవణ
దుష్కృతి వాపఁగఁ గోరి రేనియున్. 383

వ. అని పలికి రంత. 384

తే. పలుమఱును జైద్యుఁ డాడుదుర్భాషణములు
కృష్ణవిద్వేషులకుఁ జాలఁ బ్రియము లయ్యె
నంతఁ గ్రోధాగ్ని కిది వేళ యగునె యనుచు
గంధవహసుతు వారించె గంగపట్టి. 385

వ. అప్పుడా శిశుపాలుండు భీష్ము నవలోకించి. 386

ఆ. వాయుతనయు నేల వారించెదవు భీష్మ
శౌర్యధైర్యధుర్యచండమునను

వీఁడు బాలుఁ డీవు వృద్ధుండ విద్దఱుఁ
గదనధరణి నెదుర్కఁగలరె నన్ను. 387

ఉ. ఈసున నీసభాస్థితమ
హీతలవల్లభతల్లజౌఘముల్
బాసటగా ననుం దొడరి
బాహుబలంబునఁ బోరఁ జూచెదో
వాసిగ నట్లు సేయు మగ
వాఁడవయేని యెటైన నాదుబా
ణాసనముక్తబాణహతి
నంతకుపోలు గనంగఁజేసెదన్. 388

వ. అని పల్కి స్వపక్షక్షత్రియుల నెల్లం గూర్చుకొని యుద్ధసన్నద్ధుండై యుండె నంత భీమార్జుననకులసహదేవులునుం గదనంబునకు నాయితంబై రప్పు డక్కలకలం బాలించి ధర్మనందనుం డయ్యాగంబునకు నంతరాయం బు సంధిల్లె నని చింతించిన నాపగానందనుం డతని కిట్లనియె. 389

ఉ. యాగఫలప్రదాయకుఁడు
యాగమయుండును నైన కృష్ణుఁ డీ
యాగముఁ గాచుచుండఁగ నృ
పా యొకవిఘ్నము గల్గనేర్చునే

యాగరుహాంకుఁ డిప్పుడ దు
రాత్మునిఁ జైద్యుని నుక్కడంచి యీ
సాగరమేఖలాభరము
నయ్యెడఁ బాపుఁ గలంగ నేఁటికిన్. 390

వ. అని బోధించె నంత దుర్యోధనుండు గర్ణుం జూచి. 391

క. సమయం బబ్బెం మనకుం
గ్రమమున మనసేయ నున్న కార్యంబు నృపుల్
దమపని కై చేసెద రీ
యమితబలుల గెలువ నేరికయినను దరమే. 392

వ. మనబలం బెల్ల నొక్కెడఁ జేర్చికొని శిశుపాలుం గలసి
నిలుతమే యనినఁ గర్ణుం డిట్లనియె. 393

తే. ఇదియె కర్జమ్ముసుమ్ము మహీతలేశ
తోడరి యీరాజసంఘంబుతోడఁ గూడి
పాండవేయుల గెల్చి యఖండమహిమ
నిపుడ తద్రాజ్యము హరింపు మేల దలఁక. 394

వ. అనియె నంత ద్రోణుండు దుర్యోధనుం జూచి. 395

ఉ. ఏల దురూహ సేసెదు మ
హీశ్వర ధర్మపరుండు ధర్మజుం
డేల నలంగు దుష్టనృపు
లెల్లఁ గ్రమంబున నంబుజాక్షుచేఁ

గూలఁగ నున్నవారు హరి
కుంభినిభారముఁ బాపఁ బూని యీ
పోలికఁ బుట్టెఁ జైద్యనృపు
బోఁడిమియుం జెడు నీక్షణంబునన్. 396

తే. అని నివారించె నంత శతాపరాధ
పూర్తి యగునంత దమఘోషపుత్త్రుఁ డునుమఁ
దలఁచు వసుదేవనందను తలఁపుబడిన
వచ్చి చక్రంబు తత్పార్శ్వవర్తి యయ్యె. 397

శా. అంతం గృష్ణకరాగ్రముక్తమయి యు
ద్యద్భానుకోటిప్రభా
క్రాంతానంతదిశాంతమై నిగిడి చ
క్రం బన్యరాజన్యదు
ర్దాంతప్రక్రియ నేఁగి చేదివిభుమ
స్తంబున్ వెసం ద్రుంచెఁ ద
త్ప్రాంతారాతివసుంధరాధిపులు వి
భ్రాంతాత్ములై తూలఁగన్. 398

ఆ. విరులవాన గురిసె విన్నును దిక్కులుఁ
దెలివిగాంచి మించెఁ ద్రిదివవేశ్య
లాడి రుచితగతులఁ బాడిరి గంధర్వ
పతులు చైద్యనృపుఁడు వడినయంత. 399

క. ఆయెడ నాశిశుపాలుని
కాయములోనుండి యొక్కఘనతేజము నా
రాయణునిఁ జొచ్చె యాగస
మాయాతసమస్తజనము లచ్చెరు వందన్. 400

సీ. అప్పుడు ధర్మజుం డవనీసురక్షత్ర
సంఘంబునకుఁ బూజ సంఘటించి
యట వసిష్ఠుండు పూర్ణాహుతి గావించి
యాగశేషక్రియ లాచరింప
నవభృథస్నానపూతాత్ముఁడై సన్ముని
గణముల నుచితదక్షిణలఁ దనిపి
యఖిలబంధుజనాళి కర్హపూజ లొనర్చి
యెలమి నిజస్థానములకుఁ బనిచె
నట్లు కృతకృత్యుఁ డగు నన్మహామహీశు
క్రతువుచేఁ దృప్తుఁ డగుచుఁ బురందరుండు
పాండునరపాలశేఖరు భవ్యతర ని
జాసనార్ధంబునం దిడి యాదరించె. 410

వ. కృష్ణదేవుండును శిశుపాలదంతవక్త్రాది దుష్టజనంబులఁ
ద్రుంచి ధరణీభారంబు వారించుచు బంధుజనపూజితుండై
బలభద్రసహితంబుగా నిజపురంబునకుం జనియె నిట్లు. 402

తే. జయవిజయులఁ బ్రసాదభాజనులఁ జేసి
సిద్ధజేగీయమానప్రసిద్ధమహిమ

నలరి ద్వారకలోపల నధివసించె
నఖిలలోకప్రభుండు చక్రాయుధుండు. 403

క. ఋజుమతు లగు జయవిజయులు
ద్విజశాపం బెడలి దివ్యదేహాకలితు లై
నిజసుకృతవశంబునఁ జని
భుజగశయనుపార్శ్వచరతఁ బొలిచిరి మరలన్. 404

క. ఈయుత్తమకథ వినినను
ధీయుతులకు రుజలు తొలఁగుఁ దేజఃకీర్తి
శ్రీయోభివృద్ధి దనరుం
బాయుం గలుషములు విష్ణుభక్తియు నొనరున్. 405

వ. అనిన విని నైమిశారణ్యవాసులు వ్యత్యస్తరామనామప
రాయణుం డగు చోరుని తెఱం గెట్టి దయ్యె నని యడిగిన.

శా. షట్కంజాంతరతత్త్వవిన్మునిజన
స్వాంతాంబుజానందకృ
త్త్వట్కంజాప్త భవా భవాబ్ధితరణీ
దిఙ్మండలీచేల పా
వృట్కాల్లాంబుదనీలకంధర ధరా
భృద్ధుర్యచాపా బల
ద్విట్కుంభి ద్యునదీ సుధానిధి సము
ద్దీప్తావదాతాంగకా. 407

జ. సురవరనరతిర్యక్స్థా
వరనానాజంతుపూర్ణవనజభవాండ
స్థిరఫలకలితశరీర
స్ఫురదురుయజ్ఞాంగ మస్తశోభితగంగా. 408

కలహంసవృత్తము.

యమిజనాఘహృదయాబ్జనివాసా
ప్రమథనాథ హిమపర్వతపుత్రీ
కమన భక్తజనకామితదానో
ద్యమసురాగమ మహాగమవేద్యా. 409

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కాందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునందు
సప్తమాశ్వాసము.

శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



అష్టమాశ్వాసము



శ్రీగౌరీపదలాక్షా
యోగాపాటలసుధామయూఖకలాపా
యోగినికురుంబకాంత
ర్యాగార్చిత గగనకేశ హార మల్లేశా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు
సూతుండు శౌనకాదిమునిముఖ్యుల కిట్లనియె నట్లచ్చో
రుండు తపంబుసేయుచుండ ననేకమన్వంతరంబులు గడ
చినయనంతరంబ తుల్య భరద్వాజ గౌతమ వృద్ధగౌతమ
కౌశికవసిష్ఠాదు లైన మహర్షులు పదివేవురు శిష్యులుం
దారును హిమశైలంబు డిగ్గి యమ్మార్గంబునం జను
దెంచుచు. 2

క. ఎడ నెడ శివ శివ యనుచున్
బడి బడి శ్రీరామ రామ పాహి యనుచు నిం
పడరఁగ వేదోక్తవిధుల్
గడు వేడ్కం జగద్ధితార్థగరిమ నొడువుచున్. 3

ఉ. అంగపరిశ్రమం బడర
నమ్మునిపుంగవు లప్పథంబునన్
జంగమవేదశాస్త్రముల
చందమునం జని కాంచి రాక్కచో
రంగదభంగసౌరభవి
రాజితపుష్పఫలాభినమ్రనా
రంగలవంగలాంగలిక
రంటుకముఖ్యమహీజవాటికన్. 4

ఉ. భృంగమయూరకీరపిక
పేశలసూక్తులు ముక్తికామినీ
సంగతివైఖరుల్ దెలుప
సంయము లత్తరువాటిఁ జొచ్చి త
న్మంగళవృక్షమూలతల
మంజులవేదుల విశ్రమించి రం
తుం గడుఁజల్లనై మలసె
దక్షిణదిక్ప్రవమానడింభముల్. 5

ఉత్సా. పారిజాతమాతులుంగపనసకదళికామ్రమం
దారనారికేళముఖ్యధరణిజాతజాతముల్
సారతరుల కెన యనంగఁ జాలు మేలు వెలయ నిం
పారు తత్ఫలములు చేత నందికొనఁగ ననువగున్. 6

క. తృణగుల్మరహితమై ద
ర్పణసన్నిభవిమలధరణి భాసిల్లుచు నీ
క్షణపర్వనిర్వహణతరు
గణముల నొప్పారు నది జగన్నుతమహిమన్. 7

క. అవిజయాహ్వయచోరుత
పోవిస్ఫూర్తికిని బెగడి భూతము లైదుం
బావనమతి సృజియించిన
యావనివిభవంబుఁ బొగడ నజునకుఁ దరమే. 8

ఆ. జాతివైర మెడలి జంతుసంతతి మహో
దారమైత్రి నలరఁ దద్వనంబు
విబుధగణనితాంతవిహరణస్థానమై
యఖిలసౌఖ్యహేతు వగుచుఁ దనరు. 9

తే. దేవవల్లభమహిళాప్రదీప్త మగుచుఁ
బ్రబలసుమనోమనోజ్ఞరంభావిలాస
శోభితం బయి యవ్వని చూడ నొప్పు
నందనవనంబుగతిఁ గడు నంద మగుచు. 10

సీ. హరినీలనీలబంభరడింభనికరంబు
చొప్పు పెన్నెఱివేణియొప్పు నెఱప
నరుణారుణస్ఫురదురుపల్లవశ్రేణిఁ
గెంగేలిపోలిక గీలుకొనఁగ

సచ్ఛాచ్ఛతరసుమగుచ్ఛవిలాసంబు
గల్గిచన్గుబ్బలయుబ్బుఁ దెల్ప
మంజులలతికాసమంజసవైఖరి
రంగైన మేనితెఱంగు దోఁప
తే. నసమకుసుమవిలాసంబు హాసలీలఁ
దనర నిశ్శ్రీయసాంగనం దార్చునట్టి
శంబల్లియుబలె వనలక్ష్మి సంయమలకు
8 సలలితామోదవిస్ఫూర్తి సంఘటించె. 11

సీ. నానాపలాశసంతానాస్పదం బయ్యు
సుమనఃకదంబ విస్ఫురణఁ దనర్చి
మన్మథవిభ్రమమహిమ రంజిల్లియు
నీలకంఠప్రేమనిరతి వఱలి
పల్లవరాగసంపద్భాసురం బయ్యు
ద్విజవరహృద్యమై తేజరిల్లి
యవిరతమధుపకులాసక్తిఁ జెందియు
నత్యుదారాగమాఢ్యతఁ దనర్చి
తే. నవ్యపుష్పితగణికాసనాథమయ్యు
సతతపున్నాగసంగతి నతిశయిల్లి
వెలయు నయ్యాశ్రమారామవిలసనంబు
గాంచి మునివర్యు లద్భుతాకాంతు లగుచు. 12

ఆ. నందనంబు కర్మబృందానుసారిత
సంఘటించు భోగసముదయంబు
జంతువితతి కిలన సౌఖ్యంబు లొనగూర్చు
నిదియె నందనమున కెక్కు డగుచు. 13

ఆ. నందనంబు జనమనస్థానసంధాన
తారతమ్యభోగదంబు గాని
యివ్వనంబుకరణి నెల్లజంతువులకు
ననిశసౌఖ్యహేతు వగునె తలఁప. 14

మ. అని వర్ణించుచు మౌనిపుంగవులు శి
ష్యవ్రాతముల్ దారు న
వ్వనభూజంబులలోనఁ గ్రుమ్మరుచు భా
వంబుల్ మహాశ్చర్యస
ద్వసధిం దేలఁగ హాళి నొక్కెడ స
ర్వప్రాణిలోకైకమో
హనమాకందమహీజమూలమునఁ జె
ల్వార స్సమాసీనులై. 15

తే. కొంద ఱందంద ఫలమూలబృంద మర్థి
రాసులుగఁ జేసి రప్పుడు పేరాసకలిమిఁ
దృప్తి నొందక కొందఱు దిరుగుచుండి
రవ్వనీవీక్షణాపేక్ష యలముకొనఁగ. 16

క. ఆమునిముఖ్యులు గొందఱు
కామక్రోధాతిలోభకలితాత్మకులై
వేమఱు వాదించిరి తా
రామ్రదుఫలమూలసంగ్రహావసరమునన్. 17

వ. తదనంతరంబ వార లందఱు స్నానసంధ్యాద్యుచితవిధులు దీర్చి ఘనసారగంధబంధురంబులును సుధామధురంబులు నైన ఫలమూలంబుల నాహారకృత్యంబులు నిర్వర్తించి పరితృప్తులై పురాణపఠనశ్రవణాదివర్తనంబుల నద్దినశేషంబు గడపి రాత్రి యగుడు నిద్రించుచుండి రంత. 18

సీ. మహితతపఃక్రియామహిమచే మూర్తిమ
ద్వీతిహోత్రునిభాతి వెలయువానిఁ
జిత్తవాక్కర్మముల్ శ్రీరామునం దిడి
తన్మయత్వంబునఁ దనరువానిఁ
గార్శ్యంబుఁ జెందిన గాత్రంబుచే ద్వితీ
యాచంద్రుకై వడి నలరువానిఁ
బుటపాకమున శుద్ధిఁ బొరసినకనకంబు
గతి నకల్మషలీలఁ గ్రాలువాని

తే. నిర్జితక్రోధకాముఁడై నెగడువాని
నఖిలజీవప్రియంకరుం డైనవాని

మౌనిపుంగవు నొకని నమ్మౌనివరులు
స్వప్నమునఁ గాంచి రపుడు సుస్వప్నసదృశు. 19

వ. వెండియు. 20

శా. ఆమానీందుప్రియకు న్వరం బొసఁగ న
భ్యర్ణక్షితి న్నిల్చు శ్రీ
రాముం దైవతసార్వభౌము దనుజేం
ద్రవ్రాతభీము న్ఘన
శ్యాము న్సర్వగుణాభిరాము రఘువం
శాంభోధిసోము న్బలో
ద్దాముం బావననాముఁ గన్గొనిరి సీ
తారాము నాసంయముల్. 21

సీ. నిరుపమసౌందర్యనిర్జితపంచేషు
హారకిరీటకేయూరభూషు
మందస్మితాంచితసుందరాస్యవిలాసుఁ
బృథులకాంచనమయపీతవాసు
సనకాదిసన్మునిసముదయసంభావ్యు
భరతలక్ష్మణముఖభ్రాతృసేవ్యు
శ్రీకరభక్తలోకైకరక్షణదక్షు
మందారసుమదామమహితవక్షు

తే. రాము శతకోటిభాస్కరధాముఁ గాంచి
మేలుకొని రామనామ మమ్మేలు మనుచు

హార్షపరవశు లగు నమ్మహార్షులకును
క్షణసమాగమాశులీల నాక్షణంబ వేగె. 22

వ. అంత స్నానసంధ్యాదికాల్యకరణీయంబులు నిర్వర్తించి
సభకరిగి కశ్యపుండు వారలకడకు నారదమునీంద్రుం
డేఁగుదెంచిన నందఱుఁ బ్రత్యుత్థానంబు చేసి యర్ఘ్యపా
ద్యాదిసత్కారంబు లాచరించి బహూకరించి సుఖాసీనుం
గావించి రంత వసిష్ఠమునీంద్రుం డమ్మునీంద్రునితో
ని ట్లనియె. 23

ఉ. ఎవ్వనియాజ్ఞఁ బిద్ద మును
నీంద్ర! మహేంద్రభవనంబురీతిఁ దా
నివ్వసుధం గరం బలరె
నీక్షితసౌఖ్యరమాసమృద్ధిచే
నివ్వని విశ్వకర్మ రచి
యించెనొ కాక మయుం డొనర్చెనో
యివ్విధ మంతయుం దెలిపి
యందఱ కింపు ఘటింపఁ జేయవే. 24

క. పదునాల్గులోకములు నిం
పు దలిర్పఁగ సంచరించు ప్రోడవు నీకున్
విదితం బశేషవృత్తం
బది గావునఁ దెల్పు మివ్వనావనిమహిమల్. 25

వ. అని పలికి యంతియు కాదొక్కవింత విను మని యిట్లనియె.

క. అస్వప్నమానివర మా
సుస్వప్నములందు నొక్క శుభచారిత్రున్
భాస్వత్ప్రభుఁ గంటిమి రా
మస్వామిన్ మది భజించుమహితాత్మకునిన్. 27

శా. అక్షయ్యస్థితి రామనామజప మ
త్యాసక్తిన్ మేఁ జేయుచున్
సాక్షాదగ్నియుఁ బోలెఁ గ్రాలెడు ముని
స్వామిం గృపం బ్రోవఁగా
సాక్షాత్కారముఁ జెందు రాఘవుని వి
శ్వత్రాణపారీణు భ
క్తశ్రేయస్కరుఁ గంటి మిందఱము మా
కన్నుల్ గడుం జల్లఁగన్. 28

వ. అని స్వప్నవృత్తాంతం బెఱింగించి వెండియు. 29

ఆ. అనఘ రామ రామ యనుమధురస్వరం
బిపుడు వినఁగ నయ్యె నివ్వనమునఁ
దజ్జపంబు సల్పుధన్యునిఁ బొడఁగాన
మఖిలతరువులందు నరసి యరసి. 30

ఆ. ఆమనోజ్ఞమృదురవాకర్ణనమునఁ బ్ర
మోదవార్ధిఁ దేలి మునిలలామ
యెందుఁజోటి కరుగ నుల్లంబు గొలుపక
యుండ యున్నవార మిందఱమును. 31

క. ధరఁ బుణ్యక్షేత్రమునకు
నరిగినగతి నలరె మానసాబ్జములు మునీ
శ్వర యివ్వని మును చూచిన
కరణిం గనుపట్టెఁ బ్రీతి గదిరె న్మాకుః. 32

వ. ఈకారణం బేమియో యింతయుం దెలియ వివరింపు
మనిన నద్దివ్యముని యిట్లనియె. 33

సీ. ఎఱిఁగింతు మునులార యితిహాస మొక్కటి
శ్రోత్రల కత్యంతశుభకరంబు
నర్థార్థులకు నిఖిలార్థప్రదంబును
బుత్రార్థులకు బహుపుత్రదంబు
భుక్తిముక్తిప్రదంబు నపారసంసార
తరణంబు వినుఁడు చిత్తంబు లలర
మున్ను నేఁ గైలాసమునకు మహేశు జ
గత్పతి నభవు శంకరునిఁ జూడఁ

తే. గోరి యరిగితి నరిగి తద్ద్వారసీమ
నతులబలదీప్తులైన శశాంకమకుట
కింకరావళి వారింపఁ గెలన నిల్చి
యుంటి సమ్మోదమున నటు లుండునంత. 34

ఉ. శంకరకింకరాళి యొక
సత్పురుషుం గని పూజ సల్పి ని

శ్శంకఁ బ్రదక్షిణించి నుతి
సల్పె నమస్కృతిపూర్వకంబుగాఁ
బొంకముతో నతండు నొక
పుష్కరయానవరాధిరూఢుఁడై
శంకరసన్నిభుం డగుచు
శాంకరభూమికిఁ దాల్చె గ్రిక్కుఱన్. 35

మ. అతనిం గన్గొని యాతఁ డెట్టిసుకృతం
బార్జించెనో యెట్టిసు
వ్రితముల్ సల్పెనొ శంభుకింకరు లుదా
రప్రీతి నర్చింప ను
న్నతిఁ గాంచెం దగు నంచు నెంచి తదనూ
నస్నిగ్ధ తేజోబలో
ద్ధతికిం బ్రీతిలి మ్రొక్కి పల్కితి నితాం
తప్రీతి సంధిల్లఁగన్. 36

ఆ. ఓమహాత్మ యెట్టియురుతపం బొనరించి
తేమి పూజ సల్పి తెట్టితీర్థ
యాత్ర సల్పితివి కృతార్థుఁడవై యెట్టి
దాన మిచ్చి తీ వనూనమహిమ. 37

క. * ఏసుకృతమహిమమునఁ గై
లాసావాసుఁడవై చెలంగితి విట ము

---

* ఏసుకృతమునఁ గైలాసావాసుఁడవై చెలంగి తీ విట—వ్రా॰ ప్ర

న్నేసుకృతుల కైన శివా
వాసము దుర్లభము ప్రమథవర యూహింపన్. 38

క. ఘోరపిశాచనిశాచర
వీరులకుం గ్రూరులకును వీక్షింపఁగఁ జే
న్నారఁగ నంట నశక్యము
తారక శైలంబు ప్రమథతతికిం దక్కన్. 39

వ. నీ వేమి పుణ్యంబునఁ గైలాసయాతుండ వైతి వెఱింగిం
పు మనిన నాకు నతం డిట్లని చెప్పె. 40

మత్త. ఏను పూర్వభవంబునందు మహీసురుండ ఖలుండ దు
ర్దానవస్తుతతిప్రతిగ్రహదర్పితుండ నిరాకృతిన్
మానిపుంగవ విప్రకర్మము మాని శూద్రకులోచితం
బైనధర్మమునం జరింతు దురంతదుష్కృతకారి నై. 41

తే. బంధకీతతసురతసంబంధపరతఁ
బతితపాషండదుర్జనవ్రతతిఁ గూడి
సతతవృజినదుష్షండవసంతమూర్తి
నగుచు విహరింతు నార్యులు నను నగంగ. 42

క. ఈరీతిఁ గల్మషంబు ల
పారముగా నాచరించి పదపడి నేత
త్కారణమునఁ గిటికరట
క్రూరశునకజనితతాప్తిఁ గొఱలితి ధరణిన్. 43

మత్త. ఘోరజన్మము లెత్తి యాగతిఁ గుంది కర్మవశంబునన్
దూరసంచరణాతిశక్తియు దూరదృష్టియుఁ గల్గి చె
ల్వారుగృధ్రమనై జనించితి నంత నోమునిముఖ్య త
ద్దారుణాకృతిఁ గాంచి భూతవితానముల్ వెఱఁ గందఁగన్.

వ. అంత ననేకకాలంబు గడచినయనంతరంబున. 45

తే. ఆమిషార్థినై ఘోరవనాంతరమున
కరిగి యచ్చట నాహార మబ్బ కునికి
క్షుత్పిపాసలచేఁ గడుఁ గుంది యంత
నొక్కదేవాలయమునకుఁ నొయ్యఁ జేరి. 46

మాలిని. ధవళఖగవిభాస్వద్వ్రజలేపస్ఫురత్త
ద్భవభవనసమంచ ద్బర్మకుంభంబుపైఁ బ్రా
గ్భవకృతసుకృతౌఘుప్రాప్తిమై నెక్కి యం దా
సవిధవివిధతిర్యక్సంతతిం జూచుచుండన్. 47

ఉ. ఆసమయంబునందు మృగ
యారతిచే నొకలుబ్ధకుండు బా
ణాసనబాణపాణి విల
యాంతకుఁ బోలికి నేఁగుదెంచి యు
ల్లాసదృశాశుగంబునఁ జ
లంబున నేసె మహేశ్వరాలయా
గ్ర్యాసితశాతకుంభకల
శాగ్రసమాశ్రితతద్విహంగమున్. 48

క. వ్యాధధనుఃప్రేరితశర
బాధఁ గలఁగి పూర్వపుణ్యపరిపాకమునన్
క్ష్మాధరపుత్రీశమహా
స్సౌధాగారంబుచుట్టుఁ దిరిగితిఁ బెలుచన్. 49

ఆ. అటఁ బ్రదక్షిణత్రయానంతరమున న
ప్పక్షితనువుఁ దొఱఁగి యాక్షణమున
దివ్యతనువుఁ దాల్చి దివ్యగంధాంబర
భూషితుండ నైతి బుధులు వొగడ. 50

వ. ఇట్లు బలాత్కారకృతశివప్రదక్షిణభావంబున నప్సరోగ
ణసంకీర్ణంబైన దివ్యవిమానం బారోహించి తేజఃపుంజ
రంజితసకలదిఙ్మండలుండనై గంధర్వగానంబు వినుచు
విద్యాధరకదంబంబులు గొలువ నాకలోకంబునకుం జని
పురందరాదిబృందారకబృందంబులచేతం బూజితుండనై
చిరాయు వనునామంబున ననేకకాలం బందు వసియుం
చితి ననంతరంబ యొక్కనాఁడు ప్రసంగవశంబున దివ
స్పతి వాచస్పతి కిట్లనియె. 51

మ. అతులానందకరంబు నందనవనం
బారామ, మీదేవతా
ప్రతతుల్ గింకరు, లద్రిభేది పవి శ
స్త్రం, బీశచీదేవి మ

త్సతి, స్వర్గంబు పురంబు, సద్గురుఁడ వెం
చ న్నీవు నా కిట్లు శా
శ్వతసామ్రాజ్యయుతుండ నేనకద జీ
వా యీత్రిలోకంబునన్. 52

క. అనవుడు నీ యైశ్వర్యం
బనిత్యతాహేతువునఁ గ్రియాజనితముగా
ననుమేయింపం దగినది
ఘనవాహన యనుచు నతఁడు గ్రమ్మఱఁ బలికెన్. 53

వ. అప్పలుకులు విని యైశ్వర్యతారతమ్యగణనాప్రసంగం
బున సభ్యులకు వివాదం బైన నీవివాదశాంతిఁ గోరి
పురోహితబోధితుండై పురుహూతుండు సభ్యులుం
దానును మత్సన్నిధి కేతెంచి తద్వృత్తాంతంబు వివరిం
చిన సకలశాస్త్రసమ్మతంబుగా నే నిట్లంటి. 54

క. పొందుగ విభవంబు క్రియా
బృందజ మస్థిరము శక్ర పృథుచైతన్యా
*నంద మొకటియు నకర్మజ
మిం దనుమేయంబుగా దహీనప్రౌఢిన్. 55

సీ. దృశ్యత్వకారణస్థితిచేత నఖిలంబు
నస్థిరం బగు నమరాధినాథ

---

* (1) నంద మొకటియుకర్మజ, మందనుమేయంబు—అని యొక వ్రా. ప్ర.
(2) నందం బొకటియుకర్మజ, మందనుమేయంబు—అని తక్కిన వ్రా. ప్ర.

పదుమువ్వురింద్రుల బ్రకటితైశ్వర్యంబు
గనుఁగొనినాఁడ నాకన్ను లలరఁ
నంతంత కనుపయ్యె నవలి శక్రులసిరి;
యాద్యశక్రునిపతి యైనశచికిఁ
బరిచారికాకృతిఁ బరగ నిప్పటి శచి
యిది యంతయును నాకు విదిత మయ్యెఁ

తే. గాలయుగధర్మభేదముల్ గలుగు నిట్లు
యెప్పుడప్పుడు ప్రాణుల కదియె *యిచటఁ
బరమసౌఖ్యంబుగాఁ గనుపట్టుచుండు
ననుచుఁ బల్కిన విని యింద్రుఁ డనియె మరల. 56

తే. ఇవ్వివాదంబు శాంతించె నింక నొకటి
యడిగెద శివప్రదక్షిణం బాచరించి
యేఫలము గాంచు మనుజుఁ డహీనఫణితిఁ
దెలిపి యీసంశయం బెల్లఁ దీర్పు మనఘ. 57

వ. అనిన నే నిట్లంటి. 58

ఉ. ఏ మును గృధ్రదేహి నయి
యీశ్వరమందిరసత్ప్రదక్షిణం
బామెయి వ్యాధబాధితుఁడ
నై యొనరించితిఁ దానఁ జేసి నే

* యచట—వ్రా. ప్ర.

నీమెయి దాల్చి యిందు వసి
యించితి నింపమరం జిరాయు వ
న్నామముతోడ శక్ర పదు
నల్వురు శక్రులు దీఱునంతకున్. 59

నావిభవము గనుఁగొని శివ
సేవాఫల మెట్టిఁగు మనిన జిష్ణుఁడు శితికం
ఠావాసమునకు వలగొను
శేవ గడిందిగఁ దలంచె డెందం బలరన్. 60

అని ఇంద్రాదులసంవాదంబు వివరించి వెండియుఁ జిరా
యు విట్లనియె మునీంద్రా యిట్లు త్రిదివలోకంబున
వసియించినకాలంబు నాకొక్కదినం బయ్యె ననంతరంబ
వైకుంఠభవనంబున కేఁగి యచ్చట దివసద్వయంబు
నిలిచితి సంతఁ బుణ్యగౌరవంబున నీకైలాసంబున కేఁగు
దెంచితి ననిన నే నిట్లంటి. 61

హరునకుఁ బ్రిదక్షిణత్రయం బాచరించు
కారణంబునఁ గైలాసగమన మబ్బె
నీకు వైకుంఠభవనాదిలోకములకు
నెట్టిసుకృతంబుచే నేఁగి తెలుఁగఁ జెప్పుమ. 62
అనినం జిరాయు విట్లనియె. 63

హరిహరుల కెవ్వరికి భేదబుద్ధి లేదు
దూషణము దానిమూలము దూషణంబె

యఖిలధర్మవినాశంబు నాచరించు
వివిధలోకవిరోధియై విస్తరిల్లు. 64

క. ధర దూషణంబు వెలిగా
నరుఁ డేధర్మంబు చేసిన న్సఫలతచే
నిర వొందు సర్వలోక
స్థిరగమనము గన నెఱుంగఁ జెప్పితి నీకున్. 65

వ. అనియె నని చెప్పి సూతుండు. 66

క. ఈపుణ్యచరిత మెవ్వం
డేపున విను శ్రద్ధ గలిగి యిద్ధరఁ బుణ్య
శ్రీపటిమ వెలయు నాతఁడు
పాపవిముక్తుఁ డయి పరమపదముం జేరున్. 67

వ. అని చెప్పి నారదుండు వసిష్ఠాదుల కిట్లను నట్లచ్చిరా
యువునకు మ్రొక్కి యతం డనుప వెండవద్వారంబుం
బ్రవేశించితి నంత. 68

శా. హీరద్వారకవాటదీప్తమును బం
హిష్ఠాచ్ఛముక్తామణి
స్ఫారోల్లాభవిభాసురంబుఁ గుముదా
ప్తప్రస్తరాబద్ధవే
దీరమ్యంబును నై ప్రాసంగి ప్రమథా
ధిష్ఠానమై యొప్పు త

ద్వారం బింపు ఘటించెఁ గన్గవకు సాం
ద్రజ్యోత్స్నాచందంబునన్. 69

అందు న్వజ్రవిశుద్ధవిగ్రహు విశా
లాక్షు న్మహాబాహుఁ బ
ర్వేందుప్రోజ్జ్వలసుందరాస్యుఁ బ్రమథా
ధీశప్రభావు న్సదా
నందుం జిత్రరథాభిధాను నొకవీ
ణావాద్యవిద్యాఢ్యు నా
డెందం బెంతయుఁ బ్రీతిచేఁ బొదలఁ గాం
టిన్ రత్నపీఠస్థితున్. 70

అతఁడు శివనామకీర్తనం బాచరించి
వీణఁ బలికింపఁ దచ్ఛ్రుతివిలసనంబు
నాశ్రుతిపుటద్వయీరంజనం బొనర్చి
యలఘురోమాంచకంచుకితాంగుఁ జేయ. 71

నతిచేసి యతనిచే స
త్కృతియు నమస్కృతియుఁ బడసి స్థిరతరనికట
స్థితపీఠమునఁ దదాజ్ఞం
గృతమతి వసియించి యతని కే ని ట్లంటిన్. 72

ఈయైశ్వర్యమునం జెలంగుటకు నీ
వేదేవునిం గొల్చి తీ

వే యే ధర్మము లాచరించితివి ము
న్నెంతే ధృతి స్నీకర
స్ఫాయద్వల్లకి దాన పల్కెడి శివాం
చన్నామముల్ చంద్రికా
ప్రాయంబై తగు నీదుమూర్తిఁ గని నా
భావంబు పొంగెన్ రహిన్. 73

వ. ఏసుకృతంబుకతంబున నీకీమహిమంబు గలిగె నెఱింగింపు
మనినఁ జిత్రరథుం డిట్లనియె. 74

ఉ. ఏ మును సామదుం డను మ
హీసురుఁడం గడు దుర్వినీతిచేఁ
గామకళాప్రగల్భగణి
కారమణీగృహసీమలన్ విట
గ్రామణి నై మెలంగుదు సు
కర్మము లెవ్వియు నాచరింప నెం
తే మదలీల సార్యజన
నిందయుఁ జేయుదు నెల్లవేళలన్. 75

వ. మఱియు నాయుర్వినాశకరంబులు సార్యనిందితంబులు
నగుదుష్కృతంబు లనేకంబు లాచరించితి నంత నొక్క
నాఁడు సహచరులం గూడి కార్యాంతరవ్యాసంగంబునఁ
బురవీథి నరుగుచుండి. 76

క. నవలక్షకుసుమములచే
నవనివిభుం డొకఁడు త్రిపురహరుఁ బూన్పఁగఁ బ్రా
గ్భవసుకృతహేతువ్రసఁద
ద్భవనంబున కేఁగి యందు భావం బలరన్. 77

తే. అతఁడు కల్పోక్తవిధిఁ బూజ యాచరింపఁ
జూచుచుండితి దృఢతరశుద్ధబుద్ధి
నంత నాయుఃక్షయం బొట యమునిబంటు
లరుగుదెంచిరి నాయిక్క యరసికొనుచు. 78

ఉ. ఆశివపూజ సల్పు నిల
యంబు చొరంగఁ దరంబుగాక కీ
నాశభటుల్ మనంబుల ఘ
నంబుగ భీతి వహించి తద్గృహా
భ్యాశమునన్ మదాగమన
మారయుచు న్వసియించి రద్రిజా
ధీశసమర్చనంబు తెఱఁ
గేను గనుంగొనుచుండు నత్తఱిన్. 79

తే. యక్షబేతాళవితతికి రాక్షసులకు
ఛిద్ర మన్వేషణముచేయు చెనఁటులకును
మృడునిసన్నిధి నొక్కింత మెలఁగరామి
వెలుపలన నిల్చి రంతకవీరభటులు. 80

తే. వింటి శివనామపఠనంబు వీను లలరఁ
గంటి శివపూజసేయఁ జెంగట వసించి
దాన మృత్యువు దొలఁగె నత్తఱి మునీంద్ర
సజ్జనులపొందు ధరఁ గల్పశాఖి యగుట. 81

క. నిరతము వైదికనిష్ఠా
నిరతుండై శ్రద్ధ గలిగి నిష్కల్మషుఁడై
పరగినహరపదభక్తుఁడు
స్థిరతరగతి వర్షశతము జీవించు మహిన్. 82

క. భవితవ్యతానుసారిత
భవపూజాపరిసమాప్తపర్యంతము న
బ్భువి వసియించితి నంతం
బొవులుచు యమభటులు మగిడి పోయిరి లజ్జన్. 83

క. శివనామకీర్తనంబును
శివపూజాదర్శనంబు శివదివ్యకథా
శ్రవణంబు నల్పనియమో
ద్భవ మగు ఫల మనఁగరాదు పద్మజతనయా. 84

వ. అట్లు శివపూజాదర్శనమాత్రంబున బ్రహ్మాదిదుర్లభం
బైన యీశరీరంబు ధరియించి కైలాసద్వారంబునందు
నుండం గాంచితి నని చెప్పి చిత్రరథుం డనుపఁ బ్రమథ
సంకీర్తనంబును విచిత్రమణికుట్టిమంబును నానామణిగణ

బద్ధవేదికంబును నైన తృతీయద్వారంబు ప్రవేశించితి
నందు. 85

తే. తండుభృంగీశ్వరాదు లుద్దండలీల
శివదిదృక్షాసమాసక్తిఁ జేరువారి
భవునిదివ్యాజ్ఞ వెలిగ లోపలికి నరుగ
నీరు తద్ద్వారసీమ నెవ్వారి నైన. 86

శా. వేత్రప్రస్ఫురితప్రహారకలనా
విర్భ్యాతిచే నెంతయుఁ
సుత్రామప్రముఖామరౌఘముల సం
శుద్ధాత్మ్మలం జేయుచుం
దత్రత్యుం డగు నంది నుజ్జ్వలమహా
నందిం దగం గాంచి నే
నత్రస్తస్థితి లోని కేఁగితి మహే
శాజ్ఞానుసారంబుగన్. 87

మ. ధరణీభృత్తనయామనోహరు సము
ద్యత్కోటికంజాప్తబం
ధురతేజున్ ద్రుహిణాండభాండదహనో
ద్భాతోల్లసద్భాతిసు
స్థిరరేఖాకలితు న్మణీమయమహా
సింహాసనస్థున్ సురా

సురవంద్యుం బుర వైరిం గాంచితి హరున్
సోమార్ధ*కోటీరునిన్. 88

ఉ. కాంచి నమస్కరింప గర
కంజుఁ డకుంఠదయార్ద్రవీక్షణం
గాంచి మదీయసత్ప్రణతిఁ
గైకొని కన్గొను పన్న సేయ న
ప్పంచశరారియాజ్ఞఁ దదు
పాంతమునం దగఁ గూరుచుండి యొ
క్కించుక కొంకుచుం గదిసి
యి ట్లని విన్నప మాచరించితిన్. 89

తే. స్వామి తెండవద్వారదేశంబునందు
చిత్రరథుఁ డనుప్రథముఁడు విచిత్రవేషుఁ
గాంచి మ స్నిట్టిసుకృతంబు గారణముగ
నిట్టివిభవంబు నీ కబ్బె నెఱుఁగఁ జెపుమ. 90

వ. అని యడిగిన నతండును నవలక్షకునుమశివపూజాదర్శ
నంబున నిట్టి యైశ్వర్యం బబ్బె నని చెప్పెఁ దత్పూజా
మహాత్మ్యం బానతీయవలయు ననిన నమ్మహాదేవుం డి
ట్లని యానతిచ్చె. 91

క. నను నెన్న హరి నెనన్
మునివర యొక్కకరవీరమునఁ దగఁ బూజిం

---

* కోటీరమణినిన్ — వ్రా.ప్ర.

చినరుఁడు భద్రములఁ గనుఁ
బునరుద్భవదుఃఖవశత బొందఁడు వానిన్. 92

తే. కార్తికంబున నైన మాఘమున నైన
ననఘ వైశాఖమున నైన నచ్ఛకుడ్య
మృదులపల్లవతోరణపృథువితాన
లలితముగ నొక్కగేహం బలంకరించి. 93

సీ. నియతుఁడై వ్రీతి యందు నిల్చి హిరణ్మయ
ప్రతిమ గావించి తత్ప్రతిమయందు
హరి నైన నను నైన నావాహనము చేసి
భాసురాగరుధూపవాసితంబు
రంగవల్లీచిత్రరచితాంచితంబు నై
యమరిన చోటఁ బీఠమున నిల్పి
పటుహాళీకావేణుపటునిస్వనంబును
బుష్కలస్తుతిరవంబును జెలంగఁ

తే. గలితపంచామృతాభిషేకంబు చేసి
లక్షసుమములఁ బూజించి లలితధూప
దీప నైవేద్యములచేతఁ దృప్తి సేయ
వలయు వాక్కర్మనియమపరివర్తనమున. 94

వ. ఇట్లు ప్రతిదినంబును లక్షకుసుమంబుల శివశంభుమహే
శాదినామంబుల నన్నును నచ్యుతానంతగోవిందాదినా
మంబుల హరిని జతుర్థ్యంతంబులుగా నుచ్చరించుచుఁ

బూజించి నిత్యంబును బ్రాహ్మణులకు భోజనంబు నిడు
నది యిట్లు చేసి నవమదివసావసానంబున. 95

చ. ప్రితి గడు ధర్మనిష్ఠుఁ డయి
వస్త్రయుగాంచిత మైన కాంచన
ప్రతిమ నగణ్యపుణ్యుఁ డగు
బ్రాహ్మణుఁ బూజయొనర్చి దాన మ
ప్రతిహతలీల నీఁ దగు ధ
రాతలదానపురస్సరంబుగా
ధృతి నిటు సేయుమానవుఁడు
దేవుఁడుగాక మనుష్యమాత్రుఁడే. 96

సీ. ప్రథమదినంబునఁ బద్మముల్ రెండవ
వాసరంబునఁ గలువలు తృతీయ
ఘస్రంబునను రక్తకరవీరములు నాలు
గవనాఁడు కుటజంబు లవలినాఁడు
చంపకప్రసవముల్, షష్ఠిదినంబున
మొల్ల లేడవదినమునను దెల్ల
గన్నేరు లష్టమఘస్రంబునను జాజు
లట గాంచనములు దా నవలినాఁడు

తే. ప్రతిదినంబును లషపుష్పముల నిట్లు
పూజసేయంగవలయు నప్పూజసేయు

నరుఁడు కైలాసవైకుంఠపురముల వసి
యించు శాశ్వతవైభవ మెసఁక మెసఁగ. 97

క. ఇది నవలక్షకుసుమపూజాప్రకారంబు మఱియు. 98

క. తులసీదళముల శ్రీఫల
దళనికరములం దిలాక్షతముల న్ననుని
మ్ముల్లఁ బూజించినధన్యుం
డిల జీవన్ముక్తుఁ డగు నహీనవివేకా. 99

గీ. హరిహరులపూజ కంతరాయంబు సల్పు
నరుఁడు నవలక్షవర్షముల్ నరకవాసి
యగు నటులు గాన విష్ణుశివార్చనముల
కంతరాయము సేయఁగా దనఘమతులు. 100

క. శివపూజ సేయు నతఁడుఁ
శివపూజాదర్శనంబు సేయునతండుఁ
శివపూజాముదితుండుఁ
శివమతిఁ గైలాసమునకుఁ జేరుదు రనఘుల్. 101

చిత్రరథుండును బూర్వభవంబునఁ బాపాత్ముం డయ్యు
శివపూజాదర్శనమహాత్త్వంబునఁ బవిత్రుండై తత్కార
ణంబున నవద్వీపం బనుపురంబునఁ జంద్రవంశంబునఁ
జంద్రాంగదుం డనునామంబున భూపాలుండై ప్రభ
వించి వాసనావశంబున సంతతంబును శివపూజ యాచ
రించుచు నిఖిలభోగభుక్తిం బరితృప్తుం డై శతవర్షం

బులు జీవించె నంత నతనిం గైలాసంబునకుం దెచ్చు
టకుఁ బ్రమథులచేత సూర్యసంకాశం బగువిమానరత్నం
బనిచితి నవ్విమానంబు నారోహించి గంధర్వగానమో
దితుం డై యప్సరస్సంఘంబులు గొలువ మత్సారూప్య
కలితుండును వీణాపాణియు నై యభ్రవీథి నరుగు
దెంచునప్పుడు. 102

ఉ. ఆయతకోటిభానుకము
దాప్తరుచిం బొలుపొందుతద్రథ
చ్ఛాయ కృతాంతువీటిపయి
జానుగఁ బర్వఁగ నందు దుర్గతిం
బాయక వ్రేఁగుమర్త్యులకు
బాధ దొలంగినఁ బొంగి యెవ్వఁడో
యీయనఘాత్ముఁ డిందు మము
నిండట మన్చె నధర్మవృత్తులన్. 103

తే. ఏమహాత్ము రథచ్ఛాయ యిందుఁ బర్వ
యింపుమీఱంగ మము సుఖియింపఁజేసె
నామహాత్ముఁడు మము నారకాలయమునఁ
బాపుఁగా కని పల్కి రప్పాపు లప్పుడు. 104

ఉ. ఆపలుకుల్ వినంబడిన
యంత నితాంతకృపార్ద్రచిత్తుఁ డై

యాపరమోపకారి రథ
మచ్చటికిన్ స్మరలించి నిల్వ న
ప్పాపులు నారకవ్యథలఁ
బాసి దివంబున కేఁగి రంత ని
ర్వ్యాపితతేజులై యమని
వాసముఁ జేరిరి తద్భటావళుల్. 105

వ. ఇట్లు చేరి వైవస్వతున కిట్లనిరి. 106

చ. అరదము నెక్కి యొక్క తరు
ణారుణసన్నిభుఁ డైనపూరుషుం
డరుగుచు నారకిప్రతతి
యార్తరవం బొనరింపఁ గాంచి తా
నరుగక నిల్చె నిల్చుటయు
నారథవీక్షణ మాచరించి యా
నరులు సుఖించి నాకభువ
నంబునకుం జని రద్భుతంబుగన్. 107

క. యమ రాజధాని నీసం
యమనీనగరంబు శూన్య మయ్యెన్ మే మా
య్యమవంతుఁ డెవ్వఁడో తెలి
యము దీనికిఁ బ్రతివిధాన మలవఱుపు మికన్. 108

వ. అని చెప్పిన విని దండధరుండు దండాహతకుండలితేజం
గునఁ గనలి యేతెంచి యద్దివ్యపురుషునిమూర్తిం గాంచి

తద్వీణాక్వణితశివనామం బాకర్ణించి పిపాసార్తుం డమృత
పానం బాచరించినభంగిం బొంగి నమస్కరించి యతనితో
నిట్లనియె. 109

మ. శివనామామృతవర్షి యై యరుగు నీ
చేఁ బొల్చువీణారవ
శ్రవణానందము నీదునిర్మలరథ
చ్ఛాయాపరీరంభ మై
భవముం గల్గుటఁ జేసి నారకులు సం
ప్రాప్తామరావాసులై
భవబంధాఘనివృత్తు లైరి సుకృత
భ్రాజిష్ణులం బోలుచుఁ. 110

తే. వెస మదీయాధికారంబు వీటిఁబోవఁ
బ్రమథవర పాడుచేసి తిప్పట్టనంబు
ధర్మమార్గరతుండ వై తనరు దీవు
ధర్మమర్యాద దాఁటంగ ధర్మ మగునె. 111

వ. ఇంక మే మెవ్వరిం దండింతు మెఱింగింపు మనినఁ జిత్ర
రథుం డతనితోడ. 112

సీ. కమనీయతరశివకల్యాణనామంబు
లనిశంబు పలుకనియట్టివారి
భూతియు రుద్రాక్షములు నంగములఁ దాల్ప
కత్యంతదురితాత్ము లైనవారి

ననయంబు భిన్నమర్యాదచేఁ బెంపొంది
హరిహరదూషకు లైనవారి
వైదికాచారంబు వఱదపాలుగఁ జేసి
పాషండవృత్తిచేఁ బరగువారిఁ
తే. దప్తతైలకటాహమధ్యమునఁ బ్రోల్చి
కశలఁ బ్రహరించి ముద్గరాఘాతములఁ గ
లంపు మని తెల్పి యపుడ కైలాసమునకు
నరుగుదెంచెఁ గృతాంతుఁడు నరిగెఁ బురికి. 113
క. ఈసత్కథ చదివిన న
త్యాసక్తి న్వినిన మర్త్యు లఘునివహములం
గాసి యొనరించి యట కై
లాసంబున నుండుదురు విలాసకలితులై. 114
వ. అని చెప్పిన నద్దేవునితో సర్వధర్మంబులలోన నుత్తమధ
ర్మం బెయ్యది యెఱింగింపు మనిన నయ్యాశ్వరుండు
నాతో నిట్లు లానతిచ్చె. 115
తే. సంయమీశ్వర వినుము సజ్జనులపొందు
తత్సహాభాషణంబు నత్యంతభక్తి
వారి సేవించుటయు వారి భూరిదాన
మహిమఁ బొగ్డుట ముఖ్యధర్మంబు లవని. 116
తే. సాధుసంగతి గౌతమీస్నానమును శి
వార్చనంబును జేయుఁగా నగు నరుండు

చెలఁగి సాధుజనాళిఁ బూజించెనేని
కలుగు ధర్మార్థకామమోక్షములు వరుస. 117

సీ. సాధుబృందములపార్శ్వప్రదేశముల ముఱ
దట వెన్క వసియింపఁ దగు నరుండు
సతతంబు సజ్జనసంగతిఁ బెంపొందు
నతఁడు దరించు భవార్ణవంబు
కుజనసంగతి గడుఁ గూల్చు నారకమున
మహిఁ విషసంగతమధువుభంగి
నెట్టియాపద్వేళనేనియు సత్సంగ
సంపరిత్యాగంబు సలుపఁ దగదు

తే. సాధు లెచ్చట నుండు రచ్చటు సమస్త
దివ్యతీర్థాస్పదం బయి తేజరిల్లు
వార లెచ్చట శిథిలజీవనతఁ బొలుతు
రచట దుర్భిక్షచోరబాధాదు లడరు. 118

క. మును విదురుఁడు సత్సంగం
బున వైకుంఠంబుఁ బడసె భువి దాసీనం
దనుఁ డెచట మోక్ష మెచ్చట
యనఘా సత్సంగమహిమ మలవియె పొగడన్. 119

తే. హరిహరులయందు సమచిత్తు లైనవారు
వైదికాచారరతు లయివఱలువారు

నాస్తికత గల్గి శ్రద్ధచే నలరువారు
సజ్జనులుసుమ్ము నిర్జరసంయమీంద్ర. 120

వ. అట్టిసజ్జనులం బూజించుట పరమధర్మం బని తెల్పిన
విని యే నిట్లంటి. 121

తే. శ్రుతివిరుద్ధకర్మరతు లైనబ్రాహ్మణ
క్షత్త్రవైశ్యశూద్రజాతములకు
నెట్టిగతులు గల్గు నెఱిఁగింపు లోకైక
నాథ శైలజాతనాథ యభవ. 122

వ. అనిన నీశ్వరుం డిట్లనియె. 123

ఉ. వేదవిరుద్ధకర్మ లగు
విప్రులు రాజులు నూరుజన్ములున్
మేదిని ఘోరబుద్ధు లయి
మ్లేచ్ఛజనిన్ జనియింతు రట్ల య
వైదికకర్మనిష్ఠల న
వార్యతపం బొనరించెనేనియుం
బాదభవుండు క్లేశములఁ
బాల్పడు సద్గతి లేదు వానికిన్. 124

వ. ఇట్లు చతుర్వర్ణాశ్రమంబులవారలును విపరీతకర్మంబు
లాచరించి మ్లేచ్ఛులై జనియింపుదు రట్లు గావున నైహి
కాముష్మికఫలప్రాప్తిం గోరి స్వజాతివిహితం బగు
కర్మంబు సేయవలయు నన్యధర్మంబు లొనరించినఁ

గీ. హాందు శూద్రుండు నిజధర్మంబు లైన విప్రసేవాదు
లవలనఁ దరియించు నెందును స్వకర్మవర్తనులు పూజ్యు
తము లని చెప్పిన నే ని ట్లంటి. 125

క. హరుసన్నిధి దీపం బిడు
నరునకు నెట్టిఫల మబ్బు నగధన్వ మహే
శ్వర విన వేడుక యయ్యెడిఁ
దిరముగఁ గృప యుల్లసిల్లఁ దెలుపఁగవలయున్. 126

వ. అని యడిగిన నప్పరమేశ్వరుం డిట్లనియె. 127

తే. దీపదానమహత్త్వంబు దెలియ వినుము
సురమునీశ్వర యత్యంతశుభకరంబు
తత్ప్రభావంబుచేఁ బిత్రుతతి వసించు
స్వర్గమున నారకానలవ్యథఁ దరించి. 128

ఆ. ఏతదర్థమైన యితిహాస మొక్కటి
గలదు దాని వినిన ఖలులకైనఁ
గలుషసముదయంబు దొలఁగు నిక్కువ మజ
తనయ వినుము సావధానముగను. 129

క. ఆది స్కందరుఁ డనునొక
భూదేవుఁడు గలఁడు క్రూరబుద్ధియుతుఁడు సం
ధ్యాదివిరహితుఁడు డన్య
స్త్రీనయితుఁ డకృత్యకరణశీలుఁడు ధాత్రిన్. 130

ఉ. వేమఱు నార్యులం బరిభ
    వించుఁ బరాన్నమె మెక్కు నెప్పుడుం
బామరత న్మృషార్థములె
    పల్కు నిషాదునిచేతనైనఁ దా
హేమము ప్రేమ నందికొను
    నెగ్గుఁ దలంపక జారచోరచూ
డామణి యాద్విజుండు నెఱ
    టక్కఁదనంబున కెల్ల నెల్లయై. 131

శా. ఆవిప్రాధముఁ డక్షకేళినిరతుం
    డై యాడి తా నోడియుం
దా విత్తంబున కెందునైనఁ జొరఁ ధా
    త్వర్థం బాగిం జేయుఁ గా
మావేశంబునఁ బుల్కసాంగనలతో
    నైనం బ్రవర్తించు ని
ల్లేవేళం బురిఁ దిమ్మరుఁ సుజను లెం
    త్రేఁ ద న్విగర్హింపఁగన్. 132

తే. అందఱకు దినవారతారాదికములు
దెలిపి యుపవాసనియతి విధించుఁ గాని
యతఁడు మానఁడు కృష్ణజయంతియందు
హరిదినంబున శివరాత్రి నన్నభుక్తి. 133

తే. హారెదినంబుల వేయింట నైన సుకృత
మొసరు నొక్కకృష్ణాష్టమి నుపవసింప
వేయికృష్ణాష్టములఁ గల్గు శ్రేయ మబ్బు
నొక్కశివరాత్రి మానవుం డుపవసింప. 134

సీ. శివపదధ్యానంబు శివనామపఠనంబు
ననిశంబుఁ జేయుమహాత్ముఁ డొకఁడు
శతరుద్రమంత్రసంగతి శివు నభిషేక
మాచరించినయట్టి యనఘుఁ డొకఁడు
శ్రీఫలదళముల శివుని సహస్రనా
మంబులఁ బూజించుమాన్యుఁ డొకఁడు
లలితప్రదోషవేళల శివదర్శనం
బారూఢిఁ గావించు నార్యుఁ డొకఁడు

తే. నవనిలోన జీవన్ముక్తు లగుట ధ్రువము
నిమిషమైనను మఱి యర్ధనిమిషమైన
శివుని భజియించువానికిఁ జిరతరముగ
నిఖిలలోకాధిపత్యంబు నివ్వటిల్లు. 135

క. ఇల నొకయఖండబిల్వ
దళపూజఁ గోసహస్రదానఫల మగుం
దులసీదళార్చనంబునఁ
గలుగుం గ్రతుశతము సేయఁగా నగుఫలముల్. 136

క. హరుని బంధురాఖండతిలాక్షతలను
బూజయొనరించు నెవ్వఁ డప్పూరుషవర్యుఁ
డఘతతుల డిగ్గఁద్రావి పూతాత్ముఁ డగుచు
నలరి కైలాసపదమున నధివసించు. 137

అమితంబుగ నవిషాన్నము
నములుటయున్ శోణితంబు నలిఁ ద్రావుటయుం
గ్రిమికీటభక్షణంబున్
సమ మగు శివరాత్రిఁ దినినసరసాన్న మిలన్. 138

ధరఁ జండాలాన్నముఁ గు
ర్కురపలలముఁ దినుట మే లగు న్మతి హరిప్రో
త్కరసంత్యాగము మే లగు
హరివాసరమున భుజించు నన్నముకంటెన్. 139

కనకస్తేయము గుర్వం
గనఁ గనయుట బ్రహ్మహత్య కాదంబరి క్రో
వ్వునఁ గ్రోలుట యుర వగు ని
మ్మనఁ గృష్ణజయంతి నన్నము దినుటకంటెన్. 140

అట్టివ్రతదినంబులందు భుజించి యు
మ్మందరాహ్వయుం డమందహర్ష
పరవశాత్ముఁ డగుచుఁ దిరిగె దేశములు ధ
నార్జనంబు సేయు నాస గాజలి. 141

వ. ఒక్కనాఁ డుజ్జయినీనగరంబునకుం జని యందు నలబ్ధా
హారుండై జఠరానలం *బినుమడింప నాసాయాంతం
బును బురవీథులం గ్రుమ్మరి విసివి యద్దినంబు శివ
రాత్రి గావున నుత్సవదినదిదృక్షాసమాగతతైర్థికజనసం
ఘంబులం జూచుచుఁ దోరణకాయమానవిరాజితంబును
ఘనసార గంధసార కాశ్మీర మృగమ దాద్యనులేపితం
బును నగరు గుగ్గుల ముఖ్య ధూపధూమ గంధ బంధురం
బును దీపమాలికాసమాక్రాంతంబును జంపక కర్ణికార
కరవీర మల్లికా మాలతీ బిల్వద ళాద్యనేకపూజాద్రవ్యభ
వ్యంబును భక్ష్య భోజ్య ప్రముఖ నైవేద్య పరిపూర్ణం
బును నానావ్రతిజనసమాకీర్ణంబును నఖండవిభవాభిశో
భితంబు నైన మహాకాళదేవుదేవాలయంబునకుం జని
యమ్మహాలింగమూర్తి సందర్శనంబు చేసి నమస్కరించి
కొండొకదడవు నిల్చి యద్భుతాత్ముం డిట్లని యూహించె.

తే. ఆఁకటికి నాకు నేమియు నబ్బదయ్యెఁ
బ్రాగ్భవంబునఁ జేయుపాపంబుకతన
నహహ సత్పాత్రునకును జన్మాంతరమున
నుపచరింపంగ లేనైతిఁ గపటవృత్తి. 143

క. జల భక్ష్య భోజ్య శాక
స్థల సూనృతభాషణముల సాధుజనుల కి

* బా మండింప—వ్రా. ప్ర.

మ్ముల దృష్టి సలుప నేన
క్కలుషంబున నిప్పు డిట్టిగతి వాటిల్లె. 144

సీ. ఈజన్మమున నైన గృహసమాగతు లగు
నతిథులఁ బూజింప నైతి నకట
యానిశంబు దుర్వ్యసనాభిభూతుండ నై
స్నానసంధ్యాదులు సలుప నైతి
నన్యాంగనాసంగమాసక్తి మసలితి
హరివాసరాదిపుణ్యవ్రతముల
క్షౌరకాలయమున క్షౌర మై సలిపితి
నపుడ తైలాభ్యంజనాదికములు

తే. కరనిపీడితచేలంబు గట్టుకొందు
నిట్లు మఱియు దరిద్రతాహేయ మగు కు
కర్మములు సేయుచుండితిఁ గాని సుకృత
కర్మ మొక్కటియును జేయఁ గాన నైతి. 145

ఆ. అన్నపూర్ణ యైన యవని నే నొకఁడన
యన్నకాంక్షి నగుచు నున్నవాఁడ
పాత్రములకు లేశమాత్ర మైనను దొలు
బాముసందు నిడనిపాపి నగుట. 146

వ. ఈజన్మంబునఁ దపోదానపూజాదు లొనరింపనికారణం
బున భవిష్యజ్జన్మంబునందును దరిద్రుండ నగుట తప్ప
దని తలంచుచు నాఁకటిపెల్లోఁపలేక శివార్పితం బైన

యీభక్ష్యభోజ్యాదిపదార్థంబు లీజనంబు లేమఱియున్న
తఱి నపహరించి భక్షించెదం గాక యని యద్దుష్టమా
నసుం డాసమీపంబునఁ బొంచియుండె నంత. 147

తే. ఆనిశీథంబు శివపూజ యాచరించి
జాగరణకేలిఁ దేలి యచ్చటిజనంబు
లలసి నిద్రింప దీపంబు లస్తమించె
నవతమస మల్లనల్లన యాక్రమించె. 148

సీ. అప్పుడు ద్విజాభాసుఁ డాశివాభ్యాశప్ర
దేశంబునకు నోదనాశఁ జేరి
యమ్మహేశసమర్పితాన్నము దృష్టిప
థాగోచరం బైన నతఁడు వేడ్క
ప్రబలి తత్రత్యనిర్వాణదశాఖిన్న
దీపంబు నిజపటాదీప్తవర్తిఁ
బ్రజ్వలింపఁగఁ జేసి పక్వాన్నభక్ష్యభో
జ్యాదులు గైకొని యరిగె నంత

తే. వానిచరణాగ్రి మొక్కనిమేను సోఁకఁ
దస్కరుం డని కూయ నత్తఱి నెఱింగి
యారెకులు ఱాల రువ్వి భిట్టార్చి చంపి
రవినయనిధాన మైన యయ్యవనిసురుని. 149

ఉ. ఆతఱిఁ గోటికోటిజల
జాప్తవిభావిభవాంచితంబు జై

వాత్మకకోటిశీతలము
వజ్రముఖాఖిలనూత్నరత్నవి
స్ఫీతము నై చెలంగు నొక
చిత్రవిమానవరంబు నెమ్మి నే
మాతనిఁ దోడితెచ్చుటకు
నంచితి మింపుగఁ బార్థదాళిచేఁ. 150

క. ఆహైమగగనయానా
రోహణ మొనరించి యప్సరోగణగాన
శ్రీహర్షితుఁ డై త్రిదశ
వ్యూహము వినుతింప నాతఁ డుజ్జ్వలమహిమన్. 151

వ. వేణువీణాగానముదితుం డై యక్షణంబ కైలాసంబున కరుగుదెంచె నిట్లు. 152

తే. అతఁడు దీపప్రదానమహత్త్వకలనఁ
బతితుఁ డయ్యును నిర్వాణపథముఁ గాంచె
నియతమతు లైన సత్కర్మనిరతు లవని
దీప మిడునట్టిమహిమంబు దెలుపఁ దరమె. 153

వ. కావున. 154

తే. దీపదానంబుకంటె నుత్కృష్టపుణ్య
మెయ్యదియు లేదు జగముల నెంచిచూడ
నిమిష మాహరిసన్నిధి నిలుపుదీప
మక్షయఫలం బొసంగు సంయమివరేణ్య. 155

ఆ. ఒక్కమాస మైన నొకయబ్దమైన న
ఖండదీప మిడునరుండు నిఖిల
దురితసమితి నొడిచి నిరతంబు శివలోక
మున వసించు దేవమునిలలామ. 156

సీ. గ్రహపీడ లడఁగు శాత్రవులు మిత్రతఁ గాంతు
రఖిలకామితసిద్ధి యగుఁ దలంప
నాయువు వర్ధిల్లు నట మనోవాక్కాయ
జము లైనకలుషసంఘములు దొలఁగు
జలగండములు దప్పు వెలయ రోగార్తుండు
దృఢశక్తియుక్తుఁడై తేజరిల్లు
వంధ్యఁ డెంతయుఁ బుత్రవంతుఁ డౌ దుర్గతుం
డనుపమసంపద నతిశయిల్లుఁ

తే. దీక్షఁ బూని యెంతయైన నుదారమహిమఁ
గోరి హరి నైన హరు నైనఁ గూర్చి యాజ్య
తైలములచేత నొక్కయబ్దం బఖండ
దివ్యదీపంబు నిల్పిన దృఢవివేక. 157

తే. అట్లు వర్షత్రయము దీప మవని నిల్పి
నతఁడె శంభుండు శౌరియు నతఁడె వర్ష
శతము భువి సర్వభోగసంగతిఁ జెలంగి
యంతమున మత్పథంబున నధివసించు. 158

వ. మఱియు దీపదానప్రకారం బెఱింగించెద. 159

తే. మాఘమైనను గార్తికమాసమైన
మొదలు గావించి సామజవదను విల్చి
పూజసేయంగవలయు సంపూర్ణభక్తి
ననుదినము నుండ్రకము లుపహార మొసఁగి. 160

వ. అవిఘ్నరాజసన్నిధి హరిహరులలో నొక్కని నుద్దేశించి పురుషప్రమాణం బైనదీపదారువుపై మృత్తామ్రపిత్తళ రజతపాత్రంబులలో నొక్కపాత్రంబున ఘృతంబును నించి కార్పాసకృతవర్తి నఖండదీపం బిడునది యిట్లొక్క వత్సరంబు గడచిన యనంతరంబ యథావిభవంబున నొక్కసువర్ణప్రతిమ రచియించి యందు నిష్టదేవత నావాహించి పూజించి. 161

తే. ప్రతిమయును దీపపాత్రంబు పటయుగంబు
ధర్మకర్మాభిరతునకు దాన మొసఁగి
యంత శక్తి కొలంది విప్రావళులకు
సరసమృష్టాన్న మిడి తృప్తి సలుపవలయు. 162

క. ఈసద్వ్రతంబు భక్తిం
జేసిన వాంఛితము లెల్ల సిద్ధించుం గై
లాసావాప్తియు నగు జల
జాసనసుత! మానవులకు ననవరతంబున్. 163

వ. మఱి యిక్కథాశ్రవణంబున నిఖిలదురితనివృత్తి యగు నని చెప్పిన నప్పరమేశ్వరునితో లక్షపూజాప్రకారం

బెట్టఁగింపు మని యడిగిన సద్దేవుం డిట్లనియె. 164

తే. చైత్రమున నైన మార్గశీర్షమున నైన
శుభదినంబున నేకాంతసుస్థలమున
విష్ణు నైనను స్వామి నైన వేడ్క నిలిపి
పూజసేయఁగవలయు సంపూర్ణభక్తి. 165

వ. ఉత్పల శతపత్త్రి కరవీర కాంచన చంపక ద్రోణ కుంద కురువ కాదికుసుమంబుల నైన నఖండ బిల్వ తులసీదళం బుల నైనను దిలాక్షతంబుల నైనను బూజించుచు నిత్యం బును షోడశోపచారవిధులం దనుపవలయుఁ బూజా సమాప్తి పర్యంతంబు నఖండదీపం బిడునది యథాశక్తి నొక్క సువర్ణప్రతిమ రచియించి లక్షపూజాసంపూర్ణం బైన యనంతరంబ దరిద్రుం డైన విప్రునకుఁ దత్ప్రతి మాదానం బొసంగవలయు. 166

క. తాన వని కేఁగి సూనవి
తానముఁ బత్త్రములుఁ గోయఁ దగు నర్చకు నిం
పూన నది యుత్తమం బ
న్యానీతసుమంబు లెల్ల నర్ధఫలదముల్. 167

తే. యానమునఁ దైర్థికునితీర్థయాత్రవోలె
విలిచి తెచ్చినవిరు లల్పఫలము లొసఁగుఁ
గానఁ బూజార్థ మలరులు తాన తేర
వలయు నిష్టార్థసంసిద్ధి వలయునేని. 168

తే. శివునిపూజకుఁ గొన్నినల్ సిద్ధమువేళఁ
కరపదస్థలముల వలండ్లు గాడెనేని
హస్తపాదంబు లూర్ధ్వరేఖాంకితంబు
లగుట కది యాదికారణం బగు ధరిత్రి. 169

క. ఇట్లు లక్షపూజ యింపొందఁ జేసిన
భూసురుండు రాజపుంగవుండు
హరిపదమున నైన హరనివాసంబున
నైన లక్షయేండ్లు లధివసించు. 170

వ. అని శివుం డానతిచ్చునవసరంబున. 171

ఉ. వాసవముఖ్యనిర్జరు ల
వారితభక్తి శనిత్రయోదశీ
వాసరపుణ్యవేళఁ జెలు
వంబుగ నద్రిసుతాసహాయుఁ డే
వాసురవంద్యమానచర
ణాంబురుహద్వయు నద్వయుఁ హార్యుఁ
వాసుకికంకణుఁ సుజన
వత్సలుఁ గొల్వఁగ వచ్చి రిమ్ములన్. 172

వ. ఇట్లు వచ్చి యక్కైలాసద్వారంబున. 173

క. శైలాదియనుమతంబున
నాలోనికి సమ్మదమ్మున నరుదెంచి వెసన్

శూలికి మ్రొక్కి తదాజ్ఞా
లీల సమాసీను లగుచు లేఖపత్రితతుల్. 174

తే. హరుఁడు గట్టిన కరికృత్తి హరువు గాంచి
దీని నేఁటికిఁ దాల్చె నద్దేవుఁ డనుచుఁ
దత్సభాస్థితు శైవకథారసజ్ఞు
ననఘతరు వామదేవుని నడుగుటయును. 175

క. కైలాసనగస్థితియును
ఫాలాక్షునిసన్నిధియును భవునికథలపై
హాళియు నివి యొక్కొకటియె
చాలవె యాదివిజవితతి జనిసఫలతకున్. 176

తే. దప్పి గొన్న జనం బమృతంబుఁబోలె
శివకథాసుధ నజరాళి చెవులఁ గ్రోల
నింపమర వామదేవమునీంద్రచంద్రుఁ
డిట్టు లని తెల్పఁదొణఁగె నహీనఫణితి. 177

చ. గజదనుజుండు నాఁ గలుగు
గాటపురక్కసుఁ డొక్కఁ డుర్వి స
ద్ద్విజుల ముదం బడంచియును
దేవగణంబులడంబు మాన్చియున్
భుజబలశౌర్యసంపదలఁ
బొంపిరివోవుచు నొక్కనాఁడు వా

రిజభవునొద్ద కేఁగి బెద
రించి కలంచెఁ దదీయలోకముల్. 178

వ. మఱియు. 179

శా. వైకుంఠంబున కేఁగి దానవుఁడు స
ర్వప్రాణిహింసార్థియై
ప్రాకారంబులు రత్నమందిరములుం
బ్రాసాదముల్ గూల్చి త
ల్లోకం బంతయు గాసిచేసెఁ దను నా
లోకింపఁగా నోప క
వ్వైకుంఠాదు లకుంఠభీతిమెయి దు
ర్వారత్వరం బాఱఁగన్. 180

వ. వెండియు. 181

ఉ. ఆ సముదద్విపాసురుఁ డ
హంకృతి నెందును మాఱులేక కై
లాసముఁ జొచ్చి దిక్కరి గొ
లంకునుబోలెఁ గలంచియాడెఁ దా
నాసమయంబునం బ్రమథు
లందఱు నొక్కటఁ గూడి వానిపై
నేసిరి యుద్ధదుర్మదు ల
హీనబలంబున నస్త్రశస్త్రముల్. 182

చ. ముసలగదాముసుండిశర
ముద్గరచక్రముఖాయుధౌఘముల్
వెసఁ బరగించి యద్దనుజ
వీరుఁ గలంపఁగ లేక వానిఁ దా
రసదృశవిక్రమంబుఁ గొని
యాఁగిరి వోఁడు శ్రమంబుఁ జెంద క
య్యసమశరారికింకరుల
నందఱ నాజిఁ గలంచె నీసునన్. 183

చ. కమలభవాండభాండములు
గాల్చు నవక్రపరాక్రమాన్వితుల్
పరిమథితతుల్ గజాసురుని
భారికిఁ గాక కలంగఁబాఱె ర
య్యమరవిరోధియుం బవనుఁ
డంబుధులం గలఁగించులీల వి
క్రమము మెయిం బరాజితులు
గా నొనరించి యలంచె వారలన్. 184

మ. కరిదైత్యేశ్వరుఁ డుగ్రకింకరుల ను
గ్రస్ఫూర్తిఁ బై గెల్చి యు
ద్వరతం గ్రమ్మఱి పట్టనంబులు గిరి
వ్రాతంబులం గూల్చుచుం

బౌరి నేఁగ న్నిజపూర్వజన్మకృతస
త్పుణ్యాపరిభావంబునన్
వరపాపాశికిఁ బుణ్యరాశికి దయా
వారాశికిం గాశికిన్. 185

వ. ఆ కరటిదానవుని ఘో
రాకృతిఁ గని వెఱచి పఱచి యన్నగరి ప్రజా
నీకంబు లుద్దవిడిఁ జని
శ్రీకంఠున కధికభక్తిఁ జేమోడ్చి వెసన్. 186

వ. ఇ ట్లని విన్నవించిరి. 187

క. దంతిరూపఘోరదానవుఁ డొకండు
నవసహస్రయోజనప్రమాణ
తనుఁడు వచ్చె వానిఁ గనుఁగొనునంతనె
గుండె లగిలె జనులకును మహేశ. 188

సీ. సచరాచరం బైన జగ మంతయును వాని
చరణమగ్నం బయ్యెఁ జంద్రమకుట
తపనీయగిరి వానిదంతాంచలంబునఁ
గందుకాకృతిఁ బొల్చె గరళకంఠ
భవవిష్ణుపద్మసంభవలోకములు వాని
బృంహితధ్వనిఁ బెల్చెఁ ద్రిపురదమన
ధరణి యంతయు వానికరశీకరాసార
ధారాహతులఁ గుండె ధరనివేశ

తే. యీదృశాకారదానవు నెన్నఁడైన
విన్నదియుఁ గన్నదియు లేదు విశ్వనాథ
వానిఁ బరిమార్ప నొరులకు వశము గాదు
దేవరకె కాని జగముల దీనరక్ష. 189

చ. వనజభవాండకోటు లని
వారణఫాలదృగగ్ని నేర్చి త
ద్ఘనభసితం బలందుకొను
కాంతతరాంగము గల్గు ప్రోడ వీ
వనయము కల్పవేళ సచ
రాచర మైనజగంబు నీదు కు
క్షిని దగఁ జొచ్చు నూతికిని
జేరెడుబాహ్యజలంబుపోలికన్. 190

తే. నిఖిలము నడంగునప్పుడు నిలుతు వొకఁడ
వద్వయం బైనబ్రహ్మంబ వయ్యు నీశ్వ
రాఖ్యఁ జిచ్ఛక్తిరూపిణి యైనకాళిఁ
గలసి క్రీడింపు దానందకాననమున. 191

వ. దేవా ప్రసన్నుండవై యద్దనుజుం దునిమి జగంబులు
మనుపు మని ప్రార్థించిన నాకర్ణించి విశ్వేశ్వరుం డక్కా
శికిం గ్లేశావేశ యగు నప్పిశితాశిం బరిమార్పం దలంచి
యర్ధనారీశ్వరం బైనదేహంబు ధరియించి వెడలె నప్పు
డయ్యురువురకు నత్యంతదారుణం బైనరణంబయ్యె నందు.

శుండాలదానవుఁడు నిజ
తుండం బెగయించి పట్టి ధూర్జటిపై రా
మెండుగ నద్దేవుఁడు శిత
కాండంబులు వఱపి వానిగతి మరలించెన్. 193

సీ. ఆశరంబులు దైత్యకాయమున నాఁటి
లోమములరీతి నొప్పె నాలోన వాఁడు
తరులు గిరులును నేయ నత్తఱిఁ బురారి
శకలములఁ జేసె సాయకసముదయముల. 194

ఉ. శిలలు శిలోచ్చయంబులును
జేకొని యద్దనుజుండు వెండియుం
జలమున నైవ శాతకులి
శప్రదరంబుల వాని నెల్ల న
గ్గలిక హరుండు ఖండములు
గా నొనరింపఁదొణంగె నిట్లు ని
శ్చలగతిఁ బోరి రిద్దఱును
సంగరరంగకళాప్రవీణులై. 195

తే. అర్ధనారీశదివ్యదేహంబు దనకు
మృత్యు వని యాత్మ నెంచి యాదైత్యుఁ డపుడు
ధీరతయు శూరతయు బలసారతయును
ప్రాపుగాఁ బోరె నావిశ్వభర్తతోడ. 196

క. ఉరుబలముం గౌశలముం
గరలాఘవ మశ్రమతయుఁ గదురఁగఁ బోరన్
హరుఁడు గను మెచ్చి వానిన్
వర మొసఁగెదఁ గోరు మని ప్రియంబుగఁ బలికెన్. 197

వ. పలికిన వాఁ డిట్లనియె. 198

క. ఈకాశిన్ మృతి యగు నది
శ్రీకంఠుఁడ వైన నీదుచే నగు నవి ప్ర
త్యేకమ యొక్కొకటియె మో
క్షాకలనకుఁ గారణంబు లగుఁ బరమేశా. 199

తే. అనఘ సాయుజ్యమునకంటె నర్థనీయ
వస్తు వెద్దియు లేదు తద్వస్తు వప్ర
యత్నమునఁ గల్గె దాని నే నడుగ నింక
నొక్కవర మిమ్ము దేవ నీ వొసఁగ దేని. 200

మ. అజరస్తుత్యవితానభాసురనితాం
తాపారసౌందర్యముం
ద్రిజగద్విశ్రుతమార్దవంబు నగరు
శ్రీఖండకర్పూరము
ఖ్యజగన్మాన్యమహాసుగంధమును గ
ల్గంజేసి యింపొంద సా
యజినం బీవు ధరింపఁగావలయు ర
మ్యాచ్ఛాదనప్రక్రియన్. 201

వ. అని కోరె నంత దేవగణంబులు దేవా యివ్వీరం బొసంగి
లోకకంటకుం డగు నిద్దానవునిం బరిమార్పు మని పల్కిన
నట్లకాక యని యద్దేవుండు. 202

క. నిజకరశరలాఘవ మ
య్యజరులు వినుతింప నొక్కయాశుగమున న
గ్గజదనుజు నేయ వాఁ డ
క్కజముగఁ గుంభములు పగిలి కడువడిఁ జెడియెన్. 203

లయగ్రాహి. భానుహిమభానుపవమానసఖలోచనుని
చే నిశితబాణహతి దానవుఁడు గూలం
బూని సురదుందుభు లనూనగతి మ్రోసె విరి
వాన గురిసెన్ విబుధమానినులనాట్య
శ్రీ నెరసెఁ జారణులు గాన మొనరించి రపు
డాని దిశ లన్నియు నహీనరుచిఁ బొల్చెన్
మానుగ సమస్తజనమానసము లుబ్బ నన
మానమృదుగంధశిశిరానిలము వీచెన్. 204

తే. అసురవరుకృత్తిఁ దాల్చి యాహరుఁడు కృత్తి
వాసుఁ డయ్యెఁ దత్కృత్తి యవ్వామదేవు
మాంసలాంసకయుగళిపై మహితమృదుత
రాంశుకాకృతి నలరారె నమరులార. 205

చ. జలరుహసంభవాండచయ
జన్మలయస్థితిహేతుభూతుఁడై

శివునకు నై ద్విజన్ములకుఁ
జెన్నుగ నన్న మొసంగుచుఁ శివ
స్తవపఠనాఢ్యుఁడై మెలఁగి
తాన శివుం డగు మానవుం డిలన్. 215

తే. భూతిరుద్రాక్షధారణంబును శివాల
యాదినిర్మాణమును శివధ్యానమును ద
*దర్చనంబుఁ దదీయనామానుకీర్త
నంబు నల్పతపంబుఫలంబు గాదు. 216

చ. అలరులు పత్త్రముల్ ఫలము
లంబులు శంభునివేదితంబులై
నలినదళాయతాక్షులను
నందనసుందరనిష్కుటంబులన్
లలితసువర్ణరత్నశుభ
లక్షణలక్షితసౌధపంక్తులన్
గలుగఁగఁజేయు మర్త్యులకుఁ
గామితవస్తుపురస్సరంబుగన్. 217

సీ. రుద్రాక్షమిశ్రితభద్రాంబువులఁ దోఁగ
భాగీరథీస్నానఫలము గల్గు
నాయువు వర్ధిల్లు నతిఘోరభూతముల్
చేరవు రుద్రాక్షధారణమునఁ

* దర్శనంబు—శర్హణంబు—వ్రా. ప్ర.

గనకవిద్రుమమధ్యఘటితరుద్రాక్షంబు
　　　　　　　నహరంబు ధరియింప నలరు సిరులు
ప్రభవించె రుద్రనేత్రమున రుద్రాక్షంబు
　　　　　　　వివిధపాపావళివిపినకీల

తే. వాని నష్టోత్తరశతంబు వ్రాసువాఁడు
బ్రహ్మ, తత్పంచశతధృతిఁ బరఁగువాఁడు
వెన్నుఁ డగు వెండియును నవి వేయిదాల్చు
వాఁడు శివుఁ డగుఁగాక కేవలనరుండె. 218

తే. ధవళభసితంబు నొసల వక్త్రంబునందు
శంభునామంబు రుద్రాక్షసమితికంఠ
సీమ నెవ్వని కలరుఁ దజ్జీవితంబె
జీవితము వానిశీలంబె శీల మరయ. 219

తే. భసితరుద్రాక్షధరుఁ డైన బ్రహ్మకులజుఁ
డతిపవిత్రుండు లోకత్రయంబునందు
నాతఁ డెయ్యది వీక్షించె నది పవిత్ర
నిరతిఁ జెన్నొందు నిందు సందియము లేదు. 220

తే. భూతిరుద్రాక్షభూషణస్ఫురితదేహుఁ
గాంచి శమనునికింకరుల్ గడుఁ జలించి
దవశిఖిశిఖాళిఁ గన్గొని దవులఁ బఱచు
మృగతతులువోలెఁ బఱతురు మిగులఁ బెగడి. 221

వ. కార్తికసోమవారాదిపవిత్రశివపవిత్రవాసర దినంబులను బర్వంబులను విష్ణువ్రతదినంబులను మన్వాది వ్యతీపాతంబులను స్నానదానాదికక్రియ లాచరించి యుపవసించి బ్రాహ్మణులకు యథాశక్తి భోజనం బిడు మానవుండు క్రతుకోటిఫలంబువడయు మఱి దరిద్రుండు తన లేవడికిం జింతించుచు నాశుభదినంబుల స్నానతర్ప ణాదికర్మంబులు సలిపి తపోనియతాచారుం డైన దాన ఫలంబు గాంచు నట్లుగాక ధనవంతుం డయ్యు నకృత్య కరణశీలుం డై దానధర్మాదివిరహితుం డైనయేని తరు గుల్మలతాదిస్థావరజన్మంబులు వడసి ఛేదచ్ఛేదనశీతాతప బాధాదిదుఃఖంబులం బొందుచు ని ట్లని తలంచు. 222

మ. మనుజత్వంబున మున్ను యౌవనధనో
న్మాదంబునం గ్రొవ్వి యే
మనిశంబు న్బుధులన్ హసించియు ధనా
శాయాతదీనాళిఁ బె
ల్చన మోఘాశులఁ జేసి భోగసుఖలీ
లాలంపటత్వంబునన్
మని క్రూరాశయతన్ వసింపఁ దరుజ
న్మం బబ్బె మా కియ్యెడన్. 223

క. ప్రాక్తనతనువున లోభా
సక్తిమెయిన్ ధర్మవితతి సలుపక భోగో

ద్వ్యక్తిం దిగ్రమ్మరుట న్సుఖ
భుక్తిరహితమైన మాగ్రనిపుట్టువు గల్గెన్. 224

క. కుజనులము గాన యీగతిఁ
గుజనుల మైతి మిఁక నైనఁ గుసుమఫలదళ
వ్రజములు సుజనుల కిడి మ
ర్త్యజనిం బొగ్రపింతు మనుచు నాత్మఁ దలంచున్. 225

వ. అని చెప్పి వామదేవుండు. 226

ఆ. పాత్రదానమున విపన్నుఁ డాపదఁ దరి
యించు నమ్మహాత్త్వ మెంచఁ దరమె
తరువులైనఁ దలఁచుఁ ద్వగ్దారు ఫల దళ
మూలవితతిఁ బాత్రములకు నొసఁగ. 227

వ. ఇత్తెఱంగునం దలంచి. 228

చ. అట ఫలసూనదానకల
నాభ్యుదయంబునఁ బాపముక్తిగా
విటపిలతాకృతుల్ దొలఁగి
వేమఱుఁ గుక్కుటకాకఘూకఘు
ర్కుటకిటిముఖ్యయోనులఁ ది
రంబుగ నుద్భవ మంది యందుఁ బ్ర
స్ఫుటతరదుఃఖముల్ గడచి
సొంపటి మర్త్యతఁ గాంతు రంతటన్. 229

సీ. దుష్కృతనిరతుండు తొలుతఁ జండాలుఁడై
పుట్టి యొకానొకపుణ్యమహిమఁ
బస శూద్రజనితతిఁ బ్రాపించు నందు ని
త్యము విప్రసేవాదిధర్మకలన
సట బహువైశ్యజన్మావాప్తిఁ గొఱలుఁ దా
నందు నధ్యయనాదు లలవరించి
పిమ్మట నృపతనుల్ పెక్కులు దాలుచు
మహితసద్రక్షణమహిమఁ దనరి
తే. యందుఁ గర్మక్షయం బైన నవనిసురతఁ
జెందు నందును సత్కర్మశీలుఁ డగుచు
మీఱి నిరతంబు బ్రహ్మవిచారుఁ డైన
నంత నిర్వాణఘనుఁ డగు నింత నిజము. 230

వ. ఇట్లు దుర్లభం బైన విప్రత్వంబు గాంచి యందుఁ గర్మ
చ్యుతిఁ బతితుం డైన వెండియు స్థావరజంగమాదిజన్మం
బులఁ బొందు విప్రులు హరిహరులకుఁ బూజనీయులు
వేదపారగుం డైనవిప్రుండు సర్వగురుండును వందనీయుం
డు నగు. 231

తే. తెలియ వశమౌనె శివమాయ దేహులకును
దాని శివుకృప లే కెట్లు దాఁటవచ్చు
హరుని భజియింపఁ దత్కృప యపుడె కల్గుఁ
గానఁ దరియింతు రమ్మాయ ధరణిజనులు. 232

మ. నిరతాచారులు నిర్మలాశయులు ని
ర్ణిద్రాగమోక్తక్రియా
నిరతుల్ దైవతదూషణోక్తి విముఖుల్
నిర్మాయులుం శంభుస
త్కరుణాపాత్రులు దేవదూషకులు శ్రౌ
తస్మార్త ముఖ్యక్రియో
త్కరదూరుల్ ఖలులుం మహేశుకృపకుం
గా రెంతయుం బాత్రముల్. 233

చ. అనశనదీక్షఁ బొల్చు నసన
కాదులు వేదవిశారదుల్ తపో
ధనులు గనంగలేని శివ
తత్త్వము, రాగహతాత్ములై ఫలం
బనయము గోరి కొల్చి ఫల
మందక తక్కిన, నిష్టదేవతన్
ఘనముగ నిందసేయు నల
కట్టిఁడిమర్త్యులు గాననేర్తురే. 234

మ. హరమాయాంబునిధిం మునింగి ధనకాం
తావర్త గర్తంబులన్
వరుసన్ లోఁబడి యంత నంతరరిష
డ్వర్గోగ్రనక్రవ్యథా

తురతం గుందుచు విష్ణుభక్తి సభవుక్
దూషించుచు న్వొండి రూ
హరభక్తిన్ హరి నిందసేయుదు రసూ
యాగ్రస్తులై మానవుల్. 235

తే. భూసురుల దేవతలను దపోధనులను
నిందనం బొనరించిన నీచతముఁడు
శంభుమాయామహాత్మ్యుఁ డై స్వకృతసుకృత
మహిమఁ గోల్పడుఁ దా నొకమాటమాత్రి. 236

తే. వసుధఁ గార్తికమున నిందువాసరమున
శివుఁ దిలాక్షతములఁ దులసీదళముల
బిల్వదళములఁ బూజించి ప్రీణనంబు
సలుపఁ గలుగు నగ్నిష్టోమసవనఫలము. 237

క. తిలదానదీపదానం
బులు నుపవాసంబు హరిపూజయును వ్రతం
బులు కార్తికమాసంబున
నలరారఁగ నొక్కటొకటి యధ్వరసమముల్. 238

ఉత్సా. కార్తికమునఁ గల్యవేళ గౌతమిన్ మునింగి ని
ర్వర్తితస్వకర్ముఁ డైనవాఁడు త్రిదివవేశ్మియై
కీర్తిఁ బెక్కుదివసములు సుఖించి యంత మరలి భూ
భర్త యగుచు నుద్భవించు భవ్యభూతికలితుఁ డై. 239

ఆ. కార్తికంబునందు గౌతమీస్నానంబు
శశిదినోపవాససద్వ్రతంబు
నందుఁ బురహరార్పితాన్నదానంబును
దురితచరితులకును దుర్లభములు. 240

ఉ. పావనలీలఁ బొల్చు నల
బాహులమాసమురాక గాంచి గో
దావరివారిఁ గ్రుంకుచు సు
ధాకరవాసరసువ్రతంబు స
ద్భావనఁ జేయ భావభవ
భంజనుసన్నిధి యబ్బు నంచు దే
వావళి యుర్విఁ బుట్టుటకు
నాసపడుం దగ నెల్లవేళలన్. 241

చ. అతిథికి నూర్జమాసమున
నన్న మొసంగిన నాకలోకముం
జతురపటం బొసంగిన ని
శాకరలోకము తప్తకాంచనాం
చితమణిభూషణం బొసఁగి
చెన్నుగ నచ్చర లుండులోకమున్
వితరణశాలి గాంచుఁ బృథి
వీచరఖేచరపూజ్యమానుఁడై. 242

తే. వాసి గోదావరీతటావాసు లయ్యుఁ
గార్తికంబునఁ గ్రుంకని ఖలజనముల
తనువులు నిరర్థకంబులై తనరుఁ జర్మ
దారుకృతయంత్రపుత్త్రికాతతులమాడ్కి. 243

క. గోదావరిమజ్జనమును
శ్రీదయితత్రిపురహర్తుల సేవయు సత్సం
గాదరణంబును దానద
యాదులసంగ్రహము నరుల కఘనాశనముల్. 244

తే. ధనికుఁడై యుండి పుణ్యతీర్థంబులందుఁ
బుణ్యకాలంబులందును బుణ్యతార
లందుఁ బాత్రములకు లేశమైన నిడని
జాల్ముఁడు దరిద్రుఁ డగు జన్మజన్మములను. 245

తే. శైశవంబునఁ దారుణ్యసమయమునను
స్థావిరంబున ధనము పాత్రముల కొసఁగు
నతఁడు రెండవజనిఁ దత్తదవసరముల
నాఢ్యుఁడై భోగభుక్తిచే నతిశయిల్లు. 246

క. యాచకుఁ డడుగుచు నుండఁగ
వాచామాత్రంబు ప్రియము వల్కఁడయే న
న్నీచుఁడు మూవయుఁ జెవిటియు
నై చెడుఁ దా నంత వృక్షమై జనియించున్. 247

క. దీనత నడుగం జేరిన
మానితధరణీసురులను మన్నింపని పృ
థ్వీనాథునిరాజ్యంబునఁ
బూను ననావృష్టి దుఃఖములు పెల్లొదవున్. 151

క. శివునకుఁ బ్రియముగ దానము
శివపూజ పరోపకృతియుఁ జేయని యామా
నవుఁ డతనితనువుకంటెను
భువి మే లగుచుండు తోలుబొమ్మలమేనుల్. 252

తే. శివుఁడె తల్లియుఁ దండ్రియు శివుఁడె సఖుఁడు
శివుఁడె బంధుండు ధ్యేయుండు శివుఁడె సేవ్యుఁ
డఖిలము శివాత్మకంబు దదన్య మొకటి
గలుగనేరదు సకలలోకములయందు. 253

ఉ. స్థావరజంగమప్రతతి
సర్వ మఖర్వశివాత్మకంబుగా
భావమునం దలంచుచును
భక్తి మెయిన్ శివపూజసేయు న
ప్పావనుఁడే శివుండు శివ
భక్త్యతరస్మరణాఢ్యుఁడైన య
క్కేవలభక్తవర్యునకుఁ
గింకరుఁడు కృతాంతుఁ డుర్వరన్. 254

చ. శివుఁ డన నేన కా యనుచుఁ
    జిత్తమునన్ శివపూజసేయుచున్
శివశివ యంచుఁ బల్కుచును
    శ్రీశివసత్కథ లాలకించుచున్
శివమయ మిజ్జగం బనుచుఁ
    జెన్నుగ నెంచుచుఁ బొద్దుపుత్తు నా
శివుఁ డిఁక నన్ను నెన్నఁటికిఁ
    జేర్చిన నొచ్చెముగాదు మే లగున్. 255

తే. అనుచు నేవేళఁ బలికెడు నతఁడె శివుఁడు
సర్వమంగళసంగతు శైలకన్య
కాసహితు గాంగఝరధరుఁ గల్యవేళఁ
జింతసేయంగఁ దగుఁ బాపశాంతిఁ గోరి. 256

పృథ్వి. శివస్తవచయంబులున్ శివసహస్రనామంబులున్
శివాంతికతలంబునం జెలఁగి పల్కి రుద్రాక్షముల్
నవాచ్ఛభసితంబు సంతతముఁ దాల్చు నమ్మర్త్యుఁడున్
భవవ్యయవిదూరుఁడై భవతఁ జెందు నిక్కంబుగన్. 257

సీ. శివనామపఠనంబు సేయక యుఱిచిన
    రసనికల్ మండూకరసనికాళి
శివమందిరములకుఁ జేరక నడచిన
    యంఘ్రులు దారుమయాంఘ్రిచయము

శివలింగసంవీక్ష సేయక వీక్షించు
చక్షులు మాయూరచంద్రకములు
శివపదార్పితబిల్వసిద్ధవాసన లేని
ఘ్రాణయుగ్మము భస్త్రికాయుగంబు
తే. శివునిసత్కథ లనిశంబుఁ జెలఁగి వినని
కర్ణగోళము ఘుటగతాకాశతలము
శివునిఁ బూజింపఁ గానని చెనఁటికరము
దారునిర్మితనిస్సారదర్వి యుర్వి. 258

క. శివకథ వినుటయ తొడవగుఁ
జెవులకు, దానంబె తొడవు చేదమ్ములకున్
మివ్రుల భరం బగుచుండున్
భువిఁ గుండలకంకణాదిభూషణచయముల్. 259

తే. దేవదేవుని శివు మహాదేవు మాని
యితరదేవాళిఁ గొల్వఁగ మతిఁ దలంచు
నతఁడు భాగీరథీతటం బాసఁ జేరి
చెలమఁ ద్రవ్వంగఁ బూనినచెనఁటి గాఁడె. 260

ఆ. శివుఁడు మానసాబ్జసీమ వసింపంగఁ
ధ్వపుఱుకలుషసమితి దవులఁ బఱచుఁ
బూర్వశిఖరిమీఁదఁ బొలుపొందురవిఁ గని
సంతమసము వేగ జాఱునట్లు. 261

క. స్మరఘస్మరశుభనామ
స్మరణము తద్ధ్యానరతియు మఱి తత్పూజా
దరణము సంసారార్ణవ
తరణులు కలుషాంధతమసతరణులు ధరణిన్. 262

చ. పవలును రేయుఁ జేయు తత
పాతకజాత మడంగఁజేయుఁ దా
శివ యనుమాట యొక్కపరి
జిహ్వఁ బొసంగుమనుష్యకోటి కీ
యవని ననేకకోటిదురి
తాళి నడంచు తదీయశక్తి కిం
జవమతిఁ దూఁగుపాతకము
సల్పఁగలండె దురంతపాపియున్. 263

చ. ఒకపరి శంభునామము న
యోన్నతి నాలుకఁ జెందెనేనియుం
బ్రకటితజన్మకోటులకుఁ
బ్రాచితమై విలసిల్లు ఘోరపా
తకయుతుఁడైన శంకరప
దస్మరణంబున ముక్తిఁ జెందు జీ
హ్వకు ఫల మెల్లకాలము శి
వస్మరణంబె మనుష్యకోటికిన్. 264

తే. జన్మశతకోటికృతపాపశైలములకు
హరుని నామంబు శతకోటి యట్టినామ
కీర్తనంబును దద్ధ్యానవర్తనంబుఁ
దత్సపర్యయు సంసారతారకములు. 265

క. ఈయాఖ్యానము వినిన న
పాయంబులు వాయు సుకృత మబ్బు ధరిత్రిన్
ఆయువు పెరుగుం బిదప శి
వాయతననివాససిద్ధి యగు మనుజులకున్. 266

వ. అని చెప్పి నారదుం డిట్లనియె నవ్వామదేవువలన స్వర్గా
పవర్గకారణం బైన యాశ్వరమహిమంబు విని కృతా
ర్థులై యమ్మునిబృందారకబృందంబులు నంత. 267

చ. దశభుజుఁ బంచవక్త్రుఁ దర
తామరసాక్షుపరశ్వధాయుధున్
శశిధరు ఫాలలోచనుఁ బ్ర
సన్నముఖాంబుజు మానివందితుం
బ్రశమితదోషు నీలగళుఁ
బర్వతరాడ్తనయామనోహరున్
విశదశరీరు శంకరుఁ బ
విత్రచరిత్రునిఁ గాంచి మ్రొక్కుచున్. 268

వ. ప్రాంజలులై యిట్లని విన్నవించిరి. 269

చ. భవ భవదీయసన్మహిమ
పన్నుగ వింటిమి వాసుదేవుచేఁ
దవిలి భవద్భవిష్య దవ
తారకథల్ విన వేడు కయ్యె మా
కవి దయఁ దెల్పఁగా వలయు
నవ్యయభవ్యవచోవిలాసత
శివమతి యా మృకండసుతు
చే మును వింటిమి గొన్ని దత్కథల్. 270

వ. అని యడిగిన నద్దేవగణంబులతో నద్దేవదేవుం డాత్మభవి
ష్యదవతారకథావృత్తాంతం బిట్లని చెప్పం దొడంగె. 271

ఉ. రావణనామధేయుఁ డొక
రక్కసుఁ డుక్కునఁ ద్రేతయందు నా
చే వనజాతసంభవుని
చే వరలాభముఁ గాంచి మానుల
దేవతల న్బలారిముఖ
దిక్పతులం గడు బాధపెట్టు దు
ర్భావతఁ గుంభకర్ణుఁ డను
పాపుఁడు వానికిఁ దమ్ముఁడై తగున్. 272

ఉ. ఆదివిజాభియాతికి మ
హాగుణశాలి విభీషణుండు నా

సోదరుఁ డొప్ప వెండియును
 సోదరి శూర్పణఖాభిధాన యి
మ్మేదినిఁ గల్గుమాయలకు
 మేటి యనం బొలుపొందుచుండు మం
దోదరి నాఁగఁ జెల్వగుకృ
 శోదరి రావణుపత్ని యై తగున్. 273

ఉ. ఆమహిళాలలామకుఁ బ్రి
 యాత్మజుఁ డొక్కఁడు గల్గు నింద్రజి
న్నాముఁడు వెండియుం దనుజ
 నాథున కయ్యతికాయముఖ్యు లు
ద్దామబలుల్ జనింపుదురు
 దారుణగాత్రులు పెక్కుపుత్త్రు లి
ట్లామున వృద్ధిఁ బొందియతఁ
 డంత వసించును లంక యన్పురిన్. 274

చ. అడియుఁ ద్రికూటశైలశిఖ
 రాగ్రమునం దగి హేమవిస్ఫుర
త్సదనముల న్నవీనూత్నమణి
 జాలవినిర్మితసౌధవీథులం
గడియు గభీరనీరపరి
 ఘావృతసాలములం దనర్చు నం

పవలకు నాస్పదంబును శు
భప్రకరంబులతానకంబు నై. 275

సీ. అందుండి బలగర్వ మడర దశాస్యుండు
ఫలభుగ్గణంబులు బలసి కొలువ
యక్షకింపురుషాహిరాక్షసగంధర్వ
వరుల నిర్జరులఁ గిన్నరుల నరుల
నాహవంబుల గెల్చి యందఱసంపదల్
గైకొని యీగతి గాసి సేయఁ
ద్రిదశులు భీతిల్లి త్రిదివంబు దొఱఁగి మా
యావేషధరు లయి యవని కరిగి

తే. పవలు శాఖామృగాదిరూపములు దాల్చి
క్షపలఁ బైశాచవేషముల్ సవదరించి
యార్తిఁబడెఁ దద్వధోపాయ మాత్మఁ దలఁచి
శరణము భజింపుదురు మము సమ్మదమున. 276

ఉ. శ్రీమతిఁ బుష్కలస్తుతులు
చేసి దశాస్యకృతంబు లైన బల్
బాములు దెల్పినన్ విని కృ
ప న్సురసంఘముఁ గాంచి యేను శ్రీ
రాముఁడ నై జనించి యల
రక్కసుఁ ద్రుంచెద నేనె కాక య

ప్పామరు గెల్వ నొండొకఁడు
పొల్పడనోపునె ముజ్జగంబులన్. 277

ఆ. వాఁడు బ్రహ్మదత్తవరగర్వమునఁ గ్రొవ్వి
వాఁడు గాన జగమువాఁడి దున్మించు
ధరణి దశరథునకుఁ దనయుఁడనై రాముఁ
డనఁగ దనరి వానియెద టడంతు. 278

క. హరి లక్ష్మణుఁడై మఱియొ
దరతన్ జనియించి నన్నుఁ దగ సేవించున్
హరియించు నింద్రజిత్తున్
హరి దక్కఁగ వాని నొరుల కలవియె ద్రుంపన్. 279

ఉ. అవనితనూజ సీత గిరి
జాంశమునం బ్రభవించు రాఘవుం
డవని మదంశసంజనితుఁ
డై తగి దైత్యుల నెల్లఁ దున్మించు రా
ఘవుఁడె భవుండు విష్ణుఁడును
గంజభవుండును సర్వదేవతా
ప్రవరులు సీతయే యుమయుఁ
బద్మయు వాణియు దేవకాంతలున్. 280

వ. అని దేవగణంబుల సమ్మతిల్లంజేసి యనుపుదు మని చెప్పి
యీశ్వరుం డిట్లనియె. 281

ఆ. భువనమాత సీత భువిఁ గల్గు స్త్రీరూప
ములు ధరించి లోకముల వసించుఁ
బూరుషాకృతులను బొలుపొంది రాముఁ డ
జాండభాండములను నిండియుండు. 282

తే. రాముఁడె నిరంజనుఁడు పరబ్రహ్మ మభవుఁ
డాదికారణ మగు జగదావళికిని
సర్వగుఁడు సర్వసాక్షియు సర్వదేవ
వందితుండును కేవలానందమయుఁడు. 283

క. సనకప్రభృతులు విబుధులు
ఘనులు వసిష్ఠాదిమునులు గననేరరు రా
మునితత్త్వ మల్పమతు లగు
మనుజులు గన నెంతవారు మర్త్యములోనన్. 284

చ. అనిలజసేవితాంఘ్రిఁ గన
కాంబరుఁ గోటిమనోజసన్నిభున్
ఘనఘననీలవిగ్రహునిఁ
గౌస్తుభశోభితవక్షుఁ బద్మలో
చను నవనీసుతాయుతుఁ బ్ర
సన్నముఖాంబుజు రాము నెప్పుడున్
వినుతి యొనర్చువారలకు
వెండియుఁ బుట్టువు గల్గనేర్చునే. 285

సీ. ఋష్యశృంగమహర్షికృతసుతకామేష్టి
మహిమచే దశరథమహిభుజునకుఁ
బ్రభవించి రాముఁడు పరమపావననాముఁ
డనుజసమేతుఁడై యరిగి బాహు
కీలితశాతాసిఖేటకం దాటకఁ
బరిమార్చి ద్రోహు సుబాహు దునిమి
కౌశికుసవనంబు గాచి గంగాసరి
త్తరణం బొనర్చి గౌతమునిపత్ని

తే. శక్రమోహితయై పతిశాపవశత
దశసహస్రాబ్దములు శిలత్వము భజించి
శ్యామజీమూతసంఛన్నచంద్రరేఖ
యందమున నున్నదానిఁ బూతాత్మఁ జేయు. 286

చ. జనకునిపట్టణంబునకు
జానుగ నేఁగి రఘూద్వహుండు తా
ననువుగఁ గాకపక్షధరుఁ
డయ్యు నృపాలురు మెచ్చ మచ్చరా
సనదళనంబుఁ జేసి యల
జానకిఁ బెండిలియై యయోధ్యకుం
బనుపడ నేఁగు మార్గమున
భార్గవరాముని గెల్చు నుక్కునన్. 287

క. సీతాయుతుఁడై యట సా
కేతనగరిఁ జేరి సుజనకీర్తితకీర్తి
స్ఫీతగతిఁ గొన్నియబ్దము
లాతతసుఖకేళిఁ దేలు నతఁ డందుఁ దగన్. 288

వ. అంత. 289

ఉ. రాముఁ గుణాభిరాముఁ యువ
రాజధురంధరుఁ గా నొనర్పఁగాఁ
దా మది నెంచి పౌరజన
తం గని పఙ్క్తిరథుండు వల్కు నీ
రాముఁడు సర్వసమ్మతుఁడు
శాస్త్రహితుండును ధార్మికుండు నే
నీమహిభార మీయనప
యిర్ ఘటియించి సుఖింపఁ గోరెదన్. 290

చ. జనకునిపోలికం బ్రజ న
జస్రము బ్రోచు సుధాంశుకైవడిన్
జనులకు నెల్లకాలమును
జల్లఁదనం బొనగూర్చు రాముఁ డీ
యనయుఁడు మాకు రా జగుట
సమ్మతమే యన వార లుబ్బి యో
యినకుల మామనోరథము
నిట్టిదె పట్టము గట్టు మీ ఘనుల్. 291

క. అని పల్కు పౌరజనముల
యనుమతిఁ గొని రామదేవు నభిషేకింపన్
మనమున నుత్సుకుఁడై య
జ్జనపతి సంభారసమితి సమకూర్చెఁ దగన్. 292

ఉ. ఆనృపుభార్య కైక యను
నంగన యయ్యభిషేకసంభ్రమం
బానెఱిఁ గాంచి మున్ను వర
మానృపుఁ డిచ్చుటఁజేసి కోరు న
మ్మానిని యాత్మపుత్త్రి గరి
మంబునఁ బట్టముగట్ట రామునిం
బూని చతుర్దశాబ్దములు
భూరివనాంతరవాసిఁ జేయఁగన్. 293

తే. అతఁడు వరపాశకీలితుం డగుటఁజేసి
భార్య వేఁడిన నేమియుఁ బలుకకుండు
నట్లు కాదె దృఢవ్రతు లగుమహాత్ము
లాడఁబడినమాట వోఁ ద్రోవ నొర్వఁగలరె. 294

ఉ. ఆయెడ దేవతాగణము
లయ్యభిషేకశుభాంతరాయముం
జేయఁగ నాశ్రయించి నుతి
సేయఁగఁ గైకయు వారిబోధచేఁ

బాయక యవ్వరద్వయము
భర్తను వేఁడఁగ దైవవంచితుం
డై యొసఁ గిచ్చు సత్యరతి
నాత్మకులాంగనవాంఛితార్థముల్. 295

తే. సురలు విరులవాన గురియింతు రప్పుణ్య
రాశియైన పఙ్క్తిరథునిమీఁద
నతని సత్యమునకు నలరుచు నాత్మీయ
కార్యసఫలతకును గరముఁ బొంగి. 296

తే. చెలఁగి రాముఁడు పట్టాభిషేకవేళఁ
గైక యొసఁగినపరుషవల్కలముఁ దాల్చి
యవిరతానందమయుఁడు దా నగుటఁ దెల్పు
భోగయోగసమత్వవిస్ఫురణ దనర. 297

క. ఆరామునిముఖవిలసన
మారసి యాతండు శిష్యుఁడ యగు నిక్కము చె
ల్వార మనుజుండు గాఁ డని
యారాధి న్నిశ్చయింతు రావీటిప్రజల్. 298

ఉ. ఆతఁడె దండ్రియానతిఁ బ్రి
యావరజుండు సుమిత్రపట్టియున్
సీతయుఁ దోడ రాఁగ నత
సీసుమధాముఁడు రాముఁ డేఁగి గం

గాతటినీతటంబున సు
ఖస్థితి నిల్చి గుహాభిధానవి
ఖ్యాతుని శృంగిబేరనగ
రాధిపుఁ గాంచుఁ గిరాతవల్లభున్. 299

తే. ముందుఁ దా నెక్కి వచ్చిన స్యందనము సు
మంత్రుఁ డనుసూతవరునిచే మరల ననిచి
యమరనది దాఁటి యగ్గుహానునుమతమునఁ
జని యతండు భరద్వాజమునికి మ్రొక్కి. 300

ఉ. ఆఋషియాన పూని చని
యారఘువీరుఁడు గాంచు భూరిమం
దారనమేరువీరతరు
దాడిమముఖ్యమహీజవాటముల్
సారసుధారసాచ్ఛరుచి
సాంద్రనిర్ఝరాంచితసత్ప్రపీటముల్
శ్రీరమణీయదేవగణ
సేవితకూటముఁ జిత్రకూటముల్. 301

తే. అవనిజాలక్ష్మణసమేతుఁ డగుచు రాముఁ
డాధరాధరవరమున నధివసింప
నాథునునిఁ బాసి దుఃఖాకులాత్ముఁ డగుచు
స్వర్గమున కేఁగు దశరథక్ష్మావరుండు. 302

మ. ధరణీనాథుఁడు స్వర్గతుం డగుడు నం
తం గైకయీనందనుల్
భరతు న్మంత్రులు రాజ్య మేలు మనుచుం
బ్రార్థింప నాసత్యవా
క్పరతుం డొల్లక తల్లి నుల్లమునఁ దా
నిందించి శ్రీరాముఁ డే
నెరుగుం బౌరపురోహితార్యజనభృ
త్యామాత్యవర్గంబుతోన్. 303

క. ఈతెఱఁగునఁ జని యతఁడు గి
రాతపతిం గాంచి యట భరద్వాజునిచే
నాతిథ్యము గొని రాముని
హితలపతివసతి యమ్మునీంద్రుఁడు దెలుపన్. 304

చ. భరతవిభుండు గాంచు మద
బంభరడింభకగీతనాదమే
దురతరపాటలీవకుళ
తుంగలవంగసుగంధభారభా
స్వరమరుదంకురస్థగిత
సానుచరత్స్వరయుగ్మఝాటముల్
స్థిరగరుడాశ్మశోణమణి
చిత్రితకూటముఁ జిత్రకూటమున్. 305

క. చనిచని రాముఁడు గాంచెన్
మునివరు శరభంగు యోగముద్రాసంగున్
ఘనతరదురితవిభంగుం
జననుతవిమలాంతరంగుఁ జరదర్వాంగున్. 313

వ. అమ్మునీంద్రునిచేతం బూజితుండై యంత. 314

లయగ్రాహి. ఏముని జగంబులకు సేమము ఘటించుమతి
నాముకొను వింధ్యగిరిభూమి నణఁగించెన్
దామరససంభవముఖామరులు మెచ్చ వెస
నేమునిపయోధి యభిరామగతిఁ ద్రావెన్
భీమబలు నిల్వలునిబో మడఁచె నేముని త
పోమహిమ ముల్లసిల నేమునివరుం డు
ద్దామధృతిచే నహుషుఁ బాముగ శపించెఁ దగ
నాముని నగస్త్యు రఘురాముఁ డటఁ గాంచెన్.

సీ. అలఘుపాణిసరోజచులుకితవిషరాశి
హ్రదినీలలితజటాంచలుండు
జీవనకలుషవిద్రావణసన్మూర్తి
శక్రకృతాహార్యవైభవుండు
నాశ్యానురంజనాయత్తలసన్మతి
మహితకామక్రోధమర్దనుండు
జగదభిసన్నుతసర్వజ్ఞతాఖ్యాతి
శ్రీకరద్విజరాజశేఖరుండు

ననఘతరశుచిభాస్వదబ్జాంబకుండు
నచలధాముండు ద్వీపిరాడజినచేలి
భవుఁడు దా నైన కుంభసంభవునిఁ జేరి
యారఘుస్వామి వందనం బాచరించు. 316

మన్మార్త్యంతర మగుఘట
జన్మని వింధ్యాద్రిదమను సన్మునివరు ను
ద్యన్మతి భజియించుచు నా
చిన్మయుఁడు వసించు నతనిచే దీక్షితుఁడై. 317

అమ్మని యక్షయతూణీ
రమ్ములు నైంద్రి మగుచాపరత్నము దివ్యా
స్త్రమ్ములు నిస్త్రింశంబును
సమ్మోదితహృదయుఁడై యొసంగును బిడపన్. 318

నమయూరము. జానుగ నిసర్గబలశౌర్యయుతుఁ డయ్యెన్
మానివరదత్తశరమండలి కడంకన్
బూని యురుతేజమున భూపమణి యంతన్
సాన నొరవట్టు మణిచందమునఁ బోల్చెన్. 319

తే. అచట నతఁడు వసింపంగ నఖిలమునులు
నసురకృతబాధల నలంగి యరుగుదెంచి
రామ మముఁ గావు మనుచుఁ బ్రార్థన మొనర్చి
విన్నవింపుదు రిట్లు ప్రసన్నఫణితి. 320

ఉ. రక్కసు లాశ్రమంబులకు
రాయిడిసేయఁగ శేవగళ్లు మే
మక్కట చిక్కె నిద్దురయు
నన్నముగాన కనూనభీతి నీ
చక్కటి కేఁగుదెంచితిమి
స్నానము సంధ్యయు వేదపాఠముం
దక్కటికర్మకాండమును
డాలిమిఁ జేయఁగ లే దొకప్పుడున్. 321

వ. స్నానసంధ్యాదిసత్క్రియాకలాపంబు లకాలకృతంబులై యరిష్టం బాపాదించుం గావున నారక్కసుల నుక్కడంచి మమ్ముఁ బ్రోవు మని ప్రార్థించిన నారఘువీరుండు ద్దేవారులం ద్రుంచుటకుం బ్రతిజ్ఞచేసి వారల ననిపి యచ్చట నుండునంత. 322

క. శూర్పణఖ యనెడిదానవి
దర్పకదర్పార్త యగుచుఁ దనుఁ జేరఁగఁ బెం
పేర్పడఁగ ముక్కు దునుముచున్
స్వర్పతివినతుఁ డగు రామచంద్రుఁడు గడిమిన్. 323

చ. అదియును నేఁగి తెల్ప ఖరుఁ
డాదిగఁ బెక్కురు యుద్ధదుర్మదుల్
త్రిదశవిరోధు లాజి నెదు
రించిన నప్పదునాల్గువేవురం

గదనములోనఁ దున్ంచు లయ
కాలఘనాఘనశంబడంబర
ప్రిదరచయప్రియోగమున
రాముఁడు భీమగతిం జెలంగుచున్. 324

ఉ. వారలు మున్ను భూసురు ల
వారితభక్తి ననుంగుటించి దు
ర్వారతపం బొనర్చి కడు
వక్రతరోక్తుల ముక్తిఁ గోరుటన్
తా రమరారిజన్మములు
దాల్చిరి నే రఘురామునాకృతిన్
ధారుణిఁ బుట్టి వారి నుచి
తస్థితి ముక్తులుగా నొనర్చెదన్. 325

వ. ఇట్లు రఘువీరుండు ఖర దూషణ త్రిశిరఃప్రముఖచతుర్దశసహస్రదానవులం బరిమార్చి మోక్షలక్ష్మీకల్యాణగౌరవంబు సంఘటించుఁ ఖదంపడి యద్దానవి దేవదానవదుర్జయంబును ద్రికూటశిఖరిశిఖరస్థితంబును రత్నసంపూర్ణంబును నవకోటిశివాలయాధిష్ఠితంబును వేదనినాదనాదితంబును ననేకరాక్షససంకులంబును నిత్యమంగళాలంకృతంబును నగు లంకాపురంబునకుం జని నిజాగ్రజుండైనదశగ్రీవునకుఁ దద్వృత్తాంతం బెఱింగించిన నతండును నిజభగినిం జూచి రాక్షసవినాశనంబునకుం బొడమిన

ధూమకేతువుగా నెంచుచు నిట్లని వితర్కించు. 326

మత్త. మంటి నేఁబదిలక్ష లేఁడు లమర్త్యులం బొడఁగంటి ము
క్కంటివీటను విష్ణువీటను గంజగర్భునివీటనుం
గొంటి సంపద లెన్నియేనియుఁ గోరి చంద్రదినేంద్రులం
గంటి సైఁగ మెలంగఁజేసితిఁ గంటి సర్వసుఖోన్నతుల్. 327

ఉ. నందన మంతయుం బెఱికి
నాఁటితి మద్వనసీమఁ దత్తరుల్
బంధన బెట్టితిన్ దివిజ
పత్నులఁ దక్షకముఖ్యగాఢపా
ద్బృందము నాదుపేరు విని
భీతిఁ గలంగు మదీయమందిరా
ళిందమున న్వసింపుదురు
లేఖకులంబును దైత్యవర్గముల్. 328

వ. చతుర్దశలోకాధిపత్యవిరాజితుండ నై త్రిలోకమోహా
కం బైన యైశ్వర్యంబుసం జెన్నొందియు ననేకముని
సాధుబృందంబుల బాధించుచు నైశ్వర్యద్విగుణం బైన
పాపంబు భోగలుబ్ధుండ నై యాచరించితి నన్యక్షోభకర
ణంబు వెలిగ నైశ్వర్యంబు సంపాదింప నైతి. 329

తే. ఆయు విధి వ్యర్థమయ్యె నీయఖిలలోక
జయము దేజంబు నైశ్వర్యసంగ్రహంబు

బంధుహితపుత్త్రపౌత్త్రప్రపౌత్త్రతతియు
జాలములు గాక మోక్ష మీఁజాలఁగలవె. 330

వ. వారణాసీమరణంబును బ్రహ్మజ్ఞానంబును నిర్వాణప్రాప్తికిం గారణంబులు దురితచరితుండ నగు నాకు నీరెండును సిద్ధింపవు రాఘవుండు తండ్రియానతి నరణ్యంబున కేతెంచి యున్నవాఁ డమ్మహాత్మునిచేఁ గదనంబున మడసి ముక్తుండ నయ్యెద నాసత్యసంధుం డనపరాధుల హింసింపండుగావున నతనికి నొక్కయహితం బాచరించి తద్బాణహతి న్మృతిఁ బొంది ముక్తి వడసెద నని నిశ్చయించి మారీచుం డనురాక్షసునిఁ దత్కార్యసహాయార్థం బర్థించిన వాఁ డద్దశగ్రీవున కిట్లను. 331

చ. ఎఱుఁగుదు రామదేవు దను
జేశ్వర పిన్నటన్నాఁటనుండి మున్
వెఱచితి నమ్మహాత్ము శర
వేగము సైఁపక శైశవంబునన్
గఱచె ననేకదివ్యశర
కాండము లయ్యురువిక్రమాఢ్యుఁ డి
త్తఱిఁ దరమౌనె యాఘను ను
దగ్రబలున్ రణభీముఁ దాఁకఁగన్. 332

శా. ఏతన్మాత్రమె రాఘవుం డసురలో
కేంద్రా వెసన్ దానవ

వ్రాతంబుం బోలియుంప మానిసుజన
వ్రాతంబుల న్మనుప్రబ
స్ఫీతపరిక్రియ ధర్మము న్నిలుప నీ
పృథ్విన్ జనించె న్బలో
పేతుం డాహవకర్కశుం డతనితో
నేలా విరోధింపఁగన్. 333

క. రాక్షస! నీజీవితముల్
రక్షింపుము చెడఁగ నేల రామాగ్ని వెసన్
భక్షించుఁ దృణకణాకృతి
నక్షయశరశిఖల మర్మదాసురవితతిన్. 334

తే. అతఁడు బ్రహ్మాండలయకర్త యగుశివుండు
గాని కేవలమనుజుండు గాఁడు వినుము
ఖరవిరాధాదిదుష్టరాక్షసుల నెల్ల
సంగరావని నొడుచుట సాక్షిగాదె. 335

క. గిరిపక్షక్షయకరుఁ డగు
సురపతిగతిఁ బురము లేర్చుశూలిగతిన్ భా
స్కరకులజుం డాలంబున
సురవైరులమద మడంచుసూ దనుజేంద్రా. 336

వ. కావున నాబుద్ధి విని రామదేవునితో విగ్రహింపకు మని యనేకవిధంబుల బోధించిన గనలి యతండు మండలాగ్రం బెత్తి దండింపం జూచిన వెఱచి యమ్మారీచుండు. 337

ఆ. ఖలుఁడు వీనిచేతఁ బొలిసిన రాక్షస
జన్మ మబ్బు రామచంద్రుచేత
నీల్గ ముక్తి యొదవు నిది మంచి దని యియ్యా
కొనును దశముఖుండు పనుచుపనికి. 338

వ. అయ్యవసరంబున నారదుండు రాముసన్నిధి కేతెంచునంత.

ఉత్సా. నారికేళ పనస తినిశ నాగకేస రామ్ర మం
దార కుంద కదళికాది తరులు విరుల వఱలి చె
ల్వారు ఫలసమృద్ధి నలరి యతనియాశ్రమస్థలుల్
నారదునకు సంఘటించు నయనకంజపర్వముల్. 340

క. ఎదురేఁగి మ్రొక్కి యానా
రదునకుఁ బూజయొనరించి రఘుపతి యంతన్
వదనేందుజ్యోత్స్నాయుత
సుదరస్మితకాంతిగరిమ శోభిలఁ బలుకున్. 341

తే. అనఘ! మీరు గృహస్థగృహాంతరముల
కరుగుదెంచుట వారికి సతతలాభదశ్రీ
సమితిఁ గృపసేయుటకుఁ గాక సర్వధనవి
రక్తు లగుమీకు వేఱ కార్యంబు గలదె. 342

వ. భవదీయపాదరజంబున నాగృహంబుపవిత్రం బయ్యె నని
పల్కిన విని నారదుండు. 343

సీ. హరుఁడవు నీవ బ్రహ్మవు నీవ విష్ణుండ
వీవ శక్రాది దిగీశగణము

గవ్యభుక్తియుఁ దక్షకశంఖవాసుకి
ప్రముఖఫణీంద్రులు నమరవరులు
వాలఖిల్యాదిదివ్యమునీంద్రులును నీవ
కపిలాదులును మహాకచ్ఛపంబు
మండూకపతియును మహి నీవె హృదయస
ద్మముల వసించి భూతముల నెల్లఁ

తే. ద్రిప్పుదువు కీలుబొమ్మల తెఱఁగు దోఁప
నఖిలమును నీ వెఱుంగనియర్థ మెద్ది
పంక్తివదనుఁడు జగముల బాధ సల్పఁ
దెలుపవచ్చితి నవ్వార్త దేవరకును. 344

ఆ. మహతి యను విపంచి మహిమయించి యేను గా
నం బొనర్తు దనుజనాథునొద్ద
వేళ దప్పెనేని తాళక దండించుఁ
బదరి వీణెకాయఁ బగులఁ నడఁచు. 345

తే. జలజగర్భుఁడు వేదముల్ సదువుచుండ
దితిజపతియొద్ద వేళ యతిక్రమింపఁ
వతచపేటాహతుల నొంచు నతని సురలు
వెట్టిఁ ద్రొట్టుముచేసి సేవింతు రతని. 346

వ. ఇట్లు చతుర్దశభువనంబులకు బాధ గావించుచున్నవాఁ
డద్దురాత్మునిఁ బరిమార్చి జగంబులకు సేమంబు సంఘ
టింపు మని ప్రార్థించిన విని యారామదేవుండు. 347

తే. శ్రుతిపరాయణు లందఱు సోమయాజు
లందఱును జపహోమక్రియాదినిరతు
లందఱు నహర్ముఖస్నాన మాచరింతు
రట్టిదశముఖముఖుల నే నెట్టణంతు. 348

క. సోమకుఁడు శ్రుతుల్ గొని చనె
నాముని విష్ణుండు దెచ్చె నవ్వేదతతుల్
భూమి న్వ్యస్తము లైనఁ
శ్రీమతి రావణుఁడు సమము చేసి పఠించెన్. 349

వ. అనిన విని యద్దేవమునిప్రవరుండు. 350

ఉ. వారలు విప్రదేవముని
వర్యవిహింసకు లార్యనిందకుల్
భూరికృపావిహీనులును
బుణ్యవిహీనులు సత్యహీనులున్
దారుణకర్ము లన్యవని
తాధనలోలుపు లద్దురాత్ములం
బోర వధించి యీభువన
ముల్ గృపఁ బ్రోచినఁ బాప మబ్బునే. 351

తే. స్మరహరుండును హరియు బ్రహ్మయును నీవ
దేవకార్యంబుకొఱకుఁ బంక్తిరథునింటఁ
బుట్టినాఁడవు రామ యిప్పొలసుదిండ్లఁ
దునుము లోకంబు లెల్లను మనుపఁగోరి. 352

వ. నీస్వరూపంబు చింతింపుము రాజనందనునకు దుష్టనిగ్రహంబును శిష్టపరిపాలనంబు నవశ్యకర్తవ్యంబు లనిన రాఘవుం డమ్మునీంద్రుం గనుంగొని. 353

సీ. సత్యంబు నీమాట సంయమి ! నారూప
మే నెఱుంగుదు లోకహితముకొఱకుఁ
బుట్టితి దశరథుపుణ్యగేహంబునఁ
గ్రవ్యాదవర్గంబుగర్వ మడఁప
సీతాహరణకాంక్షఁ జేరుఁ బౌలస్త్యుండు
నా కనపాయిని లోకవినుత
నవనిజఁ దాఁచి మాయాసీతఁ గల్పించి
తత్కారణంబున దనుజుఁ దునుముఁ

తే. జాయ దర్శించుమాత్రనె బ్రహ్మహత్య
యట్టిసేతువు జలనిధియందు నిలిపి
యాసుధాకరసూర్య మీయవనిఁ గీర్తి
నినిచి కుశలంబు సంధింతు నిఖిలమునకు. 354

వ. అని పలికి యమ్మునీంద్రుం బనిచి యినకులుండు మృత్యుదేవత నాకర్షించి నీవు లంకాపురంబునకుం జని రావణాదిదానవులం ద్రుంపు మని పంచిన నది యిట్లను. 355

ఉ. రావణుఁ డేలు నప్పురవ
రంబు చొరంగఁ దరంబె నాకు నా

రావణు నాజ్ఞ లేక సుర
రాక్షస పన్నగ యక్ష ముఖ్యులుం
బోవఁగలారె రాజకుల
భూషణ బాధ యొనర్చె నన్ను న
ద్దేవవిరోధి యున్నతని
దిక్కున కేను నమస్కరించెదన్. 356

తే. ఐన నీయాజ్ఞ కైకొని యప్పురవరి
వేళ మొనరింతు దానవవీరువలనఁ
బ్రాణసంశయ మగు నని పలుక రాముఁ
డిట్టు లను దానితోడ నహీనఫణితి. 357

క. రక్కసిరాయని వెస నే
నుక్కడఁచెద వాఁడు చేరు నుగ్రాటవికిం
దక్కటి యసురుల నెల్లను
జక్కడఁపుము వానిపురికిఁ జని నిర్భయతన్. 358

వ. అని పలికి జానకిం జూచి. 359

తే. కంటివే సీత రావణు కైతవంబు
నీచవర్తనుఁ డైన మారీచుఁ గూడి
మాయచేయంగఁ దలఁచె మన్మాయ దెలియఁ
గాన కాతండు దౌష్ట్యంబుకారణమున. 360

వ. అనిన సీత యిట్లని పల్కె. 361

తే. ఈవు చంద్రకిరీటుండ వేను గిరిజ
నీవు పంకజనాభుండ వేను గమల
నీవు కాంచనగర్భుండ వేను వాణి
నిరువురముఁ బూజనీయుల మిద్ధచరిత. 362

వ. చిదానందమయుల మైన మన కిరువురకును భేదంబు లేదు. సూర్యసోమాన్వయులప్రదీపకుల మై రఘునిమివంశంబు లలంకరించి వసిష్ఠశతానందులయనుమతంబున వర్తిల్లుచున్నవార మేను నీడయుంబోలి వెనువెంట నంటి దేవరకు సేవ యాచరింపుదు నిట్లు సర్వలోకనిర్మాణప్రళయకర్తల మైన మనల నారావణుం డేమి సేయంగలండు వెండియు. 363

సీ. శతకోటిపద్యవిస్తృత మగురామాయ
ణంబు జగత్ప్రసిద్ధంబు దాన
నొకయక్షరము విన్న నుర్వి మానవులకుఁ
గలుషసంఘంబులు దొలఁగి పఱచు
విందు రెప్పుడు దాని విధిశివవిష్ణులు
వాల్మీకి యనుమునివర్యుఁ డదియు
సంకోచముగఁజేసి జగతిపై వెలయించు
నామ్నాయతుల్యమై యమరు నట్లు
తే. వేదములు తత్కథావృత్తి వెలయుఁ గాన
యఖిలసంభవనీయమై యలరుచుండు

సారె నక్కథలోనఁ గుశంకసేయ
నరుఁడు దుర్గతిఁ జెందు నింతయు నిజంబు. 364
తే. మును వసిష్ఠుండు వ్యత్యస్తముగ నొనర్చి
రామనామోపదేశంబు ప్రేమఁజేయ
నాజపంబున వాల్మీకి యయ్యె శబరుఁ
డతఁడు రామాయణముసేయు నచలనిష్ఠ. 365
క. వ్యత్యస్తరామమునుజప
కృత్యంబున ద్విజతఁ గాంచెఁ గ్రించుఁడెఱుఁగ వా
నిత్యము ఋజుతరజపి యగు
నత్యుత్తము భాగధేయ మడుగఁగ నేలా. 366
వ. ఇట్లు భవదీయచరిత్రంబును భవన్నామమహిమంబును
నత్యంతపవిత్రంబులై వెలయు ననిన జానకీదేవిపలుకు
లకు సంతసిల్లి రాఘవుం డప్పుడ మృత్యుదేవత నొక్క
మాయాసీతఁ గా నిర్మించిన నమ్మాయాసీతయుఁ
బ్రాంజలియై నిలిచి యమ్మహాత్మునితోడ. 367
శా. స్నానధ్యానజపాదిసత్క్రియలు ని
ష్ఠం జేయుమాసీంద్రులుం
గానం జాలని నీపదాంబురుహముల్
గంటం గనుల్ సల్లఁగా
నే నేపుణ్యము మున్ను చేసితినొకో
నిత్యంబు నీసేవ యు

త్యానందంబునఁ జేయఁ గంటిఁ బనిగా
మ్మా భూరికారుణ్యతన్. 368

క. అతిసుందరవిగ్రహుఁ డగు
పతి గలుగుట దుర్లభంబు పడఁతులకు న్మ
త్కృతసుకృతవశతఁ గలిగితి
వతులాకృతి నేను నీకు ననురూపఁగదా. 369

ఆ. పర్ణశాల యలికి పాకంబు సేయుదు
మూలవితతిఁ దానమునకు జలము
లందియిత్తు దేవతార్చన కలరులు
దెత్తు నుచితవిధులు దీర్పనిడుదు. 370

క. చతురమతి నన్నదానం
బతిథుల కిడి యారగింపుఁ డనుజుఁడు నీవు న్
క్షితి జన్మజన్మములకుం
బతి వీవే కావలయును బార్థివ నాకున్. 371

క. విహరింపుము నాతోడుత
నహరహము న్నిఁక నిష్టనై యుందు రఘూ
ద్వహ నీసుందరరూపం
బహహా వీక్షింప మిగుల నలరెం జూడ్కుల్. 372

తే. వనచరులఁ గూడి లక్ష్మణ వనికి నరిగి
ప్రసవఫలమూలములఁ దెమ్ము రామసేవ

సీయ జన్మంబు సఫలతఁ జెందు గాత్రి
మతిపవిత్రితరం బగు ననఘులకును. 373

వ. అనుచు మాయాసీత వలికిన విని నిర్వికారుండును స్వ
తంత్రుండును శివాత్మకుండును నైన రాఘవుండు సీతా
దేవిం దనయర్ధదేహంబున నిమిడ్చికొనియె ని ట్లర్ధనారీ
శ్వరుం డైన శరీరంబునం దేజరిల్లియు మాయాయవనికా
భిలీనుం డయ్యె నని చెప్పి శివుం డిట్లనియె. 374

ఆ. ఏను రాఘవుండ జానకి శైలజ
గాన యేకగాత్రకలితు లైతి
యట్టిరూపధరుని నాతొందలంచిన
గలుగు నిఖిలపుణ్యకర్మఫలము. 375

మ. భసితోద్ధూళితగాత్రుఁ బాటలజటా
భారు స్ఫురానందనో
ల్లసదర్ధాంగు దరస్మితాంచితముఖో
ల్లాసు స్వరాభీతిహ
స్తసముజ్జృంభితుఁ జాపఖడ్గకలితున్
శార్దూలచర్మాంబరు
రసికుం డై తలఁపం దదాత్మకతచే
రంజిల్లు మర్త్యుం డిలన్. 376

తే. అపుడు రావణుఁ డవనిజ నపహరింపఁ
దలఁచి పనిచిన మారీచదానవుండు

కూటమృగరూపధరుఁ డయి కూటసీత
యొద్ద విహరింప దాని నయ్యువిద గాంచు. 377

సీ. విహరించు నల్లన జవావహద్భ్రతిని
నలవోకఁ బులుమేయు నాస గొఱలి
చరియించు నొయ్యన చంచలేక్షణముల
ధవళకాంతులు తళ త్తళలు గులుక
మలయు నుజ్జ్వలహేమమణిమయాంగద్యుతు
లింద్రచాపప్రభ నినుమడింప
నడచు మెల్లన వసుంధరమీఁద ఖురహీర
దీధితుల్ రేయెండ తెరల వఱల

తే. గాలిదేవరమందురఁ గట్టఁ దొఱఁగి
పాఱుతెంచినవార్వంబువగిదిఁ బఱచు
నజునినిర్మాణకుశలత యుపహసించి
యందమున నందుఁ దిరిగె మిథ్యామృగంబు. 378

వ. అప్పుడు వినయావనతవదన యై సీత యామృగంబుతో
డం గ్రీడింపం గోరి రామున కిట్లను. 379

తే. పతియె తల్లియుఁ దండ్రియుఁ బతియె తోడు
పతియె బంధుఁడు మిత్త్రుఁడు పడఁతులకును
భ్రాతయును దండ్రి సుతుఁడు నల్పంబు నిత్తు
రమితముగ నిచ్చు భర్త నెయ్యమున సతికి. 380

వ. కావున నమ్మృగంబుఁ దెచ్చి నాకు మనఃప్రియంబు గా

వింపు మనిన రాముండు తత్క్షణంబ వరశరాసనధరుండై
తద్రక్షణార్థంబు లక్ష్మణు నియోగించి యమ్మృగంబు
వెనుకొని యతిదూరం బరిగి విసివి. 381

క. ఆ లక్ష్మణాగ్రజుఁడు ప్ర
త్యాలీఢస్థానవసతి నమరి పలాశిన్
వాలమ్మున వ్రేయుటయున్
హా లక్ష్మణ యనుచు వాఁడు నసువులు దొఱఁగెన్. 382

వ. ఆమ్మృగకళేబరంబు గొనుచు నతండు నిజాశ్రమంబునకుం
జనుదెంచె ననిన విని నైమిశేయు లటమీఁదటికథా
వృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయు, 383

ఉ. కైరవిణీమనోరమణ
ఖండశిఖండ యఖండగర్వదు
ర్వారమతంగజాసురజ
వప్రవిఖండనచండకాండ మా
యూరశిఖండమండనస
ముజ్జ్వలకాండ గవేశకాండ సం
తారకమండలాగ్రదిత
దానవమండల భోగికుండలా. 384

క. కర్మహరిసానుగర్భాం
తర్మగ్నజనౌఘవాంఛితప్రియధనస

న్నిత్రాణదత్త దక్షవి
నిర్మితమఖతంత్రభంగ నిహతానంగా. 385

వసంతతిలకము. తారాగమందిర విధాతృకిరీటకోటీ
స్ఫారాబ్జరాగరుచిబంధురదీపరేఖా
నీరాజితాచ్ఛపదనీరజ వేదవాహా
వారాశితూణ నిధివల్లభసఖ్యలోలా. 386

గద్య. ఇది శ్రీమద్గురుకరుణాతిశయలబ్ధకవితావైభవ
యీదులపల్లి శంకరమంత్రితనూభవ సుధీజన
విధేయ భవానీశనామధేయప్రణీతంబైన
స్కందపురాణంబున ధర్మఖండం
బను ప్రబంధంబునం
దష్టమాశ్వాసము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

# ధర్మఖండము



## నవమాశ్వాసము



శ్రీలలనాధిపమార్గణ
బాలార్కద్యుతిజటావిభారపినద్ధ
ప్రాలేయకిరణ దిక్చయ
చేలా చిన్మయవిలాస శ్రీగిరివాసా. 1

వ. అవధరింపుము వివిధపురాణకథాకథనప్రఖ్యాతుం డగు సూతుండు శౌనకాదిముఖ్యులం జూచి హరుండు సురగణంబులకుం దెల్పువృత్తాంతం బిట్లని చెప్పందొడంగె నట్లమ్మారీచవచనంబులు విని సౌమిత్రిం జూచి సీత యిట్లనియె. 2

తే. అన్న లక్ష్మణ నిన్ను మీ యన్న పిలిచె
నయ్యయో దైత్యమాయ నే మయ్యెనో కా
చనుము తోడుగ వేగంబె చనన్న పొమ్మని
యనుడు జనకజఁ జూచి యిట్లను నతండు.

క. వెఱ వేల నీకు రాముఁడు
కఱకంఠుఁడు గాని నరుఁడు గాఁ డసురతతిన్
నుఱుమాడి వేగ వచ్చున్
నెఱ వగుచేబలిమికలిమి నిక్కువ మబలా.

తే. అనుడు నాధోరణుఁడు మదహస్తి నంకు
శాహతిఁ గలంచుమాడ్కి నయ్యంబుజాక్షి
పరుషవాక్యౌఘముల నొవ్వఁ బలుక నోడి
యగ్రిజుం డున్నదిక్కున కరిగె నతఁడు.

ఉ. ఆతతి భిక్షువేషధరుఁ
డైదశకంధరుఁ డేఁగుదెంచినన్
భూతనుజాత నిక్కపుఁద
పోధనుఁ డంచు నమస్కరింపఁగా
నాతఁడు చేతు లిర్వదియు
నాననము ల్పదియుం జెలంగ నా
భీతమృగాక్షికన్ బెదుర
భీమతరాకృతితోడ నిల్చినన్.

ఉ. తక్కుసుఘోరరూపము ది
రంబుగఁ గాంచి నిమీలితాక్షి యై
యక్కమలాక్షి మూర్ఛిలఁగ
నంటఁగ నోడి త్రిశూలధారచేఁ

ద్రికొన్న నప్పలాశి తద
ధిష్ఠితలోష్టము వెల్లగించి స్రాం
పిక్క రథంబుమీఁద నిడి
యేఁగె విహాయసవీథి నొక్కఁడున్. 7

ఉ. ఆయెడఁ బక్షివంశమణి
యైనజటాయువు సత్త్వశాలి య
చ్ఛాయకుఁ జేరి పంక్తిరథు
సఖ్యము నెమ్మదిలోఁ దలంచి నే
నీయసురాధముం గడపి
యీసుదతిన్ విడిపింపఁ గల్గు నా
కాయతశుభ్రకీర్తి యని
యాతనిఁ దాఁకి యుఱుంతితోద్ధతిన్. 8

తే. తనదుముఖతుండమున వానితను వగల్చె
నాతఁ డసిఁ గొని క్రోధరక్తాక్షుఁ డగుచు
వ్రేయ నది తప్పఁ గ్రుంగి యవ్వీరుఁ జీఱె
వజ్రనఖతుండహతిఁ బక్షివల్లభుండు. 9

వ. ప్రహారద్వయవిద్ధుండై మూర్ఛిల్లి కొండొకవడికిం దెలిసి రాక్షసేశ్వరుం డప్పక్షి నీక్షించి యోపక్షి రాక్షసులకు నంగుష్ఠప్రదేశంబు మర్మస్థానం బది ఖండింపక మేలు చేసి తని పల్కిన నమ్మిథ్యావచనంబులు నిక్కంబులుగాఁ దలంచి యాశకుంతకాంతుండు. 10

క. అక్షణమ వానిపెనువ్రే
లక్షయజవశక్తిఁ దునుమ నరుదేరఁగ నా
రాక్షసుఁడు ఖడ్గమునఁ ద
త్పక్షంబులఁ దునిమె నేలఁబడి తన్నుకొనన్. 11

చ. తను విడిపింపవచ్చి నిహ
తం బగుగృధ్రముఁ గాంచి సీత స
య్యన నిజభూషణప్రతతి
యంశుకఖండమునందుఁ గట్టి తా
ననువుగ వైచెఁ బంప యను
నాపగ చెంతఁ జరించుకీశనా
థునియెదుటం బడం దనుజ
ధూర్తుఁడు గానకయుండఁ గ్రక్కునన్. 12

తే. క్రవ్యభుగ్రాజనీత యై గగనవీథి
నుత్తరీయంబు ముసుఁగిడి యువిద చనఁగ
ద్రవిడదేశాంగనలు సూచి తను హసింప
నరసి యమ్ముగ్ధ రోషతామ్రాక్షి యగుచు. 13

క. పయ్యెద దొలఁగిన నను మీ
రియ్యెడ హసియింపఁ బాడియే నేఁడు మొద
ల్పయ్యెదలు లేకయుండుఁడు
దయ్యంబులభంగి ద్రవిడతామరసాక్షుల్. 14

వ. అని దుఃఖార్తయై శాపం బొసంగె నారావణుండు వడి నిజ
పురంబు ప్రవేశించి సీతారూపాగత దైవమృత్యుదేవత
నశోకవనమధ్యంబున నునిచె నంత రాక్షసస్త్రీల వైధవ్య
సూచకంబులును, లంకాపురశృంగారవనవినాశపిశునంబు
లును నైనయుత్పాతంబు లనేకంబులు దోఁచినఁ గాంచి
నిమిత్తజ్ఞుండును మహాబలుండును నైనకుంభకర్ణుండు
దశగ్రీవున కిట్లనియె. 15

ఆ. అన్న చిత్తగింపు మవనిజఁ దెచ్చిన
నాఁటఁగోలె నీదునగరసీమఁ
బొడమె దుర్నిమిత్తములు పెక్కు లాసీత
సకలలోకములకుఁ జేటు సుమ్ము. 16

క. సత్యావ తత్పద విను మౌ
ద్ధత్యంబున నవనితనయఁ దగ నుంచెదవే
న్నిత్యం బగుతత్పతి
వ్రత్యానలమేర్చు దనుజవంశస్త్రీలన్. 17

ఉత్సా. ఏల సాహసంబు సేసె దిల్లి దానవేంద్ర సీ
తాలతాంగి నెచటఁ దెచ్చితచట నిల్పి రమ్ము ది
క్పాలవినుతకీర్తి రామభద్రసంజ్ఞ నసురులం
దీటుపఱుప నవతరించె దేవదేవుఁ డిమ్మహిన్. 18

తే. యాగకర్మస్థు విప్రుని ననపరాధి
వేదవిదుఁ ద్రుంపఁ డాధర్మవిదుఁడు రాముఁ

డహాహా ! నీ దగుజాహూళదార్ఢ్యంబుకతన
నణఁగె నుత్తమవిప్రత్వ మమరవైరి. 19

వ. తత్కారణంబున నీకు వినాశంబు వాటిల్లుట సిద్ధం బని పల్కినఁ గుంభకర్ణువచనంబు లాదరించి ప్రహస్తుండు రాక్షసులనెల్ల నిరీక్షించి యిట్లనియె. 20

సీ. హేమమందరవింధ్యహిమనగేంద్రంబుల
బాహులఁ బెకలించి బంతులాడఁ
గలశౌర్యనిధి కుంభకర్ణుఁ డీతనిగాత్ర
మీక్షింపఁగా నోడిహేమగర్భుఁ
డక్షులెల్లను మూసి యక్షణంబున నిష్ట
మగువరం బిచ్చి పొమ్మనుచుఁ బల్కె
నితనిఁ జూడఁగ నోపరింద్రాదు లెదురించి
చివ్వయొనర్చుట చెప్ప నేల

తే. యిట్టిబలశాలి నీతిమై నిట్లు దెల్పు
టంతకునకైన రామునకైన వెలిచి
కాదు సోదరజీవితకాంక్ష గదుర
బంధుశోకానహిష్ణుతఁ బలికెఁ గాని. 21

వ. కావున నీమహాత్మునిబుద్ధి యంగీకరించి మీరందఱు నేలి కసన్నిధిం దెలుపవలయు ననినఁ బ్రహస్తుపలుకులకు సమ్మతించి మయుండు రావణున కిట్లనియె. 22

డహహా ! నీ దగుణపాళదాష్ట్యంబుకతన
నణఁగె నుత్తమవిప్రత్వ మమరవైరి. 19

వ. తత్కారణంబున నీకు వినాశంబు వాటిల్లుట సిద్ధం బని
పల్కినఁ గుంభకర్ణువచనంబు లాదరించి ప్రహస్తుండు
రాక్షసులనెల్ల నిరీక్షించి యిట్లనియె. 20

సీ. హేమమందరవింధ్యహిమనగేంద్రంబుల
బాహులఁ బెకలించి బంతులాడఁ
గలశౌర్యనిధి కుంభకర్ణుఁ డీతనిగాత్ర
మీక్షింపఁగా నోడి హేమగర్భుఁ
డక్షులెల్లను మూసి యక్షణంబున నిష్ట
మగువరం బిచ్చి పొమ్మనుచుఁ బల్కె
నితనిఁ జూడఁగ నోపరింద్రాదు లెదురించి
చివ్వయొనర్చుట చెప్ప నేల

తే. యిట్టిబలశాలి నీతిమై నిట్లు దెల్పు
టంతకునకైన రామునకైన వెఱచి
కాదు సోదరజీవితకాంక్ష గదుర
బంధుశోకానహిష్ణుతఁ బలికెఁ గాని. 21

వ. కావున నీమహాత్మునిబుద్ధి యంగీకరించి మీరందఱు నేలి
కసన్నిధిం దెలువవలయు ననినఁ బ్రహస్తుపలుకులకు సమ్మ
తించి మయుండు రావణున కిట్లనియె. 22

ఉ. ఆర్య ! పులస్త్యవంశమణి
వయ్యయు వేదవిశారదుండవున్
ధైర్యవివేకశాలివి ప్రి
త్రాపవిశిష్టుఁడ విద్ధశౌర్యగాం
భీర్యధురంధరుండవు న
పేతకళంకుఁడ విట్టినీ వయో
యార్యవినింద్యదుర్గుణస
మగ్రుఁడ వైతివి వార్ధకంబునన్. 23

తే. వృద్ధుఁడవు గాన నీకు వివేక మొదవె
వయసు దిరిగినఁ బరలోకవాంఛ [illegible] ది
తిక్ష నిష్టంబుఁ బాత్రంబుఁ దీర్థయాత్ర
స్నానమును దానము జపంబుఁ జలుపవలదె. 24

సీ. వచ్చునే యిపుడు జవ్వనము వెండియు నీకు
నేల యిత్తెఱఁగున బేల వైతి
వారాముసతి నేఁటి కపహరించితి దండ
కారణ్యవీథిఁ దత్కారణమున
హాతుఁ డయ్యె మారీచుఁ డగుఁగాక యిం కెట్టి
ఫలము సేకుఱు నీకుఁ బలభుగీశ
యచిరకాలంబున నడఁగు నధర్మంబు
ధర్మంబు వర్ధిల్లుఁ దరతరంబ

తే. దేవదేవుండు రఘురామదేవుఁ డగుచు
నఖిలలోకహితార్థమై యవతరించె
నమ్మహాత్మున కపరాధ మాచరించి
లంకఁ జోకార్పఁగల వీవు పొంక ముడిగి. 25

వ. అని పలికె నంత విభీషణుండు రావణున కిట్లనియె. 26

ఉ. రాముఁడె విష్ణుఁడుర్విహరుఁడు
రాముఁడె బ్రహ్మయు రాక్షసేంద్ర యా
రాముఁ డవక్రధైర్యుఁడు ప
రాక్రమధుర్యుఁడు యాగరక్షకై
యామునఁ గాకపక్షధరుఁ
డై చని క్రూరబలాఢ్యఁ దాటకన్
జా మడఁగించె దీర్ఘతర
బాహు సుబాహునిఁ ద్రుంచె వేల్మిడిన్.

వ. అక్కాలంబున నీదుర్నయమహీజంబునకు మూలంబైన
మారీచుని సంహరింపం డయ్యె నమ్మహాత్మునిపరాక్ర
మంబు వాఁడెఱుంగు నది నీచేతనుం గొండొక వినంబ
డినయది యది యట్లుండె వెండియు నారఘుపుంగ
వుండు. 28

ఉ. ఆతపవాతబాధఁ బడి
యేఁకట నన్నపానముం గృశించు న

గ్గాతముధర్మగేహిని న
కల్మషఁగా నొనరించెఁ బాదకం
జాతరజోవిశేషమునఁ
జయ్యన నక్కమలాక్షియుం బలా
రాతిసుసంగలబ్ధ మగు
ప్రస్తరభావము వాసె నయ్యెడన్. 29

తే. మిహిరకులనందనుం డంత మిథిల కరిగి
తుండి బిసకాండమునుబలె ఖండపరశు
చండకోదండదండంబు ఖండములుగఁ
జేసె భూపాలమండలి చేరి పొగడ. 30

ఆ. ఆ స్వయంవరోత్సవాలోకనార్థి వై
యరిగి కాంచి తీవు నమ్మహాత్ముఁ
డమరమనుజవిస్మయాపాదిసౌందర్య
నిలయుఁ డగునొ కాఁడొ నిజము సెపుమ. 31

సీ. జానకీసహితుఁడై సాకేతనగరికి
నరుగుచుఁ గ్రోధరక్తాంతనయనుఁ
దతజటామకుటమండితు రాజతాచల
తులితాంగుఁ బ్రళయాగ్నిదుర్నిరీక్షుఁ
గార్తవీర్యభుజావిఖండనపాండిత్య
స్కంధావలంబితశాతపరశు

ధృతచాపు నేకవింశతివారభూరమ
ణాంకురమర్దను యమసమాను

తే. యుద్ధసన్నద్ధు భృగురాము నుగ్రధాము
వీరవరుఁ గాంచి రాముఁ డో విప్రవర్య
బలము లన్నియు నినుఁ గని పఱవఁదొణఁగె
నెద్ది కారణముగ వచ్చి తెఱుఁగఁజెపుమ. 32

వ. అనినం బరశురామదేవుండు. 33

తే. విప్రుఁ డని పల్కితివి నన్ను వినుము నీగృ
హాంగణమునకు నన్నభిక్షార్థి నగుచు
నరుగుదెంచినవాఁడనే ? యాజిభిక్ష
దక్క నొరుచేతఁ గొందునే దాన మనిన. 34

తే. చండగతి రాఘవుండు కోదండకాండ
మెక్కిడి శరంబు సంధింప నుక్కడఁగి
భార్గవుఁడు వీతలజ్జుఁడై ప్రాణభీతి
నతని శరణంబుసొచ్చి యిట్లనుచుఁ బల్కె. 35

ఉ. దేవ! యజాండభాండములు
దీలఁగఁ జేయుహారుండ వీవు లో
కావళి నెల్లఁ బ్రోవ మను
జాకృతిఁ బొల్చితి వట్లు గానిచో
భావభవారివి ల్దునుమఁ
బ్రాజ్ఞుఁ డొరుండు ధరం గలండె న

న్గావుము దీనపోష కరు
ణన్ శరణాగతు సేయఁ బాడియే. 36

వ. అని పలికినఁ గరుణాకరుం డైనరాఘవుం డాశరాసనంబు విడిచి యథేచ్ఛం జను మనిన నట్ల చేసి యాభృగూద్వహుండు పరమానందకంటకితహృదయారవిందుం డై యతనిం దీవించి మహేంద్రమహీధరంబునకుం జనియె నిది యంతయు నే నెఱుంగుదు నిట్టి యమానుషవిక్రమశోభితుం డైనయారామదేవుని నీవును మేఘనాదాదిలంకాపురనివాసిదనుజవీరులును సేవ సేయుంగల రారాఘునకు సీత నొసంగి శరణంబు సొరుము బాంధవుల రక్షింపుము [illegible] సోదరు లైన విడుతు రని పల్కిన రావణుండు గనలి విభీషణుం జూచి. 37

స్రగ్ధర. ఓరీ ! నాప్రాపుచే నీ వురుఘనకనక
ప్రోజ్జ్వలద్రత్నరామా
గారారామాదిసంపత్కలితలలితభో
గంబులం గ్రొవ్వియున్ మ
ద్వైరిం భూషించుచున్ దుర్వచనరచన నా
వాసిఁ గుందించె దౌరా
క్రూరాత్మా యెల్ల ని; *న్నేర్పునఁ దలఁగు గురు
ద్రోహి యీ వేల మాకున్. 38

* నిన్నేఁగుమ తలఁగు; నీ వేఁగుమ తొలఁగు—వ్రా.ప్ర.

తే. నాధనంబు భుజించుచు నాదుశత్రు
పక్షవశవర్తి వైతివి పాపకర్మ
యధిపుకార్యంబు విడిచి పరార్థకార్య
ఘటకుఁ డగువానిజన్మంబు గాల్చు టురవు. 39

వ. అని యతనిపై ననుకంప లేక తు్రింపం జూచుసమయం
బున నారావణునెయ్యంపుఁదోయ్యలి యైనమందోదరి
యిట్లనియె. 40

తే. ముదుసలితనంబు గదిరిన మునులకైన
వీటిఁబోవు సునీతి వివేకసరణి
యనినచో, నెందులకొ వేఱ యరుగ నేల
యీవె దృష్టాంత మిందుల కిందు్రవైరి. 41

క. ధర్మంబు లయకరంబు న
ధర్మము జయకరము ననుచుఁ దగఁ బశుబుద్ధిన్
దుర్మతి పలికెదుగాని య
ధర్మాత్ము వహింపలేదు ధర యెల్లపుడున్. 42

తే. ధర్మ మెచటు నుండుఁ దడయక యచ్చట
జయము గల్గు ధర్మసంగ్రహుండు
చెడఁ డధర్మరతుఁడు చెడుఁ దక్రిసంగతి
సార మడఁగు క్షీరపూర మట్లు. 43

ఉ. మానిజనాశ్రమంబులు గ్రి
మంబుగఁ బాడుగఁ జేసి దేవతా

మానినులన్ హరించి గిరి
మం జెఱఁబెట్టితి దుర్వినీతిచే
మానవనాథులం బిలుకు
మార్చితి పేర్చినవిక్రమంబునం
దానవనాథ యోగతి న
ధర్మమె చేసితి వెల్లవేళలన్. 44

మ. భవదానీతపతివ్రతాతిలకశుం
భచ్చిత్తసంక్షోభసం
భవకోపాగ్ని ధరాత్మజాజవమరు
త్ప్రాప్తిన్ దురాధర్షమై
భవదీయాన్వయ[illegible]
ఝాటిల్లి యేర్చుఁగా మనో
భవుఁ బాటించినధర్మదూరులకు సం
ప్రాప్తింపవే యాపదల్. 45

శా. మాయాభిక్షుఁడవై హరించితివి రా
మప్రేయసిన్ రాముఁ డ
చ్చాయన్ * లేమిని దీన నేమి కలుగున్
జానొందఁ నీనెమ్మదిన్
మాయాకృత్యవిశారదుండ ననుచున్
మతిల్లె దారాముస

* రామిడి దీన; రామిడి నైన—వ్రా ప్ర.

న్నాయమావార్ధికి నీదుమాయలు ధర
న్నాదేయకుల్యాతతుల్. 46

సీ. అతనిమాయాంబుధి నబ్జగర్భాదులు
మునుఁగుచు నుందురు మోహవశత
వరవర్ణినీధనావర్తద్వయంబునఁ
బడి మును లైనను గడవలేరు
ప్రకృతితమోగుణబద్ధులై పరగెడు
దానవు లవ్వార్ధి దాఁటఁగలరె
శామానపాయిని యామహీసుత శివు
నర్ధాంగమున నుండు నార్యలో లె
తే. భర్తృదేవత గాన యప్పద్మనయను
వల్లభునితోన చనుదెంచె వనికిఁ దత్ప
యోజముఖిఁ దెచ్చి యూరక యున్నవాఁడె
యతనివంచనఁ దెలియులే వైతి గాక. 47

సీ. బాహుబలాఢ్యు సుబాహుఁ ద్రుంచి మఖంబు
గావంగ జానకిఁ గావలేఁడె
పతిశాపహత యైనసతి నహల్యాదేవి
గావంగ జానకిఁ గావలేఁడె
ఖరవిరాధాదుల ఖండించి మునితతిఁ
గావంగ జానకిఁ గావలేఁడె

శబరికిఁ బతితాంకకబరికి గతు లిచ్చి
కావంగ జానకిఁ గావలేఁడె

తే. హరుఁడు హాటకగర్భుండు హరియు నతఁడ
బహుళమాయావి జనులకుఁ బ్రభుఁ డతండ
యువిద నతఁడు రక్షించియ యున్నవాఁడు
నీవు దెచ్చుట మిథ్య యోనిర్జరారి. 48

వ. అది యెట్లం టేని. 49

తే. మృత్యు వీలంకఁ జొరలేక మిడికి రాము
శరణు భజియింప నమ్మహాపురుషవరుఁడు
నిను సబాంధవముగఁ దుంచుమనసు పూని
దాని సీతగ నిర్మించె దనుజవర్య. 50

ఉ. రాముఁడు ధార్మికుం డనవ
రాధుల సాధుల బాధసేయఁ డా
రామున కీ వొనర్చి తప
రాధము నీదగు భూసురత్వముం
గాముకవృత్తిఁ బూని పర
కాంతలఁ జెందుటఁ బోయెఁ; నయ్యెఁ బో
యీ మహి రాముకార్యమును
మృత్యువుప్రకార్యముఁ బ్రాణినాయకా ! 51

క. మృత్యువు నిచటికిఁ దెచ్చితి
సత్యం బది సీత గాదు. చని రామున కా

మృత్యువు మరల నొసఁగి కృత
కృత్యుఁడ వై బంధుజనుల నెల్ల మనుపుమా. 52

వ. అని తెలుపుమందోదరివచనంబు లాకర్ణించి రావణుండు మిన్నకుండె నంత నిచ్చట. 53

తే. రామదేవుండు తమ్మునిరాకఁ గాంచి
యేమిటికి వచ్చి తీ వమ్మ పేర్మి జడించి
యామగువ నిన్నుఁ బరుషోక్తులాడె నొక్కొ
కామినులపల్కులకు మేర గలదె చెపుమ. 54

క. తముఁ గినిసిన మన్నించిన
సమదృష్టిని మగనిఁ గవయుచానలు వెకుం
ఠమునం గైలాసంబున
నమరావతి నైనఁ గలుగ రవనిం గలరే. 55

తే. తెలివకు విధేయుఁ డగుచు వర్తించువాఁడు
పూరుషాధముఁ డతని నప్పొవ్వుఁబోఁడి
కోఁతివలెఁ ద్రిప్పుచుండు నిక్కువము ధాత్రి
నతివ యధికార మైన గేహము నశించు. 56

తే. లలన మగవానియంగద దెలియలేక
పనుచు దుష్కరతర మగుపనికి నైన
స్త్రీవిధేయతచే నేనుఁ, జెలఁగి దాన
ధర్మమున నీవు నిచట నిదర్శనంబు. 57

గోటకవ్వ. అని లక్ష్మణుఁ బల్కుచు నాయనతోఁ
జనుదేర నిజాశ్రమశాలకుఁ జ
య్యన నేఁగి ధరాత్మజ యచ్చట లే
మి నతం డట పల్కు సుమిత్రసుతుఁ. 58

తే. పద్మమిత్రాభ కంటె? యిప్పర్ణశాల
విన్ననై యున్న దయ్యలివేణి లేమి
మంజుభాషిణి సీత యమ్మహిషిఁ బాసి
యెలమి విరహానలంబు సహింపఁదరమె. 59

వ. అని వంచనావచనంబులం దమ్ముని మోహపఱుచుచు
నతండునుం దానును సీతాన్వేషణంబునం జని చని గౌత
మీసరిత్తీరంబున నిలిచి. 60

క. రావణుదుశ్చేష్టలు గో
దావరి యెఱిఁగింపదయ్యెఁ దా నిపుడు జగ
త్పావని ననుచుం బటుద
ర్పావిలమతి నన్ గణింప దయ్యెం గంటే. 61

తే. గౌతమీ నేఁడుమొదలు నిక్కంబు గాఁగఁ
బావనార్థంబుగా నీదుజీవనముల
స్నాత యగువాఁడు చండాలజాతిఁ బుట్టి
జగతి నప్పుడ యాత్మతేజంబుఁ దొఱఁగు. 62

వ. అని శపియింప గౌతమియు

బనిశము విప్రహత్య మొద
లైనమహాఘములం దొలంచు న
జ్జనపతిఁ గంటి వెండియును
శాపభయం బిఁక నేల గల్గు నా
ఘనునకు నేఁ దనూజ నను
గావఁడె కారుణికత్వ మేర్పడన్. 63

వ. అని చింతించి. 64

మ. నలినాస్యంబు మృణాళబాహువులు
మీనస్వచ్ఛనేత్రంబు ల
జ్జ్వలహంసీగమనంబు చక్రకుచముల్
సత్ఫేనహాసంబు భ్రం
గలసత్కుంతలముల్ దరంగవళులుం
గన్పట్ట నాగంగ త
జ్జలమధ్యంబుననుండి వచ్చె సురయో
షావేష మేపారఁగన్. 65

క. సనకాదిమౌనిమానస
వనరుహకింజల్కపుంజవాసిత మగురా
మునిచరణద్వయమున కా
ఘనవేణి నమస్కరించి గౌతూహలతన్. 66

వ. ఇట్లని విన్నవించె. 67

బనిశము విప్రహత్య మొద
లైనమహాఘములం దొలంచు న
జ్జనపతిఁ గంటి వెండియును
శాపభయం బిఁక నేల గల్గు నా
ఘనునకు నేఁ దనూజ ననుఁ
గావఁడె కారుణికత్వ మేర్పడన్. 63

వ. అని చింతించి. 64

మ. నలినాస్యంబు మృణాళబాహువులు
మీనస్వచ్ఛనేత్రంబు లు
జ్జ్వలహంసీగమనంబు చక్రకుచముల్
సత్ఫేనహాసంబు భ్రం
గలసత్కుంతలముల్ దరంగవళులుం
గన్పట్ట నాగంగ త
జ్జలమధ్యంబుననుండి వచ్చె సురయో
షావేష మేపారఁగన్. 65

క. సనకాదిమానిమానస
వనరుహకింజల్కపుంజవాసిత మగురా
మునిచరణద్వయమున కా
ఘనవేణి నమస్కరించి గౌతూహలతన్. 66

వ. ఇట్లని విన్నవించె. 67



క. విజితద్వంద్వులు కందరాశ్రియులు సం
విద్భువ్య లాంబద్ధశో
ధజటాభారులు నైనయోగులు సము
ద్యన్నిష్ఠ నీఁ గాంచిరే
నిజజన్మాంతరపుణ్య మెట్టిదయొకో
నీమూర్తిఁ గాంచెం దరు
వ్రజవల్లీతృణగుల్మసన్మృగఖగ
వ్రాతం బరణ్యస్థలిన్. 68

వ. అనితరలభ్య మైనభవ
దంఘ్రులఁ బూజ యొనర్చుభాగ్య మి
మ్మునులకు నబ్బె నీఘనులు
ము న్నొనరించినపుణ్య మెట్టిదో
యనఘచరిత్రి తావకఘ
నాశ్రయశోభిత యాట నివ్వనా
వని శివవిష్ణులోకముల
వైఖరి నొప్పె మహాత్మ్యసంపదన్. 69

*. ఆత్మాశ్రమభవచ్ఛరణా
బ్జాతాంకిత మగునిజోటజపరిస్థలి నీ
కాతిథ్యము ఘటియించిరి
చేతోమోదమున మౌనిశేఖరు లెల్లన్. 70

ఆ. వనజసంభవాదు లనిశంబు నీదర్శ
నంబుఁ గోరి యవసరంబుఁ జూతు
రట్టినీకుఁ బాకయత్నంబు సేయుత
పస్వికాంత లెంతభాగ్యవతులొ. 71

తే. స్వామి భవదీయదర్శనస్పర్శనములు
గాంచి మునులు గృతార్థతాగరిమఁ గాంచి
రమ్మహాత్ములు మత్తీర మాశ్రయించి
నిలుచుటను భాగ్యవతి నేన నిక్కవంబు. 72

తే. రాముఁ డరుదెంచు మన్మందిరంబున భుజి
యించు నేఁ డని మునిసతు లించువేడ్కఁ
గందఖర్జూరపనసమాకందములును
దుగ్ధదధ్యాజ్యములును దెత్తురు ముదమున. 73

ఉ. భూమిభరంబు *డించు గురు
బుద్ధి సమస్తజగద్ధితార్థమై
రాముఁడు దండకాటవికి
రాఁగలఁ డత్తఱి మత్తటంబునం
బ్రేమ వసించు నాజని య
పేతకళంకతఁ బొల్చునంచు నే
వేమఱుఁ గొల్చుచుండ రఘు
వీర వసించితి వట్లు మత్తటిన్. 74

* డించుటకు—వ్రా. ప్ర.

హరిపాదోద్భవ గంగ యంచు నను న
త్యంతంబు మన్నించి యు
ప్పరమర్షు ల్వసియించి రిత్తటి భవ
త్పాదాబ్జకింజల్కపుం
జరజఃస్తోమపవిత్రితాంగ నగుట
న్సన్మౌనిసంఘంబుల
న్దురితోన్ముక్తులఁ జేయుదు న్దళదమ
ద్దుర్వారవారాప్లుతి౯. 75

ఇట్టినే శాపహత లైన నిమ్మునీంద్రు
లహరహస్స్నాన మేగతి నాచరింతు
రనఘ మస్నానపీఠంబు లైనక్రియలు
భస్మవిన్యస్తహవ్యంబు పగిది గాదె. 76

వేదశాస్త్రపురాణపారగులును, సర్వధర్మవిదులును, శాంతులును, సోమయాజులును, ద్వాదశాహదీక్షితులును వాజిపేయవ్రతపతులును, పౌండరీకయాజులును, వసంతయాజులును, చాతుర్మాస్యయాజులును, నిత్యయాగపరులును, తపస్స్వాధ్యాయపరులును, జీర్ణపర్ణజలాహారులును నైనమునీంద్రులు నాయందు విరక్తులై యొండొకచోటికి కరిగిన దండకారణ్యవాసు లగురక్కసుల నుక్కడంచి మునీంద్రులఁ బోవుటకుం జేసినభవదీయప్రతిజ్ఞావైఫల్యంబు సంభవించుఁ దత్ప్రతిజ్ఞాభంగభీత

నై నీశరణంబుఁ జొచ్చితి మాఱియును. 77

ఆ. పురుషునింట సర్వభోగాఢ్య యయ్యును
గన్య పుట్టినిల్లు గాంక్షసేయు
నందు నల్పమైన నత్యధికంబుగఁ
గాంచుఁ దండ్రిమీఁదికరుణకలిమి. 78

గీ. కన్య వలరించిరేనియుఁ గలిమి వొదలు
క్షుభితఁ గావించిరేనియుఁ గులము వొలియు
జగతి బాలురఁ గన్యల స్థవిరుల నవ
మాన మొనరించిరేని సంపద వొలంగు. 79

చ. అవనియు నాకసం బనలుఁ
డంబులుం గంధవహుండు సర్వసిం
ధువననదీవిహంగపశు
దుష్టమృగావళియు న్నిజస్వభా
వవిధి వసించుఁ గాని నర
వారము తోడుతఁ బల్కనేర్చునే
యవనిప నేను భాగ్యవతి
నౌట నిముంగని పల్కనేర్చితిన్. 80

క. కావున నీపుత్త్రి ననుం
గావుము కరుణార్ద్రదృష్టిఁ గాంచుము నే శా
పావృత నగుటం దుర్భి
తావాప్తిం గలఁగు లోక మనఘ మహాత్మా! 81

క. అని పల్కు నవసరంబున
వనరుహసంభవుఁడు త్రిదశవర్గము గొలువం
జనుదెంచి రామదేవుని
వినుతించుచుఁ బల్కె నిట్లు విస్ఫుటఫణితిన్. 82

గీ. అనఘ భవదంఘ్రిచిహ్నిత మగుటఁజేసి
పావనం బయ్యె నీదండకావనంబు
తరువు లామరతరువులపోరుపు దోఁప
నమితసుమఫలనమితంబు లయ్యెఁ గంటె. 83

క. పూతాత్ము లైరి మౌని
వ్రాతంబులు నీదుపాదవనజంబులు సం
ప్రీతిం గాంచి భజించుచు
నాతిథ్యముసేయఁ గాంచి రతులితభక్తిన్. 84

క. ఈవు వసియించుభాగ్యం
బీవనికిం గలిగెఁగాక యిట్లేల యగు న్
శ్రీవరునగరికి నైన ను
దావాసంబునకు నైన హరుపురి కైనన్. 85

ఉ. నీపదనీరజాతమున
నీవె సృజించితి పావనార్థమి
య్యాపగ నీదుశాపహత
లైనఁ జదీతమఘసప్రతీరసు

స్థాపిత దేవతాయతన
సంచయ మంతయు శాపదగ్ధ మై
యేపఱ లోకపావనత
యేగతిఁ గల్గు సరిల్లలామకున్. 86

వ. కావునఁ గంగాశాపంబు మరలింపవలయునని ప్రార్థించినఁ
జతురాననుపల్కు లాకర్ణించి రఘువల్లభుండు. 87

తే. శబరి మద్భక్తురాలు సుస్నాన మాచ
రించు నొక్కహ్రదంబున మించువేడ్కఁ
దజ్జలంబులతోడ నిత్యంబుఁ గలసి
గౌతమీగంగ శాపమోక్షంబుఁ గాంచు. 88

తే. ప్రౌఢి శబరీహ్రదంబుసంపర్కలబ్ధి
నఖిలలోకైకపావని యగుచు గంగ
సానఁ దీరినరత్నంబుచంద మొందు
నింద కర్హమె మద్భక్తబృంద మెందు. 89

తే. పడఁతులకు శూద్రులకు బ్రహ్మబంధులకును
లేదు కర్మాధికారిత లేశమైన
యవిరతము దుష్టకర్మము లాచరించు
బాడబుఁడు బ్రహ్మబంధుఁడు పద్మగర్భ. 90

చ. కొలకులనీరఁ గుప్పింకు లిడి
కుంజరము ల్మరలఁ మహీరజం

బలఁదినమాడ్కి శుద్ధతరుఁ
డయ్యును మానవుఁ డన్వహంబు న
గ్గలముగఁ జేయుదుష్క్రియకుఁ
గల్గదు నిష్కృతి యెన్నిభంగులం
దొలఁగుఁజుమీ కృతంబయిన
దోషము దా ననుతాపలబ్ధిచేన్. 91

వ. అని పల్కి నిజకోదండాగ్రంబుచే శబరీహ్రదజలంబున నగ్గౌతమి నాయోజించి శాపవిముక్తం గావించి పరమేష్ఠిప్రముఖులం బనిచి రాఘవుండు. 92

చ. స్వరుధరలూనపక్ష మగు
శైలముచాడ్పునఁ బక్షిహీనుఁడై
ధరపయి రామనామజప
తత్పరతం బడియున్నపక్షిశే
ఖరు నరుణాత్మజున్ వికృత
కాయు జటాయువుఁ గాంచి వానిచే
ధరణిజవృత్తముం దనుజు
ధార్త్యముఁ దెల్లముగా నెఱుంగుచున్. 93

తే. అధిపసఖువిప్రదేవకార్యార్థి యగుచు
దురమునకు నేఁగి యసువులు దొఱఁగువాఁడు
పదముపదమున కధ్వరఫలముఁ గాంచు
వంశజుల నందఱను దివిదివంబుఁ జేర్చు. 94

క. అని యతని సత్యసంధుం
డని తలఁచుచు నీయభీష్ట మడుగు మనుడు వాఁ
డును దేవ నిన్నుఁ గాంచితి
ఘనతర మగుభాగ్య మింతకంటెం గలదే. 95

క. అని పలికి యమ్మహాత్మునిఁ
గనుఁగొనుచుం దనువుఁ దొఱఁగె ఖగపతి యంతన్
జనకసుతవిరతిఁ గాంచుచు నా
యనఘున్ స్వర్గలోకమ్మునకు ననిచెఁ బావనిన్. 96

వ. అంత. 97

తే. యోజనద్వయదీర్ఘబాహుని సురఘ్న
వదనగహ్వరత్ద్యానపవతుఁ గబంధుఁ
జదిపి నిజభర్తృరా లగుశబరిచేత
నర్చఁ గైకొని యామెఁ బూతాత్మఁ జేసి. 98

శా. కాంచెన్ రాఘవుఁ డిత్తుకాండరసని
[illegible] శాకాంబుసంక్రాంతము
జంచన్మందమరుత్ప్రహృష్టపథిక
స్వాంతంబుఁ బద్మోత్పలో
దంచత్సారమరందమత్తమధుప
ద్వంద్వస్వనోద్ధంతము
న్ఫాంచత్క్రౌంచబకాదినాదవిలస
త్పంపాసరఃప్రాంతమున్. 99

తే. అపుడు గౌతమిసుత యైనయంజనాత
నూజుఁ డనుపమతేజుఁ డనూనవీతి
మంతుఁ డచలితధృతి హనుమంతుఁ డంత
నమ్మహీకాంతుఁ గాంచి యిట్లని తలంచె. 100

మ. భసితోద్ధూళితకాయుఁ డంబుధరశుం
భన్మేచకాంగుండు పా
ణిసరోజాంచితచాపగోపవరుఁ డు
న్నిద్రాంబుజాతాక్షుఁ డు
ల్లసదాజానుభుజార్గళుండు సుమన
శ్శ్లాఘ్యక్షమావంతుఁ డీ
యసమస్థైర్యగుణాఢ్యుఁ డెవ్వఁడొ సము
ద్యద్భానుతేజుం డిలన్. 101

శా. సాక్షాన్మన్మథురీతిఁ బొల్చె నితఁ డ
క్షయ్యాకృతిన్ వారిజా
తాక్షుండో శశభృత్కళామకుటుఁడో
యంభోజసంభూతుఁడో
యీక్షోణిన్ నరమాత్రుఁడే యితఁడు లో
కేశుండు గాఁ గారయన్
మోక్షం బియ్యఁడె యిమ్మహాపురుషు స
ద్వీక్షాసౌఖ్యముఁ జూచినన్. 102

క. ధైర్యంబున హిమగిరి గాం
భీర్యంబున నుదధి క్షమను బృథివి దలంపన్
స్థైర్యంబున సురగిరి సౌం
దర్యంబున నితఁడు కుసుమధన్వుఁడు జగతిన్. 103

సీ. ఇతనిమాయాంబుధిఁ జతురాననాదులు
తీరంబు చేరక తిరుగుచుందు
రితఁడు జగంబులకెల్ల జనిస్థితి
సంహారకర్త నిస్సంశయంబు
నిర్వికారుండును నిత్యుండు సత్యుండు
సర్వజ్ఞుఁడును నిరంజనుఁడు నితఁడు
సనకప్రముఖులైనమునులకు నీతని
పదదర్శనము దుర్లభంబు దలఁప

ఆ. నీతఁ డలిగెనేని హేమాద్రి తృణ మగు
నితనికరుణ గలుగుతృణము మేరు
వితఁడు పూజనీయుఁ డీతని సేవించి
కమలజాండమునకుఁ గర్త నగుదు. 104

క. ఇతఁ డస్మదిష్టదేవత
గతి నొప్పెడు నిమ్మహాత్ముఁ గన్గొంటిన్ స
న్మతి మత్ప్రవగత్వ మదూ
షిత మగు యశ మబ్బె నితనిసేవ యొనర్పన్. 105

తే. అని తలంచుచు ఫలపాణి యగుచు నాతఁ
డాత్మనామానుకీర్తనం బాచరించి
మ్రొక్కి యారఘునందనుమ్రోల నిలిచె
నంజలి ఘటించి వినయానతాంగుఁ డగుచు. 106

మహాస్రగ్ధర.
కనకాద్రీంద్రాభు నుద్యత్కనకమణిపరి
ష్కారు నాషాఢదండా
జినమౌంజీమేఖలారంజితు జితమదనుం
జితభానుప్రకాశున్
ఘనశౌర్యుం దీర్ఘబాహార్గళు ననిలజవుం
గామరూపాభిరామున్
హనుమంతుం గీర్తికాంతున్ హరివరవృద్ధు న
ర్కాన్వవాయుండు గాంచెన్. 107

ఆ. అట్లు గాంచి యద్భుతాక్రాంతచిత్తుఁడై
యేమి గోరి వచ్చి తెఱుఁగఁ జెపుమ
ప్రాణసదృశుఁ డైన బంధునిగతిఁ గను
పట్టె దీవు మాకుఁ బ్లవగవర్య. 108

వ. భవత్సహాయంబు గల్గిన మహావాయుసహాయుం డైన
ప్రళయాగ్నిభంగిం బొంగి రక్కసుల నుక్కడంతు మా
ర్గదర్శి యగుపురుషుం డొక్కరుండు లేమికిఁ జింతించెద
మద్బాణానలంబునకు మేరుమందరాంబరపృథివీసింధువు

లైనను నిలువంజాలవు మద్భక్తుల ధేనువు వత్సంబులం
బోలె రక్షింపుదు నని పలికి నిజవృత్తాంతం బంతయు
వివరించిన విని సంతసిల్లి శేషునందనునకు వాయునంద
నుం డిట్లనియె. 109

సీ. వాలిసుగ్రీవు లన్వానరుల్ కిశాధి
పులు నన్నదమ్ములు గలరు బలులు
దారానిమిత్తమై వారల కుదయించె
వైరానుబంధం బవార్య మగుచు
నిల మహాత్ములకైన నింతులకతన వై
రము గల్గు నన మర్కటముల కరుదె
శక్రనందనుఁడు నిర్వక్రవిక్రమశోభి
వాలి మహైశ్వర్యశాలి యగుచు

తే. ననుజపత్ని రుమాకాంత నపహరించి
తారఁ గైకొని యచలితవైరకలనఁ
బ్రాణములఁ గొన వల్లినఁ బఱచె నతఁ డ
ధర్మవర్తులకడ నుండఁ దగదు గాన. 110

తే. అంబుధినిమగ్నునకు సదంబరంబుకరణి
ధ్వాంతబాధితునకు వికర్తనునిమాడ్కి
రక్షా దరిద్రునకు ధనరాశిపోల్కి
నీవు గల్గితి రవిపుత్రునియతికతన. 111

చ. జనకునియాజ్ఞ నివ్వనికి
సన్మతి రాఘవుఁ డేఁగుదెంచె న
య్యనఘుఁ డమేయశౌర్యనిధి
యార్తశరణ్యుఁడు దుష్టశిక్షణం
బనువుగఁ జేయు సజ్జనుల
నందఱ మన్న దయార్ద్రచిత్తుఁ డా
ఘను శరణంబు సొత్తు నను
గాచు నతం డని యెంచు నాతఁడున్. 112

వ. త్రిభువననాథుండును, ప్రతిజ్ఞాతార్థపాలకుండును నఖం
డకోదండపాండిత్యశౌర్యుండును నగు నమ్మహాత్మునితోడ
సఖ్యంబు సంఘటింపు మని యాసుగ్రీవుండు పనిచిన
నేఁగుదెంచితి నిట మీఁద దేవరచిత్తం బని పల్కిన విని
రాఘవుండు సుగ్రీవుం దోడ్కొని ర మ్మనిన నభయం
బొసంగితి నని యానతిచ్చిన నమ్మారుతియు నట్లు సుగ్రీ
వుం దోడితెచ్చుచు నుండె నాసమయంబున. 113

క. పరిఫుల్లహల్లకాంబుజ
మకరందలహరీప్రమత్తమధుకరమండ్రి
స్వరపూరం బగుపంపా
సరోవరముఁ గాంచి రామజనపతి పల్కెన్. 114

తే. పాపసంతాపఘర్మనిర్వాపణాచ్ఛ
సలిలసంపరిపూర్ణమై సన్మునీంద్ర

చిత్తకమలంబు కైవడిఁ జెలువు మెఱసెఁ
జూచితే దీని లక్ష్మణ చూడ్కు లలర. 115

క. రంగత్తరంగసముదయ
సంగతచక్రాంగరేఖ చాలఁగ నొప్పెన్
శృంగారార్థముగా సరి
లాంగన ధరియించుతారహారాళి యనన్. 116

వ. అని వెండియు. 117

మ. అనఘా లక్ష్మణ కంటె యొక్కబక మీ
యచ్ఛోదతీరంబునన్
మునిలీలం దప మాచరింపఁ దొడఁగెం
బో ధార్మికత్వంబునన్
వినుమీ క్షేత్రమహత్త్వవిశ్రుతిఁ జుమీ
విజ్ఞానసంపత్తి సొం
పునఁ దీర్ఘవ్రతియుం దపంబు సలుపుం
బూజ్యప్రభావంబునన్. 118

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 119

తే. దీనిశీలంబు దెలియక దేవ యిట్లు
వొగడ నేఁటికి సురమునిభూసురులను
యతుల నైన సంతశ్శుద్ధి యరయ కాత్మ
సంస్తుతించిన దోషంబు సంఘటించు. 120

తే. ఇచటఁ గొండొకదడ వున్న నెఱుఁగవచ్చు
ననఘ దీనిశీలం బనునంతలోన
నదియు నప్పుడ కదసి మత్స్యముల మ్రింగి
వెండియును ధ్యాన మొనరించుచుండఁ గాంచి. 121

క. సౌమిత్రిఁ బొగడె రాఘవుఁ
డామెయి హనుమత్సమేతుఁ డై రవిజుఁడు ను
ద్దామగతి వచ్చి రాముని
శ్రీమత్పదములకుఁ బ్రణుతిచేసి నుతించెన్. 122

వ. అంతఁ గుశలప్రశ్నంబు చేసి యమ్మహాత్ముం డి ట్లనియె.

క. సుగ్రీవ నీదుశత్రు ను
దగ్రబలుఁ వాలిఁ దునిమి తారక రుమ న
వ్యగ్రమతి నొసఁగి కపిరా
జాగ్రణిఁ గావింతు నిన్ను నఘ కేల యిఁక. 124

వ. నీసాహాయ్యంబున నేను దశగ్రీవుని సంహరించెద నని
యగ్నిసాక్షికంబుగా సఖ్యంబు చేసి యతనితోడన
ఋశ్యమూకగిరీంద్రంబునకుం జని యందు వసియించి. 125

చ. హరివర నీవు వోయి కల
హం బొనరింపుము వాలితోడ నేఁ
దరువుమఱుంగున న్నిలిచి
తత్సమయంబున వానిఁ ద్రుంచెదం -

దురమున వానితో నెదురఁ
దోడన శక్తి దొలంగఁజూచె యే
వ్వరికయినన్ మునీంద్రకృప
వానికి నట్టివరంబు గల్గుటన్. 126

వ. అని పల్కి యంత. 127

చ. అలరులకమ్మదండ యపు
డాతనికంధరఁ బ్రత్యభిజ్ఞకై
నిలిపి ధురంబు సేయు మన
నెమ్మది నాతఁడు నట్ల వాలితో
నలుకకఁ బోరఁగాఁ దొణఁగె
నాసమయంబున నమ్మహాత్ముఁ డు
జ్జ్వలవిశిఖాహతిం దునిమె
శక్రతనూజుఁ బరాక్రమంబునన్. 128

తే. వాలి విక్రమశాలిని లీలఁ జడిపి
తారఁ దారాధిపాస్య నవ్వారిజాప్త
సూనునకును రుమాకాంతతో నొసంగి
మహితవానరరాజ్యసామ్రాజ్య మొసఁగె. 129

క. రాముఁడు గిరిగుహ నుండఁగఁ
దామరచెలిపట్టి ప్రేమఁ దారాపతుఁడై
యామున రామునికార్యం
బేమఱి కామాంధుఁ డగుచు నింట వసించెన్. 130

క. పరిమదలసన్నిధి నుండిన
సమయజ్ఞానంబు దొలఁగు సకలజనులకున్
క్షమ నతఁడు కొమ్మమొక మాఁట
యమతిఁ బరిసమాప్తత వహించుటది యద్భుతమే. 131

ఉ. ఆసమయంబునన్ రఘుకు
లాగ్రణిపంపున లక్ష్మణుండు బా
ణాసనశాతబాణధరుఁ
డై విలయాంతకుబోలె నేఁగి యు
ద్భాసరరాజనందనుని
వాకిట నిల్చి *యుమ్మగరాదరిదృ
గ్భాసురుఁడై కఠోర[illegible]
బల్కె బలీముఖు లెల్ల భీతిలన్. 132

ఉ. వాలికి భీతిఁ జెందె రఘు
వర్యుఁడు నిగ్రహపెఁ గాఁడె మున్ను నా
వాలికతూపుచే నిపుడ
వారణ నిన్ బరిమార్పఁ గావఁగాఁ
జాలునె యంత్రమం డయినఁ
జక్కనజాండవిభేదమైన యా
శీలమదీయసాయకము
భీతులఁ గోరితుల నొంపఁజాలదే. 133

* యుమ్మగరాదరి — వ్రా ప్రి.

తే. సత్యహీనుని నినుఁ గావఁజాలు నెవ్వఁ
డనుచుఁ బ్రీతియాగ్ని కెవడిఁ గినుకఁ బూనఁ
దార మొదలైన సుగ్రీవుతలిరుఁబోఁడు
లతనిఁ బతిభిక్ష వేఁడిరి * యంజి యంజి. 134

సీ. అప్పుడు సుగ్రీవుఁ డవ్వీరు వెంబడి
సమితశాఖామృగసమితి గొలువఁ
జనుదెంచి యారామజనపాలునకు మ్రొక్కి
యమ్మహామహునాజ్ఞ నవనికన్య
నన్వేషణముసేయ ననుపుచో రాముఁ డ
వ్వసుధాత్మజకు నానవాలు గాఁగఁ
దనయంగుళీయకం బనిలనందనుచేతి
కొసఁగిన నాతండు నుత్సహించి

తే. పర్వకాలమహాంబుధిభంగిఁ బొంగి
నీయనుగ్రహబలమున నెగడుమద్బ
లంబుఁ గను మని పెరిగె దేహంబు వొదలఁ
బద్మజాండోపరిస్థకర్పరము గదల. 135

గీ. అలత్రివిక్రమునాకృతి నభినయించు
నట్లు పెరిగినయతనియాద్యంతశూన్య
మైనరూపంబుపసఁ గాంచి వానరేంద్రు
లందఱును జిత్తముల నరుదంది రపుడు. 136

* యబ్జముఖులు — పా.

వ. వెండియు నతండు ప్రాకృతకపిరూపధరుం డై నిల్చి రామలక్ష్మణులకు నమస్కరించి యంగదప్లవంగప్రముఖ సేనాపరివృతుం డై మాసమాత్రంబున మరలి వచ్చెద నని చని వనగిరిగుహాప్రదేశంబుల సీత నన్వేషించుచు నతిదూరం బరిగి యొక్కబిలంబు సొచ్చి యందుఁ గనక రత్నమందిరగోపురపరిపూర్ణం బైనపురంబుఁ గాంచి తన్మధ్యంబున మాతృబాలసమన్విత యగునొక్కయోగినిం గాంచె నంత నక్కపు లిప్పురం బెవ్వరి దని యడిగిన నది యిట్లనియె. 137

క. ఈపుర మింద్రునియది నన్
గాపుంచె నతండు దీనిఁ గడచినవారిన్
శాపాహతులుగఁ జేయుదు
నేపనికిని వచ్చినార లెవ్వరు మీరల్. 138

క. అనవుడు సీతాన్వేషణ
మొనరింపఁగ వచ్చినార మోభామిని రా
మునిబంటుల మన నయ్యో
గినియును రామునిఁ దలంచి కేల్మోడ్చెఁ దగన్. 139

చ. ఫలకుసుమాభినమ్రతరు
పంక్తులఁ బొల్చెడుదాని మత్తకో
కిలకులచంచరీకశుక
కేకిరవామృత మైనదాని ని

ర్మలజలదీర్ఘికాశతస
మంజసతం బొలుపారుదాని స
జ్జలజదళాక్షియాజ్ఞ నొక
సద్వనవాటికఁ జొచ్చి రాకపుల్. 140

ఉ. తేనియ గ్రోలి పోలి యటఁ
దియ్యనిపండుల మెక్కి తేటనీ
రాని సుఖోన్నతిం జెలఁగి
యాఁకలియుం దృషయుం ద్యజించి యా
మ్నానిని వెల్వరింపఁగఁ గ్ర
మంబున నగ్గుహ నిర్గమించి యం
భోనిధితీరధారుణికిఁ
బోయి వసించి కపీంద్రులందఱుం. 141

క. తమలోఁ బలుకుచునుండెడు
సమయంబున నచటఁ దిరుగుసంపాతి యనం
గామ రైనపక్షి సీతా
విమలేక్షణ లంక నున్నవిధ మెఱిఁగించెన్. 142

క. ఎఱిఁగించిన విని వా రం
దఱు నీసాగరము దాఁటు దక్షుం డెవ్వం
డెఱిఁగింపుఁ డనిన నంగదుఁ
డటసేయక తెలుపఁ దొణఁగె నాత్మజవంబుల్. 143

ఆ. నవతియోజనములు జవగతి లంఘింతు
వలుబలిమికలిమి వారిరాశి
యంత విశ్రమించి యవతల నన్నియు
యోజనములు గడతు నోజ మెఱసి. 144

వ. అని పలికిన జాంబవంతుం డిట్లనియె. 145

తే. అమరగిరికిఁ బ్రదక్షిణం బాచరించు
నాఁడు తద్గిరిశిఖరంబు నాఁటుకొనియె
తాడితం బయి నాజానుతలమునందు
ఖంజతావాప్తి యయ్యెఁ దత్కారణమున. 146

వ. అయినను శతయోజనంబులు లంఘింపఁ బోవుదు మఱలి
వచ్చుట సందియం బని పలికిన హనుమంతుం డిట్లనియె.

తే. సప్తజలధులు దాఁటి యక్షణమ వచ్చు
నట్టిజంఘాలునకు లంక యనఁగ నెంత
యవనిసుతఁ జూచి వేవేగ యరుగుదెంతు
మఱి త్రికూటాచలం బైనఁ బెఱికి తెత్తు. 148

క. అని లంకాభిముఖుం డై
యనిలజుఁ డనిలగతి నరిగి యంబుధిమధ్యం
బున ఛాయాగ్రహమున్ ఫణి
జననిన్ సురసాఖ్య గెలిచి చనియెం బెలుచన్. 149

వ. మైనాకగిరిందర్పంబును మన్నించి కడచి చని లంకాప్రాం

తంబుం జేరి తద్ద్వారపాలిక యగులంకిణి వారించిన దాని
కి ట్లనియె. 150

తే. అల్పబలుఁ వానరుని నేల యడ్డపెట్టె
దేను గనుఁగొన్న యంతన యిప్పురంబు
గాలిపోవునో వనమెల్ల గాసియగునో
మడయుదురో దైత్యు లక్షకుమారముఖులు. 151

చ. అని పలుకంగ రక్కసియుఁ
నయ్యనిలాత్మజుదిక్కుఁ జూచి యి
య్యనఘుఁ డలంతి యయ్యును భ
యంకరణోత్తులు వక్కఁడిక్క సురల్
వనిచిరొ వీని రాఘవుఁడు
వంచెనొ కాకల నందికేశుఁ డీ
సున శపియింప నిన్నగరి
సొంపు *దహింపఁగఁ జేరకీశుఁడో. 152

క. పలుకులచేఁ దెలియఁగ నగు
కులమును దేజంబు బలము గుణమును ధీమం
తులు వీనిపలుకు నూడఁగఁ
బొలుపఱు నీలంక వీనిభుజశక్తి మెయిన్. 153

తే. వీఁడు సామాన్యకీశుండు గాఁ డటంచు
శూలమున వైవ నాతఁ డాశూలమునన

* దరింపఁగ ; దలింపఁగ—వ్రా. ప్ర.

టంతురక్కసిఁ బరిమార్చి లంక సొచ్చి
యందు సీతామహాదేవి నరయఁదొణఁగె. 154

ఉ. వేదనినాదితంబు లగు
విప్రగృహంబుల గోపురంబులన్
వేదుల రచ్చకొట్టముల
వీథుల రాజగృహంబులందుఁ బ్రా
సాదతలంబులం దివిజ
సద్మములన్ వనసీమలందుఁ గ్రీ
డాదని కేతనంబులను
నారయుచుం జని యాతఁ డొక్కచోన్.

చ. దివిజవిరోధి జానకిని
దెచ్చుట యాదిగ దుర్నిమిత్తము
ల్గవిసెను నేఁట రేపటనె
లంక వినాశము నొందు శక్రసం
భవు నని గెల్చి రాఘవుఁడు
భానుతనూభవు నేలి భూమిసం
భవ వెదకం గపీశ్వరులఁ
బంపినవాఁడు సహస్రసంఖ్యలన్. 156

ఉ. వారలలోనఁ బేరుకల
వాఁ డమరాచలసన్నిభాంగుఁ డా

మారుతనందనుండు హను
మంతుఁడు వారిధి దాఁటి యిప్పుర
ద్వారముఁ గాచుదానవి న
వారితశక్తి నడంచె సీతఁ దా
నారయు నంచుఁ బౌరజను
లాడుకొనన్ విని సంతసిల్లుచున్. 157

తే. అనిలజుఁడు దానవేంద్రునియంతిపురము
పొంతఁ జెలువొందు నొక్కవనాంతరమున
క్షితితనూభవఁ గని నమస్కృతి యొనర్చి
ముద్రిక యొసంగె విశ్వాసముద్ధి దనర. 158

వ. నిజవృత్తంబెల్ల నెఱింగించి నమ్మంబల్కి మదాగమనంబు రాక్షసులకు నెఱుక గావించెద నని యప్పుడు. 159

ఉ. పావని యావనిం బెఱికి
పాఱఁగ వైచి తదీయపాలురం
జేవడిఁ ద్రుంచి గర్జనము
సేయు నెడన్ హతశేషదానవుల్
రావణుసమ్ముఖంబునఁ ది
రంబుగఁ దెల్పిన నాతఁ డుల్కి య
త్యావిలచిత్తుఁ డై పనిచె
నక్షకుమారు మరుత్కుమారుపై. 160

తే. లంకలోఁ గల్గునట్టి బలంబునందు
నాలుగవపాలు గోల్పోవ నప్పొలసుండు
చక్కటికిఁ జేరఁ దోరణస్తంభపాతంబు
గీటకముఁబలె నద్దైత్యు గీటడంచె. 161

తే. ఇట్లు సబలంబుగా వానియేపడంపఁ
గీశవల్లభుపైఁ జాలఁ గినుక వొడమి
తనతనూభవు నింద్రజిద్దనుజుఁ బనిచె
నతనిఁ బట్టంగ రావణుం డక్షణంబ. 162

సీ. మేఘనాదుండు సమీరనందనుఁ గాంచి
యుత్తుఁడై పావకాస్త్రకపీశ్వరుండె
ప్రళయాగ్నికైవడి భాసిల్లుచున్నవాఁ
డని యనేకాస్త్రంబు లడరఁజేయ
నవియు భాస్కరునిపైఁ గవియునీహారక
ణంబులగతి విఫలంబు లైన
నలిగి పద్మజబాణ మడరింప బిసతంతు
బద్ధమ్ము గేంద్రంబుపగిది దానఁ

తే. గట్టువడి వీతభీతుఁ డై కపివరుండు
దానవులు దేర రావణాస్థాని కరిగె
ననఘు రుద్రాంశసంభవు నతనిఁ గాంచి
రావణుఁడు వహ్నిరోషప్రలంబుఁ డగుచు. 163

తే. ఈనిశావేళ లంకకు నేఁగుదెంచి
తేమిగారణమున నిన్ను నెవ్వఁ డనిపెఁ
దస్కరుండవు వానర దండనంబు
సేయఁదగుఁగాక నినుఁ గృపసేయ నగునె. 164

వ. అనిన. 165

మ. నిను వాలంబునఁ గట్టి నీరధుల ని
ర్నిద్రస్థితిం ద్రిప్పి ముం
చినశక్రాత్మజు నొక్కబాణమున సు
స్థేమోన్నతిం బట్టు గూ
ల్చిన యారామునిబంటు వాయుజుఁడ నే
సీత న్విలోకించితిన్
హనుమంతుం డనువాఁడ నీసుతుని గ
ర్వాంధున్ వెసం ద్రుంచితిన్. 166

ఉ. హైహయవంశసంజనితుఁ
డర్జునుఁ డాజి జయించె నిన్నుఁ ద
ద్బాహుసహస్రముం దునిమె
భార్గవరాముఁడు తద్భుజాబలో
త్సాహముఁ గుంచె రాఘవుఁడు
దాదృశవిక్రమశాలితో నతన్
సాహసవృత్తి విక్రమము
సల్పెద వెవ్వఁడు గాచు నిన్నిఁకన్. 167

క. జీవిత మిష్టమేనియును
శ్రీరఘురాముని వే భజింపు మే
నీవిధి బుద్ధి దెల్పుటకు
హీనబలుం డగుమేఘనాదుచేఁ
జేవఁ దొఱంగి పట్టువడి
చేరితి నాదగు ప్రాణఘట్టనన్
దేవగిరిం బగుల్తు నిఁక
దేవవిరోధులు నాశ నడ్డమే. 168

తే. లంక నిశ్శంక నీయచలంబుతోడ
పెఱికి రామునిసన్నిధిఁ బెట్టువాఁడ
నోరి రావణ తత్సాయకోరుహతుల
నీవు పరిశుద్ధిఁ జెందెద విది నిజంబు. 169

ఉ. అనవుడు దానవాగ్రణి య
హంకరణంబున వీనిఁ బట్టి వే
తునుముఁ డనన్ విభీషణుఁడు
దూతలు వధ్యులు గా రటంచు నే
ర్పున వచియింప నాప్లవగ
పుంగవువాలము కీలికీలలం
బనుపడ సంఘటింపుఁ డని
పంచె నతండును దానవావళిన్. 170

తే. దానవులు చేలములు చుట్ట వానరేంద్రు
వాల మభివృద్ధిఁ బొంది యపారితగతి
నలరె ముప్పదియోజనంబులపొడవును
వరుసఁ బదియోజనంబులవలముఁ గల్గి. 171

క. ఆలంకాపురిఁ గల్గిన
చేలము లన్నియును నేతిచేఁ దడుపుచుఁ ద
ద్వాలమునఁ జుట్టి వహ్ని
జ్వాలాసంయోజనంబు సల్పిరి దనుజుల్. 172

ఉ. అంశుకము ల్హరించి పరిభ
యాపద పౌరులకుం ఘటించుచుం
బ్రాంశుశరీరుఁ డై తనదు
బంధము లన్నియుఁ ద్రెవ్వఁ జేసి య
ద్వింశతిబాహుప్రోలు కపి
వీరుఁడు కాల్పఁ దొడంగెఁ బూర్ణశీ
తాంశునిభీల వాలమున
కాశిఖి చల్లదనంబుఁ గూర్పఁగన్. 173

చ. సలలితరామపాదజల
జాతము లాత్మఁ దలంచుపొంటె న
బ్బలియుని కగ్ని చల్లనయి
భాసిలె శీతలచందనక్రియం

జెలువుగ రామనామసుధ
చేకొని త్రావెడువానికిన్ హాలా
హలవిలయాగ్నిమృత్యువద
నావృతుఁడైనను భీతి గల్గునే. 174

సీ. హనుమంతుఁ డీగతి నాలంక యంతయు
హవ్యవాహార్పణం బాచరింపఁ
బౌరజనంబు లాబాలవృద్ధాతుర
సహితులై పురబహిఃస్థలి వసించి
కట్టిసపుట్ట మొక్కటి దక్క నిఖిలముఁ
ఖిలమయ్యె ననుచు దుఃఖించువారు
క్రొవ్వి పోకార్చె నిక్కమతి యుప్వి డని
నెట్టన రావణుఁ దిట్టువారు

తే. నగ్నికిని రామదేవున కనిలజునకు
మొనసి చేదోయి మొగుడించి మ్రొక్కువారు
నైరి యారాత్రి శివరాత్రియందమున న
ఖర్వజాగరణక్రియ గదురఁజేయ. 175

తే. హరుఁడు పురములువోలె నప్పురి దహించి
కడలి వాలాగ్నిఁ జల్లార్చి కపివరుండు
మహిసుతాదత్త మగుశిరోమణి గ్రహించి
యుదధి లంఘించె హరివీరు లెదురుకొనఁగ. 176

క. వనచరులకు సుగ్రీవుని
వనిఁ జూపఱయొసంగి భక్తవత్సలుఁ డగురా
మునిసన్నిధికిం జని కం
టిని సీత నటంచుఁ బల్కె డెందం బలరన్. 177

తే. అట్లు చేసినయుపకృతి కాత్మ మెచ్చి
కపివరుని రామచంద్రుండు కౌఁగిలించి
యాజలధిమధ్యమున శతయోజనంబు
లనఘ యేగతి దాఁటితి వనుడు నతఁడు. 178

తే. రామ సీనామ మొకపరి రహిఁ జపించి
జాల్మ తైనను భవవార్ధి సంతరింప
భద్రభవదంగుళీయకముద్రికలిమి
యంబునిధి క్రోఁతి గడచుట యద్భుతంబె. 179

క. అని నిజవృత్తాంతంబును
జనధిగభీరతయు లంక వైభవముం జ
య్యన విన్నవించుటయు న
య్యనఘుఁడు లంకపయిఁ జనఁగ నత్యుత్సుకుఁడై. 180

తే. అంగదుని నెక్కె లక్ష్మణుం డరుగుదేర
తాను మారుతిపై నెక్కె తరతరంబ
సకలవానరయూథపసమితి గొలువ
నరిగి మలయాద్రియును సహ్యగిరియుఁ గడచి. 181

మహాస్రగ్ధర.
కనియెం భూపాలుఁ డంతన్
ఘనతరముదితాఖండకూలంకషాలిం
గనమాద్యద్భంగబాహా
ర్గళదళితలసత్కంకణోన్నిద్రముద్రన్
స్వనితాంతస్వానలీలా
శమితపృథుదిశాసామజాత్ముద్రినిద్రన్
జనతారక్షాతిదక్షా
సమదినమణిరుక్సాంద్రభద్రున్ సముద్రున్.

తే. ఆసముద్రవేలాతటం బధివసించె
వానరబలంబు రెండవవార్ధిపోలె
రాజధర్మక్రమంబుఁ బురస్కరించి
యుదధిఁ బ్రార్థించె నపుడు రఘూద్వహుండు. 183

మ. రంగదభంగభంగరవ
రాజితమై చెలరేఁగి నింగికిం
బొంగుచునుండెఁ గాని రఘు
పుంగవునిన్ గణియింప దయ్యె న
వ్వొంగలివార్ధి యట్లు పృథి
విన్ సుజమన్ హసియించుచున్ నిజా
మంగళవైభవంబె పలు
మాఱును జూపు జడాత్ముఁ డుద్ధతిన్. 184

తే. అంత రఘుపతి క్రోధరక్తాంతనయనుఁ
డగుచు వారిధియాలేప మడఁపఁ దలఁచి
శరము సంధించునాలోన శరధి తచ్ఛ
రాగ్రమున మూర్తియముగతి నంటికొనుచు, 185

క. శరణము వేఁడిన శరధిం
గరుణించి తదీయవచనగౌరవమున న
య్యురుభుజుఁడు గిరులఁ దరులన్
స్థిరసేతునిబంధనంబు సేయించె వెసన్. 186

ఉ. ఆవిభుఁ డాత్మచాపమున
నైన గుణంబున నైన నంబుధిం
దా వెసఁ గట్టి వానరుల
దాఁటఁగఁ జేయ వలంతి యయ్యు సు
శ్రీవిధి లోకరక్షణము
సేయుటకై కనువారి బ్రహ్మహ
త్యావినివారణార్థమున
కై వనధిన్ ఘటియించె సేతువున్. 187

తే. అధికబలుఁ డైన దుర్బలుఁ డైన ధనికుఁ
డైన నిర్ధనుఁ డైన భాగ్యంబుకలిమి
సేతు వొకపరి చేరి వీక్షించెనేని
తొలఁగు భూసురహత్యాదిదోషసమితి. 189

క. సేతువు శ్రీశైలము బ్రి
ఖ్యాతి న్నీలాచలంబుఁ గాశీశ్వరు సం
ప్రీతిన్ సందర్శించిన
పూతమతికి వాంఛితార్థములు సిద్ధించున్. 189

తే. అన్నఁ దొఱఁగి విభీషణుం డన్న రేండ్రు
శరణము భజించె నాలోన శరధి దాఁటి
యవిరిసమధీరుఁ డై సువేలాద్రి యెక్కి
లంక వీక్షించె వీతకళంకుఁ *డతఁడు. 190

వ. రావణుండును నొక్కమహోత్సేధసౌధం బారోహించి వానరవాహినిం గాంచి రామదేవుని గుఱుతుగా నెఱుంగం దలంచి శుకసారణు లనుచారులం బనిచిన వారలు సేనాసాగరంబుం బ్రవేశించి యరసి వచ్చి యిట్లనిరి. 191

సీ. అచ్ఛభల్లాధీశుఁ డగుజాంబవంతుండు
కేల వేత్రము పూని మోలి నిలువ
ననిలపుత్రాంగదు లంఘ్రికంజద్వంద్వ
సేదిష్ఠతలముల నిలిచి కొలువ
నినజుండు సౌమిత్రియును నంజలి ఘటించి
ప్రార్థిఁ గార్యము విన్నపంబుసేయ
నంశుకసంఛాదితాస్యుఁ డై చెవిదండ
మనవిభీషణుఁడు మంతనము దెలుపఁ

* డగుచు—వ్రా. ప్ర.

తే. కూటమున మృగకృత్తిపైఁ గూరుచున్న
యసితవర్ణుఁ డాజానుబాహార్గళుండు
రాముఁ డాతఁడు రాక్షసరాజవర్య
వాసిమై నిర్వదేనేండ్లవయసువాఁడు. 192

క. ఘోరాకారులు వానర
శూరులు గోటానకోట్లు చుట్టుం గొలువన్
మేరుధరాధరధీరుం
డారాముఁడు నిన్ను గెలువ నరుదెంచె వెసన్. 193

వ. ఇందులకుఁ బ్రతివిధానం బాచరింపు మని తెల్పునవస
రంబున. 194

తే. ఆ సువేలాద్రిపై నుండి యర్కసూనుఁ
డెగసి వచ్చి రావణునిపేరెల్లి విఱిచి
ముష్టిఘాతాహతుల నొంచి మురువడంచి
చనియె వెండియు రామునిసన్నిధికిని. 195

వ. ఆసమయంబున రావణుండు పురప్రాకారరక్షణార్థం బనే
క దైత్యదానవవీరుల నియోగించి తాను ననేకాక్షౌహిణీ
మూలబలసమేతంబుగా యుద్ధంబునకు నిర్గమించె నద్దా
నవుల నెదుర్కొని వానరవీరు లత్యంతదారుణం బైనర
ణంబు సేయందొడంగి రందు దశగ్రీవు రాఘవుండును,
మేఘనాదుని లక్ష్మణుండును, ప్రహస్తుని సుగ్రీవుండును,
మహాకాయుని జాంబవంతుండును, నతికాయుని శరభుం

డును, మఱియు ననేకు లనేకులతోడఁ దొడరి ద్వంద్వ
యుద్ధం బొనరింప నంత దాశరథిబాణపీడితుం డై ఖిన్నశ
రాసనుండును, నిహతారంభుండును నై రావణుండు
మరలి లంకకుం బఱచె జనకునిపలాయనంబుఁ గాంచి
మేఘనాదుం డత్యంతక్రోధంబునం గపిబలంబుల నెల్ల
సమయించి సౌమిత్రియుం దాను బోరొనరించుచు
నుండి యంత. 196

ఉ. ఆయురు ధైర్యధుర్యనిశి
తాశుగవేగము సైపలేక వై
హాయసవీథి నిల్చి గహ
నాట్టుల గిట్టఁగించి మించి య
చ్ఛాయకుఁ జేరి రాఘవుల
శాతశరాహతి నాత్మమాయలం
బాయఁగఁ జేసి ఘోరఫణి
పాశనిబద్ధులఁ జేసె వారలన్. 197

ఈనెఱి రామలక్ష్మణుల
నిద్దఱ గాసి యొనర్చి లంకకున్
దానవనందనుం డరిగి
తద్విజయప్రద మైనహోమముం
బూనె నొనర్ప నంత రఘు
పుంగవు లున్న తెఱంగుఁ గాంచి యుః

వ్వానరు లెల్లఁ జింతిలఁగ
శారలపాలికి నద్భుతంబుగఁ. 198

తే. నారదుఁడు వచ్చి యారఘువీరుతోడ
స్వామి నీవాహనం బైన వైనతేయుఁ
దలఁపు మన నట్లు తలఁచినఁ దార్క్ష్యుఁ డరుగు
దెంచి పన్నగబంధముల్ డీలుపఱిచె. 199

క. ఆవినతాసుతుఁ డహిబం
ధావళి వో విూఁటి వైవ నారాకొమరుల్
పావనిచే సంజీవితు
లై వెలసినకపులు గొలువ నలరిరి గడిమిన్. 200

శా. అంతన్ మేలిమి దీర్చి రావణి శతాం
గారూఢుఁ డై వచ్చి దు
ర్దాంతానంతబలాఢ్యు లక్ష్మణు సము
ద్యత్క్రోధుఁ డై తాఁకి క
ల్పాంతాగ్నిస్ఫుటసాయకప్రతతు లే
యన్ వాని వారించి వి
క్రాంతిం దడ్రిథ వాజులన్ శకలము
ల్గావించె సౌమిత్రియున్. 201

తే. విరథుఁ డై వాఁడు లంకకు వేగ మరిగి
యొండురథ మెక్కి వచ్చి ప్రచండలీల

సమర మొనరించెఁ దాను లక్ష్మణుఁడు నపుడు
వృత్రవాసవు లని సేయువిధము దోఁప. 202
(వ. పో రొనరింపం దొడంగి రంత.) 203

మ. శరసంధానము మోక్షణంబు యుగప
త్సంప్రాప్తిఁ జెన్నొందఁ నా
హరిశౌర్యుండు సుమిత్రపట్టి యని సే
యం గాంచి యాదృజ్మహా
శరవేగంబు సుపర్వసంతతికి ర
క్షఃశ్రేణికిం గల్గ దీ
యురుతేజుం గెలువంగఁబోల దని తా
నూహించి పోఁ దత్తఱన్. 204

క. సురవరులు నసురయోధులు
హరివీరులు గనఁగ రాఘవానుజు నెమ్మై
శరవృష్టిఁ ముంచిన న
య్యురుభుజుఁ డజశరము వింటఁ యోజించి వేసెన్. 205

తే. అనఘుఁ డీరాముఁడు పరాత్ముఁ డయ్యెనేని
యవని మాతల్లి తా సాధ్వి యయ్యెనేని
దశరథున కేను సుతుఁడనై తగుదునేని
దుష్టహింసాయుతు నీదైత్యుఁ దునుముఁగాక. 206

చ. అని తెగ వాపఁ దత్ప్రదర
మా దనుజుం దెగటార్చి పేర్చె నా

ఘనుపడుచుఁ బుష్పవర్ష మతి
గాఢముగా గురియించి దేవతల్
వినుతి యొనర్చి రంతఁ గపి
వీరులు నృత్యము సల్ప మేఘనా
దునినిధనంబు దానవులు
దోడన తెల్పిరి దైత్యభర్తకున్. 207

ఆ. అతఁడు క్రోధదీప్తుఁడై కుంభకర్ణునిఁ
బనిచె రాముతోడ నని యొనర్ప
నమ్మహోన్నతాంగుఁ డప్పురవరణంబు
గడప దాఁటుమాడ్కిఁ గడచి చనియె. 208

శా. ఆరక్షోవరు ఘోరకాయము ప్లవం
గానీక మీక్షించి య
మ్మేరుగ్రావమొ మందరంబొ యటు
లిమ్మేఁ దాల్చి కీశావళిన్
సారోదారత నొంప వచ్చె నని దు
స్తారవ్యథం గుంది దు
ర్వారాహంకృతి వానిమీఁదఁ దరులుం
గ్రావంబులున్ వైచినన్. 209

చ. వనచరహస్తముక్తతరు
హారములుం ధరణీధరంబులుం

జెనుశిలపై నడంగుజల
బిందులచందము నొంది వందె న
ద్దనుజునురంబుఁ దాఁకి యట
తత్కపిపీరుల ఖిన్గఁజొచ్చె వాఁ
డనువుగ నిత్తుఖండములు
పాళ్లి మెసంగుగజేంద్రుకై వడిన్. 210

తే. జాలికుఁడు జాలముల మీనసమితిఁబోలె
హస్తములఁ బట్టి వదనగుహాంతరమునఁ
జొనుప నద్దైత్యునాసికాశ్రుతిబిలముల
వెడలి వచ్చిరి గొందఱు వృత్తువరులు. 211

క. సుగ్రీవముక్తభూమిరు
హాగ్రవిపాతజర్జరాంగుం డై వాఁ
డుగ్రత గదఁ గొని వైచెన్
సుగ్రీవుఁడు మూర్ఛచే వసుంధర వ్రాలన్. 212

క. ఇనజునిఁ దనభుజమున నిడి
కొని దైత్యుం డరిగె లంకకుం జెచ్చెర న
వ్వనచరపతిచందముఁ గని
హనుమత్ప్రముఖులు గలంక నందుచుఁ దమలోన్. 213

చ. దనుజున కడ్డమై మనము
ద న్విడిపించిన మానశాలి యా

యింకఁ డవజ్ఞఁ గాఁగ మది
నెంచును దాన కడంగి దానవుం
డునుమఁగలం డవార్యబల
ధుర్యుఁడు ధైర్యధురంధరుం డితం
డని తలపోసి రంత నమ
రారియుఁ గ్రుక్కి నేఁగె వీటికిన్. 214

తే. అపుడు పౌరులు గంధసారాంబువులును
మంజుమకరందబిందునిష్యందికుసుమ
దామములు గుంభకర్ణుపైఁ బ్రేమ నినిచి
రతనివిజయంబునకు హర్షితాత్ము లగుచు. 115

సీ. శీతలహిమజలీసేచనక్రియ మూర్ఛఁ
దెలిసి శాఖామృగాధీశ్వరుండు
కరదంతములఁ గుంభకర్ణుకర్ణంబులు
ఘ్రాణంబు ఛేదించి గగనవీథిఁ
జనియె నద్దానవుండును లజ్జితుం డయి
క్రమ్మఱ నరుదెంచి కపులఁ జదిపి
నిజకర్ణనాసాస్రనిర్ఝరధారలు
ద్రావి మత్తగజంబురహిఁ దిరుగుచు
తే. నట విభీషణుఁ గాంచి యోయన్న తొలఁగు
మసురవంశంబునకు నీవ యంకురంబ

వనఘు నే నిజశోణితం బానుకతన
నొరుల నాత్మీయుల నెఱుంగ కున్నవాఁడ. 216
తే. అనుచుఁ బల్కి విభీషణుం డట్ల తొలఁగె
నంత నద్దైత్యుపై రాముఁ డంపవాన
గురిసె శైలంబుపై వానగురియులీల
నది యతనిమేన గోమంబులట్ల యమరె. 217
మ. కదనం బీగతిఁ జెల్ల రాఘవుఁడు దో
ర్గర్వం బఖర్వంబుగా
గద సారించుచు నేఁగుదేరఁ గని యా
క్రవ్యాదుచేదోయియుం
బదయుగ్మంబును గంఠము న్నఱికె శుం
భద్బాణధారాహతిం
ద్రిదశు ల్విస్మితచిత్తు లై నిలిచి సం
ప్రీతిం బ్రశంసింపఁగన్. 218
ఆ. ఇట్లు కుంభకర్ణుఁ డీల్గిన హతశేష
బలముతోడఁ దాన బవరముఖముఁ
జనియె నాపదబ్ధి మునిఁగియు ధైర్యంబు
కలిమికలిమిఁ బంక్తికంధరుండు. 219
కమలవిలసితము.
తరులును గిరులును దరుచరవీరుల్
సురవిమతులపయిఁ జూఱుచూఱ నేయం

ఖరపరశువులును *(గదలును) శాణో
త్కరములుఁ బ్రజ్వలిత గడగుచువారల్. 220

క. ఈరీతి నుభయబలములుఁ
బోరాడఁగఁ దనకు నెదురు పోలఁడిఁడిపయిం
ధీరత రామమహీపతి
మారుతిపై నెక్కి పఱపె మార్గణవితతుల్. 221

తే. రామకార్ముకము క్తనారాచసమితి
నిటలమున నాఁటి మూర్ఛిల్లె నిర్జరారి
యల్లిక సారథి యరదంబుఁ ద్రోలఁగఁ జేయ
నంతఁ దెలివొంది కినుక నిట్లనుచుఁ బలికె. 222

క. ఓరీ నను భీరునిఁగ వి
చారించి రథంబు దేరఁ జనునే నీకుఁ
వైరులు గని నవ్వఁగ దు
శ్చారిత్రిక యపయశంబు నంధించితిగా! 223

తే. అనుచుఁ గ్రోధింప వాఁడు నద్దనుజుఁ గాంచి
దేవ యిది సూతకృత్యంబు దీని కలుగ
వగునె రాముని గెలువు మీ వనుచుఁ (బలికె)
నట్లు సన్నద్ధుఁడై యతఁ డనికి నెదిరె. 224

క. వృక్షచరవీరు లాలో
వృక్షంబుల శైలములను వివిధాస్త్రములన్

* ఇచ్చట వ్రాయసకాఁడు పదము నొకదానిని వదలివైచెను.

రక్షోబలములఁ గెడపిన
వీక్షించి యతండు రోషవివశుం డగుచున్ 225

ఉ. రాము నెదిర్చి ఘోరశర
రాజి నిగుడ్చిన నాతఁ డల్గి యు
ద్దామగతిం దదశ్వములఁ
దద్రథసూతుఁ దదీయచాపమున్
భీమశరంబులం దునిమి
ప్రేల్చగ * నాశుగవృష్టి ముంప న
గ్గామిడిరక్కసుండు భయ
కంపితుఁడై పఱచెన్ భయంబునన్. 226

వ. ఇట్లు రామబాణకృతవేదన సహింపలేక ప్రాణంబు విడిచి
లంకాపురంబునకుం బఱచుచు నారావణుండు. 227

మ. కుల శైలోపవనావనీరుహలతా
కుంజంబులన్ ఖేయసం
స్థల సాలాంతరసీమలన్ మఱి బహి
ర్ద్వారంబులన్ లంకలోఁ
గలసౌధంబుల వీథులన్ నిజగృహా
గారంబులన్ రాము న
గ్జ్వాలబాణాంచితచాపపాణిఁ గనియెన్
సంత్రస్తభావంబునన్. 228

* నాశర — పా ప్ర.

మ. ప్రళయాంభోదనినాదమేదురధను
ర్జ్యాటంకృతుల్ మీఱ ను
జ్జ్వలకాండంబులు పెల్లుగాఁ గురియుచుం
జానొంది రక్తాంతవ
*ర్త్మలసల్లోచనుఁడై పురంబు లలుకన్
మర్దించు శంభుండు నాఁ
‡జెలు వౌ రామునిఁ బంక్తికంధరుఁడు గాం
చెన్ సర్వదిగ్భిత్తులన్. 229

క. జగమంతయు రామాత్మక
ముగఁ గని రావణుఁడు దీర్ఘముగ రోఁజె సభన్
బొగడొందుచుఁ గల గని భయ
ము గదుర నరునిగతి మిగుల మోహాతురుఁడై. 230

క. తరుణులును సభాసదులును
గర మాశ్చర్యంబు నొందఁ గడు భీతుండై
మరితతరుఁడైనదనుజుఁడు
పోరి నుబ్బుఁ దొఱంగి వగలఁ బొగులుచు నుండెన్. 231

వ. అంత నా రాఘవుండు నిజవిశ్వరూపంబు శాంతంబు గా
వించిన బ్రకృతిస్థుండై రావణుండు లజ్జావనతుండును
మందోదరీసమేతుండును నై యంతఃపురంబున కేఁగి
చింతించుచుండె నంత. 232

* వర్త్మ; ‡ జెలఁగుంరాముని—పా. ప్ర.

ఉ. రావణుఁ డొండె నీధరణి
రాఘవుఁ డొండెను నిల్చునట్లుగాఁ
జేవడిఁ జేయువాఁడ నని
చిత్తమునం దలపోసి రావణుం
డావిలలీల శుక్రనిల
యంబున కేఁగి తదీయబుద్ధిసు
శ్రీవిభవోపదేశమునఁ
జేయఁ దొణంగెను హోమ మత్తఱిన్. 233

తే. అట్లు పాతాళగుహ హోమ మాచరింప
ధూమరేఖఁ గనుంగొని రామునకు వి
భీషణుం డెఱింగించి తద్భీమహోమ
విఘ్న మొనరించుటకుఁ గపివిభుల ననిచె. 234

తే. ఆత్మమర్మజ్ఞుఁ గుపితుఁగా నాచరింపఁ
బూనుదుర్మతి నిధనంబుఁ బొందుఁ జూవె
జగతి మర్మజ్ఞుఁ డగువిభీషణుని విడుచు
రావణుచరిత్ర మది నిదర్శనము గాదె. 235

చ. అగచరవీరు లంతట ది
శానను డున్నగుహాంతరాళ మి
మ్ముగఁగత్రిఁ జొచ్చి హోమమున
కాయత మై తగుసాధనాళి గా

సిగ శిఖిలోన వైచియును
జెన్నుగ నాతనికామినీమణికి
సిగ దగఁ బట్టి యీడ్చియును
జేసిరి విఘ్న మవార్యశౌర్యులై. 236

వ. అయ్యవసరంబున విగళితభూషితయు, విధ్వస్తకంచులికయు, వికీర్ణవేణీబంధయు, భృత్యచరముష్టిఘాతతాడితాంగయును నై మందోదరి యమందరోషంబునం జనుదెంచి రావణున కిట్లనియె. 237

తే. భామినీమణి పరులచే భంగపడఁగ
మానమున నేమి ఫల మబ్బు మానహీన!
సత్త్వహీనత హోమంబు సల్పి నీవు
గెలుతువే రామభద్రుండు గెలుచుఁగాక. 238

వ. రామునకు జయంబును నీకుఁ బరాజయంబును సిద్ధంబు భవద్బాహునియుక్తశక్తిప్రహారంబున లక్ష్మణుండు మూర్ఛితుండైన హనుమంతుం డనువానరేంద్రుండు ద్రోణగిరీంద్రంబు దెచ్చి యాతని సంజీవితుం గావించె వినుము తెల్పెద. 239

సీ. ప్రత్యాహారకరుఁ డైన పలలాశి యగుకాల
నేమి నుక్కడఁగించె నిముషమునను
జలచరం బయి మునిశాపంబుచేఁ గుంద
ధాన్యమాలిని సతిధన్యఁ జేసెఁ

గడిమి మందులగట్టు గాచి మోహలకున్న
సురసంఘముల నెల్ల మురుఁగఁజేసె
ద్రోణాద్రిఁ దెచ్చుచోఁ * దొలిపేలుపుల వార్ధి
నడుమఁ బదాహతిఁ బొడ వడంచె

తే. దానవులగాత్రములు సముద్రమున వైచి
కపుల నక్షణ బ్రదికించి క్రమ్మఱంగ
ద్రోణధాత్రీధరము నిల్పెఁ దొంటిచోట
వాయువేగంబుచేత నవ్వాయుసుతుఁడు. 240

వ. యామత్రితయకాలమాత్రంబున నియ్యుద్యమం బతండు గావించెఁ కుంభకర్ణమేఘనాదాతికాయాదియోధులు నిహతు లైనను వెండియు సమరంబు సేయు నుద్యోగం చెదవు రాజ్యతృష్ణం బొగులక సీతాదేవి నైనమృత్యుదేవిని విసర్జించి యవశిష్టబంధుజనంబులం బ్రతికింపుమని తెలిపిన నమ్మందోదరివచనంబుల దెస ననాదరంబు సేసి యారావణుం డప్పుడ సేనాపరివృతుం డై వెడలి రామచంద్రుతో ఘోరసంగ్రామం బొనర్చుచుండినంత.

తే. రాఘవుఁడు భువి రథమునపై రావణుండు
నిలిచి యనిసేయఁ గనుఁగొని బలవిభేది
ఖడ్గతూణీధనుశ్శరకలిత మైన
రథము మాతలిచేఁ బంచె రాఘవునకు. 242

దోలిచెలువుల — వార్ధి

ఉ. ఆయురథంబు నెక్కి విల
యాగ్నిసమప్రభుఁ డై రఘూద్వహుం
డాయసురేంద్రమస్తకము
లన్నియు నొక్కటఁ ద్రుంచి పై చెం దా
నాతొడ నాదశాస్యతల
లప్పుడ వెండియు మొల్చె మొల్చినం
దోయజబంధువంశజుఁడు
దోడన త్రుంచెను వాని నన్నిటిన్. 243

క. శిరములు పెరుగం బెరుగం
ధరణీశుఁడు దునుమఁ దునుమఁ దన్మస్తకముల్
గిరులగతి రాసు లయ్యెను
సురవరులును ఖచరులును జోద్యము నొందన్. 244

వ. ఆసమయంబున నగస్త్యమహామునీంద్రుం డరుగుదెంచి
శత్రుభంజనార్థంబు రాముని కాదిత్యహృదయం బుప
దేశించె నంత. 245

మ. కదలీషండమువోలె దైత్యశిరముల్
ఖండించి ఖండించి య
ప్పుడనం జేరి విభీషణుం డెఱుఁగఁ దె
ల్పన్ విక్రమోల్లాసియై
ప్రదరాఘాహాతి వానినాభిసుధధా
రన్ మీఁటె రాజేంద్రుఁ డిం

వు దలిర్ప న్నిగుడించె నాశుగతి నం
భోజాతజాతాస్త్రముక్త. 246

వ. అద్దారుణబాణంబున జగద్విద్రావణుం డగురావణుండు
నిహతుం డయ్యె నయ్యవసరంబున. 247

ప్రహరణకలిత. తిరమగు తెలివిన్ దిశలు సెలఁగ భా
స్కరరుచి దనరెం గపిబల మలరెం
సరసకుసుమవర్షము బెరయఁగ బం
ధురగతి సురదుందుభు లులిసె దివిన్. 248

చ. రణమున రాముఁ డిక్కరణి
రావణుఁ గెల్వఁగ నిర్జరావళుల్
పరిణతి నొసఁగ నచ్చరల
పాటలు నాట్యముఁ గాఁగ నుండె ల
క్ష్మణుఁడును రామునానతి వి
చంచల వైఖరి లంకలో విభీ
షణు నభిషిక్తుఁ జేసె కపి
సంఘము లచ్చెరు వొందఁ జూడఁగన్. 249

తే. రవియు శశియును భూమియు రామకథయు
నెంతపర్యంత మలరు నీ వంతదనుక
నెలమి నిశ్శంక నేలుము లంక నెమ్మి
నతని దీవించి దనుజరాజ్యమున నిల్పె. 250

సీ. అపుడు రాముని యాన నగచరవరు లశో
*కారామమున నున్న యవనిజాతఁ
దోడ్తేర నాతఁ డత్తొయ్యలిఁ గనుఁగొని
ప్రత్యయంబొనరింపఁ బనుప నదియు
సీతాంగనాకృతిచే లంకఁ జొచ్చితి
నే మృత్యుదేవత నిక్క మరయ
నేమహామహానిమాయామహాబ్ధి మునింగి
పారంబుఁ గనలేరు పద్మజాదు

తే. లట్టి రామునిచేఁ బరమాత్మచేత
ననుపమప్రౌఢి నాకార్య మయ్యె ననుచు
సకలలోకంబులు వినంగఁ జాటిచెప్పి
చనియె మృత్యువు తనరూపు సవదరించి. 251

తే. సకల దైవతవిమతుల సంహరించి
సమరహతు లైనకాననచరుల మనిచి
యినసుతవిభీషణాదిసమేతుఁ డగుచు
నపుడు రాముఁ డయోధ్యకు నరుగఁ దలఁచి. 252

క. నిజసీతాసంగతుఁ డై
యజరులు వినుతింపఁ బుష్పకారూఢుం డై
ప్రజవగతి నరిగెఁ బ్లవగ
ధ్వజినీసముదయము నమ్ముదంబునఁ దేలఁ. 253

* కాకానమున నున్న — వ్రా. ప్ర.

తే. కామగమ మైన యాపుష్పకము ప్రయాణమున
నరిగి కిష్కింధఁ జేరి తారాదివనచ
రాంగనల నందు నెక్కించి యూర్ధ్వసరణిఁ
జని యతండు భరద్వాజమునికి మ్రొక్కె. 254

క. నందిగ్రామమునకుఁ జని
యందుఁ భరతాదిసహితుఁ డై నిబిడజటా
బృందము విడిచి యమందా
నందమతిం జెలఁగుచు రఘునందనుఁ డంతన్. 255

సీ. సమలంకృతం బయి సంతుష్టరాజన
మావృతం బగు నయోధ్యాపురంబు
మహిమఁ బ్రవేశించి మణిమయసింహాస
నారూఢుఁ డై వసిష్ఠాద్యనుమతిని
బట్టాభిషిక్తుఁ డై భరతశత్రుఘ్నల
క్ష్మణధరానందనాసహితుఁ డగుచు
నిలఁ బదునొకండువేలేఁడులు నిష్కంట
కంబుగా నేలి భోగములఁ దనిసి

తే. వివిధయజ్ఞములు పెక్కు గావించి సుతుల
రాజ్యమున నిల్పి సద్ధర్మరతి వెలుంగ
వెనుక నాసన్నిధికి వచ్చె వినుతకీర్తి
రామచంద్రుండు సుగుణాభిరాముఁ డగుచు. 256

వ. అని చెప్పి యీశ్వరుండు. 257

గీ. మన్ముఖోద్గత యైన యీమహితదివ్య
కథ పఠించిన శుభములు గలుగుఁ గలుష
వితతు *లఱు నాతఁ డప్సరోవితతి గొలువ
నంతమున మత్పదంబున నధివసించు. 258

ఆ. వేదసమ్మతము పవిత్రంబు దురితఘ్న
మైనరాముచరిత మనఘమూర్తి
వామలూరుభవుఁడు వాల్మీకి యనుముని
రచనసేయఁగలఁడు ప్రచురఘనత. 259

తే. అతఁడు మును పుళిందుఁ డయ్యు వసిష్ఠోప
దేశమునఁ జెలంగి ద్విజతఁ గాంచి
యాదికవి యనంగ నలరు మహామతి
పుట్టలోనఁ బుట్టు భూనుతముగ. 260

వ. అని యానతిచ్చి శివాసమేతుండై శివుండు నిజధామం
బు ప్రవేశించె నిక్కథ నద్దేవునివలన నాకర్ణించితి నని
చెప్పి నారదుండు వసిష్ఠాదుల కిట్లనియె. 261

క. మును నే వాల్మీకాంతిక
మునఁ జదివించుచును వింటి మునులారా రా
మునినామ మిపుడు మీరున్
ఘనగతి వింటి రది యరయఁగా నగు నిచటన్. 262

వ. అనిన వసిష్ఠాదు లిట్లనిరి. 263

*లఱు—వ్రా. ప్ర.

శివరాములచారిత్రము
దివిజముని శ్రేష్ఠ నీవు దెల్పఁగ వినుటన్
భవములు సఫలతఁ జెందెన్
శ్రవణానందంబు మాకు సంధిల్లెఁ గదన్. 264

వ. అని యద్దేవమునిం బూజించి యతండును దారును ఖనిత్రప్రముఖసాధనంబులు గొని వల్మీకప్రాంతంబునకు నరిగి చిరకాలావృతం బైన యప్పుట్టం గ్రొచ్చి యందు. 265

సీ. పుటపాకశోభితభూరిప్రభాసాంద్రు
నజినవల్కలనిచయావృతాంగుఁ
బాటలస్ఫుటజటాపటలాభిశోభితు
రామనామాసక్త రమ్యరసను
సద్గురువరపాదజలజార్చితేక్షణు
దీప్యమానానలదివ్యతేజు
నవిదితబాహ్యలోకానీకవర్తను
శ్రీరామచరణాబ్జచింతనాత్ము

తే. బద్ధపద్మాసనస్థుఁ దపఃప్రదీప్తు
మునివరు నొకనిఁ గాంచి యమ్మునులు వివిధ
విధుల బోధించి విసివి రాద్విజుఁడు వారి
పలుకు వినఁ డయ్యె నిశ్చలభావమునను. 266

ఉ. వాసవముఖ్యనిర్జరులు
వారిజనాభుఁ డుమావిభుండు బ
ద్మాసనుఁడున్ దిగీశ్వరులు
నచ్చటికిం జనుదెంచి యాతపః
శ్రీసముపేతుఁ బోధ యొన
రింపఁగఁజాలక విస్మితాత్ము లై
దాసమయంబునన్ మునికు
లాగ్రణి యైనవసిష్ఠుఁ డాత్మలోన్. 267

ఆ. మున్ను వనచరత్వమున నుండుచును గురు
పాదపద్మభక్తిఁ బ్రబలునితని
కంటి ధర్మ మెచటి కరిగెడుఁ దద్వ్యథఁ
దెలుప మానులకును ధీరుఁ డితఁడు. 268

వ. అని యూహించి నిజాంతేవాసు లనుమతింప వసిష్ఠము
నిచంద్రుం డమ్మునీంద్రు నిరీక్షించి. 269

క. దేశికుఁడన్ జనుదెంచితి
నోశిష్యుఁడ పూజసేయు మొగి భద్రము నీ
కాశుగతిఁ గల్గు నాయుప
దేశమునను దపము సల్పితివి నిష్ఠమెయిన్. 270

క. అని పల్కిన నమ్మునియు వ
యనయుగళము దెఱచి లేచి యభివాదన ము

బ్బునఁ జేసి యోగురూత్తమ
ఘనపుణ్యుఁడ నైతి మిమ్ముఁ గాంచుటకతనన్. 271

వ. అని పల్కు నాసమయంబున భగవంతుం డైన వసిష్ఠము నీందుఱ్ఱిం డతనికిం బ్రిచేతసునిచేత వేదోక్త క్రిమంబున జాతకర్మాద్యఖిలసంస్కారంబులు సేయించి శ్రీపూర్వ కంబుగా రామనామమంత్రిం బుపదేశించిన నవ్వాల్మీకి యుం దపోవినిహతపూర్వదేహుండును, గృతకృత్యుం డును నై నిర్మలత్వంబునం దేజరిల్లి సురమునిగణంబుల సన్నిధి నవ్వసిష్ఠునకు గురుదక్షిణ యొసంగి యిట్లనియె. 272

గీ. అనఘ నేఁడు కులీనుండ నైతి నీదు
శిష్యుఁడను దుస్తరాజ్ఞానసింధుమధ్య
మగ్ను నను నుద్ధరించితి మానితర్య
కృత్య మెయ్యది నా కింక నెఱుఁగఁ జెపుమ. 273

వ. భవదీయకింకరుండ ననుం బనిగొనుమని పల్కునవసరంబున.

తోదకము. అచ్చరముద్దియ లాడిరి వేడ్కం
గ్రిచ్చటఁ జల్లనిగాడుపు వీచెం
హెచ్చి ప్రిసూనసువృష్టులతో నై
యచ్చరదుందుభు లచ్చుగ మ్రోగెన్. 275

మ. సిరి విద్యుల్లతభంగి రం గమరఁగాఁ
జేఁవమ్మి *శార్ఙ్గంబు సుం

* వర్గంబు సుం—వ్రా. ప్ర.

♦దరశకాన్త్రియుధలీల నొందఁ గృప *యు
ద్యద్వృష్టి గా సన్మునీ
శ్వరసారంగము లుబ్బ నీలజలద
శ్యామాభిరామాంగుఁ డై
సరసీజేక్షణుఁ డమ్మునీంద్రునెదుటన్
సాక్షాత్కరించెం దగన్. 276

వ. అట్లు సాక్షాత్కరించి దేవగణంబులును, మునిసంఘంబు
లును విన నవ్విష్ణుం డిట్లని యానతిచ్చె. 277

ఉ. శ్రీకరుఁ డిమ్మహామహుఁడు
సేయుతపంబున కింద్రముఖ్యులౌ
నాకనివాసముఖ్యులు మ
నంబుల భీతిలి రిమ్మునీశ్వరుం
డాకమలాసనాండ మొకఁ
డాల సృజింపఁగఁ బోవ నేర్చు న
స్తోకతపఃప్రభావమున
సొంపటఁ జేసి జగంబులం గడున్. 278

క. వల్మీకమున జనించుట
వాల్మీకి యనంగ నితఁడు వర్ధిలు నతిని
ష్కల్మషతపమ్మ పలుకుత
కల్మిం బ్రహ్మర్షి యై జగంబున వెలయున్. 279

♦వరచక్రాయుధలీల; * యుద్యత్కృష్టి గాఁ జేసె — (వా. ప్ర.)

క. ఋషిరసనాగ్రంబున
భారతి నటియింప మధురఫణితి నితఁడు దా
శ్రీరామాయణదివ్యక
థారచన యొనర్చు సుకవితానిధి యగుచున్. 280

ఆ. వేదవేద్యుఁడైన విష్ణుండ నేను శ్రీ
రామరూపమునఁ గరం బలరఁగ
వసుధ వేద మితనివదనాంబుజమున రా
మాయణాఖ్యచేత నవతరించు. 281

వ. రామాయణశ్రవణపఠనంబు లాచరించినమానవుండు బ్ర
హ్మహత్యాదిసకలపాపనిర్ముక్తుండై చంద్రునిచందంబు
నొంది జీవన్ముక్తుం డగు వెండియు నిమ్మునీంద్రునకు
సకలలోకసంచరణపాటవంబు గలుగు నని వరం బొసంగె
నంత నతని వాల్మీకిమహాముని యని యందఱుం గొని
యాడి రిట్లు లబ్ధవరుండైన యావాల్మీకి యవ్విష్ణుదేవుని
నిట్లని స్తుతియించె. 282

క. విశ్వాత్మ విశ్వరూపక
శశ్వద్వైకుంఠనిలయ చక్రధర విహం
గేశ్వరతురంగ శశిహరి
దశ్వేక్షణ నతి యొనర్తు నచ్యుత నీకున్. 283

గూఢచతుర్థపాది.

చ. దరధర సేవకేష్టఫలదా కమలాక్ష మనోజకోటిబం
ధుర మణిహార భూభరణ దోర్గ్వజితామరవైరి శక్రసో
దర *నరసన్నుతాంచితపదా శ్రీదశగా శివవేష మేఘసుం
దర కమలామనోరమణ తామరసోదర నన్నుఁ గావవే. 284

భాస్కరవిలసితము.

వారిజనయన వివాహ రమేశా
స్వర్ణవసన నవవనధరనీలా
సారసభవముఖసర్వసురాళి
స్ఫారమకుటమణిచయరుచిపాదా
భోరుహ మునిజనపూజిత దుర్గా
భోనిధిశయన విపులఫణితల్పా
దారితదనుజ గదాధర భక్తా
ధార మనుపు నను దయ చెలువారన్.285

లాటీవిటవృత్తము.

అవతారసహస్రము దాలిచి య
త్యంతాసక్తిం బో◆తువు ధాత్రిన్
భవవార్ధి దాఁటఁగఁ జేయుచు స
ద్భక్తౌఘంబున్ సాక్షివి నీవై
వివిధస్థితి నుండుదు లోన వెలిన్

* సుర; శ్రీరివగౌరవవేష; ◆ వుదు—వ్రా. ప్ర.

వే లోకాళి న్నిలుపు వేడ్కన్
నవవారిదవర్ణ జనార్దన స
న్నవ్యాంభోజాక్షా ఖగవాహా. 286

నీ కనంతరూపంబులు నివ్వటిల్లు
నైన రామరూపమున నార్యాత్మయందు
నివుల విలసిల్లుచుండు నీదుమృదుపదములు
గంటి నాకోర్కె ఫలియించె నంటె నభవ. 287

దశరథనందన తాటకామర్దన
నవపాల మునిసతిశాపభంగ
భవచాపఖండన భార్గవమదహార
ఖరవిరాధాదిరాక్షసవిదార
వాలివిమర్దన వనజాప్తసుతపాల
కంధిబంధన కుంభకర్ణహరణ
పంక్తికంధరదర్పభారభంజన విభీ
షణరాజ్యదాయక సాధుసేవ్య
భూసుతాయుక్త సాకేతపురనివాస
యమలినస్వర్ణసింహాసనాధిరూఢ
సామ్రాజ్యసామ్రాజ్యధౌరేయ రామభద్ర
నీకు వేవందనంబులు నిష్కళంక. 288

క. అరవిందజముఖుల కగో
చర మగు నీతత్త్వ మెన్నఁజాలుదునే యి

దరఁ దనయుతోఁ బలుకులు
గురుఁ డనురక్తి వినునట్లు గొను నానుతులన్. 289

క. మానసవాక్కాయములఁ
జ్ఞానాజ్ఞానగతిఁ జేయు సకలాఘములం
బూని క్షమియించి ననుఁ జె
ల్వూరం గరుణమెయి నేలు మఖిలాధిపతీ. 290

పుష్పమాలికాబంధము.

క. కనకనయనహర ధరధర
వనజనయన సురదరహర వరదరకర ధీ
జనజలజవారఖరకర
సనయనలినజాతగీతశాతవిలాసా. 291

గోమూత్రికాబంధపద్మబంధపుష్పమాలికాబంధాట వెలఁది.

ఖేదశాదభేదరాదమోదప్రద
శ్రీదపాదవేదవాదమోద
శాదఖేదయాదవాదరీదర్పద
భేదవాదసూదనాదవాద. 292

ఖడ్గబంధోత్సాహవృత్తము.

హేమవాన వాసవాద్యధీశ మాని శేఖరా
రామ చైత్ర నీలజలదరమ్యకాంతిభాసురా
రామ నీరజాతనేత్ర రక్షితాఖిలామరా
రామ మమ్ముఁ బ్రోవు రాజరాజ మైథిలీశ్వరా. 293

క. శ్వేతద్వీపంబున బద
రీతరుషండమున మానిహృదయములన్ వి
ఖ్యాతిగ క్షీరోదంబున
నాతత వైకుంఠనగరి నలరుదు వీశా. 294

వ. అని యిట్లు వివిధవిధుల నొనరించుస్తోత్రంబు లంగీక
రించి యవ్వాల్మీకిమహామునికి వెండియు ననేకవరంబు
లొసంగి యద్దేవుండు దేవగణసమేతుండై నిజధామంబు
బ్రవేశించె నంత. 295

క. ధీరుం డగువాల్మీకియు
గౌరవ మొప్పార రామకథ యఖిలంబున్
నారదమునివలన న్విని
శ్రీరామాయణ మొనర్చెc జితభణితులన్. 296

వ. అని చెప్పి సూతుండు రామనామప్రభావంబు నాకుc
దోcచినకరణి వర్ణించితి నని వెండియు శౌనకాదులం
జూచి. 297

చ. కొమరుగ రామనామ మొక
కోటి జపించిన మానవుండు దా
నమరcగ రాఘవుండె యగు
నం దొకలక్ష జపించు చంత భూ
మ్యమరుల దక్షిణం దనిపి
యన్న మొసంగcదగున్ మహామతిం

గ్రిమమున జాపకుండు భవ
కంధిఁ దరించు వరించు సంపదల్. 298

గీ. ప్రథమకోటి జపించిన బ్రహ్మసదన
మంత రెండవకోటిచే హరనివాస
మట్ల మూఁడవకోటిచే నబ్జనాభ
పదముఁ గను రామనామజాపకుఁడు నియతి. 299

వ. యావజ్జీవజాపకుల కైనను సంఖ్యానియమంబు లేక
శుభంబు సెందరు మఱియును. 300

మ. శివనామంబు త్రికోటిజాపకునకుం
జేకూర్చుఁ దల్లోక మా
శివరామాఖ్య త్రికోటిజాపకునకున్
శ్రీశాభ్రికేశాత్మతా
దివిశేషంబులఁ జేర్చు వెండి భగవ
ద్గీతాజపాసక్తుఁడున్
శివగీతావఠనాపరుండును సుఖ
శ్రీ దాఁటు జన్మాంబుధిన్. 301

వ. మఱియు శివవిష్ణుసహస్రనామంబులును, దేవీమాహా
త్మ్యంబును సంతతంబును జపియించువాఁడు జీవన్ముక్తుం
డగు నని చెప్పిన విని శౌనకాదులు భగవద్గీతాపఠన
ప్రభావం బెఱుంగింపు మని యడిగిన స్సూతుం డిట్లనియె. 301